కం. ఆతం డీతరి జహ్ను సు
తా తటినీ తటము నందుఁ దత్పరమతితో
నాతత తపముం జేసెడుఁ
బాతకపాతిత్యహరణ భాగ్యోదయుఁడై.

ఉ. ఆతఁడు నీదు సంశయము లన్నిటిఁ దీర్చును దీర్చినంతనే
యాతనివద్దనుండి సెలవంది క్రమంబునఁ జాఁగి మ్రొక్కి యా
నీతులనెల్ల గ్రంథముగ నేర్పున నోర్పునఁగూర్పు దానఁ బ్ర
ఖ్యాతియుఁ జిత్తశాంతియును గల్గును గల్గును భుక్తిముక్తులున్.

గీ. పొలసులు కొంద ఱెల్లని పరిహసింపఁ
దలఁచు చుందురు దానిచేఁ దలఁగవలదు
నిజమెఱింగిన మనుజుండె నీతిపరుఁడు
కాన రామహర్షణిఁ బొడఁగాంచఁబొమ్ము.

వ. అని యానతిచ్చి తిరోహితంబగుడు, రాత్రిశేషం బెట్టులో కడపి, సంభ్రమాకులుండనై —

కం. తెలతెలవారకమునుపే
కలఁగిన మదితోడఁ గాల్య కరణీయంబుల్
పొలపొలచేసి పదంపడి
వెలలితి నే విజయవాడ వీటికి నెలమిన్.

క వి ప్ర యా ణ ము

సీ. కెలన పెంపెక్కిన కృష్ణానదీ తోయ
ములయందు భక్తితో మునిఁగి మునిఁగి
కనక భూషాన్విత కనకదుర్గాదేవి
ముదముతో దర్శించి మ్రొక్కి మ్రొక్కి

ఆనకట్టనుజేరి యతివిస్మయంపడి
యాంగిలేయులఁ గొనియాడి యాడి
సంకీర్ణముగనుండి సంకుల క్వణనముల్
సలుపు 'ఎంజిను'లను దలఁచి తలఁచి

గీ. సొరిది కొండపై గీములఁ జూచి చూచి
సృష్టివై చిత్ర్యమునకు నచ్చెరువుపొంది
రేయి యచ్చోటనే పుచ్చి తేపకడనె
పయనమై పోయితిని రైలుబండి నెక్కి.

ఉ. వాయుసమానవేగమునఁ బర్విడిపోయెడి రైలుబండిలోఁ
గాయము కందకుండ నెసకమ్మున నుండి బహిఃప్రదేశమున్
బాయక చూచుచున్న యెడఁబాదపసంహతి భూమినుండి య
త్యాయతవేగమందుచు బయల్పడినట్టుగఁ దోఁచె బుద్ధికిన్.

శా. హేలాదోహల చిత్తవృత్తిఁ జనుచో హేలాపురంబున్ బయిన్
గాళీఘట్టముఁ జూచినాఁడ వరుసన్ గల్యాణ యుక్తంబులై
వాలాయంబు తనర్చు జానపదముల్ ప్రాప్తింపఁ గన్గొంటి నీ
లీలన్ బైనముఁజేసి మామక మనఃక్లేశంబు నాశంబుగన్.

చం. కతిపయ వాసరంబు లిటు కాలముఁబుచ్చుచుఁబోవనొక్కనాఁ
డతిరభసంబుతోడుతఁ బ్రయాగ ప్రయాగ యటన్న కేకలున్
శ్రుతిఁబడినంతనే యొడలి చోపుడు మాన్పెఁ బ్రభాత నీత శా
శ్వత జలజాత జాత మృదు సౌరభ శీతల వాత పోతముల్.

కం. దిగుదిగుఁడని 'పోర్టరు'ల
ధ్వగులం దొరపెట్ట గట్టి వా యచ్చుపడన్
దిగి తత్పరమతినై త
న్నగరముమజూచి వచ్చినాఁడను నాఁటన్.

వ. అంత కూఁతప్రేటుదూరంబుననుండి యభంగ భంగశీకరోపేతం బయి, సౌగంధికాబ్జ మనోజ్ఞ మృదుమధుర పరిమళ సంవాసితంబై, మందంబై, నడయాడు సమీర కుమారునిచేఁ దైర్థికుల నర్ఘ్యపాద్యాది విధులం బూజింపించుచుఁ, గేళీలోలకలహంసీ కలకంఠ స్వరంబున నభ్యాగతుల నాహ్వానించుచు, నూర్మిమాలికా డోలికల నతిథిద్విజబాలికల సత్కరించు త్రిపథగాప్రహద పవిత్రోదకంబుల నవగాహంబుఁజేయ బుద్ధి వొడముడు—

సీ. కైలాసశైల శృంగమునుండి గొల గొల
దిగుచుండు నెది హిందుదేశమునకు
వంగదేశామిత భాగ్యసంపద కేది
యాధారభూతమై యలరుచుండు
ఆదికాలమునుండి యార్యుల కెయ్యది
పరమ పవిత్రమై పరగుచుండు
పితృదేవతల కెల్లఁ బిండసంతతి నేది
కొనిపోయి 'యందిచ్చు' నను జగంబు

గీ. స్వచ్ఛవాఃపూరవార ప్రచార యగుచు
గ్రాలు నే నది యట్టి గంగాభవానిఁ
బోయి దర్శించి హర్షించి మ్రొక్కినాఁడ
భవము సార్థకపడె నంచు భక్తితోడ.

శా. అంగవ్రాతము పావదేరెఁ బదికాయాసంబు వోకారె, హై
పొంగారెన్, మునిరాడ్దిదృక్ష ద్విగుణీభూతంబుగాఁ గూరె, ము
స్గంగా నా తెలినీటి యందున బుభుక్షాతృష్ణలుం దీరె, హా!
గంగా స్నాన మహత్వ మప్పుడుగదా కన్పట్టె నా బుద్ధికిన్.

వ. అనంతరంబు జలంబులమధ్య వెల్వడి యచ్చోటువాసి యుదన్ముఖంబుగాఁ గొంతదవ్వుఁ జనుడు—

గీ. మునుఁగ మాత్రాన నెచ్చోట ముక్తి కల్గు
నట్టి ఘోరాఘమర్షణ మైన భవ్య
జాహ్నవీ యమునా నదీ సంగమంబుఁ
గాంచినాఁడను గన్నుల కఱవుదీఱ.

సీ. భస్మ మలందిన పశుపతి యొడలిపైఁ
గృష్ణసర్పావళీ ఘృణుల యట్లు
శ్వేతవర్ణుండైన సీరి దేహంబుపై
నలరు కృష్ణోత్తరీయంబు నట్లు
ఆకాశవీథిపై నట్టిట్టు నెలకొన్న
స్వచ్ఛశరన్మేఘ సంఘ మట్లు
పాల సంద్రము మీఁదఁ బవళించి యోగ ని
ద్రాస్థితిఁ గూర్కు మాధవుని యట్లు

గీ. గంగ కాళింది జలములు కలసి మెలసి
యా ప్రయాగ సమీపమునందు బహుళ
ఘన రభసమున నురుగులు కట్టుచుండఁ
బొంగి పొరలుచు ముందుకుఁ జెంగలించు.

గీ. సంగమస్నానమాడిన సద్దచేసి
పూర్వసంచిత పాపంబు పోవుననుచు
బుటుకు బుటుకున జలములో మున్గినాఁడ
నలము నివముచే మేనెల్ల జలదరింప.

అంత నంతర్వాహినియైన సరస్వతీశైవలినిం గూర్చి కేలుమోడ్చి ప్రయాణో న్ముఖుండనై, తాపించతరుషండనీరంధ్రచ్ఛాయానుషంగంబులైన కళిందా సుత తటంబుల వీక్షింపఁ గాంక్షించి ముందులకుఁ బోవ, శైశవంబునఁ జదివిన భాగవతాంతర్గతములయిన వాచామగోచరుండైన ధూర్తగోపాలుని లీలావిలాసంబు లన్నియు నా మనోగోచరంబులయ్యె.

సీ. ఈ తీరమునఁగదా కృష్ణుండు గొల్లఁడై
మెలఁగుచు మందాల మేపినాఁడు
ఈ కూలమునఁగదా కృష్ణుండు రసికుఁడై
శారదరాసంబుఁ జల్పినాఁడు
ఈ గట్టుననెకదా కృష్ణుండు సుమనోజ్ఞ
వేణుగానంబుఁ గావించినాఁడు
ఈ యొడ్డుననెకదా కృష్ణుండు గోపికా
స్త్రీ మానధనము హరించినాఁడు

గీ. ఇచ్చటనెగదా కృష్ణుండు విచ్చలవిడి
సంచరించెడి శాత్రవ సంహతులను
గ్రాచి వ్రేపల్లె నిష్కంట కమ్ముగాఁగఁ
జేసినాఁ డతిదోస్సార చిత్రమహిమ.

మ. అదె బృందావనవీథి యచ్చటనె యబ్జాక్షుండు వంశంబుఁ గెం
బెదవిం జేరిచి చొక్కి పాడినది యాభీరాళి కన్మోడ్పఁగా
మొదవుల్ నిట్టకనిల్వఁజాలు గరఁగన్ మోడుల్ చిగుర్పంగ శా
రద రాత్రంబులు విశ్వమోహనముగా రాణింపఁ గోణంగియై,

సీ, సరిక్రొత్తగానిడ్డ జాజి పూఁబొదరిళ్ళు
తీరైన పెళ్ళి పందిళ్లు గాఁగ
జలజల పైరాలు చక్కవిచ్చిన పూలు
పైఁ జల్లుకొను తలంబ్రాలు గాఁగ
కసరెక్కి గీరలేకయె పాడు కోయిల
కూజితంబులు మంత్ర కోటి గాఁగ
చెవులు పండువు గాఁగఁ జిల్క గోర్వంకలు
పాడు పాట నివాళి పాట గాఁగ

గీ. ఎబ్బె మెఱుఁగఁ జాలని గొల్ల గుబ్బెతలకు
సొక్కుపొడి చల్లి తన నిగ్గు సోయగమున
మాటు పెళ్ళిళ్ళు చేసెడి మాయదారి
వింతచర్యలు నా మనోవీధి కెక్కె.

మ. తృణగుల్మావృతకూలసాలముల సందీపించు కాళిందిలో
మణిరోచిష్మత నొప్పు కాళియ ఫణా మధ్యప్రదేశంబునన్
ఘృణిరంజన్మణి కింకిణుల్ మొఱయ శ్రీకృష్ణుండు నర్తించుచున్
ఫణినిన్ వ్రేల్మిడిఁ ద్రోసిపుచ్చిన తదావాసస్థలం బిద్దియే.

గీ. కాలియందలి యందెలు గల్లు రనఁగఁ
జిందుఁ ద్రొక్కుచుఁ దనతల్లి చేతికోలఁ
గాంచి కల్లారి కన్నీరు కార్చునట్టి
నవ్య నవనీతచోరుండు నాకుఁ దోఁచె.

ఉ. పిల్లనగ్రోవి మేను మరపించెడు పాటలు పాడుచుండ, వ్రే
పల్లియ గొల్లపిల్లలు పెటాసని చిందులు ద్రొక్కుచుండ, మా
నల్లని దొంగ దొంగనవునన్ గిలిగింతలుపెట్టి, గోపికా
పలవ పాణులం గలిసి పాడిన పూఁబొదరిండ్లఁ జూచితిన్.

ఉ. రామునిగూడి గోపకులు రాఁ బటువర్గముతోఁ గిలారులై
యోమటిపంటికావడుల నొప్పుగఁ దాలిచి శైశవంబునన్
శ్యామల వర్ణుఁడైన జలజాక్షుఁడు ప్రొద్దులు పుచ్చినట్టి యా
యాముస సైకతంబు లివియంచుఁ దలంచితి సంతసించితిన్.

మ. క్షమతో నెట్టనియెండలో యమున'దాఁకా' గోవులందోలి తా
యమునాతీర తమాలవృక్షముల ఛాయన్ నిల్చి కెంగేల వం
శముఁ గీలించుచుఁ బాటఁబాడుచును గోసంతానమున్ సీటికో
సము పోనీయని కృష్ణు బేరజము నశ్రాంతంబు లోనెంచితిన్

వ. నిరంతర శ్రీకృష్ణపాదపాథోజాత ప్రక్షాళన పవిత్రీకృతంబులగు నిర్మలోదకంబులఁ గృతస్నానుండనై వచ్చిన కార్యంబు వేగిరపెట్టుచుండ, వెండియు గంగాతీరంబుఁజేరి సూతర్షి సందర్శనాభిలాషంబునఁ బోవఁదొడంగితి.

ఉ. కాయలు దుంపలుందినుచుఁ గష్టము లోర్చుచుఁ గొన్నిరోజులా
చాయనె పోవుచుండఁగఁ గృశత్వముఁ బొంచె శరీర యష్టి యే
మాయెనొ దార్ఢ్యమే నెఱుఁగ నైతిని గాళ్లు వడంకసాఁగె నా
కాయతి తోఁచదయ్యె నిఁక నట్టులె పోయితి నూగులాడుచున్.

వ. దుర్భర నిదాఘసమయం బగుటయు, నడిమింటఁ జండాంశుండు నిప్పులం జెరుగుటయు, ఝురీసమానరయంబున ఘర్మజలంబు మైనుండి దిగజాఱుటయు, నడువనేరక యెట్టెట్టులో తడఁబడుచు, నడుగులిడుచు, మార్గము దుర్గమంబగుటఁ గార్యంబు దుస్సాధ్యంబని యెడదకుఁదోఁప, నున్న జవసత్వంబులు సంక్షీణింప, నెట్టకేలకు ఖిన్నుండనై పథిశ్రమంబున దస్సి నిట్టూర్పు పుచ్చుచుండ—

సీ. మంజు సౌరభసిక్త మంద మందానిల
సంచయ మెదురేగు డెంచె నంత
ఉత్సాహ రభసాంచ దుడ్డీన పరతంత్ర
పక్షి సంఘంబు కన్పట్టె నంత
వివిధ లతాగుల్మ విసరసమావృత
వృక్ష రాజములు గాన్పించె నంత
నానా శకుంత సంతాన సమాకుల
స్వనము లొక్కటిగ విన్బడియె నంత

గీ. నడచి పోవంగఁ గ్రమముగా నాకు నపుడు
చివురు జొంపముల్ గొమ్మల చెలువు నింప
గొనబు మీఱెడి లేమావి గున్న క్రిందఁ
బండితిని పైరవాసంబుఁ బఱచి కొనుచు.

సీ. మృదులానిలోచ్ఛ్వాస మృగశాబలోలాక్షి
యలివేణి, శుకవాణి యబ్జపాణి
రంభోరువు పికస్వర మరాళగామిని
కోకిల సల్లాప కుందరదన
కాంచననాస పంకజవక్త్ర బింబ బిం
బోష్ఠి లతాంగి నీలోత్పలాక్షి
స్తబకలికుచకుచ చంపకసౌగంధి
పున్నాగనతనాభి పువ్వుబోఁడి

గీ. యైన వనలక్ష్మి నవలక్ష్మి యగుచుఁ దనకుఁ
దాన పొబగుగాఁ దాళ వృంతములు దాల్చి
విసరు చుండంగ మెలమెల్ల విసివికొనక
పవ్వళించితి నలమటఁ బాపికొనఁగ.

గీ. ఆదరించెడి వా రొక రైన లేని
కాని పొలిమేర సీమ నేకాకి యగుచు
మేను మఱచి నిద్రించెడి వాని యూడి
గమ్మి చేయుట స్త్రీ స్వభావమ్మి కాదె !

సీ. పండుటాకుల సెజ్జ వసివాడు దేహంబు
కసుగంద నీకుండ నొసఁగు సుఖము
చెమట చిత్తడిఁ బుట్టు చిదచిద మాన్పుచుఁ
గొసరి వీచెడి గాలి యొసగు సుఖము
విన సొంపు మాటలఁ బిలిచి పాడెడు నట్టి
యున్మత్తశారిక లొసఁగు సుఖము
వీరెండ నీరెండఁ బెడఁద్రోసి నపకంపు
సహకార వృక్ష మొసంగు సుఖము

గీ. బడలికను బాపి యానంద పదవి నొసఁగఁ
బడిన కడగండ్ల మఱపింప భావి సుఖము
తలపులం బాఱ నొకరీతిఁ దనివిఁ జెంది
గాఢ సుప్తిని బొందితిఁ గన్ను మూసి.

మ. పథికాయాసముచేత డస్సిన ననున్ బాటించి లే గాడ్పులి
త్యధికశ్రాంతతఁ బాపి నిద్రఁగనుమయ్యా! యంచు జోకొట్టఁగా
బృధులానందముతోడ మైమఱచి హాయిం జెంది నిద్రించితిన్
వ్యధవో, బాల రసాలసాల నిబిడవ్యాకీర్ణ సచ్ఛాయలో.

నెక్కొని యెంతకాలమిటు నిద్దురఁబోతినొ లేచి చూచుడున్
వక్క తపోధనుం డొకఁడు ప్రక్కను నిల్వఁగ సంభ్రమంబుతోఁ
గ్రక్కన లేచి యామునిని గాంచి నమస్కృతిఁ జేసి యాదరం
బెక్కుడుగాఁ దొడంగ మదభీష్టము దీరునటంచు నెంచితిన్.

గీ. శైశవము నుండి బాధించు సంశయముల
నెల్ల మూలముట్టుగఁ బాపి యిపుడు నన్ను
నుద్ధరింపంగ వచ్చిన సిద్ధుఁడనుచు
లోన తలపోసి యిట్టంటి వానితోడ.

కం. అయ్యా! మీరెవ్వరు? నా
కుయ్యాలింపంగ నిచటకుం బ్రేముడితోఁ
జయ్యన వచ్చిన జడదా
ల్పయ్యల పౌరాణికేద్యు లవుదురె? చెప్పఁడీ.

మ. అను నావిన్నపమాలకించి కరుణాయత్తైక చిత్తంబునన్
ననుఁ గన్నారఁగఁజూచి, చేనిమిరి సన్మానంబుతో, బాలకా!
చనదొక్కింతయుశంక సూతఋషి రాట్స్వాంతంబు సౌమ్యంబు వ
చ్చినకార్యం బెఱిఁగింపుమా యనఘుఁడున్ జేదోడువాదోడగున్.

వ. నిఖిల పురాణ వ్యాఖ్యాన విజ్ఞానసమేతుం డయిన సూతర్షికి నేను బుత్రోప మానుండనైన ప్రియతమాంతేవాసిని. నీవెవ్వండవు? ఏ కార్యార్థ మెట నుండి యిటకుఁ జనుదెంచితివి? విననర్హంబేని విన్పింపు మనవుడు—

సీ. సదసద్వివేకులౌ శౌనకాదులు తొల్లి
ప్రశ్నింప సూతౌ పౌరాణికుండు
కృపతోడఁ బదునెన్మిది పురాణముల నెల్ల
విన్పింప మునులెల్ల వినిరికాదె!
ఆ పురాణములందు దాపరించిన ధర్మ
సందేహములు నన్ను సంగ్రహింపఁ
బండితమ్మన్యులఁ బల్వుర నర్థించి
సంశయమ్ములఁ బాయఁ జాలనైతి

గీ. వానిఁ దొలఁగించుకొన నెంచి వచ్చినాఁడ
సూతు దర్శించు వాంఛమై శుభగచరిత!
గ్రామమో! యంగలూరు నేఁ గమ్మకులుఁడఁ
ద్రిపురనేని రామస్వామి దెల్పుచుంటి.

కం. నన్నాముని మూర్ధన్యుని
సన్నిధికిం దోడుకొనుచుఁ జన వేడెద నా
విన్నప మాలించుఁడి యా
పన్నునిఁ గాపాడునట్టి పని మీదె కదా.

చం. అనిన యనంతరమ్మున ప్రియమ్మున రమ్మనిచెప్పి తోడుతోఁ
జనియెను వారిఁ జూపుచుఁ బ్రశస్తమనోహర సౌరభాఢ్య పు
ష్ప నివహా రంజ దత్యధిక వంజుల మంజుల కుంజ పుంజ సం
జనిత పథా వరోధ పరిసర్పిత ధామకు నొక్క సీమకున్.

సీ. నృత్యంబుచేఁ జొక్కి నీలకంఠములపైఁ
గోడె ప్రాఁచులు నడయాడుచుండె
జాలెంత క్రొల్వులుల్ పాల్చేప బతిమాలి
యిట్టిపిల్లలకుఁ జన్నిచ్చుచుండె
కొదమ సింగపుఁ బిండు గున్న యేన్గుల నెక్కి
యట్టిట్టు పాతర లాడుచుండె
కాడు బిడాలముల్ బాడుగాఁ గాపాడ
నాఖువుల్ పింపిళ్ళ నాడుచుండె

గీ. వీని నన్నింటి సంతోష వివశుఁడనయి
కాంచి సూతర్షి నిశ్చల ఘన తపః ప్ర
భావమునకు నబ్బురపాటుఁ బడుచు నపుడు
జటిలవరుతోడ నాజాడఁ జనినవాఁడ.

ఉ. మారుతుఁ డట్టె పుష్పాడి దుమారము రేపఁగఁ గంటిలోనికిన్
బోరునఁ జేర ఱిచ్చవడి పుష్పమరందము మాని తుమ్మెదల్
మీఱిన దొడ్డ కిన్కను సమీరు హమీరు శపించుచుండె ఝం
కార మిషంబుతో నతఁడు కంపిలి పోవఁగఁ జెట్ల సందుగన్.

చం. కుఱఁగలి కానలోన రవి గ్రుంకుచు నుండఁగ నెట్టిచాయలున్
గుఱుకులు కట్టఁగా నిజము గొబ్బునఁ దోఁచక ఱిచ్చపాటుతో
నెరగలియంచు భీతిపడి యేమియు నేరక కాకిమూఁకలున్
బరువడి 'కావుకావు'మని పాఱఁదొడంగెను మింట నొంటిగన్.

గీ. సంజ నీరెండ పుష్ప మంజరుల నెల్లఁ
బొల్పు మీరెడి మంకెన పూలొనర్చెఁ
బర్ణ సంతతులను బల్లవములఁ జేసె
నేమి చెప్పుదు నా వనసీమ గోము.

గీ. కొఱఁకులకుఁ జన్నపూరేండ్లు గూండ్లువట్టె
జన్ని యాపులు మందల తెన్నువట్టెఁ
దొడరి పడమఱ యెఱ్ఱలు దోలువేళఁ
గదల ముఱిముఱి చీఁకట్లు గ్రమ్మువేళ.

వ. ఇట్లభిరామంబయిన నావనసీమ దరియంజొచ్చి పోవునెడ—

ఉ. పర్ణకుటీర మొండు సుమ భారపుటీరము మాఁటునుండి సం
పూర్ణముగాక కంటఁబడె ముందుగ సుస్వర సంయుతంబులై
కర్ణములం బడెన్ శుక పిక ప్రకర స్వనముల్ సదాపతత్
పర్ణ సమూహ సంకలిత పద్ధతిఁ బోవఁగఁ బోవ నంతటన్.

యుగములనాఁ దేసి యుంచిన యాకులు
చివికి జీర్ణముగాఁగఁ జెదలువట్టి
ఆలనపాలన యదిలేమి ముంగిటఁ
గారాకు లిట్టట్టు కదలుచుండ
అదలించుటకు లేమి నడవిపందులు చొచ్చి
పెల్లగించుచు నుండఁ బెరటిచెట్లు
పైఁ బరామర్శించు వారలుండమిచేత
గోడల మన్నెల్లఁ గూలుచుండ

గీ. సారవంతములైన యోషధులు గల్గి
విరియఁ బూచిన తీవల విరివి గల్గి
భయము భక్తి గొల్పెడు నిట్టి పర్ణశాల
మౌనివాసయోగ్యంబగు దానిఁగంటి.

కం. దట్టముగాఁ బెఱిగిన కస
విట్టట్టుగఁ ద్రోసిపుచ్చి యేర్పఱచిన పెన్
గుట్టల మెట్టెడి మార్గముఁ
బట్టి చనితిఁ బర్ణశాల వాకిలి కంతన్.

చం. వడుగులు మూఁడు ప్రొద్దులను భక్తిని స్నానములాడుకోర్కెమై
మడుగులలోనికిం దిగుచు మాటికి వచ్చుచుఁ బోవుచుండఁగా
నడుగుల జాడ లేటి యిసుకందున సైతము గానవచ్చె న
ప్పుడు పొడఁగట్టెఁ గట్టెదుటఁ బొంకముగా నొక పర్ణశాలయున్.

కల్మషాభావమైన గంగా స్రవంతి
యమల తోయంబునం దీదు లాడుచున్న
పలుతెఱంగుల రంగుల పులుఁగు బెలుఁగు
లాలకించితిఁ గర్ణపేయంబు గాఁగ.

గీ. పర్ణశాలముందు బాదరించెడు నట్టి
వేది మధ్యమందు వెల్గువాని
భస్మలిప్తదేహుఁ బద్మాసనస్థునిఁ
గాంచినాఁడ నతుల కౌతుకమున.

ఉ. కాంచినయంత నామదికిఁ గల్గెను గట్టి ప్రశాంతి, బ్రహ్మతే
జోంచిత మౌని చంద్రవదనాబ్జ గళత్కరుణాప్రపూర్ణ దృ
క్పంచయ మల్ల నా పయికిఁ జల్లఁగఁ బర్విన యంతమాత్ర యి
ట్లుంచుఁ దలంచితిన్ దుదకు నాత్రముతో మెయి పుల్కరింపఁగన్.

ఉ. కష్టము తీరునంచుఁ దమకంబున వాగ్మి, త్రికాలవేది, నా
కిష్టముఁగూర్ప జాలిన నిరీహుఁ డితండని విశ్వసించి, సం
తుష్టిని బొంది సూతముని ధూర్వహుఁడౌనని శ్రద్ధతోడ వి
స్పష్టముగాఁ బ్రణామమును జల్పితిఁ దుంపెసలారు భక్తితో.

శా. శ్రద్ధాభక్తులఁ బాదపద్మముల మస్తంబుంచియున్నట్టి నన్
బుద్ధిక్షోభముఁ బొందకుండుమని సంబోధించి దీవించి నీ
విద్యాశ్రీస్థలికిన్ మదర్థమయి యిట్లేతెంచు వృత్తాంతమున్
బుద్ధింజూచి గ్రహించితిన్ మునుపె యామూలంబుగా నర్భకా!

గీ. వ్యాసభట్టారకుఁడు మున్ను వచ్చి చెప్పె
శిష్యుఁ డొకఁడు విద్యార్థియై చేరఁగలఁడు
వాని ధర్మసందేహము ల్బాపి పంపు
మఖిల లోకైక కల్యాణ మగును దాన.

గీ. అంచు వచియించి నను గు స్తరించి నిమిరి
మేను నికటాసనస్థునిగా నొనర్చి
యింబు మీరంగ శరదంబు దంబు డంబు
ననుకరించునట్టుల నిట్టు లనియెమౌని.

సీ. సవన దీక్షాతంత్ర సమయంబునందున
శౌనకాది మునీశ సంచయంబు
ప్రొద్దు రవ్వంతైనఁ బోకుండె ధర్మముల్
విన్పింపుమని నన్ను వేడుటయును
చిన్నతనంబున శిష్యుండనై వ్యాసు
సన్నిధిఁ జదివిన చదువులెల్ల
ధర్మ సంస్థాపనార్థము సంగ్రథించి పు
రాణ సమూహంబుఁ బ్రకట పఱచి

గీ. చెప్పితినటంచు వంచకుల్ చెప్పుచుండఁ
బేరు మోసమటంచు భావింపలేక
నమ్మి చెడుచున్న వారు లోకమ్ము నందు
దానఁ గల్గఁగాఁజొచ్చె సంతాపభరము.

కం. ఎట్టుల నా పేరిట భువిఁ
బుట్టించు మహోపకారముం బాపుకొనన్
ధట్టుఁద నొదునొ యని యె
ప్పట్టునఁ దలపోయుచుందుఁ బాయని చింతన్.

కం. ఒక్కొకటి గాథల నన్నిటి
నొక్కటిగాఁ జేర్చిపెట్టి యుంచిన మాత్రన్
మిక్కిలి మతముం దెల్పెడి
చక్కటిగల గ్రంథమౌనె చర్చించినచో ?

శా. నా పేరన్ వెలయించి నామెడకు నంటన్‌గట్టి తద్గ్రంథముల్
నాపై నేరము మోపఁగాఁ దలఁచి యన్యాయంబున్యాయంబుగాఁ
బాపంబున్ సుకృతంబు గాఁగ రచియింపంజాలినా రెవ్వరో ?
నాపైఁ బెట్టినయట్టి యీయగడుమాన్పంగాఁ బ్రయత్నించెదన్.

వ. అనిన యనంతగంబు నే నిట్లని విన్నవించుకొంటి—

చం. సకల పురాణముల్ చదివి సంగతులన్నియు నే గ్రహింపఁగా
వికలతఁ జెందె నా మనసు వేయి విధమ్ముల శ్రద్ధతో బుధ
ప్రకరము నడ్గి యందలి పరస్పరఘోరవిరుద్ధగాథలన్
నికరముగా గ్రహింపఁగను నేరకపోయితి మౌనిచంద్రమా !

సీ. అంబుధి సప్తకం బాపోశనముఁ జేసె
నొక్కరుండని చెప్పు నొక్కకథను
సర్వభూచక్రంబుఁ జాపచుట్టఁగఁ జుట్టె
నొక్కరుండని చెప్పు నొక్కకథను
సప్తాశ్వు జాయకై సానఁబట్టెను బట్టి
యొక్కరుండని చెప్పు నొక్కకథను
కొండకై యెగిరెడి కొండతెక్కలు గూల్చె
నొక్కరుండని చెప్పు నొక్కకథను

గీ. క్రోతి కొండ్రముచ్చులకును గొండలకును
మానవులు పుట్టిరనిచెప్పు 'మాయమాట'
లన్ని కథ లీ పురాణము లందె కలవు
పిట్టకథలకు నివియెల్లఁ బుట్టినిండ్లు.

సీ. పాథోజనాభుండు భగవంతుఁ డొకచోట
నొకచోట స్త్రైణశాపోప హతుఁడు
అళికాక్షుఁ డద్వితీయబ్రహ్మ మొకచోట
నొకచోట ఋషిపత్నులకు విటుండు
అబ్జగర్భుండు స్వయంభువౌ నొకచోట
నొకచోట శత్రు పాదోపహతుఁడు
దేవకీపుత్రుఁ డింద్రియజేత యొకచోట
నొకచోట జారపాళికి గురుండు

గీ. శుక పరబ్రహ్మ మొకచోట శుద్ధ జడుఁడు
వేటె యొకచోట సంసారి బిడ్డతండ్రి
యన్నికథలీ పురాణము లందె కలవు
పిట్టకథలకు నివియెల్లఁ బుట్టినిండ్లు.

ఒకయెడ గుణకర్మంబులె
ప్రకృతము వర్ణవ్యవస్థఁ బాల్పుచ్చెడి వే
ఱొకయెడ జన్మము మాత్రమె
ప్రకటపఱచుఁ బొమ్మనును బురాణము లనఘా!

వ్యాసుఁడె యీ పురాణముల వ్రాసిన నిట్టివి సంభవించునే?
వ్యాసుఁడు వ్రాయలేదు ప్రతిభాఢ్యుఁడు సూతుఁడు చెప్పలేదిఁకన్
మాసరమైన యాసుగల మానిసి మీరలు చెప్పినట్టుగా
వ్రాసెనటంచుఁ జెప్పెద రబద్ధమొ బద్ధమొ లోకు లిప్పుడున్.

గీ. జాతి మాత్రోప జీవులు నీతి దప్పి
సడ్డఁ జేయక స్వోత్కర్షఁ జాటుకొఱకు
వ్రాసి రష్టాదశ పురాణవర్గ మను వ
దంతి ప్రజలలో నొకటి యుత్పన్నమయ్యె.

కం. కొందఱు ప్రక్షిప్తంబులఁ
బొందించి యనేకగతులఁ బులు మానిసులై
యిందనుక మోసపుచ్చిరి
యందఱు నిజమెఱుఁగరాని దయ్యె మహాత్మా !

కం. ఒజ్జలు మీరుగదా మీ
యజ్జలపైఁ బడినవాఁడ నజ్జము గాఁగన్
ముజ్జగములయందలి వి
ద్వజ్జనము నుతించు ధర్మ పథమును జెప్పుఁడీ.

గీ. ఆగతా నాగత విదులరైన మీరు
దర్శనముఁ జేసి మీచేతఁ దథ్య మెఱిఁగి
యవల లోకమ్మునకుఁ బెల్లునట్టి వాంఛ
నరుగుదెంచితి నిటకుఁ గాఱడవిఁ దాటి.

కం. అన్నంతనె నామాటలు
విన్నంతనె సంభ్రమంబు విక్కుచు నుండన్,
విన్ననువున ముని యనియెను
బన్నికతో సుప్రసన్న భావముతోడన్.

సీ. 'ఓ'యన్న గంగలో నూయాల లూఁగెడి
కొదమ రాయంచ లూఁకొట్టు చుండు
సమిధలు గొనితేరఁ జనినచో వన్యమృ
గావళి తోడు నీడగుచునుండు
గానంబు సేయంగ గమకింప మైన గో
ర్వంకలు నీ సహపాఠు లగును
నిదురించు నినులేప నీడోద్భవ చయంబు
నీ వందిమాగధ నికర మగును

గీ. చాల కటికనేలను బెల్లు చాప మీఁదఁ
గందమూలముల్ గుడిచి నిష్కామ వృ-
త్తులాడ నొక్కరినైనఁ జూడకుండ
నెట్లు దివములు వేగింతు విచటనుండి ?

గీ. గాంగసైకతమ్ముల మీఁదఁ గట్టినట్టి
పూరి యింటిలో నీవు కాపురము నిల్చి
చలికి గ్రొస్సి శుష్కోప వాసముల డస్సి
బ్రహ్మచర్యంబు నడప దార్ఢ్యంబు కలదె ?

కం. నీవారి నుజ్జగించియు
నీవారాన్నంబుఁ గుడిచి నిల్తువె యిచ్చో ?
నీవారిఁ ద్రావి నిత్యము
నీవారి మనంబు కుంద నిన్విడుచుటచే.

గీ. ఎంతకాల మిందు నేకతంబున నుండి
యధ్యయనముఁ జేయ ననువు పడునో ?
తామసింపకుండ ధర్మ సూక్ష్మంబులు
తెలియఁబఱతుఁ దేట తెల్లముగను.

వ. అనిన మ స్తన్య స్తహ స్తుండనై, నిస్తుల మహిమాభిరామయు, సమస్త వస్త్వంతర్యామయు నగు నాదిశక్తిం గూర్చి ప్రస్తుతించి వినమిత శిరస్కుండనై తత్పాదారవిందంబుల దృష్టినిబద్ధముఁ జేసి యీ కరణి విన్నవించుకొంటిని—

శా. గంగా పూత జలాభిషేకము నశోకస్రగ్విలాసంబునున్
భృంగీ గీత వినోదమున్ బికవచః పీయూష మాధుర్యమున్
శృంగారాబ్జ మయూఖ నద్ధరజినుల్ చెందమ్మి కొందావి మీ
సంగాతంబును మీ పొలంబుడుఁగ వాంఛాసిద్ధి చేకూరునే ?

సీ. పరమపావన గాంగ పాథస్సమూహంబు
పుష్కరిణీకూప పుష్కరంబు
కలకంఠ శారికా కాకలీ రావంబు
కర్ణ పుటో దీర్ణ కలకలంబు
పైకొను పుష్పాళ్ళ వలిగాడ్పు తెమ్మెరల్
తీరని పెడగబ్బు మారుతంబు
త్రోటిపోటుల గాట్ల దోరగిల్లిన పండ్లు
కొంటె జబ్బులు డెచ్చు వంటకములు

గీ. సరిసమానములొక్కో ! యే సరణి నేని
యెఱిఁగి యెఱిఁగి నేనేల యపేక్షసేతు ?
నడవిలోనున్న మునిపల్లె విడచిపెట్టి
పొట్టకూటికిఁ గోరాడు పట్టణంబు.

గీ. ముక్తిదాయకులైన మిమ్ములను బాసి
నవ్య విజ్ఞాన సంపాదనమ్ము రోసి
యే యెడాటమ్మునందు నేనేమి చేసి
యెఱుఁగ నేర్తు ధర్మమ్ముల నెవని డాసి ?

వ. కావునఁ గృత్రిమ సౌఖ్య ప్రపూర్ణంబయిన లోకంబుఁ గంటగించెద.
జంతు సామాన్యములయిన యీ సుఖంబు లభిలషించెద—

కం. గురుకులవాసక్లేశము
నరుదారఁగ ననుభవించి యైనను సరియే
నెట్టి కత్తిమీఁది సాముగ
జరుపంగలవాఁడ బ్రహ్మచర్యవ్రతమున్.

వ. కావున—

గీ. ఎంతకాలంబు మీరు నన్నిచట నుండు
మనుచు నాఁక పెట్టెదరొ నే నంతకాల
మిచటఁ దావక పదములే యేడు గడగఁ
గొలిచి సేవించువాఁడనో గురువరేణ్య !

గీ. సర్వ పౌరాణ సందేహ సంచయంబుఁ
దీర్చి నన్ను విద్యా సముదీర్ణుగాఁగఁ
జేయు నందాఁక నిందె వసింతు నయ్య
శిష్య పరమాణువుగ నన్నుఁ జేసికొన్న.

కం. చిటిపొటి మాటలతో ము
చ్చట చెప్పుటతోఁ జదువులు చదివించెడి యా
విటతట యొజ్జలఁ గొలిచితి
నెటునలె మిము నుజ్జగింతు నేనని చెప్పన్.

వ. సూతముని కంఠీరవుండు సముత్కంఠఁదెల్పు కంఠస్వరంబుతో —

ఉ. పాత్రమెఱింగి దానము ధృవంబుగఁజేయుట పాడియంచు స
త్పాత్రునికోసరంబు నలుచక్కలు చూచితి రేపు మాపులున్
జిత్రముగాఁగ నా తలపు సిద్ధిని బొందెను నేఁటితోడ నే
యాత్రములేక ధర్మముల నన్నిటిఁ జెప్పెద నాలకింపుమా.

గీ. శిష్యకోటి వాంఛా ఫల సిద్ధిఁ జేయు
టెల్ల నాచార్యధర్మమౌ టెఱుఁగనొక్కొ !
నీ యభీష్టములెల్ల వివ్పించు నెడల
నెఱుకగలవారి మాటల నెఱుఁగఁ జేతు.

వ అయిన నిప్పుడు ప్రదోషకాలం బాసన్నంబగుచున్నది. సంధ్యావందనాదులు నిర్వర్తించి, నిదురింపుము. రేపు సావధానంబుగా విషయచర్చఁ గావింప

వచ్చుననిన, నమస్కారంబాచరించి సెలవంది, కాల్యకరణీయంబులఁ దీర్చికొని, ఫలభక్షణంబు సలిపి, యథోచితంబుగా వేదికామధ్యంబుననున్న దర్భసంస్తరణంబున, శయించి సుఖనిద్రవోయితి—

గీ. మధుర పేశలసౌరభ మహిత గాంగ
పుండరీకపరాగ సంపూర్ణ మంద
సుప్రభాత వాయువులు వీచోపు లిడుచు
మేలుకొల్పంగ మెలమెల్ల మేలుకొంటి.

వ. సంధ్యావందనాదులు నిర్వర్తించి జగదుపకారశీలియు, నిష్ఠుర తపోశాలియు నగు సూతమహాముని సందర్శించి సాష్టాంగదండప్రణామంబు లాచరించి తదనుమతిని సమీపంబునఁ గూర్చున్న నన్నుఁజూచి, విప్పారిన మోముతోఁ గరుణార్ద్రంబులగు చూడ్కులు నిగుడించుచు నీసరణి వాక్రుచ్చె—

ఉ. వేసవి వెట్టనున్ నరకు వెట్టక యెట్టొకొ జ్ఞానతృష్ణచే
గాసిలి కానిదేశమని కంకక కొంకక వచ్చితీవు నా
కోసము, సంశయంబులను గొబ్బునఁ దెల్పుము, తీర్చువాఁడ మా
వ్యాస గురూపదిష్టమగు భాతి నటంచు వచించె సూతుఁడున్.

ఉ. నావుడు సంస్కృతం బతి సనాతనదైవతభాషయంట, భూ
దేవతలంట, తారు తమదే యఁట దాయలుగారఁటే పరుల్
కావున సద్విజుల్ చదువఁగా నరకంబు లభించునంట నేఁ
డీ విధి విప్రులెల్ల వచియింతురు వింతరు ధర్మపద్ధతుల్.

చం. చదువఁగరాదొ యద్విజులు సంస్కృతభాష వివేచనంబుతోఁ ?
జదివినవాని నెల్లను ద్విజన్ములకున్ వినిపింపరాదొ ? యి
య్యది పొనరించినన్ నరక మందునఁ గూలి నశింపఁ దప్పదో ?
విదితముగాఁగఁ జెప్పుఁడు వివేకులు మీరలఁటన్న సూతుఁడున్.

శా. కార్యాకార్యవివక్షనుం దెలిసియుం గాలుష్యముం దూఁటఁగా
ధైర్యస్థైర్యములేక ధర్మముల నుద్ఘాటింతురే ? భూసురుల్
మర్యాదన్ దిగద్రావి యీసరణి రామస్వామి ! చిత్రంబహో !
యార్యావర్తము పుణ్యభూమియటె కట్టా ! యేమికానున్నదో ! !

కం. భవితవ్యంబును గూరిచి
పొవలి పొవలి పెద్దబొద్దుఁ బుచ్చఁగనేలా ?
ప్రవచించెద నా యెఱిఁగిన
ప్రవిమల వేదోక్త ధర్మ పద్ధతి వినుమా !

శా. ఈ సంప్రశ్నము సత్రయాగమున మున్నే వచ్చె నానాఁడు మా
యూసాడంగనులేక శౌనకుఁడు తా యోజించి యోజించి సం
త్రాసంబుంగొని మోడ్పుకన్నుగవతో ధ్యానింప విచ్చేయుచున్
వ్యాసర్షీంద్రుఁడు ధర్మనిర్ణయము నొప్పంజేసె నిష్పక్షుఁడై.

వ. వ్యాస శౌనక సంవాదరూపంబయిన నేతదుపాఖ్యానంబు సర్వప్రాణిమోదంబు, నఘాపనోదంబు, నగుటం జేసి విన్పింతు నాలింపుము. దాన నీ సంశయంబు దీరు—

## వ్యా స శౌ న క సం వా ద ము

ఉ. నైమిశమందుఁ దొల్లి యతినాథులు పావన సత్రయాగమున్
నేమము తోడఁ జేయఁగ మునిప్రవరుండును నిర్జితేంద్రియ
గ్రాముఁడు నైన శౌనకుని రమ్మని పిల్వఁగఁ జూడఁబోవుచున్
మామక పర్ణశాలకయి నన్ గొనిపోవఁగ వచ్చి యిట్లనెన్.

శా. సూతా ! సంయములెల్ల నైమిశవనక్షోణీ తలంబందు వి
ఖ్యాతోదంచిత సత్రయాగ మిపుడే కావింపనున్నారు, మ
చ్చేతః ప్రీతిగ రమ్ము పోవుదము విచ్చేయంగ నున్నారఁటే
పూతాత్మల్ ఋషిపుంగవుల్ త్రిజగతీపుణ్యాత్ము లెందెందఱో.

ఉ. పెద్దలసేవఁజేయు తలపెప్పుడ నీ తలఁగల్గుఁ గాన నొం
డుద్దియు లేనివారు చనుచుండిరి యాడకు వారివద్దనున్
బుద్ధులు నేర్వవచ్చు మనపుట్టువు సార్థకమౌను, లెమ్మ, వే
తెద్దియుఁ బల్కకుంచు వచియింపఁగ వల్లె యటంచు నేనునున్.

ఉ. పుణ్యుఁడు శౌనకుండు పరిపూత చరిత్రుఁడు వెంటరాఁగఁ గా
రుణ్యముతోడ బాటల నెఱుంగుటఁ జొచ్చితి నీలకంఠ లా
వణ్యము, సౌరభప్రసవపణ్య మగణ్యము నైమిశాఖ్య కా
రణ్యవరేణ్యమున్ మునిశరణ్యము కోర్కెలు సందడింపఁగన్.

సీ. పొడుపుగుబ్బలిమీఁదఁ బొడతేర జాబిల్లి
పండువెన్నెల కాయుచుండె నపుడు
పండువెన్నెలఁజూచి పగలంచు భ్రమియించి
పరభృతానీకంబు పాడ సాఁగె
పరభృతగానంబు పమ్మంగఁ బలవించి
బ్రహ్మచారి యులికి పడుచునుండె
బ్రహ్మచారిని జూచి బైరాగులెందఱో
ముసి ముసి నవ్వులో మున్గియుండ

గీ. మమ్ముఁ జూచి చూడకముందె మౌనివరులు
చేరి కుశల సంప్రశ్నముల్ సేసి పిదప
స్థండిలంబునఁగోరి కూర్చుండఁబెట్టి
యుబుసుపోకకు మాటాడు చుండిరంత.

గీ. అడవి పూలగబ్బు నపహరించి భరించి
కుంటినడకతోడఁ గొంటె గాలి
యొడలికెక్క ప్రాకి పొడుగు గడ్డము లూఁచు
చుండ నిట్లుపల్కె నొక్క తపసి.

గీ. కథకుఁ డొక్కఁడు జెప్ప సత్కథలఁ జెప్ప
వలయుఁ గావున నిపుడొక్క ప్రథిత యశుని
నిర్ధరించి పౌరాణిక నిఖిలగాథ
లాలకింప స్వశ్శ్రేయసమగు నఁటన్న.

కం. శౌనక యతి మూర్ధన్యుఁడు
మానిత మహనీయ సూక్తి మాధుర్యముతోఁ
దా నీగతి వచియించెను
మౌనివరేణ్యులకు ధర్మమార్గముఁ దెలుపన్.

ఉ. సూతుఁడు జ్ఞానయోగపరిశోధిత దివ్యమనోంబుజాత వి
ఖ్యాతుఁడు ధర్మశాస్త్రతతి గర్భరహస్య విశిష్ట తత్వ ని
ష్ణాతుఁడుగల్గ నొండొకని సాయము హేయముగాకయున్నె ? యో
పూతచరిత్రులార ! మన పుణ్యముచే నతఁడుండె నిచ్చటన్.

చం. చదివినవాఁడు శాస్త్రములు సర్వము, పెద్దలయందు భక్తిచే
మెదలినవాఁడు నెల్లపు డమేయగుణాఢ్యుఁడు శీలవృత్తముల్
పొదలినవాఁడు ప్రల్లదనమున్ మెఱమెచ్చులు లేనివాఁడు, మె
ప్పొదవినవాఁ డితం డొకరుఁ దొప్పును సత్కథకుండు నౌటకున్.

వ. అను నీ శౌనక వాక్యము లాలించి నైసర్గిక నిష్కపట వాక్పారుష్యంబున దుర్వాసుండుపాలంభనంబుగా నిట్లనియె—

చం. సభికులొ ! వేదవేత్తలు ద్విజన్ములు, భాషయొ ! సంస్కృతం, బనే
కభపహరాఢ్య నైమిశము కాఁగలక్షేత్రము, కాలమన్ననో
శుభతరసత్రయాగ మెటు సూతుఁడు నిర్మలధర్మవై దుషీ
విభవము గల్గియున్నను, వివేకము కల్గిన నర్హుఁ డయ్యేడున్ ?

ద్విజుల సేవించి కళదలు తెలియవచ్చు
ద్విజులఁ బూజించి స్వర్గ మేతేరవచ్చుఁ
గాని యద్విజుల్ ద్విజుల కెందేని ధర్మ
మర్మము లుపదేశింప సంభావ్య మగునె ?

సీ. సృష్టిలోఁ దొలుదొల్త నేభాష భగవతి
వాణికి జిలిబిలి పల్కు లయ్యె
ఆబాలగోపాల మమరులేభాషలో
దేవాదిదేవు స్తుతించుచుండ్రు
మనముందునేగిన ముని ముముక్షువులెందు
"నేతి నేతి" యని యూహించినారు
వేదవేదాంగము లాదినారాయణుం
డే భాషలోఁ జెప్పి ఋషుల కిచ్చె

గీ. ఇట్టి సంపూజ్యభాషయం దెట్లు సాహ
సింపఁగలఁడు ? సూతుఁ డుపన్యసింపఁ దనకు
లేశమగు నధికారంబు లేదటంచు
నెఱిఁగియుండియు శౌనకా ! యెఱుఁగఁ బల్కు.

వ. ఈ సూక్తి సమాకర్ణనంబునఁ గొందఱు వాచంయములు విషాదచిత్తులై దిక్కులుచూడఁ దొడంగిరి. మఱికొందఱు పుల్లవడిన మోములతో నావంకఁ జూడ్కులు ప్రసరింపఁజేసిరి. ఇంకఁ గొందఱు విహ్వలస్వాంతులై, యేమి చెప్పుటకుఁ దోఁచక యెవ్వరేమి చెప్పుదురో యని వేచియుండిరి. అంత శౌనకుండు పిడుగడచినట్లై, కొంతవడికిఁ బెప్పిరిలి సదస్యుల యాస్యబింబముల దృష్టి నిబద్ధముంజేసి రాల్పడు నీరెలుంగుతో—

వేదవ్యాసఋషీంద్రుఁ డెన్నఁడు చతుర్వేదోక్త ధర్మంబులున్
వేదాంగంబులు సంస్కృతంబున సదా విన్పించె సూతర్షికిన్
వాదంబేటికి ? నాఁడె యద్విజులు నేర్వన్ నేర్వ గీర్వాణ భా
షాదోషజ్ఞతఁ బొంద నర్హులయి రీ సందేహ మింకేటికిన్ ?

ఉ. కావున సందియంపడెడి కారణమేదియుఁ గల్గదైన మీ
భావము నమ్మకున్నయెడ వ్యాసుఁడు వేదవిభాగకర్తయే
యీవల కేగుదెంచి మన యెల్లర ముం దిదమిత్థమంచు సౌ
ఖ్యావహమంచు ధర్మగతి యంచు వచించుఁ దలంగనేటికిన్ ?

గీ. బాదరాయణుఁ డొక్కఁడే వేదవేత్త
యర్హుఁ డతఁ డొక్కఁ డీ సంశయంబుఁ దీర్పఁ
బరులు రవ్వంత చాల రీపని కటంచు
సరవిఁ గన్గవ యరమోడ్చి సంస్మరింప.

సీ. శీతవాతాతప జాత బాధలు లేని
మెఱుఁగు టొడలు మిఱు మిట్లు గొల్ప
మొలచుట్టి రాఁజుట్టి మెలివెట్టి దోఁపిన
డంబైన కృష్ణాజినంబు మెఱయ
భాగీరథీ దివ్య వారి ప్రపూర్ణ క
మండు లెడమప్రక్క మక్కళింప
యోగదీక్షావేళ నుపయోగపడెడి త్రి
దండంబు కుడిచేతఁ ద్రస్తరింప

గీ. పర్వతేంద్రుని దెసనుండి వచ్చు ధాటి
జడలు గట్టిన వెంద్రుకల్ కడలఁ బాఱ
వ్యాసభగవానుఁ డింతలో వాయుగతిని
నుట్టిపడ్డట్టులయ్యె మా కట్టెదుటను.

కం. ఎక్కడ హిమవత్పర్వత
మెక్కడ నైమిశము గడియ యేగక మున్నె
చెక్కుచెమర్పదహో ! యా
చక్కికి నేతెంచె సిద్ధ సంకల్పుఁ డగుచున్.

గీ. బ్రహ్మతేజంబు వదనబింబంబు నందు
నృత్యమాడుచు జగము మోహింపఁ జేయ
సంయములు లేచి కడు సంతసంబుతో "న
మోనమ" యటంచుఁ బల్కఁగ మోడ్పుకేల.

ఉ. మమ్ములఁ నట్టెచూచి యభిమానము రాగము త్రుళ్ళుచుండఁగా
ముమ్మరమైన వత్సలత మోమెసలారఁగఁ గూరుచుండుఁడీ
యుమ్మలికమ్ముఁ బొందకుఁడి యోరిమిపెట్టుఁడియంచు మాదు
మమ్ము నెఱింగి సంతసిలి మన్ననతో నిటుపల్కెఁ బిమ్మటన్.

శౌనకా! నీవు మమ్మెద సంస్మరించి
నంతనే బుద్ధిగోచర మయ్యె మాకు
సర్వవృత్తంబు; నీదు సంశయముఁ దీర్ప
బుజు పథమ్మని దుర్వాసుఁ దెలిమిఁజెందు.

కం. ఆలింపుము నా సూక్తులు
దూలింపుము తప్పకుండ దుష్కృత్యములన్
బాలింపుము ధర్మంబుల
గాలించి యెఱుంగు శౌనకా! కర్జములన్.

కం. దుర్వాసోముని? వినవో
గర్వాగంభంబుడించి కడు శ్రద్ధమెయిన్
పూర్వాపర విషయంబుల
సర్వము చర్చించి ధర్మ సంగతి వినుతున్.

గీ. పతితపావన భాష గీర్వాణభాష
యంచు నెంచుచుంటిమికాదె? యందుచేతఁ
బతితులకుఁ గల్గు నక్కఱ పాఱఁజూడ
నన్యులకుఁ గల్గునొక్కొ రవ్వంతయైన?

ఉ. పామరులై ద్విజేతరులు వర్తిలుచుండిరి గాన సంస్కృతం
బేమి జిఘృక్షనైనఁ బఠియింపఁగరాదని వక్కణించుచోఁ
బామరులం దరింపఁగల పాటవమబ్బని భాషయేల ? త
న్నామ విచారమేల ? యవధానముతోఁ దలపోసి చూడుమా !

చం. కరము పవిత్రవంతమగు గాంగజలంబుల ముట్టినంతనే
పరమదురాత్మ ఘోరతర పాపముకూడ నశించు నాగతిన్
సరబడితో ద్విజేతరులు సంస్కృతభాషను నభ్యసించినన్
దరణవిధానముం గలుగు ధర్మసమాదరణైక పద్ధతిన్.

గీ. ప్రాణి యొక్కఁడు సంసార బంధముక్తిఁ
గాంచునెడల భాషా పరిజ్ఞానమునను
దెలిసియుండియు నయ్యది తెలుపకున్న
మనుజుఁ డెందు నిషిద్ధ వర్తనుఁడు కాఁడె ?

వ. మఱియు జాతిద్విజుం డద్విజుని ముఖంబున ధర్మంబు లెఱుంగుట శిష్టాచార విరుద్ధమందురో ! ధర్మప్రతిబద్ధమందురో ! ! వేదప్రతిషిద్ధమందురో ! ! ! గ్రహింప నయితి కానిదయ్యె అయినను శిష్టాచారంబుఁ దెల్పెద నాకర్ణింపుము

మ. మగనాలోర్తు కృపాకటాక్షమున సంభావించి తత్త్వార్థ మం
పఁగ విప్రోత్తముఁడయ్యెఁ గౌశికుఁడు ధర్మవ్యాధునింజేరి బో
యగదా యంచుఁ దలంప కామహితు వేదార్థావబోధంబునన్
విగతాఘుండగుటెల్ల మీ రెఱుఁగరే వేదాంతపారంగతుల్.

వ. తదుపాఖ్యానంబు నా మూలంబుగా వర్ణించెద నాలింపుఁడు——

ఉ. కౌశికనామ భూసురుఁ డొకం డతి ఘోర తపో విశేషసం
వేశుఁడు యోగనిష్ఠ వట వృక్షము క్రిందఁ దపించుచుండ శా
ఖాశిఖరంబునంగల బకంబు శిరంబున విష్ఠవైవ నా
క్రోశముతోఁ గనుంగొనినఁ గొక్కెర యుక్కఱి నేలపైఁబడెన్

గీ. పడిన ముదికొంగఁ గని జాలిపడి యతండు
లిప్పదిగనాడి దిగ్గున లేచి చనియె
నుంఛవృత్తిని జీవించుచుండు వాఁడు
నాటుపల్లెకు భిక్షాటనమ్ము కొఱకు.

గీ. అరిగి యిటులొక్కయాలివు టాలి యింటి
ముంగిటను నిల్చి యూరకే కొంగ ద్రుంగె
ననుచు నుడ్డుకుడిచి యురి యాడియాడి
కొనకు "భవతి భిక్షాన్దేహి" యనుచుఁ

చం. పిలిచిన పిల్పు తక్షణమ వీనులలోఁ బడినంతమాత్రనే
మెలత పతివ్రతామణి యమేయచరిత్ర పవిత్రశీల ని
ర్మల సుగుణాభిరామ గరిమంబగు భక్తిని భిక్షగొంచు రాఁ
దలపఁగ నింటికప్పుడు పథశ్రమతో దయితుండు వచ్చినన్.

గీ. చెమటబట్టఁబట్టి చిదచిదలాడంగ
నడచివచ్చినారె నాథ యిపుడు ?
శ్రమము వోవ నట్టె జలకంబులాడఁగా
రండి రండి యంచు రమణి యపుడు.

చల్లనినీరు తోడి పతి స్నానముఁజేసియు సేదదేరఁగాఁ
వెల్లమడుంగు దువ్వలువఁ దెచ్చి ధరింపఁగ నిచ్చి భోజనం
బల్లనపెట్టి ముచ్చటలనాడి పరుండఁగఁబెట్టి నిద్రఁబోఁ
జల్లఁగలేచి భిక్షఁగొని సాధ్వివతంసము వచ్చె నంతటన్.

మొలకనవ్వులతో వచ్చు ముగుదఁగాంచి
యడగియుండని కినుకచే నౌడుఁ గఱచి
కన్నుగవ కొనల్ గెంపారఁ గౌశికుండు
కర్కశస్వరమునఁ బల్కెఁ గంఠమెత్తి.

గీ. ఇంటి ముంగిట బ్రాహ్మణు నిల్పి నిలువఁ
బెట్టి పనిపాటలను దలపెట్టి యిట్టి
యాగడం బేల చేసితివమ్మ నీవు ;
కొఱవిచేతను తల గోఁకికొనినమాడ్కి.

గీ. అలిగినేని విప్రుఁ డంబుధి జలమెల్లఁ
బుడిసిలింపఁగలఁడు గడియలోన
వానిఁ జెనకి యెవఁడు బ్రదికిపోయినవాఁడు
సమయకుండ మూఁడు జగములందు.

వ. అనిన నమ్మహాపతివ్రత మందహాసంబు మోమునకొక వింతశృంగారంబుఁ
దెచ్చుచుండ నాబాపని కాకమాటలకుఁ జీకాకుపడక—

ఉ. కొక్కెర రెట్టవైచెనని కోపదురత్యయ దుష్టబుద్ధిచేఁ
బొక్కపడంగఁ జేసితివి పోరచిగాదె భవత్తపంబు ? నీ
కెక్కడి బ్రాహ్మణత్వము? మఱెక్కడిసద్గతి? యోర్పులేనివాఁ
డక్కట! బ్రాహ్మణుం డగునె ? యార్యులు విన్న హసింపకుందురే ?

గీ. శమదమంబులు లేక విజ్ఞాన ధనము
లేక సమదర్శికత్వంబు లేక యూర
కిట్టు బ్రాహ్మణుఁడంచు గీపెట్టినంత
మాత్ర వచ్చునే బ్రాహ్మ్యంబు ? చిత్రమిదియు ;

గీ. విప్రుఁ డల్గిన లోకముల్ భీతిపడుట
నేను జక్క గ్రహించితిఁ గాని నీదు
కోప తీవ్రాగ్నికీలలు కొంగఁ జెఱచుఁ
జెఱపలేవు పాతివ్రత్య శీలవతుల.

## ప్ర థ మా శ్వా స ము

అనుచు సాకూత సస్మితాననముతోడ
మర్మభేదకముగ నామె మాటలాడ
ధారణీసురుఁడుజ్ఝూతఁ దటమటించి
యావఁ ద్రావినట్లగుచు నిట్లాడెఁ దుదకు;

తల్లి యెఱుంగకాడితిని ధన్యవు, సైపుము నాదు తప్పు, నీ
యుల్లమునందుఁ జాల దయయుంచుము, దుర్లభయోగదృష్టిచే
నెల్ల గ్రహించి మించితివి యేగతి నీకిది లభ్యమయ్యె! నీ
వల్ల నెఱుంగఁగోరెదను వాకొనుమమ్మ యటంచు వేడినన్.

మ. పతియే దైవమటంచునమ్మి కొలునన్ బ్రాప్తించె నీయోగమీ
వతి కోపంబునఁ గొంగఁజంపి యిటు భిక్షార్థంబుమై రాఁగ మ
త్పతి యే తేరఁగఁ బూజలన్ సలిపి నీ భైక్ష్యంబుఁ గైకొంచు వ
చ్చితి రోషించితి నందుచేత నిదియా చెప్పంగదే ధర్మమున్?

గీ. ఎట్టి తపమొనరించిన నేమి ఫలము?
బ్రాహ్మణత్వము నీకుఁ జే పడఁగలేదు
వినుమిచటను ధర్మవ్యాధుఁ డనెడి బోయ
కలఁడు వానిచే ధర్మముల్ దెలిసికొనుము.

వ. అనినఁ గౌశికుండు కటకటంబడి నన్ను, బ్రాహ్మణోత్తముని, బోయకు శిష్యునిగాఁ బంపెదవె తల్లీయనిన నా సతీరత్నము—

పుట్టువుచేతబోయ యతి పూజ్యుఁడు బ్రాహ్మణుఁడయ్యె గర్మమున్
బట్టి వివేకి యంత నెఱవాది యొకండిలఁగల్గఁబోవఁడీ
పట్టుల నీవు నిక్కముగ బాపఁడవౌటకుఁ గోరుదేని నీ
కట్టిడి యేలచేసెదవు? గ్రక్కునఁ బోఁగదె వానియొద్దకున్.

ఉ. కౌశికమౌనిచంద్ర ! యపకర్ష ఘటిల్లదు నీకు మామకా
దేశము విన్న; నాతఁ డుపదేశమొనర్చును ధర్మముల్ పవి
త్రాశయుఁ డొటచేత వెనుకాడఁడు నమ్మము, పక్షపాత మే
కోశమునందు లే దతని కోసము బోయిన గౌరవంబగున్.

వ. అన విని కౌశికుండు మఱుమాటాడ వెఱచి యాపతివత్నీ రత్నంబుచే నా మంత్రణంబు వడసి ధర్మవ్యాధుని గృంహంబునకుఁ బోవ—

ఉ. చీకులువ్రేలఁ గట్టుటను జీగిలిమాగిలియైన యంగడిన్
లోకులు మాంసమున్ విలువ లోపలికిం జనుదెంచి మూఁగఁ జీ
కాకును బొందకుండ వెసకమ్మన నంజుడు నమ్ముచున్న లో
కైక గులోత్తరున్ బ్రథితుఁగన్గొని కౌశికుఁ డబ్బురంబుతో.

కం. హింసాబహు ఘోరంబగు
మాంసంబును నమ్మ వృత్తి మానని వీనిన్
సంసేవించిన నేగతి
సంసారవిముక్తిఁబొంద సాధ్యంబగునో !

వ. అని సంశయగ్రస్తంబగు మనంబుతోఁ గొంతవడి వితర్కించి యమ్మహా పతివ్రత వాక్యంబులు తిరస్కరింప నోడి ధర్మశీలుండగు ధర్మవ్యాధునిం జేరి వినయంబున—

చం. నళినదళాక్షి వంపఁగ సనాతన ధర్మజిఘృక్షచే మిమున్
గలిసికొనంగ వచ్చితిని గావున మీరు విశిష్టధర్మవి
జ్ఞులు ననుఁ బాఱఁజూచి పరిశుద్ధమనస్కత ధర్మసూక్ష్మముల్
దెలిపిన వెంట నే నెఱిఁగి దివ్యపదంబును బొందవచ్చితిన్.

వ. అని యిట్లు విన్నవింప ధర్మవ్యాధుండు సెలవులనుండి తొంగిచూచు మందహాసంబుతో నిటనియె—

చం. పరిభవబుద్ధి నీవు బహు పాత్కజమందున నున్న కొక్కెరన్
మరణముపాలు సేయుటయు, మానినితో వివదించి కోపివై
పరుసని మాటలాడుటయుఁ బానలు వాపుకొనంగ వచ్చు లే
నెఱిఁగినవాఁడఁగాన వచియింపఁగ వద్దిఁక నీయుదంతమున్.

వ. ధర్మవ్యాధుని దివ్యజ్ఞానమునకు విస్మయంపడి కౌశికుం డేవపడక మనః పూర్వకముగా సేవించి, యా మహనీయునిచే బోధితుండయి ధర్మంబులనెల్ల నెఱింగి, కృతకృత్యుండయి కాలానుసరణంబుగఁ గాలగోచరుండై ముక్తి పదంబు నొందెను.

కం. బోయయు జామయు గురులై
మాయురె! యొకవిప్రు ధర్మ మార్గానుగతున్
జేయుట యెఱిఁగియు మీరిటు
పాయని సందేహమేల పడఁగా వలసెన్.

ఉ. జ్ఞానులమంచు లోఁదలఁచి గర్వపడంగను మేలుగల్గ ద
జ్ఞానులఁ జూచి యేవపడఁ గార్యము కల్గదు జ్ఞానులెప్పు డ
జ్ఞానుల చెంతఁ జేరి యిదికా దిదియౌనని నచ్చఁజెప్పి సు
జ్ఞానులఁ జేయుటే విధి యకార్యమయౌను మఱొండు చేసినన్.

ఉ. కావున నజ్ఞులం బిలిచి కమ్మని నీతులు చెప్పమాని పైఁ
గా వివరంబుగల్గిన యొకండెవఁడేనియుఁ బజ్జఁజేరనే
త్రోవనొ సాఁకుఁజెప్పి పెడత్రోవలఁబెట్టి కలంచుటెల్ల దు
ర్భావము, పెప్పనేల? యిది రాక్షస లక్షణమౌను శౌనకా!

మ. ఇది భావించియె సూతునిం జిఱుతనాఁడే చేరఁగాఁదీసి యీ
చదువుల్ చెప్పుచు ధర్మముల్ స్మృతిరహస్యంబుల్ శ్రుతిజ్ఞానమున్
విదితాచార విశేషముం దెలిపి ధీ విస్తారునిం జేసి యొ
ప్పిదముం జూపితి మెల్లవారలకు సంప్రీతాంత రంగంబుతో.

గీ. అతని యవ్యాజ భక్తిచే నలరినాము
అతని శుశ్రూషచే మోద మందినాము
అర్ఘ్యఁ డాతఁడు మీ సత్రయాగమందుఁ
గథకుఁ డౌటకు నట్టిట కల్గరాదు.

కం. గీర్వాణభాషయం దం
తర్వాణులు మెచ్చుకొనెడి నైపుణ్యముతో
సర్వము నాచేఁ దెలిసియు
గర్వింపఁడు చిత్తశుద్ధి కలవాఁ డగుటన్.

గీ. ధర్మబద్ధముకాని చందమును జెప్ప
వేదసారంబుఁ దరచి చెప్పితిని దీని,
మల్లగుల్లము మానుమో మౌనిచంద్ర!
పిదపకాలంబు వచ్చుచున్నది మఱింత.

శా. సంతోషంబగు నిచ్చటన్ నిలువ మీజన్నంబుకై కాని మా
కెంతే నీయెడ నిల్వరా దుదయ మందే సేతు బంధంబునన్
వంతల్ దీరఁగఁ గ్రుంకఁగావలయుఁ గానన్ బోదుమచ్చోట కం
చంతరానముఁ బొంచె వ్యాసఋషిరా ట్టాశ్చర్యధుర్యంబుగన్.

శా. దుర్వాసుం డటుమీఁద నన్నుఁగని సంతోషంబుతో వ్యాసుఁడున్
సర్వాంగీణముగాఁగఁజెప్పి మము నిస్సందేహులం జేసె నిం
కర్వాచీనులు మోదమంద భవదీయాలాప మాలించుచున్
బూర్వాచారవిదగ్ధులం దెలుపు సంపూర్ణ ప్రబోధంబునన్.

కం. ధర్మాధర్మములు నే
నిర్మలమతిఁ దెలిసికొనఁగ నిష్ఠురపడితిన్
ధర్మం బిప్పుడు దెలిసితి
నర్మిలి క్షమియింపుమయ్య! యాచరబుద్ధిన్.

కం. కథకుఁడవై మాకు మనో
రథములు వెసఁదీరు విధము ప్రథితమనీషన్
వ్యథ లుడుగు విధముగా మధు
మధనుని కథఁ జెప్పుమనుచు మఱి మఱి పల్కెన్.

గీ. అంత సత్రయాగమునందు నఖిలమౌని
వరులఁబ్రోలను గీర్వాణ భాషయందుఁ
బొగడినాఁడను భగవంతు నిగమవేద్యు
ఘనుని యఘమర్షణములైన కథల నెల్ల.

చం. ఎవని ముఖాబ్జనిర్గళితమేని సుభాషిత మైన యట్టిచోఁ
బ్రవిమలభక్తిఁ గైకొనుట పాడి యెఱుంగుము, ఘోరపంక సం
భవమగు పద్మమౌఁదలను బండితకోటి ధరింపుచుండదే ?
తవులదు ధర్మపీడ యవధానముతో నిటు లాచరించినన్.

వ. ఇంతియె కాక మఱొండు సంగతిఁ జెప్పెద, సావధానంబుతో వినుము—

చం. తెలియదె నీకు మీ తెలుఁగు దేశమునన్ బ్రభవించి భక్తి సం
కలిత మహానుభావుఁడయి క్రాలిన గోపన విప్రజాతుఁడై
వెలసినమాట ? యాతఁడు పవిత్రుఁడు మ్లేచ్ఛుఁడు నౌ కబీరుచేఁ
తెలియఁడె భక్తియోగము సుధీజనసన్నుత మోక్షపద్ధతిన్.

మ్లేచ్ఛసేవ నధర్మంబు లేనియెడల
నద్విజముఖంబునను ధర్మ మాలకింప
దోషమెట్లగు ? నివి ధర్మ దూరులాడు
నట్టి వేద నిషిద్ధ వాక్యములు గావె ?

కన్నదానిని గురులచే విన్నదాని
నేను వచియించితిని గాదె యిపుడు నీకు
వ్యాస శౌనక సంవాద మైన కథను
దీరెనే సంశయంబులు ? తెల్పుమన్న.

గీ. అనఁటి పండు విప్పి యఱచేత నిడినట్లు
తెల్పినపుడు నాకుఁ దెలియకున్నె ?
ధర్మశాస్త్రములును, దద్రహస్యములును
వేయుమాటలేల ? వినుతశీల.

చం. పలుమఱు విప్పిచెప్పితిరి వ్యాసుఁడు చెప్పిన పూర్వకాలముం
గలిగిన కొన్నిధర్మములు గౌరవ బుద్ధిని వింటిఁగాని యీ
కలియుగమందు మే మిపుడు కల్గిన హేతువుఁ బట్టి మీరలున్
గలియుగ ధర్మముల్ నుడువఁ గాఁదగు సారెకు దేశికేశ్వరా.

ఉ. నావిని సూతుఁ డిట్లనె, సనాతన ధర్మము లార్యధర్మముల్
గావన నెట్లు మార్పడును ? కాలము కల్పములేని మార్పఁగా
లేవు సనాతనంబయి చలింపక సుస్థిరమౌటచేతనే
యీ వసుధాస్థలిన్ వినుతి కెక్కెను వైదిక ధర్మమెంతయున్.

గీ. అరసిచూడఁ గృతయుగంబ యైనఁ ద్రేత
యైన నేమి ? ద్వాపరయుగ మైన నేమి ?
కలియయిన నేమి ? ధర్మమొక్కటియ చుమ్ము
తారు మారగుచుండిన ధర్మమౌనె ?

కం. కర్మభ్రష్టునకైనన్
గర్మరతునకునైన ధర్మగతి యొక్కటియే
ధర్మము మారదు, కాలము
ధర్మమ్మును మార్చుననుట ధౌర్త్యము చుమ్మీ.

కం. చిత్రవిచిత్రముగాఁ గృ
త త్రేతా ద్వాపర యుగ ధర్మంబులు దా
మై త్రుళ్లుచు వచ్చుననుట
చిత్రపులనునట్టి సూక్తి విధమిది కుత్సా ?



గీ. ధర్మమెప్పుడు నాల్గు పాదముల నడచు
నది కృతయుగంబు, త్రేత మూఁడైన, ద్వాప
రంబు రెండు, కలియొక చరణమ యైన
ధర్మవిచ్యుతిని యుగ భేదమగునన్న.

కం. తెలిసీ తెలియక పలికెదఁ
చెలిపితిరే సంస్కృతంబు తీరొకకొంతన్
దెలుఁగు విషయమ్ము నాకుం
బెలుపంగావలయుఁ దేట తెల్లముగాఁగన్.

గీ. అన్యభాషను గడిదొంగ యై పఠించి
యందుఁ బేరుప్రతిష్ఠలఁ బొంది పిదప
క్షమయు నౌదార్యమునులేక శంకలేక
"అప్పకవి"వల్కెఁ దెలుఁగు కావ్యముల నిట్లు.

గీ. "ఉపమగల్గిన శయ్యల నొప్పియున్న
నంధ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబుకాదు"
పొమ్మనియె నౌర! యేమి చెప్పుదుదు మీర
లప్పకవి వాక్యములఁ గూర్చి యతనిఁ గూర్చి.

వ. అంతట నిర్భరకరుణాగర్భంబులగు సూక్తుల—

కం. మౌని వచించెను నెఱిఁగిన
దానిన్ వచియింపకున్న ధర్మధ్వంసం
బౌను గుమారా! నేఁడీ
మానవలోకంబు దురభిమతహితమగుటన్.

గీ. అప్పకవి పల్కులకు నేల యాగ్రహంబు?
పరులఁ బెగడువాఁ డెప్పుడు పలుప యగుసు
నేది యెట్లున్న ధర్మంబు నెఱుఁగఁగోరి
యడిగితివిగానఁ జెప్పెద నాలకింపు.

కం. చదువులు చదివినవాఁడటె
చదువుటయేకాక శాస్త్ర సంశోధనమున్
బదిలముగఁ జేసెనటె యా
చదువుల ఫలితంబె యింత చక్కఁగ నుండెన్.

చం. చదువులు గాల్పనే జగతి సత్యము శౌచము వృత్తశీలముల్
గుదురకయున్నచో మనుజ కోటికి ? కూటికి నెన్నఁడేనియున్
జదివినవారు తొల్లి మన నాడులఁగల్గిరె ? పొట్టకూటికై
చదివినయట్టి యప్పకవి సత్తము చిత్తమిఁకెట్టులుండెడిన్ ?

గీ. ఎఱుఁగవే పరశ్రేయోసహిష్ణు భావ
బంధురత నిట్టి గోముఖ వ్యాఘ్ర వితతి
పుట్టుచుండు నప్పుడపుడు భూమిమీఁద
నీతిపేరిటఁ బ్రజకు దుర్నీతిఁ గఱప ?

గీ. పరుల ప్రతిభఁ జూచి ప్రమఁజూచి ప్రథఁజూచి
కావ్యపటిమఁ జూచి కన్నుఁగుట్టి
యంఘ్రిభవుని కావ్య మగ్రాహ్య మని గొణ్గె
నప్పకవివరుండు తప్పుమాట.

చం. గొణిగెనుగాని దొంగయయి గొణ్గిన వెంటనె రామరాజభూ
షణ కవిసార్వభౌముని లసత్కృతినుండి గ్రహించె పద్యమున్
గణగణమ్రోగు గంటమును గైకొని వ్రాయుటొకెత్తు, పిమ్మటన్
మిణుకక దాని నిల్పుకొని నెగ్గుటొకెత్తుగదా కుమారకా !

గీ. ఇంతియేకాని నిజముగాఁ గృతులయందుఁ
గుటిలబుద్ధి పీడితుఁడౌచుఁ గులముఁ బట్టి
గ్రాహ్య మగ్రాహ్య మనుచు నిర్ణయముఁజేయు
వానికెట్టి ప్రాయశ్చిత్తమైన లేదు.

మ. పరిశీలించినఁ గావ్యరాజికి గుణప్రాశస్త్యముం బట్టియే
గురుభావంబు ఘొసంగు, నేల కులముం గోత్రంబు లెక్కింప ? ఒ
క్కరుఁడైనన్ గవి భారతంబుబలె నొక్కండైనఁ దిక్కన్న యు
త్తరరామాయణముం బఠించునొకో ! యీ తార్కాణముం జాలదే ?

చం. అతి సుకుమార సౌరభ సమన్విత పేశల పుష్పమంజరీ
వితతినిగాంచి వెగ్గలపు వేడుకఁ బొందక తోటమాలి పం
డితవరుఁడైన బ్రాహ్మణుఁడు నిక్కముకాదని బైసిమాలి దు
ష్కృతమతిఁ ద్రోసిపుత్తునని జీత్తలువల్కెడు మూర్ఖుఁడుండునే ?

వ. అనిన యనంతరంబు జ్ఞానతృష్ణాపీడ్యమానమానసుండనై వక్ష్యమాణంబుగ
సూతమునీంద్రుని బ్రశ్నించితిని—

చం. తెనుఁగును మ్లేచ్ఛభాషయని తిట్టి, శపించి, లిఖించి గ్రంథముల్
వినుకలిలేక యాంధ్రులను మ్లేచ్ఛులటంచును దూరనాడుచున్
గనుకని వాదులాడెడి జనంబుల కెట్టిగతుల్ లభించునో !
మునివర చెప్పుఁడయ్య నయమున్ మనుమార్గము దప్పకుండఁగన్.

ఆ. వె. కన్న తెల్గుబాస గానటబీసట
మాకు సంస్కృతంబె మాతృభాష
యని మృషోక్తులాడు నవనీసురులు తెల్గు
బాసఁ దెలిసి చదువఁ బాడియౌనె ?

కం. చదివిన దోషంబగునే ?
చదువంగారాని చదువు సాహసవృత్తిన్
జదివిన వారికి నిష్కృతి
పొదలునె యేమైనఁ జెప్పు పుణ్యచరిత్రా ?

చం. అన విని సూతమౌని క్షణ మర్ధనిమీలిత నేత్రపద్ముఁడై
యనియెను నన్నుఁజూచి యనయంబు తెనుంగున మాటలాడుచున్
దెనుఁగుఁ బఠింపుచున్ దెనుఁగుదేశమునం బ్రభవించి యెవ్వఁడీ
తెనుఁగుఁ దెనుంగువారలను దిట్టునొ నిష్కృతిలేదు వానికిన్.

వ. మఱియు—

చం. అరయఁ ద్రికాలవేదులయి నట్టి మునీశశిఖామణుల్ ధరా
మరులు పఠింపఁగూడదు సుమా ! తెలుఁగంచును దొల్లిచెప్పిపో
యిరి యిది యాలకింప దెవఁడేని పఠించినవాఁడు ఘోరమౌ
నిరయమునందు యాతనల నింపిరివందురు వేయివర్షముల్.

గీ. నిరయ మనుభవించి మరలి యామీఁదను
హీనజన్మమెత్తి యెడలి యెడలి
మనుజుఁడగుచుఁ దుదకు మహిమీఁదఁ బుట్టును
వేదవాక్య మిదియు వినుము కుజ్జ !

వ. దీనికి దార్కాణంబుగాఁ జిన్ని యుపాఖ్యానంబుఁ జెప్పెద నాకర్ణింపుము.

కబీరుదాసుని పూర్వజన్మ వృత్తాంతము

సీ. సప్తఋష్యాశ్రమ స్థలి నంటి యే నది
పాఱుచుండెడు నేఁడు పాయలగుచు
దక్షిణాపథమెల్లఁ దరియింప నేనదిఁ
గొనితెచ్చె గౌతమ మునివిభుండు
నాదారురైతుల కేదారభూములు
ఫలియించు నేనదీ వారిచేత
గంగానదీకల్ప గళితాఘయౌ దేన
వేంగిదేశంబెల్ల వృద్ధిఁగాంచె

గీ. అట్టి గోదావరీ నదీ ప్రాంతభూమి
నలరుచుండు ద్రాక్షారామ మందు వెలసెఁ
దెలుఁగువారింటి వేలుపీ దేవుఁడనఁగ
భీమనాథుండు వైరి దృగ్భీముఁడగుచు.

ఉ. ఆపురి దేవశర్మయను నట్టి మహాత్ముఁడు భూసురుండు వి
ద్యాపరిపూర్ణుఁడొక్కరుఁ డుదారుఁడు వాసముఁ జేయువానికిన్
బాపలులేని పెద్ద వలవంత గుదింప యథోచితంబుగా
బాపలు మోదమొంద భయభక్తి నొనర్చె యనేక యజ్ఞముల్.

బిడుతఁ డొకఁడైన లేకున్నఁ బుట్టు గతులు
వాయు నా పితరులకు నివాప జలము
చుళుకమేనియు నిచ్చెడి చొప్పులేదు
పుణ్యమిటు పోకాలెనని లోఁ బొగులుచుండ.

ఉ. ఓమెడు నోముపంటయన నొక్క కుమారుఁడు దేవశర్మకున్
మోమునఁ దెల్విపార గృహమున్ వికసింపఁగ సంభవించెఁ ద
ద్గ్రామనివాసులెల్ల నుడికారముతో మన దేవశర్మకున్
బూమెలపుట్ట పుట్టెనని పొంగి చెలంగి మెలంగుచుండఁగన్.

ఉ. శాస్త్రులనెల్ల రాఁబిలిచి శ్రద్ధను జాత సుకర్మముల్ యథా
శాస్త్రముగాఁగఁజేసి విలసన్నవ సౌరభ చందనాగరుల్
వస్త్రములిచ్చిపంపి బుధవర్యుఁడు పెద్దలయాజ్ఞ చొప్పునన్
శాస్త్రి యటంచుఁ బేరిడెఁ బ్రశస్తకలాకుశలత్వ బుద్ధిచే.

జనకుఁడదె చేతమీఁదుగా సాఁకుచున్నఁ
బూటకొకరీతి నిగ్గులపుట్ట యగుచుఁ
గూర్చుతల్లికి గారాల కూచి యగుచుఁ
బిటమరించెను మనశాస్త్రి పోసరించి.

ఉ. బాల్యము చన్న యంత కులపద్ధతి శాస్త్రిని విద్యలందుఁ గౌ
శల్యమునుం గడింప గురు సన్నిధి కంపెను దేవశర్మ చా
పల్యములేక శాస్త్రి చదువంగఁ బ్రయత్నముఁజేసె భావనై
ర్మల్యముతో సదా గురుపరంపరఁ గొల్చుచు నొక్కభాతిగన్.

కం. అరువదినాలుగు కళలను
గురుముఖమున నేర్చి చదివి కూలంకష సు
స్థిరపాండిత్య ప్రతిభా
పరిణత చిత్తాబ్జుఁ డగుచుఁ బాలుఁడు చెలఁగెన్.

గీ. గానకోవిదుఁ డాశాస్త్రి కంఠమెత్తి
సామగానంబుఁ జేసినఁ జదలనుండి
తుంబురుఁడె తంబురటుపైచి త్రుళ్ళిపడుచు
వీనుదోయిని నిక్కించి వినుచునుండు.

గీ. తర్కవేదాంత ధర్మశాస్త్రముల నెల్లఁ
జతురమతితోడఁ గడముట్టఁ జదివినాఁడు
సంస్కృతంబునఁ జదువని చదువెలేదు
సుంతయేనియు గర్వింపఁ డింతచదివి.

వ. కొంతకాలంబిటుచన్న యనంతరంబు—

గీ. చెట్టుచెడుకాలమునకెడ్డ పుట్టుచుండుఁ
గుక్కమూతిపిందియ లన్న ఫక్కిఁ బడుచు
శాస్త్రికారాటములు హెచ్చె పర్వభాష
లందుఁ బండితుండనెడి పేరందు కొఱకు.

గీ. కేరి తనతండ్రిమాటలఁ గేలిచేసి
తెలుఁగుబాసను జదువఁగాఁ దెగువచేసి
నడుముగట్టెను దాఁ బదినాళ్ళలోనె
చదివి వెచెదఁ దెలుఁగంచు నెదురులేక.

చం. అనవిని దేవశర్మయిటు లాడె విపర్యయ మేలచేసెవో ?
తనయ ! వివేకవంతుఁడవు ధర్మవు వీసరఁ బుచ్చుఁబోకు, మే
లెనయదు తెల్గుబాస మన మెన్నొతరంబులు ముట్టలేదు ము
ట్టినయెడఁ గీడుమూడునని డెప్పరమౌనని చెప్పిరార్యులున్.

గీ. కలఁగి దనతండ్రి పల్కిన పలుకులెల్లఁ
గంటిఱెప్పల తుదలనే గెంటివైచి
తన మనోనిశ్చయము మౌనముననె తెల్పె
దిట్టయై శాస్త్రి నిర్వాత దీపమట్లు.

చం. కడచెనొ ! లేదొ ! వత్సర మొకండు స్వయంకృషి చేసి దీక్షతో
ముడుఁగక తెల్గుబాసఁ గడముట్ట గ్రహించెను గుట్టుమట్టులున్
బడసె యశంబు పేర్వడిన పండితకోటియు మాఁగువారఁగా
బుడుతనుగూర్చి తండ్రిమదిఁ బొందుచునుండఁగ మోదఖేదముల్.

ఉ. ఈడ్యతరప్రభావమున నెన్ని గ్రహించిననేమి ? ధర్మవున్
బిడ్యములేకయే తలఁగఁ బెట్టినదాని ఫలంబుగా మనో
జాడ్యము మోసులెత్తె నిఁక శాస్త్రి విడాకుల నిచ్చె బుద్ధికిన్
బాడ్యమిఁ గానరాని 'నెలబాలుఁడు' గన్పడకున్నె యావలన్ ?

మ. సొబగున్ రూపము గాజువార మొగమున్ సొంపాటవై వర్ణ్యమున్
నిబిడంబై యెసలార, సర్వసుకలా నిష్ణాతుఁడై నట్టి బా
డబుస్వాస్థ్యం బుబలాటమై తిబిరియై డక్కై సదా ఱిమ్మయై
గుబులై గింగిరులై చనెన్ జివరకున్ గోరాడు పెన్వెఱ్ఱియై.

గీ. కొమరుప్రాయంపుఁ బ్రేమంపుఁ గొడుకుకుట్టి
కుట్టి తనమందె యిటులౌటకుం జలించి
క్రమ్మ కన్నీరు బొటబొట కారుచుండ
దిగులు పడుచు శుష్కించెను దేవశర్మ.

కం. ధర్మవ్యతికరణమ్మున
నిర్మలమతియైన శాస్త్రి నెంజిలిచేతన్
దుర్మరణంబందెను బ్రా
క్కర్మముఁ దప్పింప నెవరు కర్తలు ధరలో ?

ఉ. పెద్దల మాటలన్ వినినఁ బెద్దరికంబిదె వచ్చుఁ బుత్రకా !
వద్దు పఠింపఁగాఁ దెలుఁగుబాస నటంచును దండ్రిచెప్పఁగా
నద్దములోని నీడకు భయంపడువాఁడనె ? యంచు మొండియై
గ్రద్దరియై పొకాలెను గకావికలై జనకుండు కుందఁగన్.

ఉ. పండితుఁడైన బ్రాహ్మణుఁడు పాదలిత్రోవను బోనివాఁడు ధీ
మండలి మండనుండు మను మార్గము దప్పిన కారణంబునన్
గొండొకకాలమున్ నరక కూపము నందు వసించి శేషమున్
వెండియు భూమిపై ననుభవింపఁగ జన్మ పరంపరాహతిన్.

గీ. రంగశాయికి విందు శ్రీరంగమందు
జన్మమెత్తెను నొక్క యాసామి యింట
గంగికుక్షికి వత్సమై కడకు శాస్త్రి
ప్రాగ్భవ విశేష పుణ్య సంపాదనమున.

గీ. తల్లిచనుబాలు నొకపూటఁ ద్రావి గడ్డి
పోఁచ యొకఁడైన ముట్టక పొక్కిపొక్కి
పొదుగు దుఃఖంబుచేఁ దల్లి పొదుఁగు మాని
తుదకు నుసురుసురనుచును దొరఁగె నుసురు.

చం. తొరఁగిన వెంటనే యొడలు దొడ్డ గుణంబుల పట్టుగొమ్మయై
సురుచిర రూపసంపదల శోభిలి శుభ్రగుణాలవాలుఁడై
గురుతర రామభక్తి పరిగుంభిత చిత్త సరోజుఁడై గుణో
త్తరుఁడయి దేశికేంద్రుఁడయి తాఁ బ్రభవించెఁ గబీరునాముఁడై .

కం. పుట్టిననాఁటను గోలెను
బట్టిన శ్రీరామభక్తి పరతంత్రుండై
గొట్టినఁ దిట్టిన మెట్టిన
నెట్టినఁ దానేమి యనక నిర్మోహుండై.

మ. గతజన్మంబునఁ దండ్రి చెప్పినపుడుల్ కైకోక సంసార దు
ర్గతి బంధంబులఁ జిక్కుటం దెలిసి పూర్వజ్ఞాన సంపత్తి, సం
తత భద్రాచల రామచంద్ర చరణ ధ్యానంబుచే యోగియై
గతమోహుండయి సంచరించె నపవర్గ ప్రాప్తి జిజ్ఞాసుఁడై.

గీ. తెలుఁగునాఁడు నిరీహతోఁ దిరిగి తిరిగి
బ్రాహ్మణుండగు గోపన్న భక్తియోగ
ము నుపదేశించి రామదాసుని నొనర్చె
లోక సంసర్గమును మాని లోఁ దలంచి.

ఉ. గేహము లేకపోయిన నకించనుఁడై యొకచోటనేని గో
దోహనకాలమైనఁ దన త్రోవను నిల్వఁగఁబోక కర్మసం
దోహముఁబాసి యన్యజన దుర్లభ మోక్షపదంబుఁ బొందె వ్యా
మోహములేని సజ్జనులు ముక్తిపదంబును బొందు టబ్రమే?

గీ. ఇట్లు శేషకర్మఫలంబు నెల్ల ననుభ
వించి మృతజీవుఁ డయ్యెఁ గబీరుదాసు
మూరు మూలలఁగూడ నీ పేరుఁ దెలియుఁ
దెల్గువాఁడవు నీకిది తెలియదొక్కొ!

గీ. ఎంత నిస్సంగుఁడైనను నెంత జ్ఞాని
యైన నెంత సాధుచరిత్రుఁ డైన నరుఁడు
భుక్తకర్ముఁడైననుగాని ముక్తిఁగనఁడు
త్రిజగములను నీ మాటకుఁ దిరుగులేదు.

వ. సూతుం డిట్లు కరుణావిశేషంబునను, శిష్యవాత్సల్యంబునను ధర్మంబుల విస్పష్టంబుగా బోధించి పదంపడి శేషధర్మంబులనెల్ల జేపు విన్పింతునన్న వల్లెయని భక్తిపూర్వక ప్రణామంబు లాచరించి కాల్యంబులఁ దీర్చికొనఁ బనివినితిని.

కం. ఈ కథ వ్రాసిన విన్నను
వాకొన్నను బాడిపంట పరువము సుబ్బున్
తేకువ జోకయుఁ బ్రబ్బున్
బ్రాకటముగ లిబ్బులుబ్బు పైరములబ్బున్.

ప్రథమాశ్వాసము సమాప్తము



# సూ త పు రా ణ ము

## ద్వి తీ యా శ్వా స ము

### జో త లు

చం. మలమలమాడు పొట్ట, తెగమాసినబట్ట, కలంతపెట్టఁగా
విలవిలయేడ్చుచున్న నిఱుపేదకు జాలినిఁ జూపకుండ, సు
త్తులపడిపోయి జీవరహితంబగు బొమ్మకు నిండ్లు వాకిళుల్
పొలమును బొట్రి నిచ్చెడి ప్రబుద్ధవదాన్యుల నిచ్చమెచ్చెదన్.

ఉ. చేసిన దోస మీశ్వరుని చింతనచే నశియించునన్న వి
శ్వాసము కల్గి రేఁబవలు, పాప మొనర్చుచుఁ దీరినప్పుడే
దో సమయంబునం గలముఁ దొందరగాఁగొని రామకోటినిన్
వ్రాసెడి భక్తకోటి పదపంకజముల్ శరణంబు వేడెదన్.

ఉ. కామపరీతబుద్ధి గుణకర్మపరీక్షను మాని బ్రాహ్మణ
స్వాములఁజేసి కొందఱిని బానిసలం బొనరించి కొందఱిన్
బూమెలు చెప్పి యీ భరతభూమిఁగలంచెడి వర్తమాన హిం
దూమత సంప్రదాయమును దోసిలియొగ్గి భజింతు నిచ్చలున్.

ఉ. పొచ్చెములేని మిండతలపొత్తయినన్ బహు పాపమంచు వా
క్రుచ్చుచు నాలిముచ్చులయి కొక్కిఱి వేలుపు నాగవాస మం
దిచ్చెడి కమ్మతావిగల యెంగిలివాగల మీఁది పేర్మిచేఁ
గ్రచ్చఱ యజ్ఞముల్ సలుపు బ్రాహ్మణదీక్షితులన్ స్మరించెదన్.

చం. మఱచితిఁ దొల్లి పూర్వకవి మాన్యుల నెంచుచు మత్కృతీనుఁడౌ
బిరుదుమగండు సాయసము వేంకటనాథకవీంద్రచంద్రు సం
స్మరణ మొనర్పనైతిని బ్రమాదవశంబునఁ గాన నిప్పుడా
కొఱతను దీర్చికొంటి, నిదిగో ! కుసుమాంజలియెత్తి వానికిన్.

గీ. మాతృభాషవలని మమకారమునఁజేసి
తెలుఁగు బాసఁ జదివి "దేశికవిత"
నుడుల కూర్పు నేర్పు నోరూరునట్టుగాఁ
బలుక నేర్చువారె తెలుఁగు కవులు.

## క థా ప్రా రం భ ము

కం. ప్రథమాశ్వాసంబును నే
గ్రథియించితి సూతమౌని కరుణారస దృ
క్పథగాముఁడనై యావలి
కథావిధానంబుఁ బాఠకా ! విను, వినుతున్.

సీ. అరుణోదయాత్పూర్వ మంబరంబున ఖార
తపత్రి వేఁగు గీతములు పాడ
కలకలారావ సంకలన సంకులముగా
గ్రుడ్డుపుట్టువులెల్ల గూండ్లు వీడ
సౌగంధికాఘ్రాత జాతసౌరభసిక్త
మందానిలంబట్టె మలసియాడ
పుండరీకశరారుతండంబు హాయిగా
గుట్టుపెట్టఁగఁ గొండ గుహలనీడ

గీ. వేఁగుజామననే లేచి జాగులేక
జాహ్నవీ తోయములయందు స్నానమాడి
జపముఁ గావించి సూతర్షి సాధుమూర్తి
మరలి నాతోడఁ దనయాశ్ర మంబుఁ జేరి.

ఉ. చీకటిగాఢ్గచెట్టుకడఁ జింపిరియాకుల చాపమీఁదఁ బుం
స్కోకిల కాకలీధ్వనులు శ్రోత్రపుటంబుల విందుఁ గూర్పఁగా
వ్యాకులపాటులేని హృదయమ్మున నమ్ముని కూరుచుండి నా
కై కనుదోయి త్రిప్ప సరిగా నుపవిష్టుఁడ నైనవెంటనే.

గీ. శేషధర్మమ్ములను వచించెద నటంచుఁ
జెప్పితిని నిన్న పుత్రకా ! చెప్పవోయి
నీ యెఱుంగవలసినట్టి నిఖిలమైన
ధర్మసూక్ష్మముల్ పెద్దలఁ దలఁచి యనిన.

కం. పిమ్మట గురు గురుభక్తిని
నమ్మని మూర్ధన్యునాన నౌఁదల నిడుచున్
బమ్మెరపాటును విడచి క్ర
మమ్మనఁ బల్కితిని వక్ష్య మాణ విధమునన్.

ఉ. కంఠముఁ జించికొంచు నరిగా వినుచో నఱచేతిలోన వై
కుంఠముఁ జూపఁగాఁగలవు కొన్నిపురాణములంచుఁ జాల ను
త్కంఠతఁ గొందఱాడెదరు తథ్యము నా కెఱిఁగింపుమయ్య ని
ష్కంఠచరిత్ర ! మీకు బుధకోటి గరాగరి చెప్పినట్లుగన్.

సర్వసంగపరిత్యాగ సాధుమూర్తు
లైన మీకు మోమోటమి యనుటలేదు
కాన దూరుపోగద్దలన్ గణుతిసేయ
కున్నదున్నట్టుగాఁ జెప్పఁడో యతీంద్ర !

సీ. దేవతాలోక మేదిక్కున వెలుఁగొందు ?
కాలమానంబెట్టు గడలునందు ?
దేవతలెవ్వారు ? దేవేంద్రుఁ డెట్టిఁడు ?
తన్మూర్తి యేరీతిఁ దనరుచుండు ?
దేవేంద్రుఁ డెందుచేఁ ద్రిభువన సామ్రాజ్య
పట్టభద్రుఁడనెడి ప్రణుతిఁగాంచె ?
దేవలోకమునందు దేవతాళికినెట్టి
శీలవృత్తంబులు చెలఁగుచుండు ?

గీ. అమరపరిపంథు లేభాతి నసురులైరి ?
పుణ్యజనులైరి ? రాక్షసమూర్తులైరి ?
దేవయోనులకును భారతీయులకును
బాంగెమేమైన యున్నదే ? సంగరహిత !

వ. అనిన యంత పౌరాణికప్రకాండుఁడు, ప్రహృష్టాంతరంగుండై మున్నొక యప్పుడు స్వానుభవంబున నెఱింగిన సమాచారంబు సాంగంబుగా విన్పింతు వినుమని యిట్లు చెప్పఁదొడంగె——

సూతమహర్షి స్వర్గలోక ప్రయాణము

సీ. దారుకావని నున్న తాపసశ్రేష్ఠులఁ
జొడఁగాంచ నొకనాఁడు బుద్ధిపుట్ట
యోగబలంబుచే నుప్పొంగి నింగికిఁ
గనుఱెప్ప పాటులోఁ జనఁగ నచట
బ్రహ్మర్షి సంఘంబు బహుళసంఖ్యాకమై
వాదోపవాదముల్ ప్రస్తరించి
సర్వశాస్త్రంబుల జర్చించుచుండెను
నిరుపమానాత్మ పాండిత్యగరిమ

గీ. సభికులెల్ల రానంద రసప్రవిష్టు
లగుచు నాలించుచుండి రేకాగ్రవృత్తి
నంత బ్రహ్మవాదులఁజేరి యభినుతించి
తత్సభాస్థలిఁ గూర్చున్న తత్క్షణమున.

గీ. దేవతలనుగూర్చి దేవలోకముఁగూర్చి
చర్చ తీవ్రముగను సాఁగఁజొచ్చె
సంయమీంద్రు లెల్ల సంశయగ్రస్తులై
యూరకున్నమీఁద దారిలేక.

## ద్వి తీ యా శ్వా స ము

కం. వివదించిరి సంయములు ప
లవు గాఁగ త్రిదివమ్ము దేవలోకం బనుచున్
బ్రవచించిరి "టిబెతే" మరి
త్రివిష్టపం బగునటంచు దేవమునీంద్రుల్.

కం. హిమవత్ భూధ్రము కైలా
సమహీధ్రము నుత్తరించి చనఁగఁ "టిబెట్" ని
క్కమ కన్పట్టు ననుచు సం
యమివర్యులు కొంతమంది యని రటుమీఁదన్.

కం. కొండలు మరుభూమి కవలఁ
జెందిన దేశం బని తెగఁజెప్పిరి పదకున్
సందడి బుట్టెను సభలోఁ
గ్రందుగ నలుమూలల 'నవుఁ గాద'ను నుడులన్.

గీ. వారి వారించి మెలపుతో వాలఖిల్య
సంయమీంద్రులు నావంకఁ జక్కఁ జూచి
"కాయసిద్ధియు దివ్య సంకల్పసిద్ధి
కలుగువాఁడవు నీవేగి తెలిసిరమ్ము.

మ. హిమవంతంబును దాఁటి మానవుల కెంతే వాసయోగ్యంబు కా
ని మహీభాగముఁ జూచి మంచుపడు తానేలన్ విలోకించి వే
గమ యచ్చో వసియించు పంచజనులన్ గన్నార వీక్షించి సం
యమి లోకంబున కెల్లఁ దెల్పుమ"ని సంభావించి వాక్రువ్వఁగన్.

కం. విని వెంటనె వింటి కెగసి
ఘనాఘనసమూహమధ్యగతుఁడ నగుచుఁ బో
తిని మౌనీశ్వరు లాహా
యని దిక్కులుచూడ నుత్తరాభిముఖుఁడనై.

గీ. నదులు నల్లని త్రాచు లనంగఁదోఁచె
మలలు పిల్లల బొమరింద్లమాడ్కిఁ దోఁచె
గగనవీథిని వాయువేగంబుతోడఁ
బఱచుచుండిన నాకు విభ్రమము గదుర.

సీ. పచ్చనిహొంబట్టు పఱపువై చినరీతిఁ
బసరుఁగ్రొక్కోడి లతావ్రతతి యుండ
వెలిమబ్బుఁ దెగఁజించి తెలినీరు గొనితెచ్చు
నన్నని శృంగరాజమ్ము లుండ
ఏకోనఁ గనరాని యెనలేని మందు మా
కులు వేరు వెల్లంకు లలమియుండ
పిల్లికూనలనైనఁ బెంపఁజాలిన నీరు
గొని కొండవాగులు చనుచునుండ

గీ. వెండిపూతఁ బూసినభాతి వెలుఁగుచుండఁ
గొలిలి కనులకు మిఱుమిట్లు గొలుపుచుండఁ
దోఁచు శృంగముల్ కంటిఁ గందోయినిండ
మన్చు వారికి బెనుదండ మంచుకొండ.

గీ. చదలదాఁకు మ్రానిమొదలు కుదులు పొదల
మెదలు తుమ్మెదల రొదలు కదలు నదులు
విదులు క్రొందావి విరిగుత్తి పదులు పొదలు
మొదలు తుదలేని ముదిగొండ మొదలుగంటి.

శా. గోలాంగూల లులాయ సూకర తరక్షువ్యాళ శుండాల శా
ర్దూలన్యంకు హరీంద్ర సాలముఖ జంతుప్రాప్త హింతాలత
క్కోలల వ్యాఘ్ర తమాల తాళ వివిధ క్షోణీజసంతాన మా
ఖీలంబై కనుపట్టెఁదుంగ హిమవద్భూమాటవీయూటమున్.

వ. అంత ననంతసాహసంబున, నెపతెగని మంచుబొట్టు మసూరంబు కన్గప్పు చున్నను, జుఱుకు చుఱుకునఁ దేలుగుట్టినచందాన వడిగండ్లు పలికి నొప్పి గలిగించుచున్నను సరకుసేయక—

కం. తారాపథ గమనుఁడనై
యారూఢగతిం జనంగ నట పైపై నీ
హారావనీధ్రశృంగము
దారికి నడ్డంబయగుచుఁ దానరికట్టెన్.

కం. మిక్కిలి యక్కజపాటున
దిక్కులు పరికించుచుండ దివ్యచ్ఛోభా
ధిక్కృత మందరయగు గిరి
యొక్కటి కన్పట్టె ముందు నుచ్చంబగుచున్.

కం. నాలో నాలోచింపఁగఁ
గైలాసము మాట నాకు జ్ఞప్తికిరాఁగా
వైశమ నేలకు డిగ్గుచు
నాలోఁ దచ్ఛైల విభవమరయుచు నటుపై.

చూచితిఁ గందళీపిహిత సుందర కందర మందిరావళుల్
చూచితి మాతులుంగతతి లుంగ లవంగలతాకుడుంగముల్
చూచితి సంబరావరణచుంబిధరాధర తుంగ శృంగముల్
చూచితి సిద్ధమౌనిజన శుద్ధ సమిద్ధకుటీర పద్ధతుల్.

గీ. మబ్బులందు మున్గి మటుమాయ మగుటచే
సూర్యరశ్మియేమి సోకకున్కిఁ
గప్పుచున్న మంచు కఱగమి నాకొండ
వెండికొండఁబోలె వెల్గుచుండె.

కం. ప్రాలేయ ప్రావృత త
చ్ఛైలము రజతాద్రిఁబోలె జానుగ నుండెన్
శూలినివాసం బగుచుం
గ్రాలెన్ రజతాద్రియనఁ బురాణములందున్.

గీ. కొండబొరియనుండి కొలఁదిగాఁ
గఱిగి పడెడి మంచు కరుడుగట్టి
వెల్లరాడుగాఁగ వెలసినమాత్రాన
స్ఫటిక లింగమూర్తి యటులఁదోఁప.

గీ. కొండకోనలందుఁ గ్రుమ్మరు చుండెడి
భిల్లజాతి యింటి వేలుపగుచు
శైవలింగమూర్తి "శాంబరీ భిల్లుఁడై"
రాణకెక్కె నీ పురాణములను.

కం. కనుచూపు మేరబోఁగాఁ
గనుగొంటిని నాముపెద్ద కంటివలెను దె
ల్లని దోవతివలె నుండిన
వినువాకను బాలువోక విస్మితితోడన్.

కం. పరుశుద్ధతోయమయమై
పఱపగు నమ్మంచుకొండ ప్రస్థముమీఁదన్
దొరలితొరలి మందాకిని
పరిపాటిన్ వచ్చివచ్చి బయలంబడఁగా.

కం. ముంగలఁ గైలాసశిఖరి
ముంగిట గండోపలములు మునికొనియుండన్
లింగాకృతితో నయ్యవి
గంగాస్రోతోనిపాత కషితము లయ్యెన్.

శా. లింగాకారము తోడనున్న శిలలన్ లీలావిలాసార్థమై
నింగిన్‌వచ్చెడి వేల్పుకన్నెలు సదానిఃశేషులై నట్టి ని
ష్పంగుల్ దివ్యతపోధనుల్ గొలుతు రశ్రాంతంబు సద్భక్తితో
గంగా భంగజలాభిషేకమనుచున్ గౌతూహలప్రక్రియన్.

కం. తత్కారణమున నేత
త్కుత్కీలముమీఁద శివుఁడు కూర్చుండి మహా
పత్కాలమ్మున నిజ భ
క్తోత్కరమును బ్రోచునందు రుడుగక పెద్దల్.

కం. మతిమాలిన కవిచంద్రులు
గతిమాలిన వారలగుచుఁ గడుకక యెవరో
బతిమాలిన నల్లిరి సి
బ్బితిమాలిన కత యిది యితివృత్తముగాఁగన్.

కం. ఈ చిత్రకథం జెప్పెదఁ
బ్రాచీన కవీంద్రకోటి పల్కినరీతిన్
"దూచా"లు తప్పకుండఁగ
నీ చిత్తాబ్జమునఁజేర్చి నిజముం గనుమా.

## గంగావతరణము

ఉ. ఉగ్రమయూఖ సత్కుల సముద్భవుఁడై సగర క్షితీంద్రుఁ డ
వ్యగ్ర సమగ్రజాగ్రదసి పాటితవైరినృపుండు, నిగ్రహా
నుగ్రహ శక్తిశాలి, యపనోదిత పాపచయుండు తొల్లి ప్ర
త్యగ్రయశస్వియై భరత ధారుణినేలె సనాతనంబుగన్.

చం. సగరనృపాలమౌళి భుజసారుఁడుదారుఁడు వైరివీర వా
రగురు చమూప్రణాశన పరాక్రమ భద్రకళాకుశీలవుం
డగణితవైభవోన్నతిని నాప్తవచోగతి నశ్వమేధముల్
సుగతులఁ గోరిచేయుటకుఁ జొచ్చెను ముప్పిరిగొన్న వేడ్కతో.

ఉ. క్రించుదనమ్ముననన్ రిపులు రేఁగి తిరస్కృతిఁ జూపకుండు లా
గెంచి సమస్త శత్రు పృథివీశ్వర సీమల సంచరింపఁగా
బంచెను దివ్యలక్షణ విభాసిత జాతి తురంగరత్నమున్
మంచిముహూర్తమందు బుధమండలి మెచ్చఁగ శాస్త్రసమ్మతిన్.

సీ. విడిచిపుచ్చిన తేజి విశ్వంభరాస్థలి
ఖురపుటంబులచేతఁ గొట్టికొట్టి
ధారావిశేషంబు దైవార సుహ్వాంగి
నింగిమీఁదికిదాఁటెఁ జెంగలిడుచు
హయపాలకులు దిగ్భ్రమాయత్త చిత్తులై
తేజి యాగడ సుంత తెలియలేక
వెనువెంటఁ బోయెడి వెఱ వెఱుంగఁగలేక
తేజి నిల్పఁగలేక తెగవులేక

గీ. పుడమి పతికి నివేదింప వెడలిపోయి
యజ్ఞ దీక్షితుఁడైన ధరాధినేత
సగర సార్వభౌమునిజేరి సంగతులను
విన్నవింప నాలించి పృథ్వీవరుండు.

చం. అఱువదివేల పుత్రకుల నందఱిఁబిల్చి తురంగరత్నమున్
సురపురినున్నఁ బెండు మదశోభితులై రిపులెవ్వరేనియున్
బొరిఁబొరి నడ్డువచ్చునెడ బోరలుచీల్చుచు సూర్యవంశపుం
బరువు ప్రతిష్ఠ నిల్పి గరువంబును జూపుఁడటంచుఁ బంపఁగన్.

సీ. ఉత్సాహపూర్ణులై యుద్భటారభటులై
యుద్వేగవంతులై యోర్పులేక
సగరావనీభర్త సంజాతులెల్లరు
వార్వంబు నెమకంగ బయలుదేరి

వారాశిపర్యంత వసుమతీతలమెల్ల
గాలించి గాలించి కత్తలాని
ఎచ్చోటఁ గనరాక యేమేని తోఁచక
ముడివడ్డ మోముతో ముసుఁగువెట్టి

గీ. యురుపరీభావ ఖిన్నులై యొక్కచోటఁ
గూడి యందఱు కర్జంబు లాడికొనుచు
నసకమున వారిలో నొక్కఁడౌడుఁగఱచి
తెలివివాఱిన మోముతోఁ బలికె నిటుల.

చం. కొకిబికి కొండగూడెములు గుట్టలు మెట్టలు చెట్టు పుట్టలున్
బెకబెకలాడు మాడెములు పిల్చినఁ బల్కెడి పట్టణంబులున్
సకలముఁ జూచి చూచియును జాతరజక్కని గాంచమైతి మే
మొకమున భూతలేశ్వరుని మోసలఁజేరఁగ నేర్తు మైననున్.

చం. తెలిపెద నాలకింపుఁ డొకతీరును యజ్ఞతురంగ మెంతయో
తెలివి కలట్టి దీ కుతల దేశమునం దెట డాఁగియుండినన్
నలుపురుచేరి పట్టుకొని న్యాదముఁ జేసెదరంచు వే రసా
తలమున డాఁగనోపు నిది తథ్యము తప్పదటంచుఁ జెప్పుచున్.

కం. జన్నము పాడై పోయిన
మన్నింపఁడు తండ్రి మనల మక్కువతోడన్
మున్నెన్నఁడు చేకూరని
విన్నఁదనము సూర్యవంశ వీరుల కబ్బున్.

కం. కావునఁ గుతలం బెట్టటొ
వేవేగన్ గ్రొచ్చిత్రవ్వి ద్వట్చక్రంబున్
జావఁగఁగొట్టి హయంబున్
భూవరునకు నీయవలయుఁ బోడిమి ననఁగన్.

చం. అగునగు నంచు రాకొమరు లప్డుడే కొలఁదిముట్లు తెచ్చి వా
రగణిత శక్తిసంపద నహర్నిశలుం ధర ద్రొచ్చిద్రొచ్చి యే
పగిదినినైన ఘోటకముఁ బట్టి నృపాలవతంసు యజ్ఞమున్
ముగిసెడునట్టు చేయుటకుఁ బూనిరి క్రొవ్వి తదేకచిత్తులై.

చం. బొరియలుపెట్టి తాల్మిఁగొని భూమినిద్రవ్వఁగ బాతిలోపలన్
వరలెడి కప్పురీతి నొకపైపున గోచరమయ్యె ముంగలన్
దురగ మొకండు మౌనికులభూర్వహుఁడౌ కపిలుండు ధారుణీ
శ్వరతనుజాతులందఱును బాపురె ! బాపురె ! యంచు నార్చుచున్.

కం. గికురించి మనల నీ ఘో
టకముం గొనితెచ్చి యిచ్చటన్ జప మనుచున్
ముకుమూసికొనియె వీఁడని
యెకసక్కెము లాడుచుండ ఋషిచంద్రుండున్.

చం. తపమునుబాసి కోప పరితాప పరాభవ తప్త చిత్తుఁడై
కృప యనుమాట రోసి తమకించి శపింపఁ గషాయతాక్షుఁడై
చపలుల దిక్కు చూచునెడ సార విహీన వివర్ణ దేహులై
కపిలుని కంటి మంటఁబడి క్రాఁగిరి, బూడిదయైరి వెంటనే.

కం. సగరుం డీ వృత్తాంత మె
ఱిఁగి వేగులవారివలనఁ బ్రియపౌత్రకునిన్
సుగుణాఢ్యు నంశుమంతుఁ దు
రగముం గొనితేరఁ బంపెఁ బ్రతలంబునకున్.

గీ. అంశుమంతుండు మతిమంతుఁ డగుటచేతఁ
జేతమున సంభ్రమంబును జెందకుండఁ
గపిలు సన్నిధిఁజేరి నిష్కపటబుద్ధి
మ్రొక్కి, వచ్చిన కార్యంబు వక్కణింప.

అక్కటికంబుతోఁ గపిలుఁ డప్పుడు నొక్కి వచించె "సీపితల్
చక్కటిఁదప్పి సాధుల వెలార్చుచు బూదెవ బొక్కణంబులై
ప్రక్కిరి, నీవు మమ్ము బతిమాలఁగ వచ్చితి వందువేత మీ
జక్కని నీవు తీసికొని సాఁగుము మీ నరపాలు వీటికిన్".

"బూదె రాసులై పడిన మీ పూర్వులకును
గతులు కల్పింపనెంచుచోఁ గష్టమనక
మింటివఱ్ఱును గొనితెచ్చి మిడుకకుండఁ
దడుపు"మని యంశుమంతుతో నుడివి పంప.

అంశుమంతుఁ డంతట కపిలమహాముని యామంత్రణంబు వడసి యజ్ఞాశ్వంబును గైకొని, యజ్ఞదీక్షితుఁడయిన తాతకు సమర్పింప యజ్ఞంబు పరిసమాప్తిఁ గావించి సగర సార్వభౌముండు కాలానుసరణంబుగా, దివంగతుఁడైన నఖిలభూజన మనఃప్రియంబుగాఁ బట్టాభిషిక్తుండై, తాతలు సుగతిహీనులగుటకు నతిదుఃఖితుఁడై—

ప్రథితగుణుఁ డంశుమంతుఁ డత్యధిక భక్తిఁ
దాతలకు సద్గతులు గూర్ప దైత్యవైరిఁ
గూర్చి ఘోరతపముఁజేసి కొట్టకొనకుఁ
జేయునదిలేక ముక్తిని జెందెనంత.

అంశుమంతుని పౌత్రకుఁడౌ భగీర
థుండు నిష్ఠాగరిష్ఠుఁడై దొడ్డతపముఁ
గాలి బొటమన వ్రేలిపై గాలిఁ దినుచుఁ
జేసి గంగాశివులను మెచ్చింప నపుడు.

సీ. కదలెత్తి మ్రోఁగుచు నొడలెఱుంగక గంగ
చిడిముడిపాటుతో మిడిసిపడుచు
సుడిగుండములతోడ శూన్యంబులోనుండి
నుచ్చిళ్లగ్రక్కుచు నులిసి నులిసి

శివ జటాజూటంబుఁ జేరి యందుండి బ్ర
హ్మావర్తదేశంబునందుఁ జొచ్చి
స్రోవఁజూప భగీరథునివెంటఁ గ్రేళ్లబు
కుచు సాఁగి దేశముల్ కొన్ని కడచి

గీ. సగరవసుమతీశ్వర తనూజాతచయము
గ్రొచ్చి త్రవ్విన బొరియలగుండఁ బోయి
బూదిరాసులఁ దిన్నఁగాఁ బొడిచి తడిపి
గతులు కల్పించెనంట దుర్మతుల కంట.

వ. ఏతన్మూలంబున మందాకిని, బాగీరథీనామంబున జగద్విశ్రావంబుఁగాంచి, పతితపావనియను వాసిఁగాంచెనంట.

గీ. బొరియలేడుపెట్టి భూమండలముఁ ద్రవ్వి
గంగనీరుఁదెచ్చి కడుపునింప
జలధులేడుగల్గె సగర భూజానికి
ముందులేదహో! సముద్రచయము.

ఉ. సప్తసముద్ర సంతతి విశాల మపార మగాధమై పరి
వ్యాప్తముగాన నెట్టులొక వాహిని నీరము నింపువంచు సం
తృప్తులుగాక కొందఱొక తీరునఁ బల్కెద రంతెకాని ప
ర్యాప్తముగాఁగ రేయిఁబవ లప్పుల నింపిన నిండకుండునే?

గీ. వెగ్గలపుఁ బట్టుదల నొక్క వగ్గుతపసి
పుక్కిటనుబట్టి తిన్నగాఁ బుక్కిలింపఁ
జాలని జలంబుఁ గూలంకషామతల్లి
యొకటి గొనితెచ్చి యొకచోట నుంపలేదె?

సీ. గగనంబులోనుండి గంగమ్మ శివుమస్త
మున దూఁకె ననుమాట ములుచమాట
అతి తపోనియతిచే నల భగీరథుఁడు గం
గను దెచ్చె ననుమాట కల్లమాట

°గంగాజలంబుచేఁ గంధి నిండింపఁగాఁ
బడియె సుమ్మనుమాట బడుగుమాట
శైవ జటాజూట సక్తయై తిరుగాడె
వేల యేండ్లనుమాట వెఱ్ఱిమాట

గీ. సగరసుత భస్మరాసుల సరవి దడిపి
స్వర్గమునకంపె ననుమాట వట్టిమాట
టక్కునేర్పెడి కవుల గంటాలవ్రాత
కాదనఁగరాదు ప్రాచీన కవులుగాన.

శా. గంగామూల మెఱుంగఁగోరి సగరక్ష్మానేతృ పౌత్రుండు వే
గంగాకూలముఁ బట్టిపోయి తుదకుం గార్యంబు సాధింప శీ
ర్ణాంగుండై మరణించెఁ దత్కథను బర్యాలించి తత్పుత్రుఁడు
త్తుంగఖ్యాతిని బొంచెఁ బట్టినపనిన్ దుర్వారుఁడై తీర్చుచున్.

కం. గంగాతటినీమూలము
సాంగముగ నెఱిఁగి భగీరథాఖ్యుఁడు పృథుకీ
ర్తింగనె భాగీరథియని
గంగాశైవలిని దాన గణుతికి నెక్కెన్.

కం. వినువారలున్నఁ గథలన్
వినుపించెడివారుగల్గ విస్మయమగునే ?
విని కని చక్కగ నిజముం
గనుగొనఁగా వలయుఁగాని కాదనకుండన్.

సీ. కైలాసగిరిముందుఁ గల గండశైలంబు
పుడుకులిచ్చెడి లింగమూర్తి గాఁగ
అల్లిబిల్లిగఁ జుట్టు నల్లు పుష్పలతా చ
యంబు చంద్రార్ధ జూటంబు గాఁగ

ప్రస్థంబుపై నుండి పడుచున్న జలధార
తరళగంగా ప్రపాతంబు గాఁగ
పడి జాలుగాఁబాఱు వఱ్ఱు భగీరథు
నడుగంటి చను గంగ నడక గాఁగ

గీ. నమ్మకం బుట్టిపడునట్టు నక్క బుద్ధి
పూర్వకంబుగా లోకముం బుండలించి
చిత్రకథ వ్రాసినారు ప్రాచీనకవులు
స్వార్థమో! పరార్థమొ!! భగవంతుఁ డెఱుఁగు.

వ. అనంతరంబు ప్రకృతి శిల్పకళావైదగ్ధ్యంబున కచ్చెరువుపడి, హిమాలయ పర్వతపు నెత్తమ్మున నుండి క్రిందికిఁ జూచుడు నాకాశంబున నున్న చాయఁ గన్పట్టి విస్మయంపడుచు గంగావతరణంబుఁ జేసి.

కం. గురుతర హిమవద్ధరణీ
ధరపరిసరము త్తరించి తత్పరమతితో
మరుభూములఁ గని మరలితి
సురకరువలి చుట్టుముట్టి సుడిముడిపెట్టన్.

గీ. మంచుగప్పిన మరుభూమి మండలంబు
మీఁదఁ బడి యేటవాలుగా మిహిరకిరణ
పాళి కన్ను చెదురునట్టు ప్రతిఫలించి
యినుమడించి విస్వీథికి నెగయుచుండె.

చం. అరుదగు గుట్టమిట్టలను నన్నిటిఁ జూచుచుఁ బోయి పోయి యు
త్తరకురుభూములం గడచి దవ్వులనున్న త్రివిష్టపంబు సం
బరపడి చూచి యాపొలము పచ్చికబీళ్ళను దోట దొడ్లనున్
వరుసగఁగాంచి యచ్చె నిలువంబడిపోతి భ్రమాకులుండనై.

చం. విపుల సరోవరంబొకఁడు వీక్షణమాలిక కద్దురాఁగ నే
నపుడు తలంచినాఁడ నిదియొఁగదమానసపంచు భంగముల్
తపతపమంచుఁ గూలములఁ దాఁకుచుఁ బైఁబడుచుండ నింతలో
రెపరెపమంచు లేచెచనె జివ్వన మింటికి రాజహంసలున్.

బంగరు పూతఁబూసిన విభాతిని దోఁచెడి తమ్మితూండ్లతోఁ
దొంగలి తేకులందెగడి దూకొనివచ్చెడి కమ్మతావులున్
రంగరు వన్నె చిన్నె గల రంగుపులుంగుల నంగికూయి యు
ప్పొంగఁగఁజేసె నన్నుఁ బరిపూర్ణరసానుభవంబుఁ గూర్చుచున్.

ఏమియు దూరభారమని యెంచక నేను ద్రివిష్టపంబుఁ గ
న్గో మదిఁ బట్టుఁబట్టి యిదిగో ! యదిగో ! ! యని పోయి పోయి
డ్డా ! మిహిరుండు కన్పడనియట్టి పొలంబుల దాఁటిపోయి యా
యా మడ లుత్తరించి మఱి యామడలెన్నియొ యేగి నిల్వఁగా.

సీ. దూదిపింజలరీతి దులదుల పడసాఁగెఁ
బైనుండి హైమంబు పట్టపగలె
పూగుత్తులను భ్రాంతి పుట్టఁగా మిక్కిలి
కసిదీర వడిగండ్లు విసరికొట్టె
మిట్టమధ్యాహ్నంబె మిథునముల్ చెలరేఁగి
చెట్టుచెట్టులచుట్టు చేరసాఁగె
కనుఱెప్పపాటులో గలిసిన మిథునమ్ము
లప్పుడే తారుమా రగుచునుండె

గీ. చేతులును గాళ్ళు క్రొవ్వలి చేతనపుడు
కొంకరలు పోవఁజొచ్చెను గొలఁది కొలఁది
వింతదేశంబు దీనిలో వేగుబెట్టు
లనుచు నాందోళితస్వాంతుఁ డైతి నేను.

గీ. పాఱు సెలయేళ్ళ నీటి తుంపరలతోడ
విరుల క్రొందావి విరఁజిమ్ము తరులనీడ
సురల యాచారములనెల్లఁ జూడఁగోరి
యెదురుచూచుచు నిలుచున్న యింతలోన.

త్రి వి ష్ట ప స ం ద ర్శ న ము

కం. లెంకలు వంకల నిలఁబడి
యంకిలిమాన్పన్ స్ఫురత్సుమాంచ ద్ధూళీ
పంకిల ఘంటాపథమునఁ
బంకేజాతాస్యయొ ర్తు వచ్చుచునుండన్.

గీ. అంగజాలల నెవ్వరీ యాఁడుపడుచు
తెల్పుఁడంచును నేను బ్రార్థించినంత
వారు తెల్పిరి యూర్వశీభామ యీమె
యధిక లావణ్యసీమ, వేశ్యాలలామ.

గీ. ఎదురులేనట్టి నెఱజాణ యెమ్మెలాఁడి
యీమె వాంఛితార్థంబు లీడేర్పకున్నఁ
దిట్టుఁ దినకుండఁ బోవలే రెట్టివారు
మాటినంగ యాయమ యంచు మాటఁదెల్ప.

చం. దడదడలాడె గుండెలు యదాయదలై మును దొంగప్రొద్దునన్
విడివడిపోయి పైకొనఁగ వెంపరలాడుచుఁ జేర నర్జును౦
డొడబడకుండినం గినిసి యుంకి, నపుంసకుఁ జేసె నీమె నేఁ
డుడుగునె యొంటి నన్గనిన నుక్కిరి బిక్కిరిచేసి చంపదే.

గీ. బండవానిచేతి చిపేలు బదరు వేల్పు
టాలి కీల్జడ వ్రేటు పెడేలుమనఁగ
సొమ్మసిలకుండఁ గన్నీరు గ్రమ్మకుండ
నొంటిప్రాణంబుతోనైన నుండు టరిది.

గీ. గిల్లుకొలుకుల పొత్తంబు నెల్లఁజదివి
యారితేరిన యామె సయ్యాటలందు
బడుగు బైరాగి కెట్టు లీపాట్లు తెలియు ?
వంగి జోహారుఁజేయు టేపాటియెఱుఁగు ?

గీ. మర్త్యలోకవాసుఁ డనెడి మాటవిన్నఁ
బులకరించెడి మేనితోఁ బొంగిపోయి
యీామె మోహాంబునిధిలోన నీదులాడు
ననుచుఁ బెద్దలు చెప్పెద రామెఁగూర్చి.

అంచుఁ గొంతవడి వితర్కించి, యీామె బారి కగ్గముగాకుండు టుచితంబని తలంచి, యోగమాయాప్రభావంబున నదృశ్య శరీరుండనై దేవలోకంబు నాల్గుమూలలు గాలింప నుంకించి దశదిశలుపలక్షింప—

సీ. ఎత్తైన నెత్తమ్ము లెక్కి బారలు చాఁప
శిశిరాంశు బింబంబు చేతఁజిక్కు
పరికించి కనుగొన్న భారతఖండంబు
ప్రతలంబు రీతిఁ గన్పట్టుచుండు
చదలంటు మ్రాఁకుల సందుగొందులదూరి
కుందును బిచ్చుక కుంటువేల్పు
నీలాబ్దమాలికా నిచయంబు చెలరేఁగి
కోట కొమ్మలఁజిక్కి కొనుచునుండు

గీ. నభ్రవీథీ విటంకంబు నందరుగు వి
మానములు సౌధములఁదాకి మరలుచుండు
నాపురీ సంస్థితులను గన్నారఁజూడ
మేఘమండలమందున్న మెలపుదోఁచు.

నే నంతట నెమ్మదిగా నడుగులు లెక్కించుకొనుచు ముందులకుఁ బోవంబోవ—

సీ. నగ్నలై రాగ నిర్మగ్నలై చదలేటి
యందున జలకంబు లాడువారి
జుమ్మనుతేంట్లతో జూజంబులాడుచు
హరిచందనము క్రింద నొరగువారి
కోడాడు కొంగ్రొత్త కోడెగాండ్రనుజూచి
వాలారుచూపులఁ బట్టువారి
మేలువారలఁగూడి మిన్నేటి యిసుక తి
న్నెలను వెన్నెలరేల మెలఁగువారి

గీ. గంగగట్టునఁ గడిమిడి గట్టి నేల
నీరములపొంత తమయంత కూరుచుండి
చిత్తరువు వ్రాయు బిత్తర చేడియలను
నివ్వెర పడిపోయితి నిదానించి చూచి.

గీ. కంచుకంబుఁదీసి కడగంటితోఁ గాంచి
జడుపులేక దుమికి మడుగులోన
నీఁతకొట్టుచున్న యిగురుబోఁడి యొకర్తు
కన్ను సైగఁజేసె నన్నుఁజూచి.

గీ. మసకలాడు నాగుల మాడ్కి మసలి బాహ్య
లోక మాదమఱచి రసలుబ్ధు లగుచు
గాఢతర పరిష్వంగ సౌఖ్యమునఁదేలు
వేల్పుజంటలఁ గనుఁగొంటి వెంటవెంట.

బంగరు తమ్మిపూలగమి ప్రసన్నని తావులఁ జిమ్ముచుండఁగాఁ
జెంగటఁ జిందు గాంగజలశీకరముల్ మెయిఁ దద్దుచుండ స
ర్వాంగకముల్ ఛడంకఁగ మృగాజినమున్ బయిఁగప్పుకొంటి భ
స్మాంగుఁడనై యలంచునివమంతయుఁబోవఁగ నొక్కపెట్టునన్.

త్రసరేణుపటలంబు సుమపరాగ జటిలంబయి తుషారసించితం బగుటచే సుబ్బలియగుత్రోవను "జారిపడుదునేమో" యను శంక నెమ్మదిగ నడుగు లిడుచు నూర్వశీ పర్వేందుముఖి గంధర్వవరుని చెట్టఁబట్టి సురపొన్నగున్న క్రిందకుంజని క్రీడోత్కంఠత నన్యోన్య పరీరంభ సుఖాప్తిం బొందుచుండ గీర్వాణభటుం డొక్కరుండు హుటాహుటిం జనుదెంచి దేవతాసార్వభౌముని యాదేశంబు దేవతాంగనకు విన్పింపఁ గ్రీడాభంగ సంభవోన్మాదంబున నాగణికామణి యిట్లు గొణఁగికొనియె—

సీ. విష్టపత్రయమందు విజ్ఞుఁ డెవ్వండేని
తపము సల్పుచునున్నఁ దల్లడిలును
తనకొంప గూలిపోయినరీతి నాహార
పానీయములు మాని పల్లటిలును
అసమర్థుఁడై భీరువై ప్రతీకారంబుఁ
బచరింపఁజాలు నిబ్బరములేక
మంత్ర తంత్రంబుల మాటున జవరాండ్ర
మాలిమితో బతిమాలి, యింటి

గీ. పట్టునం బదినాళ్ళని పట్టుమనుచుఁ
గుడిచి కూర్చుండనీయఁడీ కుత్సితుండు
రేయిఁ బవ లెల్ల లోకముల్ ద్రిమ్మరంగఁ
జెప్పి పంపించుఁ దనమాట చెల్లుననుచు.

గీ. ఆఁడు తోడునఁ బుట్టినవాఁడు కాఁడొ
ఆఁడువారల యగచాట్ల నాలకించి
యాదరింపఁడు, స్వర్గంబునందునున్న
వేల్పు సానులగతు లిట్లు వేగుచుండె.

అంచు రోషించి మంత్రరుద్ధభుజంగమవోలె, నా భుజంగి చేయునదిలేక నిట్టూర్పు విడచి—

గీ. వదలలేక వదలలేక వదలి ప్రియుని
బాహుపంజరమ్మునుండి బయటఁబడుచు
బాష్పసంరుద్ధకంఠయై పలుకలేక
యూర్వశీకాంత దేవేంద్రు నొద్దకంత.

కం. తడఁబడు మెల్లని నడతో
విడివడి వ్రేలాడుచున్న వ్రీలిన జడతో
నుడుగని యూర్పుల వడతో
దుడుకునఁ గన్పట్టుచున్న తొడతోఁ జనియెన్.

గీ. అచటి మిన్నేటివారను నరుగు నాకు
నిసుకతిన్నెల నెలరాలయిండ్ల నాట
పాటలందు మునిఁగి తేలు స్వైరిణీ జ
నమ్ము దేవకన్యా నివహమ్ముదోఁచె.

గీ. సురనువాచేరఁ దెగఁద్రావి సోడుముట్ట
మైమఱచి నేలపైఁ గూలి మరులు కూన
రాగములుతీయు గోవాంద్ర రాగరస ని
మగ్నతను జూచి యానందమయుఁడ నైతి.

గీ. వాక యిద్దరినున్న మధూక వనముఁ
బాసి వచ్చు సుమాళంపు వగరుతావి
నాసికాపుటిఁ జేరి యున్మత్తుఁజేయ
దిగ్భ్రమాకులుండ నగుచుఁ బెన్నుదప్పి.

ఉ. చక్కని రాచబాటఁబడి సాఁగుచుఁబోవ నశోకవృక్షముల్
చిక్కని పూవుఁదేనియలు చింది పయింబడఁగార్చు చుండఁగా
మక్కని జంపుజొంపముల మాటున డాఁగిన పూవుగుత్తులున్
జిక్కణమైనరీతి విరఁజిమ్ముచునుండెను గమ్మతావులున్.

కం. చల్లని మ్రాఁకుల నీడను
మల్లాడుచునుండ మార్గమధ్యమునందున్
దెల్లని యుడుపుల దొడిగిన
గల్లంతులమారి జాణ గకవిక నవ్వెన్.

కం. వలిపంపుఁ జీరఁగట్టియుఁ
గలపంబునుబూసి కర్ణికారముఁ జెవులన్
వెలయఁగ సొగసుగ నిల్చిరి
వలభీపార్శ్వంబులందుఁ బల్లవపాణుల్.

కం. కలకల నవ్వుచు దిశలన్
గలకలమను నెమ్మొగంబు కాంతులు పర్వన్
గలకంఠస్వరములతోఁ
గలవాణులు పాడుచుండఁగా విని యంతన్.

గీ. రాచబాటను విడనాడి ప్రక్కనున్న
చంద్రకాంతశిలాచయస్థగితమైన
వీథిఁబడి పోవుచుండఁ ద్రివిష్టపమునఁ
గానరాని విడ్డూరముల్ గానిపించె.

సీ. శ్రోత్రియవరుఁడైన సోమయాజులు సాని
కొంప తల్పులు చేతఁ గొట్టుచుండ
వీరగంధముతోడఁ బెనఁగి కూలిన మల్లు
సానివాడఁ బచారు సల్పుచుండ
యజ్ఞయాగాదుల నాచరించిన యోగి
రోపడంతుల యిండ్లు రోయుచుండ
నిద్రించి తపములో నెగ్గిన జటిలుండు
బొజుఁగుబోఁటుల పొఁజు పొంతనుండ

గీ. దారి తెలియక జడదారి తారుచుండఁ
గొంటె తెఱగంటి కన్నె గన్గొట్టుచుండ
ననుపుకాఁ డట్టె పెదనవ్వు నవ్వుచుండ
నల్లకల్లోలమై యుండె నాకపురము.

చం. విసవిస సోమయాజి యొకవీథిని బోవుచు వేశ్యకాంతతో
గుసగుసలాడుటెల్లఁ గని కోపనగావున సోమిదమ్మయున్
బుసబుసలాడి ఘూస్థలిని బోకడ లిట్టివియున్నెయంచుఁ దాఁ
దసతస పూవుటీర మొకదానిని దారెను దొంగదారినిన్.

కం. ఎదురగు మదిరాక్షుల కే
నొదిఁగి యొదిఁగిపోవ వారి యూర్పులవలిచే
మదిరాసవ వాసనచే
మది మదిలోలేక తాఱుమాఱుగ నుండెన్.

వ. అంత నా గబ్బుగొట్టుటచే నుక్కిరి బిక్కిరి యైనటులుండి యేమియుఁ దోఁచక, నే నిటునటు పోయి, పోయి, కొలువుఁ దీర్చియున్న వేలుపు సురతాణి హజారముం జేరి, మణిమయపట్టభంగమ్ముల భంగమ్ము నందక దౌవారికులం ద్రోసికొని, నిండోలగంబుఁజొచ్చి విలోకించుడు——

కం. ప్రాచీనబర్హి విలసత్
ప్రాచీ దిక్పాలకుండు తగఁ గూర్చుండెన్
బ్రాచీన బర్హిపీఠిని
వాచంయమి గణము కొల్వఁ బ్రాభవ మొప్పన్.

సీ. మోళికట్టెడువాని మోచేయికడనుండు
కోలెమ్మ కొకప్రక్క గునిసియాడ
దనుజుం డొనర్చిన దండచే మచ్చలు
పునుఁగు పూఁతలలోనఁ బొనుఁగుపడఁగ

జారుచుండిన యోడు సవరించుకొని తుంబు
రుండు పాటలు పాడి యొప్పుచుండ
తెలగంటిబోటులు తెలచిన కనులతో
వింజామరలుపట్టి వీచుచుండ

గీ. రాజసంబు దీపింపఁగా భ్రాజమాన
విమల చింతామణీ భద్రపీఠమందు
నంగజాలలు సందడి నాఁగుచుండఁ
గొలువుఁదీర్చి మహేంద్రుండు కూరుచుండె.

ఉ. భోగములాసఁజేసి చనిపోయినపిమ్మట వానిఁ బొందఁగా
యాగము లాచరించిన ధరామర దీక్షితకోటి ముంగలన్
గాగర కొంగుదాఁకునటు గంతులు వైచెడి స్వర్గ వారకాం
తా గజదంత దంతురిత తాండవకేళిని గంటి ముచ్చటన్.

కం. తెలగంటి దొరనుఁ జూచినఁ
దిరముగ సందేహ మొండు దీరెను నాకున్
దెరఁ దీసినభాతిగ నా
తెరఁగును విన్పింతుఁ దేటతెల్లముగాఁగన్.

సీ. ప్రాచీన బర్హినా వన్నెవాసికినెక్కి-
దేవతాపతి దేశ దేశములను
"ప్రాచీనబర్హి" శబ్దమ్ము జానుతెనుంగు
బాసయందునవౌను బ్రాఁతనెమిలి
చిత్రచిత్రంబుగాఁ జిత్రింపఁబడియుండు
వేలకన్నులు బర్హి పింఛమందు
వేఁగన్ను లుండెను వేల్పు టేలికమేన
నన్న వదంతిని నందెదాన

గీ. నకట శబ్దార్థమునుబట్టి యంకురించెఁ
గాపురుషయోగ్యమైనట్టి కథ యొకండు
వేయి గన్నులు నాకు గన్పింపలేదు
పొడలుమాత్రము గన్పించె నొడలినిండ.

వ. పౌరాణిక గాథా ప్రబంధనిబద్ధములయిన యిట్టి కథలు పెక్కులు గలవు. వానిలోఁ గొన్నింటి నిట వివరింతు, దత్తావధానుండవై యాకర్ణింపుము. ఆకర్ణించిన పిమ్మట సత్యంబు బోధపడఁగలదు—

సీ. ధరణీంద్రుఁడైనట్టి దశరథున కరదం
బులు పది గలవంచుఁ బలుకునటుల
దైత్యేశుఁడైనట్టి దశకంఠునకుఁ గంఠ
ములు పది కలవంచుఁ బలుకునటుల
దితిజసేనానియౌ త్రిశిరునకును మూఁడు
తలలు గలవటంచుఁ బలుకునటుల
ఋషిపుత్రుఁడైనట్టి ఋష్యశృంగున కొక్క
మనుబోతు కొమ్ముండె ననెడునటుల

గీ. వినుము ప్రాచీనబర్హికి వేయిగనులు
కలవని పురాణములు పల్కుఁ గంఠమెత్తి
వేయికన్నులు నాకుఁ గన్పింపలేదు
పొడలుమాత్రము కన్పించె నొడలినిండ.

సీ. మాండూక్యముని లోకమాన్యుండు మాండూక
మునకు జన్మించినాఁ డనెడిరీతి
సుశ్లోక చరితుండు శుకయోగి శుకిగర్భ
మున సంభవించినాఁ డనెడిరీతి

మౌనితల్లజుఁడైన శౌనకబ్రహ్మర్షి
శునిగర్భమునఁ గల్గె ననెడుకీతి
అఖిలాస్త్రసంవేదియైన యశ్వత్థామ
యశ్వమునకుఁ బుట్టె ననెడిరీతి

గీ. వినుము ప్రాచీన బర్హికి వేయిగనులు
కలవని పురాణములు పల్కుఁ గంఠమెత్తి
వేయికన్నులు నాకుఁ గన్పింపలేదు
పొడలుమాత్రము గన్పించె నొడలినిండ.

అప్పుడు త్రిదివలోకేశ్వరుని సన్నిధి నంతర్వాణి ద్వయంబునకుఁ బ్రచండ వాదంబు ప్రవర్తిల్లుచుండె. ఎవ్వరని యచటివారి నడుగ దేవగురుండగు బృహస్పతియు, స్మృతిరచయిత యగు మనువని నా కెఱింగించిరి. నేనును వాదంబేమియో, యెట్లు ముగియునో యని వేడుకపడి చూచుచుండ, దేవ గురుం డావేశముతో మనువు నుపలక్షించి యిట్లు ప్రశ్నించెను—

ఊరక యుండలేక యెటులో స్మృతియొండు లిఖించెనన్నచోఁ
బేరుప్రతిష్ఠ వచ్చునను వెంపరి వేడుకవ్రాసితొక్కొ? మీ
భారతవర్షమందుఁ దలవంపులుగల్గఁగఁ బండితాళికిన్
దీరని వైమనస్యము గదించుచుఁ దత్ప్రజ కెల్లకాలమున్.

జాతులఁబట్టి మేము స్మృతిసంహితలన్ రచియింపలేదిటన్
జాతులఁబట్టి తప్పులు విచారణఁజేయము శిక్షచెప్పఁగన్
జాతులఁబట్టి ధర్మము ప్రచారముసేయము బందుకట్టి నీ
ఖ్యాత దయాగుణంబునకు మోదము నందితిఁ జెప్పనేటికిన్.

సీ. అజ్ఞాను లొనరించు నపరాధములకెల్ల
నతిమాత్ర శిక్షలు న్యాయమయ్య?
జ్ఞాను లొనర్చు దోషముల కన్నింటికి
నామమాత్రపు శిక్ష న్యాయమయ్య?

ఒకరీతి నేరంబునకుఁ బెక్కురకముల
దండనల్ విధియింప ధర్మమయ్య ?
భరతవర్షమునందుఁ బ్రజలకు ధర్మైక్య
సంచారమును మాన్పఁ బాడియయ్య ?

గీ. ఆంధ్రులను మ్లేచ్ఛజాతులయందుఁ జేర్చి
వ్రాసిపెట్టితివిదియేమి పాపమయ్య ?
ఆంధ్రజాతి గూరిచి యెట్టి యానుపాను
తెలియకుండంగ స్మృతి నేల పలికితయ్య ?

గీ. వానవంగుళ్ళకోర్చి రేఁ బవలు తెప్ప
వాల్ప కూఢిగం బొనరించు ప్రాతలకును
బ్రాత, యెంగిలి పొల్లును బ్రతిఫలంబ
టంచుఁ జెప్పితి విదియెట్టి న్యాయమయ్య ?

ఉ. భద్రముఁ గూర్పఁగాఁ బ్రజకు వ్రాసితి నీ స్మృతివందువయ్యయో !
శూద్రునకున్ ధనం బమర క్షోభపడున్ జగమెల్లనంచు నే
మాద్రిరచించితో ! మనుజమాత్రుఁడు కాఁడొకో శూద్రుఁ డక్కటా !
క్షుద్రుఁడవీవొ ! లేక మరి శూద్రుఁడొ ! చెప్పు సురేంద్రు సన్నిధిన్.

కం. ఒక్కటి యడిగెదఁ జెప్పుమ
యెక్కటి "శూద్రంతుకారయేద్దాస్య" మటం
చెక్కరణిన్ స్మృతివ్రాసితి
వక్కటికము నీకు సుంతయైనను గలదే ?

గీ. కటికవానికిఁ గల్గు నక్కటికయైనఁ
గానరాదు నీయెడల మహానుభావ !
ఋషివి యెట్లైతి వేగతి స్మృతినివ్రాసి
ధర్మనిర్ణయమ్మొనుజేయఁ దగితి వయ్య ?

సీ. గరుడ గంధర్వ కిన్నర కింపురుషముఖ్య
నానాప్రథిత దేవయోనివితతి
జాత్యంతరు లనేక శతవర్షములనుండి
యిందొక్కచో వసియింపలేదె ?
పక్షపాత విశిష్ట శిక్షాస్మృతుల మేము
రచియించినారమే క్రమముఁదప్పి ?
ఐకమత్యముతోడ నన్నదమ్ముల రీతిఁ
జరియింపలేదె పొచ్చంబులేక

గీ. ప్రజలయం దెచ్చులొచ్చులు వర్ధిలంగ
స్మృతులు వ్రాయించు భూపతుల్ స్మృతులువ్రాయు
పండితావళియున్న భూమండలంబె
యదుపులేనట్టి మ్లేచ్ఛ రాజ్యంబు సుమ్ము.

గీ. ప్రజల సమదృష్టితోఁజూచి రాష్ట్రమందు
నీతిబాధలు లేకుండ నీతిగల్గి
ప్రజలఁబ్రోచుట రాజధర్మంబు కాని
పక్షపాతంబుఁ జూపింపఁ బాడియౌనె ?

వ. ఈ సూటిపోటు మాటలకు మను వులికిపడి క్షణకాలం బాగి యీ విధంబుగాఁ జెప్పఁదొడంగె.—

ఉ. అప్రతిమాన బుద్ధిధనులై స్మృతులం దలక్రిందు సేయు మా
విప్రులు కొందరట్టె పలవించి కడున్ బలవంతపెట్టఁగా
నప్రతిభుండనై జడుఁడనై స్మృతి వ్రాసితి నన్ క్షమింపుఁడీ
క్షిప్రగతిన్ బ్రమాదపడి చేసినకార్యముగాన గీష్పతీ !

కం. అనుమాట లాలకించుచు
ననిమిషగురుఁ డంతఁ బల్కె నాత్రముతోడన్
వినుమని శ్రద్ధాభక్తుల
మనువు సమాలింపనుండె మక్కువతోడన్.

కం. కల్హారితనముఁ బూనకు
మిల్లి దిగో ! దివ్యదృష్టి యిచ్చెద నీకున్
మెల్లన భారతదేశం
బెల్లన్ గనుగొమ్ము విన్ను నేమను కొనుదో.

వ.. నేను భారతదేశ కష్టగాథా ప్రపంచమంతయు నెఱింగినవాఁడ నగుటచేతను, మనువు బృహస్పతి వాక్యంబులు పూర్వపక్షంబు సేయనేరక డిల్లపడి యుండుటచేతను నటనుండ రోసి మగిడివచ్చుచు స్వర్లోకంబు వీక్షింప బయలుదేర—

కం. హిమవాలుకాయుతీతతి
సుమధూళీ మిళిత లలిత శుభ్రామృతయై
శమితాథ్వోరు శ్రమయై
ప్రమదోద్యానంబునుండి పాఱుచునుండెన్.

ఉ. ఆ సెలయేళ్ళ గట్టుకడ యంచుల వెంబడి సాఁగిపోవఁగా
నానవయోనులైన వివిధాగమతండము జాగరూకులై
కాసెలబిగ్గఁగట్టి మడిఁ గట్టుచుఁ బాదులు త్రవ్వి నీరమున్
దోసెలఁబోసి పెంచు పువుదోఁటల కాపరిమూఁకఁ జూచితిన్.

## న ం ద నో ద్యా న ము

గీ. నందనముఁ జూచు కోర్కెలు సందడింపఁ
బారిజాత పరిమళంబు దారిఁజూపఁ
గమ్మతావుల గొజ్జంగి కాల్వదాఁటి
నందనోద్యాన వనసమయందుఁ జొచ్చి.

సీ. ఒకవంక వీక్షింప నుత్ఫుల్లసౌవర్ణ
పంకజాత పరాగ పంకిలంబు
ఒకచాయఁ గనుగొన్న శుకశారికానీక
కోకిల కాకలీ కూజితంబు

ఒకచ్రేవఁ బొడగన్న వికచమందార పు
ష్ప మరంద గురు ఝరీ ప్లావితంబు
ఒకకోనఁ బరికింప నురువేపథుఃగ్లాని
సంహారకసమీర చాలితంబు

గీ. మధురవేణు వీణాగాన మండితంబు
స్వైరకేళీ సహారిణీ సంకులంబు
విటవిటీ నటీనట విరివేష్టితంబు
నందనోద్యాన మానంద మందిరంబు.

చం. తడవులనాఁటనుండియును దాపసవృత్తిని బూనియున్న నా
కడవులె యాటపట్టులయినందునఁ దన్మృగపక్షిజాతులం
దుడుగని నేస్తముంగలిగి యుండుటచేతను సంభ్రమంబునన్
వెడలితి నందనోపవనవీథులు చూడఁగ నాల్గుమూలలన్.

వ. అంతట నాగుబ్బుగాఁ బెఱిగిన పూఁబొదరిండ్లు, పూఁబొదరిండ్లనుండి పూఁదేనె దిగఁద్రావి మత్తిల్లి వెలువడు తేఁటిపోఁజు తేఁటిపోఁజు రొద కులికిపడు చిత్తరికన్నెలు, కన్నెల వెన్నాడు గోవాంద్రునుగల్గి నిత్య కల్యాణము పచ్చతోరణమై వెలుంగుచుండ నే నిటునటు తిలకించుచుండ—

గీ. కొమ్ము తేన్గాక పొదరిల్లు గ్రుమ్మిపైవ
నంగమొలతో సురాంగన యంగపై చె
నంగదట్టము విడివడ్డ నంగరాగ
మంగహారముచేఁ జాలనంగవింప.

ఉ. గుబ్బలిమాటునన్ సురలకోసము పెట్టిన యొక్క యంగడిన్
గబ్బలికన్నె చెన్నుఁగని కై వణఁకన్ సుర చింది ముంగిటన్
జొబ్బిలఁ ద్రాగుబోతు లటసోలుచుఁ దూలుచునుండ దారి పె
న్నుబ్బలియైన నందనము నొక్కెడఁగంటిని తీచ్చపాటుతో.

గీ. జారుసిగలోన గేదంగిసరులు తురిమి
జారుపయ్యెంటలోన మందార ముంచి
నీటుతో నెలకట్టుపై నిక్కినడువఁ
జారణీస్త్రీ యొకత కాలుజారిపడియె.

గీ. తీఁగ తూఁగుటుయ్యాలలోఁ దీఁగబోఁడిఁ
గూడి జోడుగ నొక వేల్పుకోడెకాఁడు
కౌఁగిలింతల పొంగులోఁ గాలుజారఁ
గేకిసల్గొట్ట నెడకాంద్రు క్రిందఁ బడియె.

కం. పన్నిటి యేటిమీఁదను
బ్రన్నని యొకచిన్నదొన్నె పైభాగమునన్
గన్నులు మూయని కన్నియ
కన్నుంగవమూయు కోడెకానిం గంటిన్.

గీ. పారిజాత సంతాన పుష్పముల నేరి
తెచ్చి మేలు గేదఁగులతోఁ దెప్పఁగట్టి
పజ్జఁ బాఙాడు గొజ్జంగి వాక విడచి
తెప్పమీఁద నచ్చరలేమ తేలిపోయె.

ఉ. కాతరభావ మేమియును గన్పడనీక యథేప్సితంబుగాఁ
గేతకి కుంజపుంజముల క్రేవల నావల సంచరింపుచున్
జేతులు చేతులుం గలిపి చిక్కురు బొక్కురుగాఁగ స్త్రీలతోఁ
బాతరలాడుచున్న మగవారలఁ గాంచితి నాఁకతోఁటలో.

గీ. కామశాస్త్ర నిష్ణాతల గబ్బితనము
కళలుజార్చెడి నొక్క పక్షంబునందె
షోడశకలానిధినిబోని ప్రౌఢ కౌర!
వేల్పు జవరాండ్ర పొలయల్క బేరజంబు.

విరుల తేనెసోనలు వెల్లివిరియుచుండ
కరుల మదధారలోడికల్ గట్టుచుండ
భ్రమరకాంతలు నివ్వాళిఁ బాడుచుండ
నవ్యవైఖరిఁ బొడకట్టె నందనంబు.

వెల్ల గౌరుఁ జూచి వెల్ల జక్కినిజూచి
కల్ప పంచకంబుఁ గనులఁజూచి
నందనోపవనము నాల్గుమూలలుఁ జూచి
వేల్పుపౌఁజుఁజూచి వెడలుచుంటి.

వ. ఇంతలోఁ బడమటిదిక్కునకుఁ బ్రొద్దుచాలఁగై వ్రాలుటయుఁ బెద్దతడవు విరామంబులేక నలుదిక్కులు మల్లాడుటయు, విపరీతంబుల పెక్కుఁజూచి మనంబు చెదరుటయుఁ, జేయునదిలేక—

కం. కొంచెము విశ్రామంబును
గాంచఁదలఁచి యొక్క చెట్టుకడ కేగంగాఁ
బొంచి లతాంగి యొకత నా
వంచకురా నామెతోడఁ బల్కితి నిటులన్.

కం. ఇందఱు యువతీ యువకులు
క్రందుగ నున్నట్టిచోటఁ గన్పించ రహో!
చిందులు తెగఁద్రొక్కెడి కసి
గందులు వచియింపుమమ్మ కారణ మన్నన్.

ఉ. స్వైరవిహార నిష్ఠమెయి సర్వదిగంతర దివ్యదేశ సం
చారముఁజేయు మాకు గ్రహచారము చాలక సంతుగల్గినన్
వారలనెల్ల గన్న మగవారికి నిత్తుము కాని పెంచు నా
చారములేదు స్వర్గమున సత్యముఁ జెప్పితినంచు నామెయున్.

గీ. ఆలకింపుము స్వర్లోకమందునున్న
మానినులయందుఁ బెండ్లిండ్లు లేనికార
ణమున మరులెత్తి మర్త్యలోకమున, దేశ
దేశముల పయింబడి వారు తిరుగుచుండ్రు.

కం. మగనాండ్రిచ్చట నుండరు
మగనాండ్రన్నన్ దెలియదు మాబోంటులకున్
మగవాండ్ర మనుచు మాపై
మగబీరముఁ జూపరారు మా మగవారల్.

వ. అని నిష్కపటంబుగా వచియింప స్వర్గలోక నాగరికంబునకు నాలో నే నేవపడి, యేమిచేయుటకుఁ దోఁచక, మెల్లనలేచి, ప్రక్కకొదిగి పోవుచుండ సురాంగన నన్నుఁజూచి కేరింతలాడ నిట్లు దలపోయఁదొడంగితి—

గీ. కల్లునిచ్చెడి చెట్లకుఁగల్గు గౌర
వంబు పెఱవానికిని లేదు, వజ్రిమ్రోల
గజ్జెకట్టెడి బోగంపుగరితకున్న
పలుకుఁబడి కానరాదెట్టివారి కిందు.

ఇండ్లో యున్నవి కాని పెండ్లిండ్లులేవు
ఆండ్రో యున్నారు కాని యిల్లాండ్రులేరు
బాగు ! శివ ! శివా !! యిది వట్టి భోగభూమి
యుండరాదిందు మావంటి యోగులకును.

సీ. మిన్నేటిగట్టుపై మిడుకుదునందునా
కొంటెకన్నియ లీఁతగొట్టు చోటు
నందనోద్యానంబునందుందు నందునా
గోవాండ్ర గమిగుంపు గూడుచోటు

పొన్నారి పొదరింట్లఁ బన్నుండునందునా
    కాముకీ కాముకుల్ గలియుచోటు
కొండనెత్తములెక్కి కూర్చుండునందునా
    చోరవతోఁ బ్రోయాంధ్రు తిరుగుచోటు

గీ. కానమిటఁ జాటుచోటొక్క జానెఁడైన
మౌని జనవాస యోగ్యమౌదాని నకట!
బాగు! శివ! శివా!!! యిది వట్టి భోగభూమి
యుండరాదిందు మావంటి యోగులకును.

అని తలంచుచుఁ జేతికందు దూరంబులోనున్న పరిష్కృత నిష్కుటంబును జేరి, కృష్ణాజినంబు సెజ్జగాఁ జేసికొని నాఁటిప్రొద్దెల్లఁ జూచిన వింతవింత సంగతులను గూర్చి విచారించుకొనుచు, నిదురంబోయి, సర్వభూతమనః ప్రియంబగు నుషఃకాలంబుననే లేచి యమరనదికిం జని కాల్యంబులఁ దీర్చికొని, చల్లనినీట స్నానంబాడి మెల్లని పరిమళవాయువులచే సేదఁదేరి, కక్షపాలనున్న భస్మంబునుదీసి, యన్యమనస్కుండనై, మై నలందికొని చూచుడు భస్మలేపనంబు, పుష్పొడిపూఁతయయ్యె. నేను దిగులుపడి, నాకంబు విటవిటీ భోగ్యంబుకాని, మౌనిజన వాసయోగ్యంబుకాదని యెంచి వైశమ భరతఖండంబునకు రాఁ బ్రయాణోన్ముఖుండ నగుటయు—

సీ. భస్మలిప్తంబైన బడుగు దేహపుకాంతి
    మంచుకొండలమంచు సంచుమించ
మధుర వీణాగాన మహిమంబు గంధర్వ
    యువతీజనంబును నుదుటపఱప
ద్రుతతరంబైనట్టి గతి చాకచక్యంబు
    కాయసిద్ధిని జాటఁ గల్గుచుండ
సంస్కృతవైయ్యాఘ్ర చర్మసంత్యాగంబు
    నిస్సంగతత్వంబు నెఱపుచుండ

గీ. త్రిభువనవిహారి నారద దేవమౌని
సంగరహితుండు, శుద్ధాంతరంగమూర్తి
మోముపై మందహాసంబు మోసులెత్తఁ
దక్షణంబ నాముందఁ బ్రత్యక్షమయ్యె.

వ. వయోవృద్ధుండును, గుణప్రవృద్ధుండును, ప్రబుద్ధుండును, సంకల్ప సిద్ధుండును, అనుకంపాబద్ధుండును నగు వీణావాదన విశారదుం డగు నారదునకు నమస్కారంబుఁజేసి, నా వచ్చిన కార్యంబు విన్పింప, నారదుం డర్ధనిమీలితాక్షుండై యిట్లనియె—

## నారదసూతర్షి సంవాదము

కం. అదె! కంటివె! మందాకిని
యిదె! త్రిదివక్షోణి వీరలెల్లరు సురల
ల్లదె! నందన వనవాటిక
యిదె స్వర్గమని పలుకఁబడియెఁ బురాణములన్.

సీ. పక్ష్మముల్ కుఱుచలై పనుపడఁ బరులకు
గనుఱెప్పలార్పుట గానరామి
ఇవముచే రేఁ బవ లివతళించుటచేతఁ
జెమట చిత్తడి దరిఁజేరరామి
కూటియెద్దడి మాన్పుకొఱకునై పడుపాట్లు
ముసలితనంబును మూలఁద్రోయ
దృఢగాత్రులగుటచే మృతినొందునందాఁక
వార్ధక్యపదవి చేపడమిచేత

గీ. ననిమిషులనంగ నస్వేదులనఁగ నిర్జ
రు లనఁగఁ ద్రిదశులన యోగరూఢి కెక్కి
స్వర్గలోకౌకసులు పురాణచయమునందు
వాసి కెక్కిరి సర్వప్రపంచములను.

వ. ఇంతియె కాక త్రివిష్టపశబ్దార్థముంబట్టి యింద్రుఁడు ముజ్జగంబుల దొరయని ప్రసిద్ధి వడసెఁగాని బాహుబలంబుచే లోకత్రయంబును జయించికాదు—

కం. అనవిని నేనిటు వాకొని
తిని నారదమౌని! భారతీయులకును స్వ
ర్గ నివాసులకును నేస్తం
బును జుట్టఱికమును రాకపోకలు గలవే?

గీ. ఓ త్రికాలజ్ఞ! ధర్మసంయుక్తచరిత!!
అరసి వచియింపుఁడీ, సురశబ్దార్థమేమొ!
ఎటుల సురలైరొ నాకౌకులెల్లఁ దొల్లి!!
యాతుధానులెట్లైరొ సురారులెల్ల!!!

కం. అసురులనెడి నామంబెటు
లసురవిరోధిచయమునకు లభియించెను దా
పసవర! పుణ్యాజనులు రా
క్షసులన నుతికెక్కి రేమికతమునఁ జెప్పుఁడీ.

వ. అంత దేవర్షిచంద్రుఁడయిన నారదుండు తెలివివారిన మోముతో నన్నుఁ దిలకించి సాభిప్రాయంబగు మందహాసంబుఁ జేసి యిట్లనియె—

చం. బహుశనృశంసుఁడై పరమ పాపపరుండయి పాకవైరి దు
స్సహమగు బ్రహ్మహత్య నెఱి సల్పి పదచ్యుతుఁడైన దేవతల్
"నహి నహి దేవలోకమున నాయకుఁడౌటకు నర్హుఁ" డంచొగిన్
నహుషుని దోడితెచ్చి సురనాథునిజేయుట నీవెఱుంగవే.

సీ. కౌమరుప్రాయమునాఁడు కుంతి భోజునిపుత్రి
సూర్యోపగూహన సుఖము కనదె?
పుత్రార్థి మాద్రి యశ్వులఁబొంది రహి నొక్క
పర్యాయమె కవలఁ బడయలేదె?

మేనకా కనకాంగి మౌని విశ్వామిత్రు
నెట్టన గిరిగీసి నిల్పలేదె ?
పుంజికస్థల యొడల్ పులకరింపఁ బురూర
వుని గూడి ప్రొద్దులు పుచ్చలేదె ?

గీ. దశరథుండును ముచికుంద ధరణివిభుఁడు
దిక్కుమాలిన దేవతల్ దేవురింప
వచ్చి బాసటయై నిలువంగలేదె ?
పాంగెమున్నదే యని యేల ప్రశ్నఁజేయ ?

(గీ.) సురయనంగ మద్యంబు తత్సురను ద్రావి
వినుతి కెక్కిరి సురలను పేరిచేత
సురను నొక్కనాఁడేని మూచూడకున్న
కారణముచే నసురులైరి కడమవారు.

ఆర్తరక్షాపరాయణు లవుటచేత
వాసిఁ గాంచిరి రాక్షసప్రవరు లనఁగ
యాతనా ప్రాణివితతిఁ గాపాడుకతన
యాతుధాను లనంగఁ బ్రఖ్యాతిఁ గనిరి.

(గీ.) అటమటీంద్రును దుండగీం డ్రాచరించు
ధర్మపీడలు దప్పించి ధర్మపరులఁ
బ్రోచువారు గావున నైరి పుణ్యపురుషు
లనుచు నారదుం డాడినయంత నేను.

వ. తెల్లంబోయి పౌరాణికగాథలందు రాక్షసులం గూర్చి కర్ణకఠోరంబులగు కథలు కలవవియెట్లన్న—

ఉ. క్రూర సమీకరంగమునఁగూడి చలంబున దేవదానవుల్
పోర జయాభిలాషలయి పోయి పరాజితులైరి దైత్యుల
వ్వారినిగూర్చి దేవతలు వారక వ్రాసిరబద్ధ సంగతుల్
(గారడిచేయలేని యొకకార్యము కల్గునె లోకమందునన్.)

సీ. గెల్పోటముల నొక్కపోల్పునఁ జూచిన
వృత్రాసురుఁడు తత్త్వవేత్తకాఁడె ?
రణనీతిబద్ధుఁడై ప్రాణముల్ వాసిన
స్వర్ణనేత్రుఁడు నీతిశాలికాఁడె ?
కాపట్య మెఱిఁగియుఁ గాశ్యపి నిచ్చిన
బలిదైత్యుఁడు వదాన్యవరుఁడుకాఁడె ?
సమధీత వేదవిజ్ఞానధనుండైన
విశ్వరూపుఁడు వేదవేత్తకాఁడె ?

గీ న్యాయమగునె వైతండికు లాడుమాట
పాటిసేయుట నీవంటి పండితునకు ?
పక్షపాత భూయిష్ఠమౌ పాతములను
వ్రాసిపెట్టెను దేవతా వందికోటి.

అనిన యనంతరము నారదమౌనీంద్రుకడ సెలవంది, మనోవేగంబున భాగీరథిందాఁటి, కైలాసంబుత్తరించి, హిమవంతంబు నతిక్రమించి, భారత వర్షంబుఁజొచ్చి, నాకై యెదురు చూచుచున్న వాలఖిల్యాదులకు సర్వంబు నివేదించి, యామంత్రణంబు వడసి, యతిజవంబున నా యీ యాశ్రమంబును జేరి యథాస్థితిగా భగవత్కాలక్షేపముం జేయుచుంటినని చెప్పి పిమ్మటి కథ వచియింప నుపక్రమించె—

వే ల్పు ల వ ల స

కాలము మంచిదై విరివిగాఁ దెగఁబండిన పంటపైరులే
చాలవు పొట్టకూటికయి స్వర్గమునందు వసించువారికిన్
నాలుగు రెండుమాసములు నాతముకూడ లభింప దాపయిన్
గూలియు నాలి చేపడదు కొంచెము సైతము చెప్పనేటికిన్.

గీ. ఈతిబాధలు గల్గుచో నింకనేమి
కలదు ? నల్లవో ! గ్రుక్కెఁడు గంజియైన
బొక్కెఁ డన్నమైనను బుట్టఁబోవ దందు
నిట్టినాడికయం దొక్కయేఁడు నందు.

సీ. వేసిన పైరెల్ల మోసులెత్తకమున్నె
సంగోరు తినివేసె జట్టిమిడుత
ఏఁడాదిపొడవున నివతళింపఁగ భూమి
విడివడ్డ సాఁబాలు సుడిసిపోయె
ముక్కారుపంటలు మ్రక్కిపోవఁగ నిట్లు
పట్టెఁడు కలియైనఁ బుట్టదయ్యె
వలిచుట్టఁబెట్టంగ వడగండ్ల కడగండ్లఁ
గడుపు కక్కూర్తియుఁ గడవదయ్యెఁ

గీ. ప్రజల కన్నపానీయముల్ వట్టిపోయెఁ
గంటికిని గూర్కు కఱవయ్యెఁ గానికాల
మరుగుదేరంగఁ గటకటా ! యమరపురిని
దుర్భరంబైన దుర్భిక్ష తొడరినపుడు.

కం. కాపులు పడిగాపు లగుచుఁ
గూపెట్టుచు జేని కొలువుకూటముఁ జొరఁగా
నేపనికై వచ్చితిరని
కాపులఁ బ్రశ్నింపఁ డెంత గామిడి యతఁడో.

గీ. ఎత్తికోళ్ళకు కనికరం బెనయలేదు
మొత్తుకోళ్ళకు మది జాలిఁ బొందలేదు
వేడికోళ్ళకు దయ యుద్భవింపలేదు
ముజ్జగంబుల దొర యెంత ములుచవాఁడొ.

గీ. పలుకరింపని దొరవంకఁ బాఱఁజూచి
మూతి బిగఁబట్టి లోలోన రోఁతపుట్ట
నాదరింపని జేని రాజ్యంబుఁ దొలఁగి
వలసపోవుటే మిగుల సంభావ్యమనుచు.

గీ. వేల్పుజేని దివాణంబు విడచిపెట్టి
వెంటఁ వెఱగంటి మూఁకలబంటు లప్డె
గుసగుసలువోయి యొకచోటఁ గూడి మూ
పట్టుఁబట్టిరి యెటకేని వలసపోవ.

గీ. అంత దేవతానీకమ్మునందుఁ గొన్ని
తెగ లయోనిజప్రభృతులు తెగువఁజేసి
యిళ్లు వాకిళ్లు తెగనమ్మి గొల్లుమనుచు
పనవి యొకసారి నాకంబువంకఁ జూచి.

సీ. తరతరంబులనుండి తనివోవఁగాఁజేయు
సురనిచ్చు చెట్లను సురుగుటెట్లు ?
బెదరించి యందందు బెల్లించుకొనితెచ్చు
హవ్యకవ్యముల బోనాడుటెట్లు ?
మున్నాట యర్వది ప్రొద్దుల ముఱిపించు
పెల్లాటకత్తెల వీడుటెట్లు ?
మందయానలతోడ మందాకిని మునింగి
విహరించుకోర్కెల విడచుటెట్లు ?

గీ. పండువెన్నెల మాపులఁ బాయుటెట్లు ?
గండుకోయిల పాటలఁ గడచుటెట్లు ?
అనుచుఁ గన్నీటిజాలుతో వెనుకతిరిగి
ప్రేలుకాడెడి మోముతో వెడలనెంచి.

ఉ. మూటలు ముల్లెలుం దలలమోపి భరంబునఁ దొట్రుపాటుతో
దోఁటలుదొడ్లనున్ వదలిత్రొక్కిసలాడుచు నంతతేకమై
బాటలఁబట్టి పేరలపువాయఁగఁ బాటలుచొక్కి పాడుచున్
బూఁటలు రోజులున్ నడచిపోయిరి కొండల నేటవాలుగా.

గీ. అమరనది దాఁటి ముదిగొండ నవతరించి
కొంచ ఱేటునటు పరికించి కొట్టకొనకు
భరతవర్షంబు వీక్షించి పట్టపవలె
మెట్టి రాంగిలేయులఁబోలెఁ బొట్టకొఱకు.

గీ. భరతవర్షంబుఁ జొరక యసురు లయోని
జప్రముఖ దేవయోనులు క్షిప్రగతిని
పశ్చిమాశాభిముఖముగాఁ బైనమైరి
కొల్లగొట్టంగ దేశంబు కొల్లయనుచు.

గీ. సింధు గంగానదీ పుణ్యజీవనములఁ
బూఁచికాచిన తరులతాపుంజములను
గలయఁ బరికింప మిఱుమిట్లుగొలుప నంచె
నెలవు లేర్పఱచికొనంగ నిశ్చయించి.

చం. పరమబుభుక్షచే నవసి భారతభూమిని జొచ్చి పిమ్మటన్
సురలను తొంటిపేర్విడచి సూత్న సమాఖ్యను నార్యనామమున్
బిరిగొనువేడ్కఁదాల్చి పిరివీకును మాని క్రమక్రమంబుగా
గురుతర కాయకష్టములకుం దలలొగ్గుచుఁ గీర్తికాములై.

సీ. చిదుగు కంపలనెల్లఁ బొదుపుగా నొకచోటఁ
బెచ్చుగాఁబెట్టి కార్చిచ్చుఁబెట్టి
పొడవుగాఁ బెరిఁగిన నిడుదచెట్టులనెల్ల
గొడ్డళ్ళచేఁ బడఁగొట్టివైచి
ఎండకన్నెఱుఁగక యివతళించెడు నేల
పై నున్న యీరముల్ పాయఁద్రోసి
గుట్టమెట్టలుగాఁగ బిట్టుగాఁ బడియున్న
పలుగురాళ్ళన్నింటిఁ దొలఁగఁబుచ్చి

గీ. భరత భూమండలంబును వాసయోగ్య
మైనదానిగా నొనరించి యచ్చటచట
నార్యు లగ్రహారంబుల నవతరింపఁ
జేయ సమకట్టి యద్భుతామేయశక్తి.

జాంగలముల లాంగలములఁ జక్కఁజేసి
యెక్కలిని మిక్కలి వసించు నిక్కఁజేసి
యార్యకౌమారవర్గంబు కార్యనిరతిఁ
గాత్రగడ్డతోఁ బల్లెలఁ గట్టిరంత.

కం. చిరి తామర కొలనువలెన్
బరిమితిలేకుండ వారు వర్ధిలుచుండన్
సిరిసంపత్తులతోడన్
బెఱవారికిఁ గన్నుఁగుట్టె బెడిదంబగుచున్.

సీ. గండాడుక్రోల్పులిల్ గండరించెడిచోటఁ
గోరాడు నేనుఁగుల్ గూడుచోట
బుసకొట్టు నాగముల్ మసకలాడెడిచోట
గర్జిల్లు సింహముల్ కవియుచోట
అంపిల్లి వృషభముల్ అంకె వైచెడిచోట
మంపిల్లి తోడేళ్ల మరగుచోట
కారుదున్నలుకూడి కసవుమేసెడిచోట
కారుమబ్బులు తొంగి కలియుచోట

గీ. తిండికై వాల్మీకంబులు తిరుగుచోట
వత్సములును బాలురును మహోత్సవమునఁ
బందెములు వైచికొని క్రేళ్ళు వారుచుండ
మూరువల్లెలు తలయెత్తి నొక్కటొకటి.

గీ. అంతకంతకు నీరీతి నార్యసమితి
వర్ధిలఁ గులము పెద్దలు భావిగతులఁ
జాయకట్టులఁ జర్చించి బందుకట్టి
గట్టుదిట్టముల్ చేయుట కర్జమనుచు.

కం. పాత్రులను బిలిచి బ్రహ్మ
క్షత్రియవైశ్యులని యార్యసంఘంబును వ
ర్ణత్రయముగ విభజించుచు
సూత్రించిరి ధర్మకోటి సూరులదయచే.

సీ. నిత్యనైమిత్తిక నియమంబులను దీర్చి
భగవంతుఁ బూజింప బ్రాహ్మణులను
ఖడ్గధారలచేతఁ గంపకోటలఁగట్టి
కాపాడఁ బల్లెల క్షత్రియులను
వాణిజ్య గోపరిపాలన కృషులచే
బండారములనింప వైశ్యవరుల
నియమించి వేర్వేఱ నిర్దిష్ట కార్యముల్
జాగరూకతతోడ జరుపుచుండఁ

గీ. కూటియెద్దడి లేకుండఁ గొన్ని నాళ్లు
సకల సౌభాగ్యగరిమచే సాఁగ "మూఁడు
పూవు లాఱు కాయ"లనిన పోల్కినెగడెఁ
జూచువారికి నోడలెల్ల సొక్కుపుట్ట.

గీ. బ్రాహ్మణుండు వేదపాఠంబు సేయంగ
క్షత్రియుండు రిపులఁ జక్కఁబఱప
వైశ్యవరుఁడు కృషియు వాణిజ్యమునుజేయ
నార్యసమితి యొసగె ననుదినంబు.

గీ. పుట్టి పెరుగుచున్న బొట్టియలకునెల్ల
నూత్న శౌర్యపటిమ నూరిపోసి
కుబుసమూడ్చినట్టి కోడెత్రాచులఁజేసి
పెంచినారు కులము పెద్దలెల్ల.

గీ. మాంత్రికులు విప్రవరు లప్రమత్తులగుచుఁ
జెడని తంత్రంబుఁ జక్కఁగా నడుపుచుండఁ
జుట్టుప్రక్కల వొలమెల్లఁ జుట్టఁబెట్టి
కైవశముఁ జేసికొనినారు క్షత్రవరులు.

కం. దేశం బీవిధముగ పై
దేశిక వీరభటులకు నధీనమయిన నా
క్రోశముతోఁ బరికించి స్వ
దేశజు లారాటపడుచుఁ దికమక లగుచున్.

## ద్రా వి డ యో ధు ల మం త న ము

గీ. రచ్చమ్రానుక్రింద ద్రావిడమన్నీలు
రెడ్డిగములు వైచి గడ్డుదేరి
రెడ్డిగములఁ బిల్చి యొడ్డోలగంబుండి
మాటలాడి రిట్లు మంతనమున.

కం. వింటిమె వింతలు ? నిజముగఁ
గంటిమె యెప్పుడేని యిట్టి కార్యమ్ములఁ ? గూ
ర్చుంటిమె చేతులు ముడుచుక ?
బంటులమని ప్రల్లదీంద్రు పగ్గెల కొట్టన్.

గీ. బొల్లిమొగముమీఁదను నిల్వుబొట్టుఁబెట్టి
రాలురప్పల కెల్లను గేలుమోడ్చి
గంద్రగోళంబుఁ గావించు కల్లరీంద్ర
దౌష్ట్యమును మాన్పకుండుట ధర్మ వగునె ?

కం. దేశము మనయదికాదో !
దేశోద్ధరణంబు భాగధేయముకాదో ! !
దేశవినాశకులగు పై
దేశిక హననంబు మన యదృష్టముకాదో ! ! !

సీ. అవిసితేనెలుచిల్కు నమృతకల్పములైన
పండ్ల నిచ్చెడి వృక్షపంక్తిగల్గి
తమయంతనే క్షీరధారలు గురియించు
పొదుగులుండిన యాల కదుపుగల్గి
తావుల్ గుబుల్కొను పూవుఁదీవెల కప్ప
డంబుల పొదరిండ్ల డంబుగల్గి
తడిసి నాగేటికట్టు దాఁకకుండఁగఁ బండు
బలముగల్గిన మంచి పొలముగల్గి

గీ. యెల్లకాలంబు పోషించె నింతదనుక
"నడుగనిదె యన్నమునుబెట్ట దమ్మ"యైన
ననెడి సామెత వ్యర్థమై చనఁగ నిట్టి
మాతృదేశంబు మనమెట్టు మఱవవచ్చు ?

ఉ. కూళలురేఁగి యాకరణిఁ గూడని కార్యము లాచరించుచున్
బాలలు బాలురున్ బెదరి పాఱఁగ బొబ్బలు పెట్టిపెట్టి గ
గ్గోలొనరించి దేశమును గొద్దియొ గొప్పయొ యాక్రమింప నీ
పోలిక నూరకుంట మనబోంట్లకు ధర్మమె ? రాజకర్మమే ?

గీ. నదురు బెదురులేని నాయఁకులెందఱొ
సొంత నాడు కొఱకు వంతదక్కి
వ్రేటుపడ్డపులుల విధముగాఁ బోరాడ
నేర్చువారు కలరు నిశ్చయముగ.

కం. ఇప్పుడె మనమెల్ల రమును
జప్పుడుగాకుండ వైరి సైన్యముమీఁదన్
గుప్పించి దూఁకి పొడుచుట
తప్పని పని వేఱెలేదు ధర్మంబన్నన్.

గీ. అంపకోలలు పొదినుండి యవలఁబడెను
పదనుచురకత్తు లొరనుండి బయటఁబడెను
మన్ను మిన్నును గానక మన్నెదొరలు
సింగినాద మూఁదుచుఁ గూచి సేసి యపుడు.

ఉ. రక్తము వాఁగులై దెసలఁ రంయిని పారకమున్న క్రూరమై
నక్తములెల్ల రోదన పినద్ధములై గనరాకమున్న యీ
దృక్తతి పోకమున్న మన దేశము ముష్కర శత్రుకోటికిన్
భుక్తమయౌనె? యేమియయిపోయెను నీసుభటాలి యంతయున్?

గీ. ఓసరిలకుండఁ బ్రాణంబు లొడ్డియైనఁ
బీన్గుపెంటలుగాకుండఁ బృధివియెల్ల
మనము స్వాధీనపఱతుమే మార్తురకును?
ననినమాత్రాన సైనికు లదరిపడుచు.

వ. కోలాహలముఁజేయుచు, "శత్రులసదమదించు టొండె ప్రాణంబులను వీడు టొండె" సంభవించుననుచుఁ బంతంబులాడికొనుచుఁ దమ తమ మనికిపట్టులకుంజని, సమధిక సమరోత్సాహంబునఁ గట్టాయితులై —

ఉ. పంబిన కోపవేగమున వైరుల యుక్కడగింప తీవ్ర రో
షంబున బారు టీఘెలును జొకులు కత్తికటారి పిండు వి
ల్లంబులుదాల్చి యెక్కమొగి నందఱు మచ్చరమూని సింహనా
దంబులు చేయుచున్ సమర ధాత్రికిఁ జేరఁగ గుంపు గుంపులై.

గీ. వింటికోపుమీఁద వీరరక్తముఁజల్లి
పలుకవాలునకును బలులుపెట్టి
మూఁగదేవరలకు మ్రొక్కుబడులుదీర్చి
పైనపైరి రిపుల జారసమర.

కం. అంతకుమున్నె రిపు వృ
త్తాంతమెఱిఁగి యార్యులు బహు దర్పముతో ని
శ్చింతమెయిన్ సాయుధులై
పంతముతో వచ్చినారు బవరము సేయన్.

కం. ఒంటరులై సరిసరులై
బంటులు చెలరేఁగి యుభయ పక్షములందున్
గెంటింపఁబడుచు గెంటుచు
బంటింపక వారనేక భంగులఁ బోరన్.

ఉ. గండరగండలై పిఱికి కండ యెకింపుకలేక చండదో
ర్దండగదాప్రహారముల దండుపయింబడి పోరుచుండఁగా
నేండులు పూండులున్ గడచె నింతియకాని జయంబు మాత్రమున్
రెండుకుదుళ్ళవారిని వరింపకపోయె నీఁకేమి చెప్పెదన్.

గీ. అంత భటులెల్ల జర్జరితాంగులగుచుఁ
గాందిశీకులై తాత్కాలికంబు గాఁగ
గలను జాలించి రంతియేకాని పిదపఁ
బెనఁగులాటను క్షణమైన వీడరైరి.

కం. ఓహరి సాహరి పెనఁగియు
మోహరములుదీర్చి యుద్ధభూమి వడంకన్
బాహాబాహిని బోరియు
నోహటిలెను ద్రావిడ సుభటోత్కరమెల్లన్.

కం. వీఁగిన ద్రావిడసైన్యము
బాగుగా వీక్షించి యార్యవాహిను లెంతో
వేగమ వెన్నాడెను నీ
యాగముఁ బరికించి దేశమంతయు బెదరన్.

కం. పిల్లలు ప్రౌఢల్లెఁగలసి
యల్లో నేరేళ్ళనాడి యరిగెడిభాతిన్
జెల్లాచెదరై ద్రావిడు
లల్లాడిరి చెట్టుకొక్కరై యడవులలో.

ఉ. ఒంజలిచేత ద్రావిడులు యుద్ధము మాని విషాదచిత్తులై
వింజముదాఁటి కారు టడవిన్ దలదాఁచుకొనంగఁ జొచ్చుచున్
సంజల దొంగదారులను జాటున మాటున దక్షిణాశకున్
గొంజక క్రొత్తనాడికలకుం జని నిల్చిరి యచ్చటచ్చటన్.

కం. చెంచులుమాత్రము వింజపు
టంచుల విడిపోవలేక యటనే తముఁ బో
షించుకొనుచు డాగి రయో!
పెంచిన దేశంబు విడచిపెట్టఁగఁ దలమే?

గీ. మాన్యతరమైన దేశాభిమానగరిమ
పచ్చినెత్తురుఁ ద్రావెడి పగఱనడుమ
నుసురు లఱచేత నిడికొని మసలుచుండు
చెంచువారలఁజూచి గ్రహించవలయు.

ఉ. నేఁడును వింధ్యపర్వతపు నెత్తములందునఁ జెంచువారు మ
ల్లాడుచు గానవౌదురు, ప్రయత్నములేకయె చింకిగుడ్డలున్
వాఁడి శరంబులున్ బలుక వాలును దాలిచి భీకరంబుగా
గూడెము వీడి, తేనియలకోసము చెట్టులనెక్కి డిగ్గుచున్.

శూద్రులు: శూద్రశబ్దవ్యుత్పత్తి

ఉ. ద్రావిడయోధు లీగతిఁ బరాజితులై చన నార్యసైనికుల్
త్రోవల నడ్డగించి పెఱతోయమువారలనెల్లఁ బట్టి త
జ్జీవములన్ హరించుచు విశృంఖలులై విహరించి రక్కటా!
కేవల దుష్టబుద్ధిఁ దమకించి త్యజించి సమీకధర్మమున్.

గీ. పాఱఁబోతులుఁ బందలు బడుగువారు
బవరమున వికలాంగులై పడినవారు
చేతఁబడఁ బాయకట్టులఁ జేర్చిపెట్టి
రార్యు లానందరసమగ్ను లగుచుఁ బిదప.

కం. సందియమందక కుందక
యందుండిన భటులనెల్ల నావేశముతో
బందెలలోఁ బడఁగొట్టియుఁ
గుందింపఁగ మొదలుపెట్టి కుత్సితు లగుచున్.

గీ. బానసీండ్రుగాఁ గొందఱ బానిసీండ్రు
గాఁగఁ గొందఱ నియమించి కాడుచేసి
కలుషితాజ్ఞాన గాఢాంధకారమునను
ముంప యత్నముల్ చేసిరి తెంపుతోడ.

కం. కులపతియైన వసిష్ఠుఁడు
కులుకుచు శాత్రవులు గోడుఁ గుడుచుటచేతన్
దలపోసి పోసి యీ గతిఁ
బలికెను దనవారితోడ వజ్జరి యగుచున్.

గీ. చేతఁబడినారు పగవారు చేతఁదక్కి
వారి జీవముల్ గొనుటొండె వదలుటొండె
వెట్టిపనియైన మెడకంటఁగట్టుటొండె
మనము నిశ్చయించుట పాడి యనుచుఁ బలుక.

గీ. పడుచుమగవాండ్రు "తమచేతఁ బడిన రిపుల
విడువ ధర్మంబుగాదం"చు నుడువుచుండఁ
దలలు నెఱసిన మంత్రవాదు లిటులనిరి
ఛావి కలగతులనెల్లఁ బారఁజూచి.

సీ. మన కగ్గమైరంచు మా ర్తుర పరికాండ్రఁ
దల కోసివైచుచో దారుణముగఁ
బగతు రింకను బటాపంచలై పోలేదు
మనపైకి రావచ్చు మాపొ రేపొ
మనమిప్పు డొనరించు మారణకర్మంబు
విన్నవా రొడలిపైఁ బ్రీతిఁ దొరఁగి
దగదీరఁ గ్రొన్నెత్రుఁ దెగఁద్రావు కత్తుల
బ్రేటులాడరె మన చేటుమూడ

గీ. వారు సామాన్యులా ? వీరభటులుకారె ?
మన మెఱుంగమే వారి సంహననశక్తి
మంత్ర తంత్రంబులను బిల్కుమార్పవలయుఁ
గాని వేఱుమార్గము కొఱగా దఁటన్న.

కం. అగునగు ననుచు వసిష్ఠుఁడు
పగఱఁ బరిసిపుచ్చవలయు బహుతంత్రములన్
బిగిగలుగు రాజనీతిని
వెగటించు మఱొండు కార్యవిధిచే ననుచున్.

ఉ. నూతనవైఖరిన్ మిగుల నూతనధర్మము లుగ్గడింపఁగా
నాతరి బ్రాహ్మణోత్తముల నందఱికిం బిలిపించి చెప్పఁగా
నాతతశేముషీ విభవ మచ్చుపడన్ దలలూచి వారలున్
గైతవబుద్ధి మాటుపడఁగాఁ దెగవ్రాసిరి ధర్మసూత్రముల్.

కం. నల్లని ద్రావిడచర్మము
తెల్లని తమమేను సోఁకఁ బెగమాయునటం
చుల్లఅములాడి ద్రావిడ
వల్లభులనుగూడఁ దాఁకవలదని రార్యుల్.

కం. తమజాతిలోనఁ గలిసినఁ
దమవర్ణము మాసిపోవుఁ దప్పక యనుచున్
దమకక ద్రావిడజనులను
దమజాతిని జేర్పరైరి తగవని యార్యుల్.

కం. ద్రావిడులలోనఁ బెద్దల
రావించి మతొక్కనాఁడు అచ్చకుఁదగుమై
యీవిధము వసిష్ఠుఁ డనియెఁ
దీవరమును మాటుపుచ్చి తీయనినుడులన్.

కం. మీకున్న యింటిపేరులు
కోకొల్ల వినుటకు సొంపుఁ గూర్పవు పైఁగా
మాకున్ జ్ఞాపకముండవు
మీకిత్తుము మంచిపేరు మేమొకటనుచున్.

పగఱ యింటివరవడంబు వలనఁ గల్గు
దైహికము మానసికమైన దారుణార్తి
ద్రుంగుచుండుటఁ దలపోసి గ్రొవ్వుచేత
శూద్రులను పేరుపెట్టిరి శుద్ధశఠులు.

ఉ. బొత్తిగఁ దాల్మిలేక పొర పొచ్చము లెవ్వియు మానలేక య
త్యుత్తమజాతి సంజనితు లుండిరి ద్రావిడసంఘమందు నాఁ
జిత్తమునందు నొక్కపుడు చింతిలకుండఁగ శూద్రులంచు దు
ర్వృత్తినిమగ్నులై వ్యవహరించిరి దూరముఁ జూడకుండఁగన్.

# ద్వితీయాశ్వాసము

మానవజాతియన్న యభిమానము లే కసమానమైన దు
ర్మానము నూని ద్రావిడుల మానమునెల్ల హరించుకోర్కెమై
మానమునందు నుంత యనుమానము లే కవమానమున్ సదా
మానక హీనమానవ మానముగాఁ జరియించిరార్యులున్.

ఎన్నిగతులను వీలౌనో యన్నిగతుల
మతము పేరిట దుస్తంత్ర మంత్రములను
బ్రధితమూఢులంజేసిరి ద్రావిడులను
వినుము వివరింతు నవియెల్ల విశదముగను.

కం. తిరుమంత్రముఁ జెప్పెదమని
తిరుమంత్రముఁ జెప్పినారు తిన్నగఁ జెవిలో
ధరణీసురులకు మ్రొక్కినఁ
బరమపదము వచ్చునంచుఁ బరలోకమునన్.

చం. చదువులు నేర్పుచో మిగుల జ్ఞానముకల్గి వివేచనంబునున్
గదురును దాన నయ్యదియె కల్గినఁ దాము వచించు నీతి సం
పద తలకెక్కఁ బోదనుచు బ్రాహ్మణవర్యులు ద్రావిడావళిన్
జదువఁగరాదటంచు మఱి శాస్త్రములన్ లిఖియించిరెన్నియో.

గీ. చిఱుతనాఁట నుండియును సంస్కృతముఁ జదివి
నంతఁ దమగుట్టు బయలౌ నటంచు నెంచి
"చదువరాద"ని చెప్పిరి సంస్కృతంబు
నదియె పంచాక్షరీమంత్ర మయ్యెఁదుదకు.

గీ. అన్యులెవరేని సేయరీ యాగడంబు
నేది యిట్టిదికలదె సృష్ట్యాదినుండి?
భాషఁగఱచుటకొక్క స్వత్వంబువలెనె?
చదువ జిజ్ఞాస కల్గినఁ జదువరాదొ!

గీ. "నీతిశాస్త్రంబులఁ బఠించి నిగ్గుఁదీసి
మేముచెప్ప మీ రాలింప మేలుకల్గుఁ
జదువ నష్టకష్టంబులు సంభవించు"
ననుచు మాన్పించిరట్టె విద్యానురక్తి

కం. ద్రావిడకన్యల నార్యులు
వావిరి, చెఱపట్ట ధర్మపద్ధతి యయ్యెన్
గేవల మార్యులకన్నెల
ద్రావిడులు వివాహమాడఁ దప్పైపోయెన్.

గీ. సాఁగుచుండె నేఁడిట్టి యాచారమింకఁ
గేరళమునందు మిగులఁ గేకిసలతోడ
వెక్కసంబుగ నంబూద్రి విప్రులందు
ననుచితంబన్నవా రొక్కరైన లేరు.

గీ. ఇచ్చి పుచ్చుకొనుట కల్గనేని తుల్య
భావ మేర్పడు సుమ్మిరువాఁగులఁ
ననుచు నీయ మానుచుఁ బుచ్చుకొనుట యొకటె
మహితధర్మ మనిరి నేఁటి మాధ్వులట్ల.

గీ. గుడులలోనికిఁ బోవుటఁ గూడదనిరి
బడులలోనికిఁ బోవుట పాపమనిరి
మడులఁ గట్టుకొను టధర్మమార్గమనిరి
చటుల దుస్తంత్ర వైదగ్ధ్యసార మౌర!

గీ. ప్రజల న పలపింపఁగఁ గైతవంబుచేత
స్మృతుల వ్రాయించినారు పండితులచేత
ద్రావిడులు మ్లేచ్ఛజాతివారలని; కలదె
పాపపరిహార మిటువంటి వంచకులకు?

కం. చింతాలేశము లేకయె
యంతఃకరణప్రవృత్తి నావల నిడుచున్
సంతోషముతోఁ దెగఁబడి
యెంతెంతలు చేసినార లేమివచింతున్ ?

ఉ. ఈవగఁ గుత్సితాత్ములయి యెంతయు ద్రావిడమానసంబునున్
నోవఁగఁజేసి యార్యులు మనోరథసిద్ధిని బొందలేక తా
మేనగనేని తంత్రము వహించుచు వారల స్థూలదేహముల్
బోవఁగఁజేయఁగా మనసుపుట్టినఁ బట్టనిగట్టి కిన్కతో.

ఉ. ఆర్యనవోథలంగొని యనార్యులు పెండిలియాడ వర్ణసాం
కర్యముకల్గి యున్నతి కగావికలౌనని దూరదృష్టిచే
నార్యసభాపతుల్ స్మృతులయందున వ్రాసిరి ద్రావిడాళి త
త్కార్య మొనర్చినన్ గఠిన దండనలం బొరిపుత్తుమం చొగిన్.

ఒక్కయధర్మమున్ సలుపకుండఁ బరావర్తిని గోరకుండఁ గొం
డొక్కవిధంబునన్ జెమటయోడ్చి ధనంబును గూడఁబెట్ట నా
యొక్కము ద్రావిడప్రజకు ముచ్చిలియో బలవంతపెట్టియో
దక్కకయుండఁ జేయుటయె ధర్మమటంచు వచించిరార్యులున్.

అంగద చిచ్చునార్చుకొనన్నైన ననార్యులు పట్టెఁడేనియున్
బొంగలి ముట్టఁగూడ దొకపూటయుఁ జక్కని బట్టకట్ట రా
దెంగిలికూడు సాపడియె యెప్పుడు తప్పక వెట్టిఁజేయుచున్
గింగిరిపాతఁ గట్టుకొని కిట్టుటె ధర్మమటందు రార్యులున్.

జాత్యభిమాన దుర్విషయసక్త మనంబునఁ గ్రూరకర్ములై
సత్యము ధర్మమున్ వగలి శత్రుల రాయుటె కర్జమంచుఁ బా
తిత్యము మూటఁగట్టికొని త్రిక్కక యార్యులు మంత్రతంత్రదౌ
ర్గత్య నిమగ్నులై తలపరానివి కానివి చేసి రెన్నియో !

మ. కౌమరుంబ్రాయపు కండకావరమునన్ గోవాంధ్రు దుర్ధర్షులై
భ్రమచే ద్రావిడకన్యకానివహ లావణ్యంబునంజొక్కి డం
బముతోడన్ జెఱపట్టినన్ స్మృతులహో ! పల్లెత్తుమాటైన ధ
ర్మము కాదంచును జెప్పనేరవుకదా ! మర్యాదబద్ధంబులై.

ఉ. ఎల్లర దొడ్ల పెంట భుజియించెడి జంతువులెన్నియేని న
ట్టిల్లను జొచ్చుచున్న నెవ రేమనరార్యులు, కాని జంకుతో
మెల్లఁగ ద్రావిడుల్ గడప మెట్టినమాత్ర కషాయతాక్షులై
గొల్లునఁ దిట్టిపోసెదరు కూడదటంచు వచించునే స్మృతుల్ ?

సీ. కోయ నయితికాని తీయ మామిడిపండ్లఁ
జేతికందిచ్చెడి చెట్లనడుమ
జడివానకైనను దడియకుండఁగనుంచు
ముండ్లుగల్గని పొద రిండ్లనడుమ
మోరలుపైకెత్తి పుల్లావుపెయ్యలు
క్రేళ్లువారెడి పచ్చి బీళ్ళనడుమ
ఎండకారుననైన నెండిపోవని తేట
కొండవ్రంతలకొండ కోననడుమ

గీ. విరుల క్రొందావిఁ జిల్కు పయ్యెరలుగ్రోలఁ
బాటుటాకులపాక లేర్పఱచికొనుచుఁ
నందుఁ దలదాఁచికొను ద్రావిడాళి నెల్ల
వానరులటంచు నార్యులు వదరినారు.

గీ. గడుసు రాయబారములెట్లు నడపఁగలరు ?
కడలి కానకట్టలనెట్లు కట్టఁగలరు ?
కాసెపనినేర్చి యిండ్లెట్లు కట్టఁగలరు ?
వానరులెయైన ద్రావిడ ప్రజలు చెపుమ.

గీ. అగ్నిసాక్షి ప్రమాణంబు లాచరించి
వ్రేల్మడచి పరుల్ తప్పుఁ జూపింపరాని
రీతిగా నెట్టువారు వర్తింపఁగలరు?
వానరులెయైన ద్రావిడ ప్రజలు చెప్పుమ.

గీ. ఎదురు చెప్పఁగ నేర్చువా రెదుటలేమి
బెదరు నదురు లేకుండ ద్రావిడులఁగూర్చి
నీచ వాక్యంబులను వ్రాయ నేర్చినారు
బడుగు పెద్దలు గంటంబు పదనుచెడఁగ.

ఉ. కాఱియలందఁగాఁ బురుషకారము వ్యర్థమయైన ధైర్యమున్
జారఁగనీక ద్రావిడులు సాధుమృగంబులపోల్కి నెట్టి ధి
క్కారమునైన నెట్టి యపకారమునైన సహించి నీరసా
కారముతోడ నుండిరి వికారములేకిటు లుత్తరంబునన్.

కం. భగ్నమనోరథులై యు
ద్విగ్న మనస్కులయి ద్రవిడ వీరవరేణ్యుల్
ఖుగ్నులయి దాస్యపంక ని
మగ్నులగుచు నుండిరి యవమానక్షములై.

గీ. మంచికాలంబునకు వేచి పొంచి పొంచి
యార్య మందిరంబులయందు నణఁగి మణఁగి
చివికిపోయిన మనసుతో నవసి నవసి
యుత్తరాదిని ద్రావిడు లున్నయంత.

ఉ. దక్షిణభూమికిం జనిన ద్రావిడు లద్భుత శక్తిమంతులై
దీక్షవహించి దానిని స్వదేశముగాఁ దలపోసి దక్షులై
యాక్షితి నిండ్లుగట్టుకొని యందె వసించి క్రమక్రమంబుగా
నక్షయమైన వైభవము నందిరి వందురు మాని యందఱున్.

గీ. పంటకాల్వ లయ్యెను గొండవాగులెల్లఁ
బంటపొలము లయ్యెను జౌటిపడియలెల్లఁ
బంటపైరులు తలయెత్తె గంటలోనఁ
బంటకాపు చల్లనిచేయి పడినమాత్ర.

కం. దక్షిణ దిగ్భాగమున సు
శిక్షితులై ద్రావిడకుల శేఖరతతి ధ
ర్మక్షయమెది లేకుండఁగ
రక్షింపుచు బీదసాద రైతుల నెల్లన్.

ఉ. రాజ్యములం గడించి సమరస్థలి శత్రులఁ బిల్కుమార్చి త
ద్రాజ్యములన్ హరించకయె రాజ్యములన్ దొలిరాజులేల సా
మ్రాజ్య పదాధి రూఢులయి ద్రావిడ భూపతివర్గ మెంతయో
ప్రాజ్యముగాఁగ నేలి జనరంజనఁజేసెను దక్షిణంబునన్.

ఉ. బూవము బంతిపెట్టి రిపు భూభుజ సంతతికిన్ సరస్వతీ
దేవికి నాట్యరంగముగ దేశమునుం బొనరించి లక్ష్మికిన్
స్థావరమొక్క యేర్పఱచి చక్కఁగ సర్వకకుబ్విర్కీర్ణ తే
జోవిభవంబుచేతఁ బరిశుద్ధులు సిద్ధులునైరి భూవరుల్.

భారతయుద్ధమందుఁ గురుపాండవసైన్యము రాజ్యకాంక్షచేఁ
బోరఁగ నిల్వఁగా సమరభూమి పరాజిత వైరివీర పృ
థ్వీ రమణుండు పాండ్యుఁ డతిధీరుఁడు ద్రావిడ భూమిభర్త శూ
రారికులంబునెల్లఁ దెగటార్చఁడె ధర్మజ పక్షపాతియై.

సీ. వింధ్యదక్షిణభాగవిశ్వంభరను నొక్క
గొడుగుక్రిందికిఁదెచ్చి విడచినారు
కాకిచేఁ గబురంపి కప్పముల్ దెప్పించి
కొని వైరి కభయంబుఁ గూర్చినారు

దానధర్మశ్రేణి యూనంబుగాకుండ
బండారముల వెళ్లిపఱచినారు
దండెత్తివచ్చిన మండలేశులనెల్లఁ
బూరిమేసెడిదాఁకఁ బొడిచినారు.

గీ. సరిగఁ బాలించి దుష్టశిక్షణము శిష్ట
రక్షణముఁజేసిరి ప్రజానురంజకముగ
రాజమాత్రులే ద్రావిడప్రభువులెల్ల,
నిఖిలలోకైక కల్యాణ నిలయులైరి.

సీ. క్రమముగా వంశ పారంపర్యముగవచ్చు
నాచారములను గాపాడినారు
ఉత్పన్నదశఁ బొందకుండ నెల్లప్పుడు
శృంగారకళలఁ బోషించినారు
కాటకంబులనెల్ల బూటకంబులుచేసి
సీమలన్నింటి రక్షించినారు
దొంగదొద్దడికాండ్రఁ దూలించి రాష్ట్రింబు
లెద్దడిలేకుండ దిద్దినారు

గీ. ఆలగోలును గగ్గోలు బాలగోలు
కంటఁబడకుండ భూములఁ గాచినారు
రాజమాత్రులే ద్రావిడ ప్రభువులెల్ల
నిఖిలలోకైక కాల్యాణ నిలయులైరి.

సీ. అన్నమో రామచంద్రా ! యంచు నారాట
పడి యంగలార్చెడి వారులేరు
చినిఁగిపోయిన చీరచెఱఁగొక్కటియు లేక
ప్రాతకై యర్థించు వారులేరు

దినవెచ్చమునకునై దేవులాడుచును గ
వ్వయుఁగూడ యాచించు వారులేరు
చేసాచి యడిగిన సీ లేదు పొమ్మంచు
బదరించి మాటాడు వారులేరు

గీ. ద్రవిడరాష్ట్రములందెల్ల నవిటి చెవిటి
గూని గ్రుడ్డివారొకరైనఁ గానరారు
రాజమాత్రులే ద్రావిడ ప్రభువులెల్ల
నిఖిలలోకైక కల్యాణ నిలయులైరి.

గీ. గుడులఁ గట్టించి గోపుర కోటితోడ
మంచి మడిమాన్యములు సమర్పించి యధిక
పైవభక్తిఁ జూపించిరి దేవళముల
ద్రవిణమంతయు వెచ్చించి ద్రవిడనృపులు.

గీ. బాటసారులు నిలువంగ బాటకడల
వేసి పెంచిన తోఁటలు విసుఁగులేక
నీడనిచ్చుచునున్నవి నేఁడుకూడ
"వనము తోఁటలు" దక్షిణా పథమునందు.

ఉ. కాలవశంబునన్ ద్రవిడ ఖండము సర్వము ఛిన్నభిన్నమై
వ్రీలిన భిన్నరాష్ట్రములు భిన్నకులంబులు నుద్భవించెఁ ద
న్మూలమునన్ బురాతన సమున్నతి కోల్పడిపోయి పిమ్మటన్
జాలఁ గృశించెఁ గందువడె శాత్రవులుం దలలెత్త వెంఁడియున్.

గీ. అబ్బురపు గాలపైపరిత్యంబుచేత
రాష్ట్రములు చీలిపోయిన రాజులెల్లఁ
జెదరి నలుదిక్కులకు నేగిచిన్నచిన్న
సీమలార్జించి దొరతెరి సేఁగిలేక.

దేశకాల పాత్రంబులవలనఁ గల్గిన పెక్కు మార్పులచే నా యా సీమలకునేగిన ద్రావిడులు, నూతనాచారంబులు పట్టువడుటచే భిన్ననామరూపంబులందాల్చి విజృంభించి, పదంపడి దక్షిణాపథమును మరల దక్కొఁజేసికొని, వివిధ రాజవంశంబుల పేరిట, నిష్కంటకంబుగా మహావైభవముతోఁ బరిపాలించిరి. కాలాను రూపంబునఁ గల్గిన యీ పరిణామదశను నానుపూర్వికగ వర్ణించుట సుకరంబుగా దయినను, నానేర్చినకొలఁది పెద్దలవలన యెఱింగిన కొలఁది యెఱింగింతు నాలింపుము. ద్రావిడులు విజ్ఞోద్దై తమిళులు, తెలుఁగులు, కన్నడులు, మలయాళులు మొదలగు జాతులుగఁ జీలి, దక్షిణాపథంబు నాల్గు చెఱఁగుల నాక్రమించి, వేర్వేరు నాగరికతయు భాషయుఁ బ్రతిభయుఁ గలుగఁ గట్టుమాఱఁ జిరకాలం బరిష్టంబులేకుండ నేలుచుండ —

ఐక్యముతోడఁ బంచజను లందఱు హాయిగనుండఁ జోళ చా
లుక్యముఖాది భూమిపతులున్ భువినేలిరి కొంతకాలమే
జోక్యముకల్గనీక గుణశోభితులై నయపక్షపాతికిన్
శక్యముకాని యట్టిపని సంభవమాౌనె జగత్త్రియంబునన్.

వారు కాలగోచరులైరి వారిపిదప
దేశ మల్లకల్లోలమై దిక్కులేమిఁ
గాఱుచీకట్లు దిశలెల్లఁ గ్రమ్మికొనఁగఁ
బ్రజలు కళవళించి రుపద్రవములచేత.

తమిళ కేరళ తులువ రాష్ట్రముల పూర్వ
పుణ్య పరిపాకమునఁజేసి పొసరించి
రచట నాయర్లు వెళ్ళాలు నతుల శౌర్య
విదిత కీర్తి భాసితులైన మొదలియార్లు.

తెలుఁగుదేశంబునందు దేదీప్యమాన
శక్తి రాజ్యంబుఁజేసిరి సారభుజులు
వెలమ మన్నీలు రెడ్డి హంవీరవరులు
కాపు సరదార్లు నాయకుల్ కమ్మదొరలు.

సీ. విక్రమావష్టంభ విభవాతిరేకులై
విదళించి కొట్టిరి వెలమదొరలు
సమర శౌర్యాటోప చండ ప్రచండులై
క్రవ్వించి నెట్టిరి కమ్మదొరలు
నిర్ణిద్ర దోస్సార నిర్భిన్న వైరులై
రెట్టించి మెట్టిరి రెడ్డిదొరలు
వైరి భీకర ఖడ్గపాండితీదక్షులై
కదియించి దట్టిరి కాపుదొరలు

గీ. శాత్రవానీక మీరీతి సమసిపోవ
దుర్భరావగ్రహ విపత్తి తొలఁగిపోవఁ
బ్రజలు బ్రదికిరి తస్కరభయములేక
తెలుఁగు దొరలేలు మాగాని పొలములందు.

గీ. వర్తమానంబుననుఁగూడఁ గీర్తిధనులు
వెల్గుచున్నారు పైవారు తెల్గుదేశ
మందుఁ బెట్టి పోషించెడు నట్టిశక్తి
నంగరంగ వైభవముల నంగవించి.

గీ. ఒక్కగతి పులి మేకయు నొక్కతేవు
నందు నీరుఁ ద్రావెడునట్టు లధికశక్తి
న్యాయభావంబుతో దక్షిణాపథంబు
నెల్ల ద్రావిడరాజన్యు లేలుచుండ.

ఉత్తరంబున నార్యు లుద్వృత్తినపుడు
చతురుపాయంబులఁ బ్రయోగచతురులగుచు
శత్రుకాండీరులనునెల్ల సదమదించి
దక్షిణాపథమ్ముఁ జయింపఁ దలఁచి తలఁచి.

గీ. సర్వతంత్ర స్వతంత్రుండు శ్రద్ధదానఁ
డింగితజ్ఞుండు వేద వేదాంగవేది
యగు నగస్త్యుని బిలిపించి యప్పుడపుడె
చెప్పిరిటు పల్కి నయగార మొప్పుచుండ.

ఉ. తెక్కలి నిన్న మొన్న పరదేశమునుండి బిరానవచ్చినా
మెక్కడఁ జూచినన్ రిపు లదేపనిగా మనచుట్టుమూఁగి తా
ముక్కడగింపనుండి రెటులో యొకదారిని నుత్తరాదినిన్
గక్కసపెట్టి వైరులను గాపురముంటిమి కత్తిబల్మిచే.

కం. మనచే నోడింపఁబడిన
మనవైరులు దక్షిణమున మనలుచునుండన్
మన కబ్బఁగలదె క్షేమము
మనఁగలమే చిక్కులేక మనమిచ్చోటన్.

గీ. శత్రుపరిశేష మెటువంటి సాహసునకుఁ
బ్రాణహానికరంబని రాజనీతి
కోవిదులు పల్కుచుందురు గునియకుండఁ
గాన మనమది పాటింపఁ గర్జమౌను.

చం. కతిపయ శిష్యులుం గొలువఁగాఁ బయనంబయి యిప్డె వింధ్యప
ర్వత వనభూములంగడచి ద్రావిడదేశముఁజొచ్చి యచ్చటన్
బ్రతివసథంబునన్ విడిసి వారలకుం దలలోని నాల్కవై
మతమును బోధసేయు మిష మర్మముతో నటియించి పిమ్మటన్.

కం. భేదోపాయముచేతన్
భేదము పుట్టించి మిగుల భేదజ్ఞుఁడవై
వాదులతో మూదలతోఁ
గాదనకొప్పించి తీర్పఁగదె మన పనులన్.

గీ. ప్రజ్ఞచేత దివ్యమగు సుపజ్ఞచేత
లోకవృత్తం బెఱుఁగజాలు మీకు ధర్మ
ములుపదేశించు పాటివారలము కాము
గాని చెప్పుచుంటిమి యని యైన వినుఁడు.

గీ. బెరసిమాటాడఁ బోకు మీ పరులతోడ
నరసిసాగింపు తంత్ర మాదరముతోడ
మురిసి కిటుకేమి చెప్పకు మొరులతోడ
నిరసియైనఁ బట్టినపట్టు నెల్లఁదీర్పు.

గీ. దేశకాలపాత్రంబుల దీర్ఘదృష్టి
నఖముఖంబులఁ బరికించి నిఖిలగతుల
విప్రకారంబుఁ దగపైఁచి వేచియుండి
మంచికాలంబున విరోధి నొంచవలయు.

ఉ. ఎట్టులనేని సంఘహితమే పరమార్థమటంచు నెంచి యి
వ్వట్టున గట్టిపట్టుదలఁ బైకొని మేలొనరింపు దాన నీ
పుట్టువు సార్థకంబగును బ్రొద్దులుపుచ్చఁగవచ్చు హాయిగా
రట్టడిలేని రాష్ట్రముల నంపిలుచుండఁగఁ బిన్నపాపలున్.

వ. అని యీరీతిఁ జదువు సాములు నేర్చిన కులము సాములు నచ్చఁజెప్పి, మున్నడి దీవించి, యగస్త్యునిఁ బ్రయాణోన్ముఖుంజేయ నతండును వల్లెయని, పైశమ శిష్యపరివృతుండై, యత్యుత్సాహంబునఁ బయనంబై, వింధ్య పర్వతంబు నిర్గమించి, తద్దక్షిణదిశాభాగ పరివ్యాప్తంబగు కీకారణ్యంబుఁ బ్రవేశించి, వాసయోగ్యంబులగు పొలముల నెమకి, జలతృణకాష్ఠ ఫలవృక్ష సమృద్ధంబగు ప్రదేశంబులయందు మునిపల్లెలు గట్టుకొని, జన్నితొఱ్ఱుపట్టుల నేర్పఱచికొని, పెద్దరులగు శిష్యులంగూర్చికొని, ద్రావిడజనపదంబులకుఁబంపి, విచ్చలవిడి వేదాంతంబు బోధింపించి, పూర్వాచారంబులఁ దెగడి, వెగటు పుట్టించి, తర్కపాండితీ మహిమంబు వెలయ, వితండవాదంబుఁగావించి, పూర్వాపరసందర్భముల మఱపించి, ద్రావిడ సంఘంబునుండి జాతిద్రోహాల

గీ. ఆమె ద్రవిడరాజేంద్రు నర్ధాంగలక్ష్మి
నిండుచూలాలు మనము మన్నింపవలయు
విడువు విడువుము మరుమాట నుడువకుండఁ
గీడుమూఁడు నీదేవేరి వీడకున్న. 36

చం. పొడవడగింపఁగల్గు నినుఁ బోలెడి వీరులు వేయిమంది దుం
దుడుకున నెత్తివచ్చినను దోర్బలభీముఁడు ద్రావిడేంద్రుఁ డొ
క్కఁడు మగబీరమున్ గడిమి కల్గిన పోటరి వానిదేవి ని
ప్పుడు చెఱఁ బట్టినన్ సుడిసి పోదువు నా పలు కాలకింపుమీ. 37

గీ. మొదలె సత్వసంపన్నుఁడు పిదప ఘోర
తపముఁజేసి వచ్చుచునుండె దర్పఘనుఁడు
దైవసాహాయ్యమును బొంది తప్పకుండఁ
జెనకఁబోకు మాతనిసాధ్విఁ జెనఁటి వగుచు. 38

వ. ఈమాట లాలించి మహేంద్రుఁడు తాఁ జేసినకార్యంబునకు లజ్జించినవాఁడుం బోలె నటించుచు నా సాధ్వీ వతంసంబునుడించి, నారదునివద్ద సెలవుం బుచ్చికొని మగుడ, నారదుఁడు లీలావతీదేవి నుద్దేశించి యాదరంబున— 39

కం. అల్లదె ! పర్ణకుటీరము
తల్లీ ! యిక్కడకుఁ జాల దగ్గర నుండెన్
మెల్లఁగఁ బోదము రమ్మా !
యుల్లాసముతోడ నందు నుండఁగవచ్చున్. 40

గీ. పోతుటీఁగైనఁ జొరరాదు పుండలించి
నేను గీసిన గిరి దాఁటి నెగ్గరాదు
పుణ్యవతి నీవు కాలంబుఁ బుచ్చవచ్చు
భర్త వచ్చునందాఁక నీ పర్ణశాల. 41

కం. మణిమంత్రౌషధ శక్తిన్
గుణమణి ! నీభక్తనివహమునకుఁ జెప్పెద నే
నణిమాదిసిద్ధు లిచ్చెద
నణుమాత్రము నీకు సందియము వలదమ్మా !

కం. అని కపటోపాయంబున
వినయం బుట్టిపడఁ జెప్పి విబుధర్షి వెసన్
గొనిచనెఁ గాంతామణినిన్
దనపరకుటీరమునకు దగరదారిన్.

వ. విలక్షణలక్షితంబయి, లీలావతీదేవి కందోయికి విస్మయ జనకంబుగా నున్న యేతత్పర్ణశాల నుపలక్షించి, సంశయగ్రస్తయై— 44

గీ. మౌనిశేఖరుతోఁ గూడి మౌనమూని
మానినీమణి కలవరమాని గుండె
కొట్టుకొన నడుగులు లెక్కపెట్టుకొనుచుఁ
గడఁకతోఁ జొచ్చె మునిపల్లె గడపదాఁటి.

సీ. ఆఱిపోవకయున్న యగ్నిహోత్రము లేదు
యజ్ఞవైచికి యొక్కఁడైన లేడు
నీ వారబలు లిచ్చు నిష్ఠాపరుఁడు లేఁడు
వటువాతనే లేచు వడుగు లేఁడు
జపతపంబులు సల్పు ఛాత్రుఁ డొక్కఁడు లేఁడు
పితృయజ్ఞము నొనర్చు నతఁడు లేఁడు
నైమిత్తికముఁ దీర్చు నైష్ఠికుండును లేఁడు
వేదపాఠముఁ జేయు వేధ లేఁడు

గీ. అతిథివర్యు లభ్యాగతు లసలె లేరు
నారచీరెలు కృష్ణాజినములు లేవు
పెళ్ళుమని మండిపడు రావి పేళ్ళు లేవు
అతివిచిత్రం బహో నారదాశ్రమంబు.

సీ. పనితంపు నెత్తావి పైఁడిదామరతూండ్ల
నారగించెడి రాచ యంచమూఁక
క్రొమ్మావి గోమించు క్రొంజిగురాకు సం
గోరు మెసవు మైన గోరగములు
కంగారుపడకుండఁ జెంగల్వమోక స
గంబుఁ గొఱికి మేయు కన్నెలేళ్లు
పండ్లారఁ గొఱుకుచుఁ బండ్లారగించెడి
కొంటెకోఁణఁగి పండుకోతి పిండు

గీ. దట్టమగు నీడ నిచ్చెడి చెట్టుమీఁదఁ
బ్రాకి పొదరిండ్లఁ గట్టెడి వ్రతతివితతి
కల్గి చివురాకుపందిళ్ల గల్గి యొప్పె
నారదర్షి కుటీరంబు నవ్యశోభ. 47

పుణ్యవతి పుణ్యాజనభర్త పుణ్యఫలము
పతివియోగాగ్ని మఱుఁగుచు వనటఁ "బరుల
పంచ బ్రదుకవలసెఁ దొంటి బామునందు
నెట్టికొఱనోములను నోచి పుట్టినానొ." 48

గీ. అనుచు మాటిమాటికి నుస్సురస్సురనుచుఁ
బ్రాలుమాలిక మ్రొగ్గ నిబ్బరము తగ్గ
నురసి లీలావతీదేవి యొక్కనాఁడు
పండువెన్నెలఁ బవళించి పాలుపోక. 49

ప్రేఁకటప్రొద్దులం దనకు సంభవించిన కడగండ్లమాటఁ దలపోసికొనుచుఁ బూర్వపై భవంబు దలంచికొని పొంగిపొంగి పొరలివచ్చు శోకంబు నాపుకొని లోలోనఁ గుములుచు— 50

సీ. గీర్వాణి వచ్చి వాకిట వేచి యున్నది
యని చెప్ప నూకొట్టు నట్టి యొడుపు
ఇంద్రాణి కబురంప నేమితొందర యంచుఁ
గనుసైఁగతోఁద్రోచి యనుపు సౌరు
మారాణిదూతిక మనవి యొక్కటి తెచ్చె
నని చెప్పఁగా వినీ వినని ఠీవి
శర్వాణి తన్నొక్కసారి రమ్మనెనన్న
వచ్చుచుంటినటంచుఁ బల్కు సొబఁగు

గీ. తలఁచికొనుచు మనస్సులోఁ గలఁతపడుచుఁ
గాలవైపరీత్యమున కక్కజము పడుచు
దిక్కుమాలిన దైవంబు తెచ్చిపెట్టె
నిట్టియిక్కట్టు లౌరౌర ! యేమి తగవు ? 51

కాలునిచిన యూరు కారూరు పురిటిల్లు
పాఱుటాకుటోరపాకపంచ
పురుడు పోయు తల్లి మునిపల్లెలోఁ బుట్టి
యేమి తెలియనట్టి యెడ్డెకత్తె. 5

గీ ఉగ్గుఁ బాలు పోసి యుండరా నాయన్న !
యేడ్వఁబోకు మంచు నేడు పుడిపి
పూలతొట్టిఁ బెట్టి బోరుకాడించుట
యడవిపల్లెఁ బుట్టి నట్టి పడుచు. 53

జోజో యటంచును జోలపాటలు పాడి
పొదిగిళ్ళలో బిడ్డఁ బొదిగిపెట్టి
వినరాని పాటలు వినిపింప విననయ్యొ
దిక్కుమాలిన నాకుఁ దెరువు లేదు

తులలేని బంగారు తూఁగుటుయ్యాలలో
ముందూఁగవలసిన ముద్దుబిడ్డ
కడిమిచెట్టులక్రిందఁ గడిమితోఁ గట్టిన
తీగటుయ్యాలలో నూఁగవలసె

గీ. ద్రవిడరాజన్య రత్న సంస్థగితమైన
పైఁడిగద్దెపైఁ గూర్చుండు వాఁడు నేఁడు
కాడులో మునిపల్లెలో గావురంచు
నేడ్వ నాలించువా రొక్కరేని లేరు. 54

అని యిట్లు చింతించుచు, నింటివేల్పునకు మ్రొక్కులిడుచుఁ, దలఁపులు నలుదెసలకుం జెదరిపోవఁ జేయునది లేక యాయాసపడుచు, నిండుచూలాలి తనంబున దిగులుపడుచు, నాయంతర్వత్ని కన్ను మూఁతపెట్టుచుండ— 55

గీ. మహతి చేఁగొని నారద మౌనివరుఁడు
తరుణ మరుదెంచెనని చెప్పి తారి తారి
నాల్గుదిక్కులు పరికించి నవ్వుకొనుచు
నిట్లు హృదయమ్ములో నిశ్చయించుకొనియె. 56

ఆభిజాత్యము గల్గినయట్టి మాన
వతికి నొకమారు తలకెక్క మతపుఁబిచ్చి
యెట్టి పనియైనఁ బొనరించు నీశునాన
మానవుని వల్లఁగా దామె మనసుఁ ద్రిప్ప. 57

ఉ. కావున నేయుపాయమును గైకొని యైనను మంచిమాట లే
వో ! వినిపించి మావలని కొప్పుగ నామెనుద్రిప్పుటొప్పు, లే
దా విడిపోవు మాపనులు తప్పదు గావున నీమెచేతనే
హావడిఁగూర్తు ద్రావిడుల కంచును నారదమౌని యంతటన్. 58

ఉ. పున్నమ రేయి యాశ్రమము పొంతను మెల్లఁగ సన్నగాలి పే
రెన్నిన సన్నజాజిపొదరిండ్లపయిం బడి వీచుచుండఁగాఁ
గిన్నెరసాని యెల్గుఁగొని కిన్నెర పల్కఁగ సన్నగొంతుతో
విన్నను వొప్పఁ బాట వినిపింపఁ దొడంగె మనోహరంబుగా.

చం. పతియెడఁ బాటుచేఁ గలుగుబాధ విరోధి గృహప్రవాస దు
ర్గతి కలిగింప నేమి యెఱుఁగంగని చిత్తముతోడ నా పతి
వ్రత వినుచుండె నారదుని పాటల నేమరి మెల్లమెల్లఁగా
మతి చెడిపోయె నొక్కగతి మ్రాన్పడిపోవఁగ జీచ్చపాటుతో.

సీ. ఇదె ! మంచిపాట పాడుదు నంచుఁ జెప్పి య
ష్టాక్షరీమంత్రంబు నాలపించు
ఇదె ! గొప్పకథయంచు నింపుగా సొంపుగా
వైష్ణవగాథలన్ వరుసఁబెట్టు
ఇదె ! మేలుసుద్ది చెప్పెదనంచు మురువుతో
నార్యరాజచరిత్ర మట్టె పాడు
ఇదె ! లెస్స బుద్ధి పల్కెద నంచుఁ బ్రావద్ద
ద్రావిడాచారముల్ తడవుచుండు

గీ. కన్ను మూఁతలు పడుచున్న కాంత యపుడు
వినెనొ ! వినలేదొ ! రవ్వంత వీనినెల్ల
నారదుఁడుమాత్ర మట్టె చిర్నగవుతోడఁ
జెలఁగి పాడుచుండెను గొంతు చిరుగునట్లు.

విష్ణుకథలఁ జెప్ప వినరాదు నేనంచుఁ
జెప్ప లేకపోయెఁ జెలియ యపుడు
సంయమీంద్రుఁ డద్ది చక్కఁగాఁ గనిపెట్టి
విష్ణుకథల నెల్ల విప్పి చెప్పె.

గీ. వినఁగ వినఁగ భక్తి విస్ఫారఁజొచ్చెను
దెలియకుండ నుంత దెలియ కపుడు
కడకు నేమి కలదు ? గర్భస్థపిండంబు
మార్పుఁ జెందెఁ దల్లి మార్పుతోడ. 63

కం. తల కెక్కుచుండఁ గ్రమముగఁ
గలవాణికి మౌని బూటకపు నుడువులు వ్యా
కులపా టుడిగి కుతుకమునఁ
గలఁగక యందుండె బేల గావున నటుపై. 64

కం. శుభలగ్నంబున నొక రే
శుభలక్షణలక్షితుండు సూనుం డొకఁడున్
బ్రభవించెఁగదా ద్రవిడ
ప్రభాపహారుం డగుచును బ్రహ్లాదుఁ డనన్. 65

చం. నవనవలాడుచుం బెఱిగి నత్తిసుడుల్ తడబాటు నెన్నడల్
జవజవలాడు మైమెఱుగు చక్కని చామనిచాయ మేనితో
గవగవలాడుచుండ నెసకమ్మున నెంతయుఁ గన్నతల్లి తా
నవిరళమోద మంది తనయా ! యిటురమ్మని పిల్చుచుండెడిన్. 66

ఉ. నారదమౌని శేఖరుఁడు నమ్మక మొప్పఁగఁ గన్నతల్లికిన్
సారెకుఁ జేరఁదీసి యుపచారముఁ జేయుచు విష్ణునామముల్
నేరుపసాఁగె బిడ్డ కవలీలను దల్లి యెఱుంగకుండ వి
స్తారపు వాలకంబునను దన్నొరు లెవ్వరు చూడకుండఁగన్. 67

సీ. ఆరముగ్గిన పండ్ల నారగింతువు రార
చెట్లచాటున కంచుఁ జేర్చుచుండు
మంచిమొల్లలు తెచ్చి మాల గ్రుత్తువ యంచుఁ
బొదరిండ్లదరికిఁ గొంపోవుచుండు

లేఁడిపిల్లలఁ బట్టి యాడింతువా యంచు
దూరదూరమునకుఁ జీరుచుండు
రంగుపుల్గులఁ జూచి పొంగిపోదువె యంచుఁ
గాపుకొమ్మలఁ బట్టి చూపుచుండు

గీ. నారదుండు ప్రహ్లాదునిఁ జీరి యిట్లు
తంత్రములఁ బన్నసాఁగె నుద్దండుఁ డగుచుఁ
గాన నుండుటచే నొరుల్ గానకుండఁ
గడకు లీలావతీదేవి కన్నుఁ బ్రామి.

సీ. శివలింగధారణఁ జేయవే యని తల్లి
బతిమాల మూఁగయై పల్కకుండు
శివదేవునకు మ్రొక్కు జెల్లింపవే యన్న
"ఊఁఊఁ" యటంచుఁ దా నొదిగియుండు
శివదేవు మంత్రంబుఁ జెప్పవే యన్నచోఁ
బేరెత్తి విష్ణునిఁ బిల్చుచుండు
నినుఁబట్టి కొట్టింతు నేనని వచియింప
నుత్తదే యనిచెప్పి యూరకుండు

గీ. ప్రబ్బికోలు మొండితనమ్ము ప్రల్లదనముఁ
జూపుచున్న ప్రహ్లాదునిఁ జూచి తల్లి
మొగము చిట్లించికొనలేదు మొదటికాన్పు
గానఁ గనుబొమ్మ ముడివైవఁ గడఁగలేదు.

ఎన్ని పేరు లుండ వీశున కాతఁ డే
పేరఁ బిలుచుచున్న వినకయున్నె ?
పేరులోన నేమి పెన్నిధి కలదంచుఁ
దిట్టఁబోక సమ్మతించెఁ దల్లి.

కం. నాఁడుఁ దడ యొంటెఁ ఁఁగ
న్నారఁగ రక్షించి మోద మందుచు నుండెన్
దారుణమునఁగఁ బెఱయుంటను
బోరుచు వాకొల్పినాఁడఁ బో పొమ్మనుచున్. 71

కం. ఈగతి నై దేండ్లేగన్
వాగీశు ననుగ్రహంబు వలన వరంబుల్
దాఁ గొని హిరణ్యకశిపుఁడు
దూఁగాడుచు నడిచిపాటుతోఁ జొరి నగరున్. 7

ఉ. వచ్చుచు పాడునుం బెలిసి బగ్గున మండి కషాయతాక్షుఁడై
యచ్చెరు వయ్యె నైవగతి యా మగడీరుచేని వంద నే
నిచ్చట లేనటం చెఱిఁగి యేమిమొగంబున మందిరంబులోఁ
జొచ్చె మదీయసాధ్వి నెపిమాముక యుండఁ బట్టియాప్నెనో. 73

గీ. ద్రవిడరాజసింహంబు పరాభవంబు
నకట సహింయునో నేనాఁ గాని
మగలరాజౌట నాపంచి మగనిఁ బట్టి
తెత్తు మగనాంధ్రు చూడఁగన్నెత్తి వాని. 74

వ. అనుచు నవమానరోషంబునఁ గ్రుద్ధుండై కాల నేలందన్ని— 75

కం. తలచీరఁ జుట్టి చేతన్
దళతలమను కత్తిఁ బట్టి తటుకున సైన్యం
బుల నగరంబుననె నిలిపి
కలకల మాపుచు హిరణ్యకశిపుం డంతన్. 76

చం. కతిపయసాదులం గొని యఖండజవంబున నారదాశ్రమ
ప్రతిసరభూమిఁ జేరి యతివర్యుని నారదుఁ గాంచి వందనం
బతిశయభక్తిఁ జేసి రయమారఁ గుటీరముఁ జొచ్చి వెంటనే
కుతుకముతోడ నందు సుమకోమలిఁ జూచి సరాగచిత్తుఁడై. 77

కం. అవలేపముతో నింద్రుం
డవకాశముఁ జూచికొనుచు నవరోధము లే
కవరోధము దూరి యిటుల
నవమానముఁ జేసె సాధ్వి హంతవ్యుఁ డగున్. 78

ఉ. చూడుము మాపొ ఱేపొ పరిశోషణఁ జేసెద స్వర్గధామమున్
జూడుము మాపొ ఱేపొ కడఁజూడెద భీకరశత్రుసైన్యమున్
జూడుము దేవి ! నాబలము సొంపు విరోధి బలంబుపెంపు నే
నూడనిబాడఁ జేసెద బిడౌజుని నాకులఁబాడు చేసెదన్. 79

వ. హిరణ్యకశిపుం డిటు దేవేరితోఁ బరిభాషంబు నీఁగు కార్యక్రమంబు నివేదించుచుండ 80

కం. చిడిముడిపడు చడుగడుగునఁ
దడబడుచున్ గొణఁగికొనుచుఁ దందఱపడుచున్
మిడిసిపడుచుఁ బ్రహ్లాదుఁడు
వడివడి నడతెంచి తల్లి వంకకు నడువన్. 81

వ. హిరణ్యకశిపుం డానందాశ్రులు చిందుచుండఁ బరవశుండై బాలకుఁ గ్రుచ్చి యెత్తి ముద్దాడుచుఁ జుబుకంబుఁ బుణుకుచుఁ, దడబడు నడలు, బుడిబుడి నుడులు, మంటిఁబ్రుంగిన యొడలు, మురిపెంబు గడలుకొలుప— 82

పుత్రగాత్ర పరిష్వంగ భూరిసుఖము
నందు నోలాడి మఱపుతో నట్టె నిలిచి
కడకుఁ బ్రియురాలితోఁ దన కొడుకుతోడ
వెంటనే పయనం బయి వీడు చొచ్చి. 83

వ. జైత్రయాత్ర చాటించి, ప్రస్థానభేరి వేయించి, మహాసైన్యంబుతోఁ ద్రివిష్టపంబుపై దాడివెడలి, తన్నగరంబువలఁ జుట్టియున్న, మిఱ్ఱు

పల్లెంబులకుఁ బొలంగి, సముద్రప్రదేశంబున దండువిడియించి, కోటకు లగ్గలుపట్టి, యత్యల్పకాలంబున సాధించి, పలుపురు చూచుచుండ, శచీదేవి కట్టెదుట నింద్రునిఁ జెఱఁబట్టి దక్షిణాపథంబునకుం గొనితెచ్చి పెట్టిపని యందు నియోగించి, యతని ముత్తకోళ్ళతోఁ బాటు లీలావతీదేవి చేడికోళ్ళ కరుణార్ద్రచిత్తుఁడై యంగీకరించి, విడిచిపుచ్చి— 84

గీ. అఖిల దిగ్దేశవిజిగీషుఁడై హిరణ్య
కశిపుఁ డై దారుగాదులు కడపిపుచ్చి
పిదప నుడుకు చల్లారఁగా విశ్వమెల్లఁ
జిక్కు బెడఁబాపి రాజ్యంబుఁ జేయుచుండె. 85

వ. ఒక్కనాఁడు రాజకుమారుని విషయమై యోచించి, బాలుని విద్యాప్రసంగమున సంస్కరించుట యుత్తమంబని నిశ్చయించి— 86

పూర్ణముగ నీతిశాస్త్రంబు బోధపడదు
ప్రౌఢమంత్రాంగ మెఱుఁగంగ వలనుపడదు
రాకొమరుఁడు చదువకుండరాదు గానఁ
జదువు నేర్పింతుఁ గొలపుబొజ్జకడ నంచు. 87

పదియేనేఁడులు చెల్లిపోయిన సరే బాల్యంబులం జిక్కి చి-
క్కి దివారాత్రములందు బాలకుఁ డహో క్రీడించుచున్నాఁడదే
చదువుల్ నేర్పనఁగాని పోవదు మనోజాడ్యంబు కాఁబట్టి నేఁ
జదివింపించెదఁ బెద్దయొజ్జలకడన్ శాస్త్రంబు లన్నింటినిన్.

అంచు విచారించి, సకలనీతిశాస్త్ర పారంగతులును, గురాచార్యులును నైన శుక్రాచార్యతనూజు లగు, చండామార్కుల రావించి, కార్యవిషయంబు ముచ్చటించి రాజకుమారుని వారల కప్పగించి, పండితోత్తముంజేసి తోడ్కొని రండని యానతీయ— 89

సీ. మూఁడేండ్లు పోవకమున్నె శుక్రాచార్యుఁ
పట్టి ప్రహ్లాదునిం బట్టి తెచ్చి
ద్రవిడరాజేంద్రు ముందరఁ బెట్టి దీనుఁడై
యిటఁ దెట్టి బిడ్డఁడో యెఱుఁగ
గురుభక్తి గనరాదు సరకు సేయుట లేదు
శిక్షింతుమన్నఁ దాఁ జెడ్డకోతి
వనమెల్లను జెఱచు ననెడి నానుడిరీతిఁ
దోడిబాలురఁ దప్పుత్రోవఁ బెట్టె

గీ. అకట! కులదైవమును దూలనాడఁ జొచ్చె
శివునికథలెల్లఁ బెడచెవిఁ జేర్పఁజొచ్చె
బాలునకు శిక్ష చెప్ప మావల్లఁ గాదు
చతురమతి నీవె యెట్లయిన సాఁకికొనుము. 90

గీ. ఎన్ని చెప్పినఁ దలయూఁచఁ డింతయేని
మాఱు పలుకక తనపని మాత్ర మట్టె
పట్టుఁదలఁ జేయు నిది యేమి పాపమయ్య?
మూఁగవానివి బోధింపఁ బూనుటయ్యె. 91

కం. చదివింపఁగ దొరకొంటిమి
చదివించిన లాభమేమి సమకూడెనొకో!
చదివినయర్థం బెఱుఁగఁడు
చదివింపఁగలేము మేము క్ష్మావర! వీనిన్. 92

కం. చిరకాలార్జిత విద్యను
బరమార్థముతోడఁ జెప్పఁ బఠియింపకయే
మఱుకువతో నుండును భూ
వర వీనిని సాఁకలేము పాలసుఁ డగుటన్. 93

గీ. ద్రవిడజాతి కీతఁడు గుండె తల్లడంబు
విమల రాజవంశమునకు వేరువిత్తు
దేవ ! దీని నెల్ల నెఱింగి దిద్దికొనుము
నీదు తొలికాన్పుబిడ్డను నేర్పుతోడ. 94

ఉ. కావున నీ కుమారకుని గ్రన్ననఁ దెచ్చితి మప్పగింపఁగా
భూవర ! యింకమీఁద సరిపోయినరీతిని దిద్దికొమ్ము, మీ
పావనమైన వంగడపుఁ బర్వుఁ బ్రతిష్ఠను బాఱఁజూచి లో
కావనదీక్ష నేకరణి నైన స్వధర్మము నిర్వహింపుమా. 95

వ. అంచు వచియించి, చండామార్కులు హిరణ్యకశిపునకు హితవుం గఱపి, సెలవుం గైకొని మగిడిపోవ, రాక్షసేశ్వరుండు చింతాక్రాంతచిత్తుండై — 96

గీ. నయము భయ మనయము నయముగా బోధింప
మచ్చరంబు హెచ్చ మానఁ డయ్యె
మొండిపట్టుఁ బట్టె దండనంబునఁ గాని
సాధ్యపడఁ డటంచు సాహసించి. 97

ఉ. వాదన లేటికంచు బలవంతుఁడు తేఁడు కృపం ద్యజించుచున్
గాదిలిపట్టి యంచుఁ గడకంటను జూడక నిష్ఠురక్రియా
పాదనచేత శిక్షఁ బరిపాటి విధింపఁగఁ జీలిపోయెఁ బ్ర
హ్లాదకుమార మాతుల బలంబు చలంబున రెండుపాయలై. 98

గీ. రాచనగరెల్ల నిట్టి దుర్వార్త వినుచు
నట్టుడికినట్టు తుకతుక లాడిపోయె
నార్య లియ్యది కనిపెట్టి యౌర మంచి
తరుణ మాసన్నమయ్యె నీ సరణి ననుచు. 99

గీ. నీతికోవిదుల్ గుమిగూడి నిక్క మెఱిఁగి
దైవగతిచేత గృహములోఁ దారసిలిన
భేదభావంబు నెటులైన విస్తరింపఁ
జేయ సమకట్టి నారదుఁ జీరి చెప్ప. 100

వ. మహేంద్రుని చెఱ విడిపించి తొల్లి లీలావతీదేవిని దన యాశ్రమంబున నుంచికొని యుపచారములు చేసి సంతోషపెట్టుటచే నా మానవతీమతల్లి తన యెడ కనికరించి నిరాటంకముగా నంతఃపురమునకు రాకపోకల కనుమతించిన స్నేహంబుఁ బురస్కరించుకొని కార్యోన్ముఖుం డయి— 101

ఉ. నారదుఁ డొక్కనాఁడు నరనాథకుమారకుఁ జూడవచ్చి దై
వారెడుప్రేమఁ గన్పఱచి యక్కఱమాటలు నాల్గు చెప్పి వే
యారులు కొండెముల్ పలికి యాననిపించి సుతారమొప్పఁగా
దూరని తోఁపకుండ మది దూరని మెత్తని గొట్టుమాటలన్. 102

నీ జనకుండు గర్వమున నిర్జరకోటిని సాధుపాళి రా
రాజునటంచు నుబ్బుచుఁ బరాక్రమలీలఁ గ్రమంబుఁ దప్పి పే
రోజముఁ దూల్చుచుండ నిటు లొప్పరికించుట రాజనీతియే ?
రాజులు లేరె ? మున్నిటుల రాజకముం బొనరించినారలే ? 103

ఉ. యాగము ముక్తినిచ్చునను నాశమెయిం గడు శ్రద్ధతోడ నా
యాగమవేత్త లందఱు ప్రయాసముతో నొనరించుచుండఁగా
యాగము ముక్తినిచ్చునె యథార్థముగా ? నని పాడుచేయు నీ
యాగము నాగడంబు తగునా యొడయుండగువాని కెందునున్ ? 104

కం. బాలుఁడ నే ననఁబోకుము
బాలకునకు మాత్ర ధర్మపద్ధతి వలదా ?
బాలుఁడె ధర్మము నిలుపం
జాలిన దైవంబు మెచ్చి సంతసపడఁడా ?

కం. నే నెటు లీపనిఁ జేసెదఁ
బోనిమ్మని నీవు చెప్పఁబోకుము బాబూ !
వేనకువేలున్నారు మ
హానాయకు లిపుడు నీకు నండఁగ నిల్వన్.

ఉ. తర్కవితర్కముల్ వదలి తండ్రి పురోహితదండనాథ సం
పర్కముచే మహాకఠిన భావముఁ దాలిచి యొక్కతీరుగాఁ
గర్కశుఁడయ్యె దానఁ బ్రజ కష్టము లొందెడుఁ గావునన్ శుభో
దర్కముగాఁగఁ జక్కఁబడు దారిని బోవుట పాడి పుత్రకా! 107

వ. ఇంతియ కాక— 108

ఉ. దేవరహస్య మొండు విను తెల్పెద స్వప్నమునందు సర్వలో
కావనదీక్షితుండు చతురాగమవేద్యుఁడు నాకుఁ దోచి నే
నీవఱ కూరకుంటి నిటు లే నిఁక సైఁప మదీయభక్తునిన్
బావను నిష్ఠురంబయిన బాధలు పెట్టుచు నుండ నెవ్వఁడో. 109

ఉ. కంటకుఁడై ధరావరుఁడు కారియపెట్టిన యప్పుడే సభా
మంటపమందు నున్న యతిమాత్రపు స్తంభమునందు డాఁగి త
న్నంటిన వెంటనే యతని యాయువుఁ దీసెద నాదుభక్తు నే
నొంటరిఁ జేసి పోవ నెటు లూరట గల్గునటంచు నాడెఁగా. 10

ఉ. కత్తులు నూరినంతటనె కంపము నొందరు ధీరు లెందుఁ గిం
చిత్తయినం బ్రమాదపడి సేయ రధర్మము గాన దీని యా
వత్తెఱిఁగించినాఁడ భగవంతుని యిష్టముఁ దెల్పినాఁడ నీ
చిత్తము; ధర్మపాలనము శిష్టసమీహితకార్య మౌఁగదా. 111

ఉ. రక్షకుఁ డొక్కఁ డేనియును రాష్ట్రమునం గనరామి నీ ప్రజల్
రూక్షభయంబునన్ గలఁగి రోజొక యేడుగ నున్న వారు నీ
కక్షయసంపదల్ గలుగు నయ్య ధ్రువంబుగ నార్తులౌ ప్రజా
పక్షముఁబూని పోరునెడ బాగని దైవము మెచ్చుఁ బుత్రకా! 112

ఈగతి నపూర్వ రాజనీతి ప్రకారంబు మెఱయ, నారదుండు బోధించి, యలౌకికుం డయిన ప్రహ్లాదునిచే వల్లె యనిపించుకొని, సూటిగా విశ్వకర్మ మందిరంబుఁ బ్రవేశించి, యెగ్గతంబున మంతనం బాడి నేర్పరులగు పెక్కుర శిల్పుల సమకూర్చి వారికి రహస్యంబుఁ దెల్ప వారును— 113

చం. ఎవరికిఁగూడ శంక ఖటియిల్లని నేర్పున మెల్పుతోడ రేఁ
బవ లనకుండ నారయని పంకము నెగ్గెడుభాతి యుక్తిచేఁ
జివరకుఁ దత్సభాస్థలిని జిక్కని చిక్కని మాటుతల్పులన్
గవిసిన యుక్కుకంబమును గట్టిరి శిల్పకళావిదగ్ధులై.

ఉ. ఆఁకొనియున్న సింగము రహస్యముగాఁ గని పట్టి తెచ్చి యే
పోకలు పోవనీక యొక బోనునఁ బెట్టి యుపాయశాలురై
కైకొని దాని మండపపుఁ గంబమునం దిరికించి పెట్టి తా
మై కనిపెట్టియుండి రెటులొనొకదా ! యని యార్యమాంత్రికుల్

వ. మఱునాఁడు హిరణ్యకశిపుం డాగ్రహోదగ్రుఁడై సభాముఖంబున గద్దెపైఁ గూర్చుండి, గద్దించుచు "విష్ణంచు, విష్ణండని నిరంతరంబు వావిడచి, ప్రలపించు చుంటివి. ఆతం డెక్కడ యదృశ్యుండయి యడంగియుండెనో చూపింతువా" యనఁ బ్రహ్లాదుండు వికసితముఖుండై నిశ్చయముగా "ఇదిగో ! నీ సభామంటప స్తంభంబున నుండె, చూడ నిచ్చగింతువేని చూడవే" యనవుడు సార్వభౌముండు మండిపడి తోకఁద్రొక్కిన మహా నాగంబుకైవడి రోజుచు, గదను బిరబిర సారించుచు గద్దెనుండి దుమికి, సాకం బెఱుఁగక స్తంభంబునకేసి యెదురు నడచి, బ్రహ్మాండంబు బూరటిల్ల సింహనాదంబుజేసి, డాసి యయోమయంబగు దీర్ఘ గదాదండంబు గిరగిరఁ ద్రిప్పి పెళ్ళుమని స్తంభంబు విఱిగి కూల విసరికొట్టెను. కొట్టిన మఱుక్షణంబుననే యదృశ్యంబులగు మఱతల్పులం బడఁద్రోసికొని—

కం. గర్జించుచుఁ బంచాస్యము
నిర్జరరిపుపైకి దుమికి నీరవునింగా
జర్జరితాంగుని జేసెను
ధూర్జటిభక్తునకు నేమి తోఁచకమున్నే.

కం. అంగద నవయుచుఁ జెంగున
సింగము చెలఁతేఁగి గోళ్ళఁ జీల్చుచు తేనిన్
గంగారుగఁ జేసి పిదప
నుంగిడి పుట్టించి వేగ యుసు రెడఁబాపెన్.

ఉ. కొండలు పిండిపిండిగను గొట్టెడి మేల్పడ వాలుదంట క్రుం
ఖాండుఁడు హుంకరించి జ్వలదాతత శాతకృపాణ హస్తుఁడై
గండడగించి సింహమును గాలుని ప్రోలికిఁ బంపె వెంటనే
దండగులెల్ల ప్రాణపడి దూరఁగఁ దొందర సందుగొందులన్

కం. పాతరలాడెను నారదుఁ
డాతరి నుప్పొంగిపోయి యనుకొన్న పనిన్
జాతురితోఁ దీర్చితి నని
చేతం దెగమెఱయుచుండఁ జిటితాళంబుల్.

గీ. అన్నదమ్ము లిర్వురను సింహంబుచేత
నేదుపందిచేఁ గూల్పించి యెగిరిపడుచు
మోదమందె నార్యజనసమూహ మెల్ల
నెల్లభూములఁ దమయాజ్ఞ చెల్లుననుచు.

ఉ. ద్రావిడరాజ్య మంతయును దక్కొనఁజేసిన తత్క్షణంబునన్
ద్రావిడులెల్లఁ బోరెదరు ప్రాణముపైఁ గల తీపి మాని రా
జ్యావనదీక్షఁ బూని సమరాంగణ మెల్లను బీనుపెంటలై
పోవఁగఁ గాన నిప్పు డిది పోలదటంచు మునీంద్రుఁ డంతటన్

గీ. రాజనీతి విరుద్ధమై ప్రాణహానిఁ
జేయు నీకార్య మరయ నిషిద్ధమంచు
నార్యులకుఁ జెప్పి యొప్పించి యవలఁ గార్య
చతురుఁడై దూరదృష్టిచే సకల మెఱిఁగి.

గీ. కీలుబొమ్మ నొండు కీలకమ్మున గద్దె
మీఁద నుంచునెడల మీఁద మేలు;
ఎల్ల లేని నేల యెల్ల నీతనిపేర
నేలవచ్చు పలుక నేల యనుచు.

శా. జాతిద్రోహానిఁ దాతమారకుని వంశభ్రష్టుఁ బ్రహ్లాదునిన్
జేతోమోదముతోడ నార్యజనముల్ సింహాసనారూఢునిం
బ్రాతిం జేసిరి తత్క్షణంబ ద్రవిడ వ్రాతంబు నిర్విణ్ణులై
కాతర్యంబున నేమితోఁచకయె దిగ్భ్రాంతాత్ములై దాఁగఁగన్

అతిమతావేశకలనచే నాదమఱచి
గురువులకు లోఁగి మతిచెడి కులముఁ జెఱిచి
వంశనాశంబుఁ జేసిరి పాపమనక
తల్లిబిడ్డ లొక్కటయి పెంపెల్లఁ బోవ.

ఆకలంబు సాపడు మౌని యైన నేమి?
యాకులంబుఁ జెందినవాసి నందఁ డెందు
నేకలం బీశ్వరునిఁ జేసె నేకలంబు
నాకలంబునకు జోహారు లనకయున్న.

యథార్థ ప్రహ్లాద చరిత్రము

సంపూర్ణము



# యథార్థ రామాయణము

కం. శ్రీరామాయణకృతిలో
మీ రెఱుఁగని భావమొండు మిసుకునె ! కానన్
గారుణికోత్తమ ! చెపుఁడీ
శ్రీరామాయణమునఁ గల చిత్రము లెల్లన్.

ఉ. మార్తుర పేరులం దలలు మాఱిచియున్ దలక్రిందుచేసియున్
నేర్తునటంచు గర్వమున నిక్కి ప్రచేతసుతుండు తెంపునన్
బూర్తిగ రామచంద్రకథ మున్ రచియించెనటంచు బాపురే !
వార్త యొకండు నేఁడు వినవచ్చెడి సత్య మెఱుంగఁబల్కవే.

కం. అనినంతనె సూతమహా
మునిచంద్రుఁడు పల్కెఁ బ్రేమమున నిట్లనుచున్
వెనుకటి గాథలఁ జ్ఞప్తికిఁ
గొనితెచ్చికొనుచు మనంబు కుతుకముఁ జెందన్.

కం. బిడ్డా ! నీసంప్రశ్నము
దొడ్డది; యఖిలంబు చెప్పుదున్ విను మిపుడే
చెడ్డయొ మంచియొ తెలిసిన
గడ్డువిశేషంబు లెల్లఁ గాదనకుండన్.

ఉ. పేరులు మార్చినాఁడు తలపెట్టి దురర్థము రాఁగఁ గొన్నిటిన్
బేరులు మార్చినాఁడు తలపెట్టి యపార్థము రాఁగఁ గొన్నిటన్
బేరులు మార్చి మాఱుతుర పేరు ప్రతిష్ఠను బాడుచేయుచున్
బేరు గడించె నాదికవి పేరు పొగడ్త జగంబు నిండఁగన్.

సీ. 'దసగీవ' యనెడి శబ్దము దశగ్రీవఁ గా
వించి గొంతులు బంతి పెట్టినాఁడు
'రావన్న' యనుపేరు రావణగాఁ జేసి
బొబ్బమానిసి చేసి పోయినాఁడు

'చుప్పనాక'ను దెచ్చి శూర్పణఖం జేసి
చేటగోరులదానిఁ జేసినాఁడు
'రక్కసి' యనుమాట రక్షస్సుగాఁ జేసి
యేమేమొ యర్థముల్ ప్రామినాఁడు

గీ. (లోకసామాన్యకవియె వాల్మీకిమౌని ?)
తలఁకు తెగమార్చినట్టి పదాలనెల్ల
వేటె యొకనాఁడు చెప్పెద వి_స్తరించి
నేఁడు రామాయణాంశముల్ నీకు వినుతు.

## లం కా పు ర వ ర్ణ న ము

సీ. మూఁడు కాలములందుఁ బూచి నెత్తావులం
బొలమెల్ల విరఁజిమ్ము పూలచెట్లు,
ఆకాల మీకాల మేకాల మనకుండఁ
బగటిల్లి తెగకాయు పండ్లచెట్లు,
మిద్దెమేడలకొద్దె నిద్దంపు మెఱుఁగారు
ముద్దుకల్ప నొసంగు మద్దిచెట్లు,
పశుపక్షి మృగకీట వర్గంబునకు నెందు
నిలువ నీడ నొసంగు నిడుదచెట్లు,

గీ. తీగగుంపు, గాటంబుగాఁ గౌఁగిలింప
మిగుల రమణీయమై చూపుమేరవఱకు
ద్రేఁగుద్రేఁగుగాఁ గన్పట్టు విపినభూమి
యిమ్ముకొని యుండు ద్రవిడదేశమ్మునందు.

ఉ. ఓదములన్న లెక్కగొనకుండ మదంబున గుంపుగుంపులై
గాదము మేయుచున్ బసరుగ్రక్కెడి పచ్చనియాకుకొమ్మలన్
బోదెలఁబట్టి తొండముల బోరలగల్చుచు బృంహితంబులన్
వాదములాడుచుం దిరుగు వన్యమదేభ సమూహ మచ్చటన్.

పిడికెడు విత్తనంబులను విత్తినమాత్రన మూఁడుకారులన్
గడుపున చిచ్చుఁబుచ్చుఁగల కమ్మని మేలిమి పంటపైరులన్
పుడుకులనిచ్చి భూప్రజను బోషణఁ జేయుచునుండు నెప్పుడీ
పుడమిని దక్షిణాపథముఁ బోలెడిదేశము వేఱెయున్నదే ! 9

చం. ఋషిజనవాసయోగ్యమయి పుణ్యనదీనదవారిసేవ్యమై
మధురఫలప్రసూన తరు మండలమండిత దివ్యభాగ్యమై
పృథుతర దివ్యభోగ్యమయి వెల్గెడి పూతచరిత్రదక్షిణా
పథమును నంటి దక్షిణపు వైపున దక్షిణవార్ధి యొప్పెడిన్. 10

గీ. నారికేళావనీరుడ్వనంబులందుఁ
గాపురము సేయుచుందు రక్కడి జనంబు
పరమ సంతుష్టులగుచు నొంటరము లేక
పరుల యధికార మెట్టిదో యెఱుఁగఁబోక.

చం. అఱవము, జానుతెల్గు, మలయాళము, కన్నడబాస, కోయ, చెం
చెఱుకల గోండు బాసలకు నెల్లను దొల్లిటిదైన బాసనున్
నెఱిపడి మాటలాడెదరు నీతిదొఱంగక సంచరింపుచున్
బిరుసున మానరక్షణకుఁ బిక్కకు ప్రాణము పూటవెట్టుచున్. 12

ఉ. కో యని యార్చిచూడు మిదిగో ! యని కొంపఱుకీను కత్తితోఁ
గోయఁ బ్రతీపకంఠములఁ గొంకరు జంకరు మానరక్షకై
కోయలు చెంచులున్ దుఱవ కోటులకోటులపోటుమానిసుల్
పాయరు జన్మభూమిఁ దెగవై చెద రన్యులు కాలువెట్టినన్. 13

అంకపడి దక్షిణాంబుధి యంకమందు
లంక, శివలెంక, ప్రతిభాంక లంక వెల్గు
నిత్యనిష్పంక, నిశ్శంక నిష్కళంక
వంక గానరా దావంక వంకవంక. 14

గీ. తొలుత సాలకటంకట కులజులైన
మాల్యవంతుండు మాలి సుమాలి మొదలు
గాఁ గలుగువారు లంకలోఁ గాపురంబు
సలిపి రాజ్యమేలిరి కత్తి బలిమిచేత. 15

నిరంతర పరాజయసంభవావమానంబుచేఁ గుమిలి కుమిలి, విద్వేషులెల్ల
నొక్కటయి, దండెత్తివచ్చి మాలిం జంప మాల్యవంతుండును సుమాలియు
లంకను బాడువెట్టి రసాతలంబునకుం బలాయితులైరి. 16

పాడువారిన లంకను బాడుగుడిపి
జక్కు లందుండ వారలఁ జావమోది
వెడల నడచిరి కోయలు జడుపునుడిగి
వశముఁ గావించుకొని బాహుబలముచేత. 17

కొంచె మించుమించుగ నాలుగువయిపులను
నతివిశాలం బగాధంబు నైన కడలి
యతికి యుండుటచే నారు ఋతువులందు
వాసయోగ్యంబు లంక యెవ్వారికైన. 18

నిడుదమలమీఁద వాటంపు నెత్తమందు
గట్టిగా మూఁడుకొమ్మల నట్టనడుమ
దుర్గమంబుగాఁ గట్టిరి దుర్గమొండు
కాపె పనిఁగన్న లోకంబు కన్నుఁగుట్ట. 19

సీ. అభ్రంకషోత్తుంగ హర్మ్యసౌధంబుల
పసిడిరోచులు దెసల్ ప్రాకులాడ
గోపురప్రాకార కుడ్యరత్నద్యుతుల్
దూఁకి యొండొంటితోఁ ద్రోపులాడ

రథకేతనాంబర ప్రథిత కాంతిచ్ఛటల్
తెంపాఱి మింటిపైఁ దేలియాడ
శింజినీటంకార శృంగారి ఘీంకార
రావంబు లొండొంట రాపులాడ

గీ. బహుళ చతురంగ వాహినుల్ పగ్గెలాడ
మూఁడులోకంబులకు గుండె ముల్లువెలసె
మాట జవదాఁట నేరని పోటుమగల
కాపురంబైన రమ్య లంకాపురంబు.

ఉ. చల్లని పిల్లతెమ్మెరలు సాఁగుచుఁ గమ్మని పూవుతావిలో
మెల్లఁగఁ బొర్లిపొర్లి ఓమ మేనఁ బువుం బొడి మేదుకొంచు న
ల్లల్లన కుంటికుంటి నడయాడుచు నుండఁగ మింటనుండి జా
బిల్లియుఁ గాయఁగాఁదఱపి వెన్నెల హాయిగ నుండు లంకలో.

శా. అంకాపొంకములెల్లఁ జేవదలి యత్యానంద నిర్మగ్నులై
శంకాతంకవిచారదూరులయి యశ్రాంతంబు నాపీట శౌ
ర్యాంకుల్ వాసము చేయుచుందురు సమస్తైశ్వర్యభోగాఢ్యులై
లంకారాజ్య మహావిభూతి గరిమన్ శ్లాఘింపఁగా శక్యమే ?

గీ. వెడఁద ఱొమ్ముగల్గి నిడుద చేతులుగల్గి
మాట యురువుగల్గి నీటుగల్గి
జిద్దు నేర్పుగల్గి చిట్టంటు లంకలో
మానటీఁడులెరి మనుజులెల్ల.

సీ. పదిదిక్కులనుగెల్చి బహు జయస్తంభముల్
పాతి పెట్టించిన బల్లిదుండు
పదిశాస్త్రములుగట్టి పట్టుతోఁ బఠియించి
ప్రజ్ఞాధురీణుఁడౌ పండితుండు

పదునాల్గు లోకముల్ బవరాన నోడించి
కాలిక్రిందను బెట్టు కాలిబంటు
పదియారుకళలఁ బ్రపంచంబుఁ దనియించు
శశిచెంపఁ గొట్టిన సౌమ్యమూర్తి

గీ. కడుపులో చల్ల రవ్వంత కదలకుండ
ద్రవిడ జాత్యభిమాని యథార్థవాది
ప్రాజ్య రాజ్యమేలుచునుండె రావణుండు
దర్పితాహిత లోక విద్రావణుండు.

సీ. పలుగాకి పులుగాకుఁ బొలిపుచ్చి తననాఁడు
చీకాకు పడకుండఁ జేసినాఁడు
గాటంబుగాఁ జెలగాటంబుగాఁ జెల
రేఁగి మార్తురఁ జీల్చి రేఁగినాఁడు
గోపురంపు పురంబు బాపురే ! యన మూఁడు
కొండకొమ్మలమధ్యఁ గూర్చినాఁడు
కలిచేతఁదన్ని యాకలిమాన్పి గిలిమాన్పి
నలిమాన్పి యెల్లర నిలిపినాఁడు

గీ. కుదురునకుఁ బట్టుఁగొమ్మయై కుదిరినాఁడు
నాఁడు తనుఁగొల్వ నొనరించినాఁడు నాఁడు
నదురులేని నాయంకుఁడై నాఁడు నాఁడు
రావణుం డార్యలోక విద్రావణుండు.

లంకాపురీంద్రమే లబ్ధవర్ణనకెంతొ
బడలార్చు బంగారు పడుకటిల్లు
దక్షిణాపథమే విపక్ష పక్షాంతకు
నలరించు పసివారు నాఁకతోఁట

భారతఖండమే బాహాబలాఢ్యుఁ
సవరించి గడితేర్చు సాముగరిడి
ఖండాంతరంబులే గానకళావేది
కరియప్పనములిచ్చు నట్టిపొలము

గీ. ద్రావిడావళి కెవ్వాఁడు జీవగఱ్ఱ
యతఁడు వీరశైవుండు మహాభిమాని
రావణుండు విద్రావితై రావణుండు
గొనబు జాణవా గద్దెపైఁ గొలువుఁదీర్చు.

గీ. కోయవారల నాగరికుల నొనర్చి
చదువు సాములఁ జెప్పించి చక్కఁబఱచి
యాభిజాత్యభావోదయమ్ములవరించె
నవుర! రావణుం డెంత ధన్యాత్ముఁడగును.

గీ. 'అన్నమో రామచంద్రా' యటంచు నేడ్చు
వారయోధ్యలోఁ బెక్కురున్నారు కాని
'యన్నమో రావణప్రభూ' యంచు నేడ్చు
వారు లంకలో నెవరు గన్పట్టరారు.

గీ. కలఁడు తోబుట్టువొక్కఁ డుక్కలుఁడు రావ
ణునకు జగజెట్టి కుంభకర్ణుండు, నిదుర
పోతు చిననాఁడె చౌదంతి పొడుగుకొమ్ము
లొడిసి చేపట్టి యుయ్యాల లూఁగినాఁడు.

గీ. విపుల తంత్రజ్ఞుఁడైన విభీషణుండు
పోకలాఁడు; పెద్ద వదరుబోతు ఖరుఁడు;
మాఱు తమ్ములు చెల్లెలు 'మాటకారి'
శూర్పణఖ యన్నలకు ముద్దుఁ జూపుబిడ్డ.

ఉ. శైవమతాభిమానియగు జంగమదేవర గావునన్ సదా
రావణభూవరుండు తన రాష్ట్రమునందున జీవహింస తా
నేవిధినైన మానుపుటయే మతధర్మమటంచు నెంచి యే
జీవులఁ జంపఁగూడదని చేసెను గట్టడి ధర్మలోలుఁడై.

సీ. గొంతెత్తి తొలుసారి కోడికూయకమున్నె
పురవీధులను నూడ్చి తిరిగిపోవు
పడకమంచమునుంచి పడుచు లేవకమున్నె
మెల్లఁగాఁ గలయంపి చల్లిపోవు
వంటపుట్టియ సిద్ధపడి చేరకయమున్నె
నీళ్ళతోఁ బంతెలు నింపిపోవు
ముంగిళ్ళు సరిచేసి ముగ్గుపెట్టకమున్నె
వెన్నాడి ప్రొయిరాజఁ బెట్టిపోవు

గీ. వాయుదేవుండు మేఘుండు వరుణదేవుఁ
డగ్నిదేవుండు తమయంత నరుగుదెంచి
ప్రాలుమాలక యేప్రొద్దు వరపుడంబుఁ
జేయుచుందురు లంకలో సిగుపడక.

ఉ. పాదులు కూలఁద్రోసి పగవారల పొఁజులఁ బట్టి యొక్కఁడే
బాఁదిగుదించి కట్టికొని వచ్చిన వారును సామియానఁ దా
మోఁదలఁదాల్చి కాదు మరి యౌ ననకుండఁగ నెల్లవేళలన్
జీదర మాటలేక పనిఁ జేయుచునుందురు లంకలోపలన్.

చం. పురుషులతో సమానముగ బోటులు సర్వకళాభిరామలై
గురువులవద్ద విద్దెలను గోరిక నేర్చుటెకాక ఘోర సం
గరమున నస్త్రశస్త్రములఁ గైకొని యేయుట నేర్చియందఱున్
గఱగఱికన్ స్వరాష్ట్రమును గాచెడి పూనిక నుందురెప్పుడున్.

ఇంకని పౌరసేవ యొకటే పరమార్థము నిచ్చునంచుఁ గూ
లంకష పాండితీగరిమ లాభముచేత గ్రహించి మంచితో
లంకిణి పెండ్లిమాని యమలం బతులంబగు బ్రహ్మచర్యమున్
గొంకక స్వీకరించె బుధకోటి "హసాద"నఁ ద్యాగశీలయై. 35

గీ. పొలిసిపోని లంకారాజ్యమునకు నెల్లఁ
జేవఁగల లంకిణీదేవి చేతి కత్తి
వ్రేటు పెట్టని కట్టని కోటయయ్యెఁ 36
గనుగవను మూసి పౌరులు కునుకుచుండ.

ఉ. లంకిణిఁగంచెలన్‌దొడి, విలాసముగాఁ గయిసేసి కాంచికా
కింకిణజాలమున్ మెఱయఁ గింకిరిమార్తుర ప్రాణగొడ్డమౌ
వంకిణి చేతఁబట్టి పరువంబున రేఁబవ లొక్కకై వడిన్
లంకిణి శాత్రవుల్ బెదర లంకను గావలిగాయు నెప్పుడున్. 37

రాజులు లంకపై పునకు రారు భయంబున లంకిణీ రిపూ
ద్వేజకమైన కత్తిఁగని బెక్కుఱి దానను శాంతిభద్రముల్
రాజిలు పౌరపాళి కవురా ! యిది కన్గొని లంకిణింగనన్
లాజలు చల్లుచుండెదరు లంకనుగల్గు పురంధ్రులందఱున్. 38

ఆశ్రమంబులలో గృహస్థాశ్రమంబె
యఖిలజనశిరోధార్యమౌ నంచుఁ దలఁచి
సోకు టిల్లాంధ్ర తలపూస చుప్పనాక 39
చేకొనె గృహస్థధర్మంబు చింతలేక.

గీ. కేలుపట్టిన పెనిమిటి గూల, గోల
దండకావన సీమలోఁ దపముసేయు
నేకసుతుఁ డూతకోలగా నెగ్గతంబ
శూర్పణఖ ప్రొద్దులనుబుచ్చు సుగతిఁగోరి. 40

ఉ. బోటులకెల్ల ధర్మము ప్రబోధముఁజేయుచు జీవహింస బా
హాటముగాఁగ నాపుపనికై విసుమాలకయెల్ల ప్రొద్దులా
మాటలె చెప్పుచుండి మను మార్గమునందున సంచరింపుచున్
దాటక రాజయోగ పరితర్పితయై పురివీడి పిమ్మటన్.

కం. వానప్రస్థము నూనుచు
మానుగఁ దాటకి మహాభిమానవతి యనూ
చానమటంచును దండక
కాననమున సుతులఁగూడి కాపురముండెన్.

వ. ఈగతి స్త్రీ పురుష ప్రభేదంబువలన స్వత్వంబుల యందు వ్యత్యాసంబుఁ
జొరయకుండ ధర్మసంరక్షణంబుఁ జేయుచు—— 43

ఉ. పంతముతోడ నన్య నరపాలురపైఁబడి దోర్విభూతి దే
శాంతర సీమలం గెలిచి యావలిపుట్టఁగ వారినెల్ల సా
మంతులుగా నొనర్చికొని మంతునకెక్కి యథేచ్ఛతోడ వి
శ్రాంతినిబూని రావణుఁడు రాజ్యముఁజేసెడి కాలమందునన్. 44

సీ. గండోపలచ్ఛటా గండూషితప్రస్థ
వింధ్యపర్వతపంక్తి వెనుకనెట్టి
పంచాస్యశార్దూల వన్యేభసంకీర్ణ
ప్రస్ఫురద్దండకా వనముదాఁటి
ప్రావృట్సమారంభ బహూపయస్సంపూర్ణ
దుర్లంఘ నిర్ఝరుల్ దూఁకివచ్చి
విషసరీసృపచమూ విష్కంభ దుర్లోక
తృణలతాగుల్మముల్ తీసివచ్చి

గీ. యార్యసంఘంబు మునిపల్లె లచ్చటచటఁ
గట్టుకొని వేగుపనికినై కాపురంబు
లుండి బహుజంతుహింసా ప్రయుక్త యజ్ఞ
యాగములు చేయఁజొచ్చిరి యాగకుండ.

ఉ. మానినులెల్లరున్ భయము మాని విచారముమాని వెంటరా
మౌనిజనంబు దండము కమండలముంగొని పోయి పోయి, వే
కాననసీమలన్ నెమకి కాపుర ముండిరి పల్లెలన్ జన
స్థానమునందు గట్టుకొని దారులుకాయుచు మాఱుమూలలన్. 46

గీ. వృత్తవేది రావణుఁ డీ ప్రవృత్తిఁ దెలిసి
శైవమతవిరుద్ధంబైన జంతుహింసఁ
బెద్దప్రొద్దు చింతించి మాన్పింపఁదలఁచి
వీరసువు తాటకిని బిలిపించి పల్కె. 47

ఉ. తాటకి సాధ్విరో ! వినుము తప్పక యేమని చెప్పనేర్తు ? నా
నోటను మాటరాదు విన నోచితి నీ విపరీతకర్మముల్
మాటలఁదీరునే యొడలు మంటలఁ బ్రుంగుచు నుండఁగాన నో
పాటలగంధి ! యెట్లయినఁ బాపవె ! నాపరితాపవహ్నినిన్. 48

గీ. ఆర్యులఁట నీతిపరులఁట యాహితాగ్ను
లఁట యెచటనుండియో వచ్చిరఁట పరోప
కారులఁట ద్రావిడులనఁట కాదనకఁట
దొడ్డమంత్రంబులఁ గడతేర్తురటె తల్లి. 49

కం. నియతిన్ గోమేధంబఁట
హయమేధ మఁట నరమేధ మఁట చేతురటే
దయమాలి స్వార్థపరులై
వ్యయప్రయాసములులేక యార్యమునీంద్రుల్. 50

చం. ఎఱుఁగుదు నీకుమారకుల నిర్వ్వర దుర్జయబాహుసారులన్
దెరలని స్వామిభక్తులగు దిట్టగరాసుల వారితోడుతో
నరిగిన నీకుఁ దప్పక జయంబగు నమ్ముము మాటలేల ? యీ
తరుణమునందుఁ గర్జమును ధైర్యముతో నొనరింపఁగాఁదగున్. 51

ఉ. కాదనఁబోకుమమ్మ, పని గల్గెనటం చెదురాడకమ్మ, త
ల్లీ ! దరితెన్నుఁ గానక చలించెడి డెందము మౌనమూని యీ
మాదిరి నూరకున్న విషమంబగు దుర్గతి సంభవించు లె
మ్మా ! దరిఁజేర్పుమమ్మ, మను మార్గముఁ బట్టిన నీకుఁదప్పునే ? 52

చం. పరుసని మాటలాడకుము వారలతోఁ దగురీతి నేర్పుమై
గరుసునుదెల్పి యొప్పిదముగా మనయేల్బడినున్న సీమలన్
బరగెడి దేశధర్మమును వాకొని వారికి నచ్చునట్టులే
సరణిని జంతుహింస నిట సల్పఁగరాదని యొత్తిచెప్పుమా. 53

గీ. అముకవిసి విశ్వామిత్రుఁ డనెడి మౌని
వరుఁడు గోమేధమును జేయవలయునంచు
యుదియఁగొని యుండెనఁట వాని యుదియ యుడిపి
వెలఁది ! యీపులగాకు తప్పింపవలయు. 54

గీ. మన ముపేక్ష సేయు నెడ నీ యనువునందు
ధర్మనాశనమౌనమ్మ తప్పకుండఁ
బాడువారి దేశము ప్రజా పీడగల్గుఁ
జావు కడులెస్స ధర్మరక్షణము కొఱకు. 55

కం. మనతాతలు ముత్తాతలు
తనువులు బడగలనుచు మదిఁ దలఁచియు కాదే
యనిసేయుచుఁ దెగటారిరి
జనములు మెచ్చఁగ స్వధర్మ సంరక్షణకై. 56

సీ. రాజాజ్ఞ లేనిదే రాజ్యంబుఁ జొరరాదు
పరరాష్ట్రవాసులో ప్రజలు తెగువఁ
జొచ్చి రేనియుఁ జొచ్చి చొచ్చుటతోఁ దమ
రాకఁ దెలుపకుండ రాదు పతికి

ఉండి రేనియు నేత దుర్వీషుశాసన
ములనెల్ల జవదాఁటి పోవరాదు
పోయిరేనియు వారు భూపాలు శిక్షలఁ
దిన్నఁగాఁ దలఁదాల్చి తీరవలయు

గీ. చోరులంబోలె దేశంబుఁ జొచ్చి వారు
పూని ధర్మవిరుద్ధంబులైన పనులు
చేసి రాజాజ్ఞ బ్రతిఘటించెదరు, దండ్యు
లైరి యాకరణముచేత ననుచుఁ దెల్పి. 57

గీ. మంచిమాటల జన్నంబు మానిపింపు
లేద దండకాటవినుండి లేవఁగొట్టి
బొమ్మను మఁటన్న నా మంత్రణమ్ము వడసి
చనియెఁ దాటకి రాజాజ్ఞఁ జక్కఁబెట్ట. 58

ఉ. పూఁచిన కార్యభారమున మున్నడి తాటకియింటికేగి మా
రీచ సుబాహులం బిలిచి తేని యనుజ్ఞనుదెల్ప వారలున్
లాఁచి నితాంతశక్తిని జలంబునఁ దల్లిని గూడి దివ్యవ
ర్మాచితదేహులై వెడలి యందఱు చేరిరి యజ్ఞవాటికన్. 59

చేరి గాధేయునకు తేఁడు చెప్పినంత
పూస గ్రుచ్చినకైవడి బోధపఱప
నెంతలేసి మాటలని గ్రుడ్లెఱ్ఱఁజేసి
నిప్పు ద్రొక్కినకోఁతియై నెగిరిపడుచు. 6

కాపేయంబునఁ గ్రిందుమీఁదెఱుఁగకా కంపించు దేహంబుతోఁ
గోపాటోప విఘూర్ణమానుఁడయి సంకోచంబు నేమాత్రముం
జూపంబోవక కౌశికుండపుడు గ్రచ్చుల్గొట్టి వాచాలుఁడై
మాపట్టున్ విడఁబోవమంచుఁ బలుకన్ మర్యాద లేకుండఁగన్. 61

గీ. పల్కు లాలించి సంక్షోభ పడక, యదరి
పడక, మోమోటపడక నిబ్బరము చెడక
తాటకీసాధ్వి రాజాజ్ఞ తప్పదనుచుఁ
బాఱఁజూచి పుత్రులవంక బఱటినంత. 62

గీ. పట్టుమంచు మారీచ సుబాహులపుడు
పట్టు విడనాఁడవో మృషా బ్రాహ్మణుండ!
కొంతు మీవేమిసేయఁగాఁ గలవొ యంచు
యజ్ఞ విఘ్నంబు సల్ప నాయత్తపడుచు. 63

యూపంబులకుఁ గట్టియున్న యాఁబెయ్యల
మెడత్రాళ్ళ సడలించి విడచిపుచ్చి
చిద్రుపలుగాఁగొట్టి చేర్చియుంచిన రావి
చిదుగు కుప్పలపేళ్ళ చిమ్మివైచి
గుమగుమ తావి యాగుబ్బుగాఁ గొట్టు నా
వుల నేతి పంబెల బోర్లగించి
కుండంబులోనుండి కొలఁది నాల్కలుగ్రోయు
నగ్నిహోత్రమ్ముఁ జల్లార్పివైచి

గీ. దర్భలను నాల్గుమూలలం దరలవైచి
పాఱఁబోతులం బెదరించి పాఱఁద్రోల
మిన్ను విఱిగి కూలినమాడ్కి మిణకరించి
చూచిచూచి యప్పుడు గాధిసూనుఁడంత. 64

ప్రాఁతలాతాము మెల్లగాఁ జేతఁబట్టి
చంక నిఱికించి చినిఁగిన జింకతోలు
లెండు లెండంచు శిష్యుల లేవఁదీసి
తల్లడిల్లి సాకేతంబు దారిపట్టి. 65

ఉ. కూఁకలు పెట్టుచుం బెదరఁగొట్టుచు నట్టడవిన్ వసించి కా
రాకులు కూడుగా మెసవునట్టి మునీంద్ర జనంబుమీఁదికిన్
దూఁకులుదూఁకి కావరముతోఁ జెగనాడిరటంచు రాజుతో
సాకులు చెప్పుచుం దగినశాస్త్రి యొనర్చెదనంచుఁ జెప్పుమున్. 66

ఉ. గోవులఁ జంపినంత తమ కొంపమునుంగునె ? వీరి కక్కటా !
గోవులు గోవ్రలంచుఁ బయికొందురు తద్వధనాపద్రావిడుల్
గోవుల మాంసపుంజవులు కొద్దిగనైన నెఱింగియున్నచో
గోవులఁ జంపఁగూడదని గొల్లనఁ జెప్పుట వీరు మానరే. 67

గీ. ఎంతయత్నంబుఁ జేసిన నేమివచ్చె ?
నావునెఱచిని రుచిచూడరైరి వారు
సోమపానంబునుం జవిచూడరైరి
ఇందుచే నిన్నియిక్కట్టు లేగుదెంచె. 68

ఉ. అమ్మరివోసి చుల్కనగ నాఁడుది సైతము లక్ష్యశుద్ధితోఁ
గిమ్మనకుండ శాత్రవులఁ గీటడగించుటె కాక ఘోరసై
న్యమ్మును నిక్కుతో ననిమొనన్ నడిపింపఁగనేర్చు నిట్టి రా
జ్యమ్మును దొల్లి యేనెఱుఁగనైతిని నైతి యెటో జయింపఁగన్. 69

గీ. పోటుకానితోడఁ బోటుకత్తియ కూడ
నిలిచి పోరుచుండ నిలువఁగలరె
వైరులెంత గండు వజ్జీరులైనను ?
మాట దక్కఁబోదు మాటలేల ?

గీ. బొమ్మముడివేసి తలముడి పుచ్చకుండ
అవికముడి వేయునట్టు లాఘవముగొరల
నరుల ముడివేసి ముడిచేప నరులగొంతు
ముడి నురలఁబుత్తు రిచ్చటి ముద్దరాండ్రె.

వ. అంచుఁ జింతించుచుఁ జింతాకులమానసుండై, శిష్యులంగూడి యిటునటు చూడక, యడుగులు లెక్కించుకొనుచుఁ గాలినడకతో, గాలిపాటునకు జంకక, గాలిపాటలు పాడుకొనుచు నెమ్మదిగా— 72

ఏరులుదాఁటి వాటముగ నెన్నియొ క్రొందలిరాకు బాటలన్
నేరుగ దండకావన వినిర్గమనంబొనరించి పిమ్మటన్
వారక భంగపాటు పొరపాటును దల్లడపాటు పెట్టఁగా
నూరక గాధినందనుఁ డయోధ్యకుఁబోయెను దొట్రుపాటుతో. 73

చం. కులషాతియౌ వసిష్ఠుని కొంపను జొచ్చి రహస్యపద్ధతిన్
గల తెఱఁగెల్లఁజెప్పి యిది కాదదికాదని దీర్ఘదృష్టితోఁ
బలుమరు చర్చఁజేసి యిది భావ్యమటంచును నిశ్చయించి తా
వెడలెను గౌశికుండు పృథివీపతి దర్శన సంభ్రమంబునన్. 74

చం. దశరథభూమిపాలకుని దర్శనముం బొనరించి పేర్మితోఁ
గుశలమునడ్గి యేమిపనికోరని వానినిబోలె సర్వమున్
విశదముగా నెఱింగి తన విహ్వలభావము తోఁపకుండ నా
కుశికతనూభవుండు కొనగోళ్ళను గడ్డము చిక్కుదీయుచున్. 75

చం. పొరపడకుండఁ దొట్రుపడఁబోక గరాగరి మంచిమాటలన్
నరవరు మోముపాటుఁగని నమ్మకముం జెడకుండఁ జక్కఁగా
సరిపడునట్లుగా, నొరులు సైతము మేలని మెచ్చురీతిఁగా
వరుసగఁ జెప్పె నిట్లు నరపాలుని మ్రోలను జాల జాలితో.

పాపభూయిష్ఠ ప్రవర్తనంబును బాసి
సంసారసంబంధ సరణి రోసి
బహుళజనాకీర్ణ పట్టణంబుల వీడి
కారుపల్లెలలో మెకాలఁగూడి

ప్రత్నశిష్టాచార పథమట్టె చేపట్టి
మొలచుట్టు పాఱుటాకులనుజుట్టి
ఐశ్వర్యములనెల్ల నఱకాల దిగఁదన్ని
భాగ్యభోగ్యములన్ని పాఱఁదన్ని

గీ. షడ్రసోపేతమైన భోజనముడించి
కాయగసరులతో నెట్టొ కడుపునించి
పారమార్థిక చింతతోఁ బరముఁగొల్చి
బ్రదుకుచుంటిమి తాపసాశ్రమముఁదాల్చి. 77

గీ. సూరవంశాభి వృద్ధిని గోరి కాదె
యారితేరిన మేధావులైన మునులు
దండకావనిఁ జేరి యందుండి తపముఁ
జల్పుచెల్లను నగచాట్ల సరకుగొనక. 78

గీ. ఆర్యులనుపేరు విన్నంత నచటి రాజు
లాగ్రహోదగ్రులై వారి హతమొనర్ప
సిద్ధమౌదురు మావంటి శీర్ణదేహు
లేమి సేయంగ నేర్తురో నృపతిచంద్ర! 79

సీ. సెలయేళ్ళ నీళ్ళ దోసిళ్ళతోఁ గడుపాఱఁ
ద్రావి ముప్పూటలఁ దనియుచుండి
పండి రాలిపడిన యెండుటాకులు పండ్లు
నొంటిపూట భుజించి యొదిగియుండి
పూలతావులలోనఁ బొరలివచ్చెడి గాలిఁ
గోర్కెమైఁ దనివోవఁ గ్రోలుచుండి
మనసుపోయిననాఁడు మాత్ర నివ్వరిభోజ
నముఁజేసి యెట్టులో నవయుచుండి

గీ. యుఱకయీరాలపొంత గూర్చుండు మమ్ము
నడవి మెకములం జూచెడునట్టుచూచి
యెక్కసక్కెములంజేతు రేవగించి
జాతి వైరంబు మనసులో సందడింప. 80

ఎంతదూరంబు తఱిమి మునీశ్వరుండు
చెప్పచుండిన దశరథ క్షితివరుండు
మాటలాడకుండిన యంత మసలిపడుచు
నుల్లకుట్టు మాటలచేత నులికిపడఁగ. 81

దూరముఁ బాఱఁజూడు చెవిదూరవు నేనిపుడాడు పల్కులన్
గారణమేమియో తెలుపఁ గాదగునయ్య యసహ్యమయ్యెనే ?
పాఱులు నిల్వనేరని నృపాలురరాజ్యము వృద్ధిబొందునే ?
కారియలందఁడే నృపతి కష్టపరంపర రాక తప్పునే ? 82

కం. పులినోటికండవలె మా
నులు మఁప్రొద్దుల మహా మనోవ్యధచేతన్
గళవళపడి నిలువంగాఁ
దెలియని వానివలెనుండఁ దెలిసిన పనియే ? 83

గీ. తెలిసికొనవా నీరాజ్య విస్తృతికిఁగాదె
ఋషులు దండకావనసీమ కేగి యందె
నిలిచి పోయినా రిది నీవు తలపవెట్లు ?
ఇతంటి కృతఘ్నతను నే సహింపఁజాల. 84

ఉ. చొచ్చిరి దండకావనము శుష్కశరీర విషణ్ణచిత్తులై
నొచ్చిరి ద్రావిడప్రభుల నూరినవెగ్గడి చిక్కటారులన్
వచ్చిరి నేఁడు దిక్కని భవచ్చరణంబును గోరి వారలన్
గ్రచ్చుఱ నాదరించి, యుపకారము సేయ వదేమి చెప్పుమా ! 85

కం. కుశికసుతుం డిటులాడఁగ
దశరథుఁడుం గటకటపడి దైన్యముతోడన్
దిశలూరక కన్గొనుచు వి
వశుఁడగుచు వచించెనిట్లు భయభక్తులచే. 86

చం. కులపతులౌ మునీశ్వరులకున్ వలవంతలు గల్గుచుండ వ్యా
కులపడకుండ నుండుదుమె ? కొందలమందదె మాదు డెందమున్
విలయము వచ్చిపడ్డ రఘువీరులు పాఱులఁ బ్రోవకుండ శ
త్రుల మొగసాలముందుఁబడద్రోతురె ? యెందులకిట్టి నిందలున్ ? 87

కం. ఇదె ! పోదము రాఁగదె దో
ర్మదమున ద్రావిడులు పోవు మార్గము లెల్లన్
వదలక యరికట్టెద నా
ప్రదరములకు నెవ్వరడ్డు పడఁగలవారో ! 88

చం. తడయఁగ వద్దు పోవుదము దండక కాననసీమ కిప్పుడే
గుడుసువడంగ సింగిణి లకోరులు 'రంయిని' దూఁకుచుండఁగాఁ
గెడపెద నేను మార్తురను గీటడగించెద ద్రావిడప్రజన్
గడగడలాడఁజేతు గమికాండ్రను గాండ్రని బొబ్బవెట్టుచున్. 89

గీ. అబము సుబమే మెఱుఁగని నా యట్టివాని
మీఁద నిందమోపుట ధర్మమే ? మహాత్మ !
విప్ర సంతర్పణంబైన పిదపఁ గాదె ?
యేము భక్తితో భుజియించు టింతొ యంతొ. 90

ఉ. ఏయుగమందు మా రఘుకులేశులు భూపతులన్నమాట కా
నీ ! యెప్పుడైన నొక్కపని యేని స్వతంత్రతఁ జేసినారలే ?
యీ యనుమానమేల ? పదుఁడీ యిపుడే వయనంబయైతి స్వా
మీ ! యిటువంటి పల్కులు సహింపఁగనేరను వేయునేటికిన్. 91

కం. అని చెప్పుచు నుండంగాఁ
జనుదెంచి వసిష్ఠమౌని సాంతముగాఁ దా
విని సర్వోదంతంబిటు
జనపాలుని తోడఁబల్కె ధర్మముతోడన్. 92

కం. కడువృద్ధుండవు నీ వి
క్కడ నిలిచి యుండి యేలఁ గల్గుదుగానీ
యడవుల వెంబడిపడి భ్రము
క్కడి మానవులఁ బడఁగూల్పఁ గల్గుదువాకో ! 93

చం. చెలువముకగ్గ నీ వయసు చెల్లఁ బటుత్వము కొంత తగ్గ నీ
కిలపయిఁ దీరఁగాఁదగు నభీష్టము లెల్లను దీరిపోవ నీ
యలవుచలంబు నెందులకు నక్కఱరా వదిగాక నీతనూ
జులకు విరోధిమారణముఁ జూఱగొనంగను నేర్పఁగాఁదగున్. 94

ఉ. కావున రామలక్ష్మణుల గాదిలి బిడ్డల నిర్వురన్ మహో
పావనుఁడైన మౌనికుల వర్యుని చేతను బెట్టి పంపుమా
పూవులలోన పెట్టికొని పోయి విరోధిచమూసమూహముం
జావఁగఁ గొట్టి తెచ్చి మన సన్నిధి నుంపఁగలండు భూవరా ! 95

భానువంశంబునకు వన్నె వాసికల్గఁ
జెలఁగి నీకీర్తి దెసలెల్లఁ జిందుఁద్రొక్క
వెనుక ముందు యోజనలెల్ల విడచిపెట్టు
మంచుఁ జెప్పఁగా దశరథుఁ డావులించి, 96

కంటినీటితో బిడ్డల జంటచేసి
చివుకుమన గుండె మౌనీంద్రు చేతఁబెట్టి
శోక మెటుమాన్తురో నాకు ? లేక లేక
కన్న సంతాన మియ్యది కావుమన్న ! 97

# తృతీయాశ్వాసము

చం. చెఱియొకవైపునన్ నిలిచి చిందులుద్రొక్కఁగ రామలక్ష్మణుల్
ముఱియుచుఁ గౌశికుండు తనముప్పు దొలంగెను నేఁటితోడ నం
చురవడిఁ బైనమయ్యెఁ జటులోగ్ర భయంకర దండకాటవిన్
జొరి పరిమార్చ ద్రావిడులఁజుబ్బన చూఱఁగ నిబ్బరంబుగన్. 98

ఉ. పిన్నలు రామలక్ష్మణులు బెగ్గిల వచ్చును వింటిమ్రోఁతలన్
విన్నను వేగిరింపఁ జెడుపేయగుఁ గావున మెల్లమెల్లఁగా
వెన్నునఁ దట్టి భీతి యొకవేళ ఘటిల్లినఁ బోవఁబుచ్చి రా
మన్నకు మున్నుగాఁ దెగువయబ్బెడు కైవడిఁజేయుటొప్పగున్. 99

గీ. అనుచుఁ దలపోసి పోసి యనంతరమ్ము
తికమకలు మాని మౌని యుద్రేకమడఁచి
యొక యుపాయంబు నూహించి యొరులకేమి
చెప్పకుండఁగాఁ గార్యంబుఁ జేయనెంచి. 100

చం. ముఱిముఱి చీఁకటుల్ దెసలు మూసెడివేళ నరణ్యసీమ నొం
టరిగవసించు తాటకిఁ దటాలునఁ బైఁబడిగూల్చుటొప్పుఁదొం
దరపడకుండ నాఁడుదిగదా ! యెటుపో యెటువచ్చినన్ సరే
దెరలఁగవచ్చు రామునకుఁ దీరఁగవచ్చు భయంబు కల్గినన్. 101

ఈగతి ననేకవిధంబుల నూహించుచుఁ బ్రొద్దు పడమటి దిక్కునకు వ్రాలుటఁ దలంచి యుత్తలంబున— 102

ఎత్తిలి కాలిబాటఁబడి యేగుచు సంయమి దారిలోఁ బురా
వృత్తము లెన్నియేని వినిపించుచు శౌర్యము పొంగిపోవఁగాఁ
జిత్తములోన నూహలొగిఁ జిక్కురు బొక్కురుగాఁగఁ బుట్టఁబే
రెత్తినఁ గాలుద్రవ్వనటు లెంతయుఁజేసెఁ గుమారులిర్వురన్. 103

ఈ ప్రకారంబునఁ గొంతదవ్వేగి సంభ్రమించుచు విశ్వామిత్రుండు రాముం జూచి ప్రసన్నవదనంబుతో నిట్లు మూదలించి పల్కెను— 104



ఉ. అల్లదె! చూచితే! యుటజమక్కడ నొక్కటి దానిలోపలన్
గల్లలమారియైన యొక కామిని తాటకి పేరుతోడ రే
కెల్ల వసించు నీమె హసియించెడి నార్యులు గోఘ్నులంచు నీ
యల్లరి రూపుమాపవలె నాయమునుం దొలిముద్దఁజేయుచున్.

కం. ఆఁడుదియని తండ్రీ! యెదు
రాడకు నీవింటికి నెఱయగునటుగాఁ దూఁ
టాడుము దయమాలుచు నీ
యాఁడుది జగజెంత యెంతకె ననుజాలున్.

గీ. అనిన వెంటనే నరపాల తనయు లట్టె
విల్లు సవరించి సరిచేసి పిఱుతివియక
దూసి కఱకుటమ్ములఁ గవ దొనలనుండి
నారి మ్రోయింప దెసలెల్ల బూరటిల్ల.

తాటకి వింటిమ్రోఁతవిని దబ్బున బైటకువచ్చి నిల్వఁగా
వాడెఁడు తూపులన్ సువతిపై గురియించిరి చిత్తజల్లుగా
గాటులుబెట్టుచున్ దుదకు గాళ్లనుజేతులు త్రుంచిత్రుంచి య
చ్చోటనె కూల్చివైచి రతిశూరులుగారె కుమారులిర్వురున్.

ఇంతమొగముఁ జేసికొని మునీశ్వరుండు
కేకిసలు గొట్టుచుండ సింగిణుల యెక్కు
డించి మూఁపుదోయికి దగిలించి రామ
లక్ష్మణులు నిల్చియున్నంత గ్లానిలేక.

ముక్కువాతను నెత్తురుల్ గ్రక్కి గ్రక్కి
చాపకట్టుగాఁ బుడమిపైఁ జచ్చిపడిన
పడతిఁ బెడనవ్వుతోఁ దేరి పాఱఁజూచి
మౌని సాఁగెఁబో రామలక్ష్మణులఁగూడి.

ఇట్లు వేయిమాసంబుల ప్రాయంబుచెల్లి ముఁడుకాళ్ళ ముసలియగు తాటకిని యౌవనప్రాదుర్భావమునఁ గలిగిన కంఠక్రొవ్వున మిట్టిపడుచున్న యిర్వురు రాకుమారులచేఁ జంపించి యొకలు తెలియక సల్లాపంబు లాడి కొనుచుఁ గలఁకదేఅని మనంబుతో రామలక్ష్మణుల వింటినేర్పు ముక్కాఁకలం దీరిన ద్రావిడహంవీరవరుల నేర్పునకు సుద్దికాదని సంశయగ్రస్తుండై, విశ్వామిత్రుండు పాలువోక ముందునకు సాఁగిపోవుచు, మచ్చరంబునఁ దన పూర్వాశ్రమంబున నేర్చికొన్న యఖిలాస్త్రశస్త్రంబులఁ దొఁకుగను నేయను ముడువను నేర్పి, తన యాశ్రమంబుఁజొచ్చి తల్లడపడుచున్న మనంబుతో సంబారంబులఁ గూర్చికొని, చవిచచ్చియున్న నాలుక త్రుప్పుడుల్లపుచ్చ వేగిరపడుచు, గోమేధంబును జేయ యత్నించుచుండెను. ఇంతలో మాతృ మరణంబు నెఱుంగని మారీచసుబాహులు, తల్లియానతిఁ దలమోయుచున్న వారు గావున యజ్ఞవిఘ్నంబు నాచరించ సమకట్ట శ్రీరామభద్రుఁడు నాఁడు నెత్తుటి తడియారని చేతితో వాఁడియమ్ములు దొడిగి చీకటి యోలంబున నిలిచి, సడిచప్పుడుకాకుండఁ జెవిఁ దాఁకువఱకు లాగి విడువ నందొక్కటి సుబాహు ప్రాణంబుల హరియించె; రెండవది లక్ష్యశుద్ధి కొఱవడుటచే గుఱితప్పి మారీచు ప్రాణంబుల హరియింపనోపకఁ డిల్లపడునట్లు భూమిపై దొల్లఁజేసె. అంత నతండు భీతిఁగుడిచి పలాయితుండయ్యె. పిమ్మట విశ్వామిత్రుండు నిరాటంకంబుగా యజ్ఞపరిసమాప్తిఁ గావించి, రామలక్ష్మణుల చేతి లావు చాలమిఁ జక్కఁగా గ్రహించి మిన్నకుండవలసిన వాఁడయ్యెను. రామలక్ష్మణులతోఁ గొంతకాలంబు తన యాశ్రమంబున విశ్రమించి వారిచే నగు కార్యము లేమింజేసి విశ్వామిత్రుండు తిన్నగా వారలం దోడ్కొని దుక్కిఁదున్న ననువుగాని వేవిలిమెట్టదారుల నెఱిడిపొలములంబడి, మిథిలకుం గొంపోయి, యందుఁ బదిపంద్రెండు తరములనుండి పడియుండి చివికిచెదదిన్న పెద్ద ప్రాఁతవింటిబద్ద విఱిపించి, రాజకీయసఖ్యంబు నపేక్షించి, యార్యుల యందలి రెండు తెలగవారికిఁ జుట్టఱికం బెట్టులయినఁ గూర్ప గట్టిచేసికొని, శ్రీరామునికంటెఁ బెద్దదియుఁ దెలియని పుట్టుపూర్వములు కలదియు నగు సీతామహాదేవిని శ్రీ రా ము న కుఁ బెండ్లిచేయించి, సాకేతంబునకుఁ దిరిగి వచ్చుచు, దారిలో ముసలివగ్గు వడుగైన పరశురామునిఁ దన గురుధనుర్భంగ

ముచేఁ గుపితుఁడైనవాని బదరి, వానిని వింధ్యాటవులందాఁటి దక్షిణాపథమున మాఱుమూలనున్న కేరళదేశంబునకుఁ బోయి యందు నార్యనాగరికత వ్యాపింపఁజేయ నొడంబఱచి పంపి, యయోధ్యకరిగి యందు రామలక్ష్మణుల డించి, కౌశికుం డెందే యేగెను. ||1||

గీ. రాజ్యతృష్ణ తీరని దశరథుఁడు రాజ్య
భారమును రామునకు నీక పాలనంబుఁ
జేయుచుండ శ్రీరాముండు సీతఁగూడి
కామతంత్రుఁడై ప్రొద్దులు గడపుచుండె.

సీ. తోడుతో నాఁడునెత్తురుఁ ద్రావి కడుపాఱ
తెపతెపలాడు మానుపులులైన
చిచ్చుఱమ్ముల పిండు చెలరేఁగి కవదొనల్
త్రోపాడి నాలుకల్ గ్రోయుచుండ
ద్రావిడ మన్నీల ప్రాణంబుల హరింప
శ్రీరామచంద్రుండు చింతఁజేసి
ఏయెక్కుచేనైన నిల్లువాకిలిడించి
దండకారణ్య భూస్థలికినేగి

గీ. యార్యరాజ్య విజృంభణ మాచరింప
మంచి తరికోసరం బట్టె పొంచియుండ
నింతలో రాజు వార్ధక్య మెనయఁదన్నుఁ
జెలఁగి పట్టాభిషిక్తునిఁ జేయనెంచ.

ఉ. కేకయ రాజపుత్రిఁగని క్లిష్టపరిస్థితిఁ బూనఁగ్రుచ్చిన
ట్టేకరువెట్టి యేకరణి నేనియుఁ దల్లిరొ! దండకాటవీ
ప్రాకట వీథులందిరుగు భాగ్యము నాకొడఁగూర్చి పంపవే
వీఁకమెయిన్ విదల్తు రిపువీరుల, రాజ్యము పెంపుచెందఁగన్.

గీ. రాజు సంతుష్టుఁడైనచో భ్రష్టుఁడగున
టంచుఁ బెద్దలు నుడువు వాక్యమ్ములన్ని
యెఱుఁగుదువు కాదె ? తల్లి ! నా కేడుగడవు
నీవుదక్క వేఱెవ్వరు నేఁడు కలదు ?

కం. అని యీగతి శ్రీరాముఁడు
పినతల్లినిఁ జేరి పలుకఁ బ్రేమముతోడన్
విని కేకయ రాజాత్మజ
చనువున వచియించె నిట్టు చతురోక్తులతో.

కం. పరిలెమ్ము కన్నతండ్రీ !
తరుణము కనిపెట్టియుండి తప్పక నేనే
వెరవున నైనను నీపని
సరిఁజేసెద నమ్ము మెట్టి సడిపైఁ బడినన్.

వ. అని కైకేయి వచియింప శ్రీరామచంద్రుండు ప్రహృష్టాంతరంగుండై, పినతల్లివద్ద సెలవుంగైకొని వెడలిపోయె. అటుపిమ్మట వెండియు నొక్క నాఁడు కైకేయి పుట్టినింటి దాసియైన మంధర వడివడి వచ్చి "దేవీ ! కేకయ రాజపుత్రీ ! సార్వభౌముండు శ్రీరామచంద్రుని బట్టాభిషిక్తునిఁ జేయుటకు లగ్నంబు నిశ్చయించి సంబారంబులను సేకరించుచుండెను, ఱేపే పర్వ దినంబ"ని రోజుచు నుడువఁ గైకేయి తనకుఁ దలవని తలంపుగాఁ జేఁజిక్కిన సమయంబునకు మురిసి, తొల్లి మహాదారుణరణంబునఁ దాఁజేసిన తోడ్పాటున కలరి, తన పతి యిచ్చిన వరద్వయంబున రాముని వనవాసంబునకు, భరతుని పట్టాభిషేకంబునకు వయోవృద్ధుండును, స్త్రీలోలుండును నయిన చక్రవర్తిని నొప్పించి, యొప్పించి యీ సమాచారంబు శ్రీరామునకుఁ దెలుప సహధర్మచారిణి యగు సీతతోడను, సోదరుండైన లక్ష్మణుని తోడను విపినావాసంబునకుఁ దండ్రి వలదని వలవల వాపోవుచుండఁ బయనంబై —

గీ. రథముతోలంగఁ బ్రాజిత రాజవీథిఁ
బోయి గంగనీళ్ళాడు రేవునకునేగి
యచట దేయడిగ్గి సుమంత్రు నంపివైచి
తోఁచని మదితో దొన్నెక్కె వేచియుండ.

గీ. రాజనీతిజ్ఞుఁడై నట్టి రాముఁడంత
దేశకాల పాత్రంబులఁ దెలిసికొనుచుఁ
జతురుపాయప్రయోగ కౌశలముచేతఁ
దన యభీష్టంబు నెఱవేర్చి కొనఁదలంచి.

గీ. పురుషు లేనట్టి లావరి బోయపెద్ద
నదురులేకుండ గంగపై నడపఁగలఁడు
పడవ యెట్టిదైనను నట్టి గడుసుదిట్ట
గుహుఁడు వాని నేస్తముఁజేసి మిహిరకులుఁడు.

గీ. మంచిమాటలాడి మన్నించి పదిలంబు
గాఁగఁ బడవనెక్కి గంగదాఁటి
కాలినడకతోడఁ గదలిపోయిరి ముగ్గు
రంతుపొంతులేని యడవికేసి.

ఉ. భద్రముగాఁ బ్రయాసపడి వారలు మూవురుపోయి చిత్రకూ
టాద్రిని జేరఁగా భరతుఁ డచ్చటికిం జనుదెంచి దీర్ఘమౌ
నిద్రనుబొందెఁ దండ్రియన నిక్కమువందురి పాదుకాద్వయీ
ముద్రనొసంగి రాఘవుఁడు పొమ్మనిచెప్పి తలంచె నీగతిన్.

ఉ. ఇచ్చట నున్నచో భరతుఁ డీగతి వెండియు బాధపెట్టఁగా
వచ్చును జాలితోఁ దిరిగి పట్టణసీమకు రమ్మటంచు నా
వచ్చిన కార్యముం జెడఁగ భక్తుఁడు నాకతఁ డెంతొగాన మే
మిచ్చటనుండి దూరముగ నేగుట కర్జమటంచు నెంచుచున్.

గీ. వానవంగుళ్ళ కోరిచి వలికి నోర్చి
యుఱుము మెఱుముల కోరిచి యుబ్బకోర్చి
యెండ దగ దప్పులకునోర్చి యెడకు నోర్చి
పయన మెరంత దక్షిణా పథముఁబట్టి.

చం. ఇటు పడిపోవఁబోవఁగ మునీశ్వరపుత్రు డొకండు దారిలోఁ
దటుకునఁ గానిపించిన ముదంబున క్షేమ మెఱింగినంత నీ
యటవిని మౌనిశేఖరుల యాశ్రమభూములు కొన్నియున్న వే?
యిటకు సమీపమందు నొకచేనియుగల్గునె? చెప్పుమీయనన్.

గీ. మాణవకుఁ డంతఁ జెప్పె నీ మార్గమందు
ననతి దూరంబునందునే యాశ్రమమొకఁ
డున్నయది దేవ! మిక్కిలి యొప్పుగల్గి
యనిన మూపురా దారినే చనుచునుండ.

చం. చిఱుతతనంబుగోలెఁ బరసేవయే వృత్తిగ నెంచుచున్ సదా
గరువతనంబు మాని కలకాలము మౌనుల యాకుపాకలన్
దొలకెడి భుక్తశేషమును దూఁటుచు సాపడి వారిపొత్తుచేఁ
జొరయుదు స్వర్గమంచుఁ దలపోసెడి కామిని యుండెనచ్చటన్.

వ. ఇట్లు చెప్పుచుండ నేనును సంకులితస్వాంతుఁడనై, యట్టి నిరభిమానంబున సంచరించిన యామె చరిత్ర యెట్టిదో, యామె యానుపాను లెట్టివో యెఱుంగ నభిలషించి, సూతమహర్షి మోముఁదిలకించి—

గీ. ఆమె పేరేమి? యేజాతి యందుఁబుట్టె?
జగతియందున నేఁడామె జాతికలదె?
యున్నచో నిప్పుడెచ్చట నుండెనయ్య
సంగ్రహంబుగఁ జెప్పుఁడో సంయమీంద్ర!

గీ. అనిన మౌని యర్ధనిమీలితాక్షుఁ డగుచుఁ
జెప్పఁదొడఁగెను నీరీతి నీద్రపడక
పెద్దవార లామెకుఁ బేరు పెట్టలేదు
శబరి యనిమాత్ర పిల్చిరి జాతిపేర.

కం. మునులకు బట్టల నుదుకుచుఁ
గనిపెట్టుక యుండి యొక్క కడికూటికినై
పను లెబ్బెటికము లేకయె
పొనరించెడి వంగడంబు పోడిమి చెడఁగాన్.

కం. జాతి భ్రష్టయటంచును
జాతి శబరు లట్టి బానిసను వెలివేయన్
వాతెఱఁ గొఱుకుచు నామెయు
జాతామర్షంబునఁ దన జాతినిబాసెన్.

ఉ. పాసినయంతమీఁద మునిపల్లెలయందు సదా వసింపుచున్
బాసినకూడు నొక్క కడివంతున వారలు పంచిపెట్టఁగా
దోసిటఁబట్టి సాపడుచుఁ ద్రొక్కిసలాడక బ్రహ్మవిద్యనున్
బాసినవంటకంబొసఁగె బాపురె ! యంచుఁదలంచు నామెయున్.

గీ. వరవుడం బెంతచేసినఁ బాపమేమి
వచ్చె ? నీయరయిరి గౌరవంబు సుంత
జాలితో నామెపఙ్క్తుల నాలకించి
కనుబొమ లెగురవైతు రా మునిజనంబు.

గీ. పేరుపెట్టియైన శబరిఁ బిల్వలేదు
పరువు చెడిపోవుననెడి గర్వంబుచేత
నిట్టి యవమాన మెవఁడు సహింపనేర్చు ?
బళిర ! చెంచెత యనిమాత్ర పల్కినారు.

గీ. సవరలను పేర నీనాఁడు జయపురమునఁ
గిమిడికొండలఁ దెల్గు నాఁట మనుజాళి
కలరు వారినే ప్రజలెల్ల బిలిచినారు
వానరులని తొల్లి యెఱుఁగవా? కుమార!

నాఁటి శబరులే యీనాఁటి సవరులైరి
నాఁటి కాయకుప్పమ్మలు నాఁటిగవులె
నేఁటికిని మన్కిపట్టులై నెగడుచుండె
నాగరికత యెక్కవిధంబు నాఁడు నేఁడు.

వ. పదంపడి పథిశ్రమంబు సరకుఁగొనక—

గీ. శబరి యాతిథ్యము గ్రహింప సంభ్రమించి
రామలక్ష్మణు లభిరామ రామఁగూడి
ముచ్చెమట లట్టె దిగజారఁ బోయిఁబోయి
యేతదాశ్రమభూమికి నేగి నిల్వ.

వ. మునివర్యులు చెప్పిన యడియాలంబుచే సీతారామ లక్ష్మణులఁ బొడఁగాంచి గుర్తించి, పరమానందకందళిత హృదయయై శబరి—

ఉ. వంగిన పండ్లకొమ్మలను బట్టి విదల్చుచుఁ గొన్ని పండ్లనున్
జెంగునఁ గోయుచున్ గొఱికిచెడ్డవొ మంచివొ యంచుఁ జూచి యా
యెంగిలిపండ్లనున్ రఘుకులేశున కిచ్చినఁ దోడుతోడ ను
ప్పొంగుచు వానినిందినియె భూవరుఁ డాఁకలిచేత దూఁటుచున్.

(గీ) ద్రవిడలోకబునందెల్ల దప్పి దారి
యాభిజాత్యంబుఁ గోల్పడ్డ యట్టి శబరి
యెంగిలి భుజించె శ్రీరాముఁ దేవపడక
కార్యపరులకు నెగ్గులు కలవె? చెపుమ!

గీ. ఆర్యమునుల యుచ్ఛిష్టంబు నహరహంబు
కుడిచి దేహంబుఁ బోషించు కొనియెఁగాన
నామెయెంగిలిఁ దిన దోష మేమియుండు
యుమ్మి యుమ్మిలోఁ గలసినట్లుండుఁగాక.

గీ. శబరి భక్తిని గనిపెట్టి సంతసించి
కంటిచూపుతో మోక్షంబు గట్టిపెట్టె
శంబుకుని తపంబును మెచ్చి సాహసించి
కత్తివ్రేటుతో మోక్షంబుఁ గట్టిపెట్టె.

వ. తదనంతరంబు సీతాలక్ష్మణ సహితుండై శ్రీరాముండు—

గీ. పలువయెండల కెండి వానలకుఁ దడిసి
తులువ మెకముల బొబ్బరింతలకు జడిసి
యేమిచేయంగఁ దోఁచ కొక్కింత తడసి
బయలుదేరి యాకానలోఁ బాడుదారి.

గీ. ముదురు వెదురుప్రాలు మురువ్వతో భుజియించి
పుట్టతేనెఁ ద్రావి పొట్టనిండ
మడ్డియిప్పకల్లు లద్దిగం బంకించి
ముగ్గు రడవినడచి పోయి పోయి.

గీ. ఏదుబందులు సివ్వంగు లెలుఁగుబంట్లు
క్రేళ్ళువారు కుందేళ్ళు తోడేళ్లు లేళ్లు
చిఱుతపులులు బెబ్బులులెల్లఁ దిరుగుచుండు
కారడవిఁ గాళ్ల బలపాలు కట్టఁ దిరిగి.

కం. నానుడు వానలచేతన్
నానినఁ జేయెత్తుపెఱిగిన తఱచుపులులో
మానక డాఁగుడుమూఁతలు
లోనమునిఁగి తేలు మెకములు గలుచోగుటన్

వ. ఇంటిపట్టునకు ననువైన పట్టులం గనుంగొనఁజాలక విసుగుచేఁ బోయిన
పోకగాఁ బోవుచుండ నొక్కనాఁడు—

ఉ. దాపునఁ బర్ణశాల తమదారిని నొక్కటి కానుపింప నా
వైపునకేగి యందు మునివర్యుఁ డగస్త్యుఁడు భార్యతోడుతన్
గాపురమున్న మాటెఱిఁగి క్రన్నన చూచుట మేలటంచు న
త్తాపసిసమ్ముఖంబునకుఁ దద్దయు నేగిరి ముగ్గురొక్కటై.

వ. ఏగి, కులగోత్ర నామంబులుచెప్పుచుఁ దమ్మెఱింగించికొని, సాష్టాంగముగాఁ
బ్రణమిల్లిన నపరిమితానందముఁ బొంది యగస్త్యుఁడు వారల దీవించి,
భూతభవిష్య ద్వర్తమానంబు లెఱింగిన యాతండు శ్రీరామచంద్రునిచే
నిఖిలం బెఱింగి, కొంతవడి వగచి, యెఱుక కలవాఁడు గావున
వగపుడిగి శ్రీరామచంద్రునితో—

గీ. జటిలవరుఁడు త్రొక్కిటఁబడి యిటులఁబల్కె
నిటకు మందటఁ బిప్పలీ జటిలమైన
పంచవటి నాఁగవెలెడి వనమొకండు
వాసయోగ్యంబు మీఁబోఁటి వారికదియు.

ఉ. చెక్కుచెమర్పకుండఁగ వసింతురు పెక్కురు మౌనులచ్చటన్
నిక్కిన చెట్లనీడ నవనీపతిపుత్రకులార ! మీరటన్
మిక్కిలి చిత్తశాంతిని గమింతురు మింతురు మేలుగాంతురీ
రిక్కడనుండి పాసిచనుఁడీ ! మునివర్మన లాభమౌననన్.

కం. మునితల్లజు ననుమతినిం
గొని రాఘవు లవనితనయఁ గొని గొనకొని వెం
టనె పైనమయిరి పంచవ
టిని జేరఁగ దెన్నెఱిఁగి వడిన్ గాలినడన్.

గీ. పంచవటిఁ జేరి యటనొక్క పర్ణశాల
గట్టికొని రాముఁ డందుండెఁ గాపురంబు
సీతయును లక్ష్మణుండును జెంతనుండ
గడచిపోయిన కార్యముల్ దడవికొనుచు.

సీ. తనజాతి తనకులం బనువారు గనరాని
ప్రొద్దుపొడుపులేని భూములందు
ఓరుగాలి చెలంగి యుయ్యాల లూఁగించు
పాఱుటాకుల కప్పు పాకలందుఁ
గాపురంబుండ నేకాకినై యొకనాఁడు
మాలిమితో నొక్క మాలకాకి
పర్ణశాలనుదూరి వసుధాతనూజాత
బెదరించి కొట్టిన పీడకున్న

గీ. భర్తతో నెన్ని యెక్కులో పల్కిపల్కి
కాకిఁ జంపించి ముంగిటఁ గాకిగడకుఁ
గడకుఁ గట్టించె నది జారిపడకయుండఁ
దమకు నేదృష్టి దోషంబు తగులదనుచు.

గీ. పులుఁగులందుఁ గాకములను ద్రావిడులు పూ
జింతురనుచుఁ బ్రేమ బెంతురనుచు
నెఱిఁగియుండి చంపె నృపతిచంద్రుండు ద్రా
విడులతోడఁ బోరుఁ బెట్టుకొనఁగ.

గీ. కాఱుచీకట్లు దిశలెల్లఁ గ్రమ్మువేళ
గొఱ్ఱెమందను గాచెడి గొల్లవోలె
వదినె యన్నయు నిదురించు పర్ణశాలఁ
గాచుచుండుఁ దమ్ముఁడు నిద్ర గాచికాచి ॥

గీ. ఇనుపగుద్దలి యొకచేత నెనయుచుండ
నురులు మూపుపై వ్రేళ్లాడుచుండ నొక్క
దినము కందమూలంబులు దెచ్చుపనికి
వినకులుండైన సౌమిత్రి యేగుచుండ.

చం. సునిశిత చంద్రహాస మొకచోటఁ గనంబడ దారిలోపలన్
గనుకని మందహాసమునఁ గైకొని చెచ్చెర వాయి యెట్టిదో
కనుఁగొనఁగోరి యాత్రపడి కాచిన మేలిమి ధారుణీజ పా
శిని బడఁగొట్టుచుండఁగఁ జలింపక దక్షిణబాహుశక్తి చే.

ఉ. ప్రక్కనుగల్గునట్టి ముని పల్లెలనుండిన మౌనులెల్లరున్
గ్రక్కునవచ్చి యేమిపని ? కారుణికోత్తమ ! పూచికాయు నీ
చక్కని పండ్లచెట్లఁ బెలుచన్ బడఁగూల్చెదవేల ? యిప్డు మా
చిక్కులుదీర నొక్కపనిఁజేయుము మాయెడఁ బేర్మిజూపుచున్.

కం. అదె ! వెదురుపొద యెదురుగాఁ
బొద ! పొద ! ! యచ్చోటకీవు పొదపడఁ జదుపన్
సొదవదలెడి నందేదులు
పొదలును సరకుగొనవెట్టి పోటరినె నన్.

గీ. అనిన నటకేగి యతఁడు బాహవ్వలించి
చిప్పకత్తి వాదర సరిచేసి చూచి
పటుతరంబైన దక్షిణ బాహువెత్తి
వ్రేటుతోడనే పడఁగూల్చె వెదురుపొదను.

గీ. చూరకత్తిపై నెత్తుటి జారలుండె
వెదురుప్రాలు రక్తాక్షత వితతియయ్యెఁ
గాంచినంతనే లక్ష్మణు కన్నుచెదరె
నెంతపాపంబుఁ జేసితి నెట్టులనుచు.

కం. ఇటునటు పరికించినయం
తట మెడతెగిపడ్డ మౌని నాథుం డొకఁడున్
దటుకునఁ జొడగట్టిన ముం
దట గడగడలాడి లక్ష్మణ కుమారకుఁడున్.

గీ. ఎలుఁగురాల్పడఁ గన్నీరు కొలఁకులందు
ము త్తియములట్టు కన్పట్ట మునుఁగువెట్టి
పర్ణశాలకు సైదోడు పజ్జకేగి
పాదయుగళంబుపై వ్రాలి పనవి పనవి.

కం. అన్నన్న ! ఘోరపాపం
బన్నా ! యొనరించినాఁడ నజ్ఞుఁడనై యా
పన్నుఁడ నను(గావుము నీ
కన్నను దిక్కెందుఁగలదు ? కారుణ్యనిధీ.

గీ. వెదరుపొదలోనఁ గూర్చుండి విప్రుఁ డొకఁడు
దీర్ఘతపముఁ జేయఁగ దలఁ ద్రెళ్లిపడియె
వంశనాశంబుఁ జేయంగ వంశనాశ
మగునొ ! శ్రీరామ యీ బ్రహ్మహత్యచేత.

కం. నిష్కారణముగ నెఱుఁగక
దుష్కృత్యముఁ జేసినాఁడ దుందుడుకొప్పన్
నిష్కృతి కల్గినయెడలఁ బ
రిష్కృతి యొనరించి యుద్ధరింపుఁడు నన్నున్.

చం. అనవుడు రామచంద్రుఁడకటా ! యెటువంటి ప్రమాదమయ్యె దు
ర్జనుల గూల్చి ధర్మ పరిరక్షణముం బొనరింపనున్న యీ
మన కిటువంటి సంకటముమాయెరె ; రాఁదగునే కుమార ? యే
మనియెద నేమితోఁచదుకదా ; యని యీాఁటఁబల్కుచుండఁగన్.

కం. మునివరులు పర్ణశాలకుఁ
జనుదెంచుచు బ్రహ్మహత్య సల్పెఁడహో నీ
యనుజుఁడు తలఁదెగి కూలిన
మనుజుఁడు బ్రాహ్మణుఁడుకాఁడు క్ష్మాతలనాథా

గీ. దొంగబ్రాహ్మణుం డాతండు దొంగ తపసి
రావణానుజయైన శూర్పణఖ సుతుఁడు
కినియువాఁడు జంబుకుమారుఁ డనెడివాఁడు
వానిఁ జంపినమాత్రపాపంబులేదు.

ఉ. నావిని మోదమందె నరనాథుఁడు లక్ష్మణుఁ డంతమీఁద మో
దావహుఁడయ్యెఁ దప్పెఁగదా ! మనమేర్చెడి బ్రహ్మహత్య నేఁ
డీ విధినంచు, మౌనిజన మేగెను బిమ్మట నొక్కఁడొక్కఁడున్
భూవరు మోసపుచ్చి పొరిపుచ్చఁగ నేర్చితిమంచు నొక్కనిన్.

గీ. ప్రథిత లంకాధిపతియైన రావణునకు
మాఱుచెల్లెలు జంబుకుమారుతల్లి
ఖరునితోడఁ బుట్టువు పరామరికగలది
యనఁటి గొడ్డురాలాభిజాత్యంబు కలది.

సీ. ప్రాయంబు సుంత గై వ్రాలకుండిననాఁడె
దొమ్మిలోఁ దనభర్త ద్రుంగిపోవ
సతతకుఘోరోపవాసములచేఁ గడుడయ్యు
నేండ్లు పూండులు చాల నెగిరిపోవ
మోటువారిన మోము ముడుత గగ్గులచేత
ముసలితనమ్ముచేఁ బుల్లసిల్ల
తూఁగాడు రొండిచే దుద్దెక్కు పొరడుచేఁ
గడువగ్గు గబ్బుచే నొడలుదనర

బ్రహ్మపురాణమునుబట్టి

# శ్రీకృష్ణుని వంశవృక్షము

దేవమీఢుఁడు

అసిక్ని

శూరుఁడు

వసుదేవుఁడు. దేవభాగుఁడు. దేవశ్రవుఁడు నాధృష్టి కనవకుఁడు. వత్సవంతుఁడు

శ్యాముఁడు శ్యామీకుఁడు;

ద్ధవుఁ గృంజముఁడు. 10. గండూషుఁడు

పదిమంది భార్యలు అందరికి సంతానము కలదు.

నశ్మక్నియందు దేవశ్రవుఁడు

కూతుళ్లు

పృథుకీర్తి పృథ శ్రుతదేవ 4 శ్రుతశ్రవ 5 రాజాధిదేవి

రోహిణి దేవకీదేవి యందు దంతవక్త్రుఁడు పాండవులు కేకఁ విందాను

బలరాముఁడు శ్రీకృష్ణుడు శత్రుఘ్నుఁడు అనునామాంతరము కల ఏకలవ్యుఁడు పాలుఁడు విందులు

చిత్ర (సుభద్ర

శ్రీకృష్ణుఁడు, యుద్ధవుఁడు, ఏకలవ్యుఁడు అన్నదమ్ముల బిడ్డలు; బ్రహ్మపురాణము సుభద్రను బలరాముని తోఁడఁ బుట్టువుగాఁ జెప్పుచున్నది. భాగవతపురాణము శ్రీకృష్ణుని తోఁబుట్టువుగాఁజెప్పుచున్నది. ఇందేది నిజంబోకదా. వంశవృక్షములనైనఁ బురాణములు సరిగా నీయఁజాలకున్నవి. త్రికాలవేదులయిన మునులు చెప్పుటచేతఁ గాఁబోలు.

## ద్రుపద కృపాచార్య వంశ వృక్షము

ముద్గలుఁడు




ద్రౌపది.

సగోత్రజులుకూడఁ దమలోఁ దాము పెండ్లిచేసుకొను నాచారమున్నది. సాత్యకి వంశమందుఁ బుట్టిన సత్యభామను శ్రీకృష్ణుఁడు పెండ్లియయ్యె.

## వంశవృక్షము



## కర్ణుఁడు సూతుఁడేనా ?

ఇందనుకఁ గర్ణుని బురాణములు, భారతము సూతుఁడని వచించుచున్నవి. ఈ కింవదంతిని నాధారము చేసికొని యనేక గాథలు బయలుదేరినవి. కాని భాగవతములోఁ జెప్పఁబడిన వంశవృక్షమును నిటఁ బొందుపఱచుచున్నాము. దానిఁబట్టి చూడఁ గర్ణుని పెంపుడు తండ్రియైన యతిరథుఁడు చంద్రవంశక్షత్రియుఁడైనట్లు పొడకట్టుచున్నది. ఈ చిత్రమేమియో కర్ణుఁడు సూతపుత్రుడను ప్రవాద మేల బయలువెడలినదో దుర్గ్రాహముగానున్నది. పుట్టిననాఁటినుండియును గర్ణుఁడు దురదృష్ట వంతుఁడే.

(యయాతి కొడుకు అనువు సంతతి)

### చంద్రవంశము

రోమపాదుఁడు
|
చతురంగుఁడు
|
బృధులాక్షుఁడు
|
బృహద్రథుఁడు
|
బృహన్మనస్సు
|
జయద్రథుఁడు
|
విజయుఁడు
|
ధృతి
|
ధృతవ్రతుండు
|
సత్యకర్ముండు
|
అతిరథుఁడు

కర్ణుఁడు

## భీ ష్ము ( డు

ఆసేతు శీతాచలము భారతవర్షమునందలి హిందువులు భీష్ముని స్వార్థత్యాగి యనియు, నీతివే యనియు నేఁటివఱకుఁ గొనియాడుచుండిరి. కాని యింత కపటి, యింత పక్షపాతి భారత యోధులందు మఱియొకరు గన్పట్టరు. దక్షిణ గోగ్రహణ సమయంబున నర్జునుండు గోవులను మరలింప బయటఁపడినప్పుడు పదుమూఁడు వర్షములు పూర్తికాలేదని దుర్యోధనుని నమ్మకము. అందుచేతనే గోగ్రహణంబు జరిగినది. భీష్ముఁడు దీనినెఱింగి యియ్యకొనియెను. నిజముగఁ బదుమూఁడు సంవత్సరములు చెల్లిపోయినయెడల భీష్ముఁడు దుర్యోధనునకు గోగ్రహణమునకుఁ బూర్వమే వినిపించియుండును. అట్లు జరుగలేదు. పదుమూఁడేండ్లు పూర్తియయ్యెనే యని తాతను దుర్యోధనుడు ప్రశ్నించి నపుడు మహా నీతివేత్తయగు భీష్ముఁడేమి సమాధానముఁ జెప్పెనో చూడుఁడు.

* గీ. రెండవయేట నొక్కండధిమాసమి
ట్లెక్కిన యన్నెల లెల్లఁగూర్చి
కొనఁ బదుమూఁడు హాయనములు దప్పక
నిన్నఁటితోడనె నిండెనంత.

ఈసిద్ధాంత మెచ్చటిదో బోధపడదు. అధిక మాసములయొక్క యుద్దేశ్య మేమి? సౌరమానము ప్రకారము సంవత్సరమున కుండఁదగిన రో॥ 335-6 గంటలు చంద్రమానములోని పండ్రెండు మాసములు గూర్చినఁ గొఱవడిన దినములను బూర్తిచేయుటకేకదా యేర్పడినది? అట్టిచో నాయధిమాసములను బ్రత్యేకించి లెక్కపెట్టి దొంగలెక్క సిద్ధముచేసి భీష్ముఁడు దుర్యోధనుని మోసపుచ్చఁజాలెను. ఇట్టి సంప్రతి నెచ్చటను బుట్టియుండఁడుకదా.

అతికపటియై కర్ణుని నర్ధరథునిగా నిరూపించెను. నిజముగఁ గర్ణుని నిరసించి, నిరుత్సాహుని జేయు తలంపే లేనియెడలఁ, గర్ణుని నతిరథ శ్రేష్ఠునిగాఁజెప్పి, వానికిం గల్గిన శాపాదులచే నిర్వీర్యుఁ డగుటచేఁ జేయఁదగినంత యుద్ధము జేయఁ జాలఁడని

---

* విరాటపర్వము, చతుర్థాశ్వాసము 232 వ పద్యము.

చెప్పవలసియుండు. ఎఱిఁగి యెఱిఁగియే పాండవులకుఁ దోష్పడ నెంచి యీ పద్ధతి నవలంబించెను. అంపసెజ్జపై భీష్ముండు పడియుండఁగాఁ జూచుటకునై కర్ణుఁడు వెళ్ళియున్నప్పు డిరువురకు జరిగిన సంభాషణము జూడుఁడు.

## రా ధ

రాధ లిరువురున్నట్లు పురాణాంతరములయందుఁ జెప్పఁబడియున్నది. ఒక రాధ నందునిచెల్లెలు, కృష్ణుని మేనయత్త. రెండవ రాధ కృష్ణుని సయ్యాటకత్తె; కీలారులందలి చెలిమికత్తె. ఈ రాధయే మహాభక్తురాలనియుఁ గృష్ణుని పరతత్త్వ మహత్త్వముఁ గనిపెట్టిన జాణయనియు భక్తులచే వర్ణింపఁబడినది. నామ సామ్యముంబట్టి యెడలెఱుంగని భక్తకోటిచే నిరువురు నొక్కరుగాఁ జేయఁబడిరి. ఇట్టిది యింకొక్క యుదాహరణ మిత్తుము. చంద్రవంశంబున దశరథుండను రాజొకండుకలఁడు. ఈతనికి శాంతియను కుమార్తె కలదు. ఈయమనే ఋశ్యశృంగుని కిచ్చి పెండ్లిఁజేసిరి. సూర్యవంశమున శ్రీరాముని జనకుఁడయిన దశరథుఁడు కలఁడు. మతిమాలిన భక్తులు నిరువురను నొకటిఁజేసిరి. శాంతను సీత యాఁడుబిడ్డను జేసిరి. ఆడువారి పాటలలోని కెక్కించిరి. ఇట్టి ప్రమాదములెన్నెన్ని కలవో యెవ్వడెఱుంగును?

## ధృష్టద్యుమ్నుఁడు

భారతము వీనిని శ్వేతజాతుండనియు; నయోనిజుఁడనియు వచించుచున్నది: అయోనిజులు శ్వేతాంగులే. ఈ యయోనిజులు చిరకాలమునకుఁ బూర్వము గ్రీకుల యందు నొక తెగగానుండిరి. అయోనియన్ సముద్రమనియు, నయోనియన్ దీవు లనియు వీరి పేర నేటికిని సుప్రసిద్ధములై యున్నవి. కావున భారతవర్షమునకు ధృష్టద్యుమ్నుఁడు దత్తపుత్రుడని యూహించు చుంటిమి.

## ధర్మజ భీమార్జునులు మూవురు కుంతీదేవి పుత్రులేనా?

పృథాసుతులనఁబడు ధర్మజ భీమార్జునులు మూవురు పార్థులని పిలువంబడక, యొక్క యర్జునుఁడే పార్థుఁడని పిలువంబడుటచే నర్జునుఁ డొక్కఁడే కుంతి పుత్రుఁడని కొందఱు వాదించుచున్నారు. భారత వీరుల చరిత్రలో బ్రహ్మశ్రీ

పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారీ వాదమును మొలకెత్తించినారు. తమ వాదమును బలపఱచికొనుటకుఁ బెక్కు కారణము లిచ్చియున్నారు. ఇది యిట్లుండ బ్రహ్మ పురాణములో యయాతి వంశమును జెప్పుటలో "కృష్ణద్వైపాయనుఁడగు వ్యాసులావైచిత్రవీర్యక్షేత్రంబున, మాతృనియోగానుసారంబున ధృతరాష్ట్రుఁడు, పాండుఁడు, విదురుఁడు ననువారలను బుట్టించెను. ధృతరాష్ట్రునికి గాంధారి యందు నూర్గురు పుత్రులు పుట్టిరి. అందు దుర్యోధనుఁడు జ్యేష్ఠుఁడై యెల్లరకుఁ బ్రభువై యుండెను. పాండునకు ధనంజయుఁడు. నాతనికి సుభద్రయందు నభిమన్యుఁడు, నాతనికిఁ పరీక్షితుండును బుట్టిరి." అని వర్ణింపఁబడెను. దీనింబట్టిచూడ ధర్మజ భీములు కౌంతేయులుగాని, పాండవేయులుగాని కానియటు పొడకట్టుచున్నది. ఒకవేళ పాండునకుఁ గృతకపుత్రులేమో ! ఆకాలంబునఁ గృతకపుత్రులు ధర్మసంతానముగనే పరిగణింపఁబడిరి.



# సూతపురాణము



## చతుర్థాశ్వాసము

### మొత్తుకోళ్ళు

గీ. చెవిటిదేవుఁ డొక్కఁడు పాప చెవులదేవుఁ
డొకఁడు లోకపాలనఁ జేయు చుందురట్టె!
యెటులఁ బ్రార్థింపవలయునో యెఱుఁగరాదు
భక్తకోటికిఁ బ్రాణాల పైకివచ్చె.

గీ. అఖిల భువన సంవ్యాపకుఁ డంచు బుధులు
నుడువుచుందురు నినుఁగూర్చి నోటినిండ
నదియె నిజమైనచోఁ దీర్థ యాత్రలెల్ల
భగవదపచారములుగావె పరమపురుష?

చం. పరమ సుశీలఁ బాలుని పాలొనరింతువు మూర్ఖురాలినో
సరసుని పాలుఁజేసెదవు స్వామి! యిదేమి? ప్రపంచ మెల్ల దు
ర్భరతర దుఃఖభారమున ద్రమ్గుచునుండఁగఁ గాంచి యెంతయో
మురిసెదవా? యిటైన నిను భూస్థలి నమ్మెడు వారలుందురే?

వ. పాఠకా! యనంతర కథావిశేషంబు, నిరవశేషంబుగా విన్పింతు సావధానుండవై యాలింపుము.

### నాగోడు

గీ. బాల్యమిత్రుల విహితుల బంధుజనులఁ
గూడి సుఖముగాఁబుచ్చితిఁ గొన్నినాళ్ల
కాని యేలొకో క్రమముగాఁ గష్టమగుచుఁ
బుట్టినూర నుండఁగ బుద్ధి పుట్టదయ్యె.

చం. తుదకొక నాఁట నేదియును దోఁచక యూరకయుండలేక నె
మ్మదిఁగను పొంపె సూతముని మండను నాశ్రమభూమికేగి, కొ
న్ని దినములందె యుండి బహు నీతివిశేషములన్ గ్రహింప న
భ్యుదయము గల్గునంచుఁ దలపోయుచుఁబైనము నిశ్చయించితిన్.

గీ. బలసి బూజువట్టిన యోగ వాగలపుడె
చేతఁగైకొని యోర్మితోఁ జికిలిచేసి
తూర్పురేక లారకముందె తొందరించి
మెదలకుండ బయలుదేరి చదలబాట.

ఉ. దవ్వని యెంచకేను జనుదారిని లేవలిగాడ్పు తెమ్మెరల్
జివ్వన మోముదూసి చన జిచ్చను బొందితి నెంతయేని నా
కొవ్వమి; యేదియెట్లయిన నోపికవెట్టి మనంబు జాయిగా
నవ్వనువీథిఁ బోయితి నవాంబుదముల్ మెయిసోకుచుండఁగా.

గీ. మింటిత్రోవ నీగతిఁజని మిహిరుఁడల్ల
ప్రొద్దుమలమీఁది కెక్కఁక మున్నె గురుని
పర్ణశాల నొక్కెడ నానవాలు పట్టి
గంగయొడ్డున దిగినాఁడ నంగవైచి.

అప్పటికప్పుడే సూతర్షి తనకుటీరంబు ముంగలఁగల జగతిపై నల్లని యిఱ్ఱి కళాసంబుఁ బఱచి కూర్చుండి నన్నుఁగాంచి, దరహసితవదనుండై, కన్నన్న రమ్మని పిలువ, సామీప్యంబునకు నేగి, సాష్టాంగ దండప్రమాణంబు లాచరించి; కూర్చుండ నన్నుఁగాంచి కుమారా ! శుష్కభూత శరీరుండవైతివేల ? యన నేనును గాద్గద్యంబు బయటఁ దోఁపనీక యిట్లంటి —

పరమసాధ్వి నీలీరాగవతి కళత్ర
మఱఁగ మునిచంద్రమతిపోయె నందుచేత
నిటుల శుష్కించి శుష్కించి యెండిపోయి
శల్యగతజీవినైతిని జావలేక.

వ. ఈ యుదంతంబు గుడువడుం డాలకించి తాత్కాలిక ముఖవికారంబు పొడకట్ట నూరకుండి తుదకు — 12

చం. మఱగిన జాయ మానవతి మాన్యచరిత్ర దివంబుఁ జేరఁగా
మఱుగుట మానరాదయిన మానకచేసెడిదేమి ? సౌఖ్యమే
మఱుగును గాన లోఁబొగుల మానుచు, బెద్దలత్రోవఁబోవుచున్
దురటిలఁబోక చూడు సుఖ దుఃఖములన్ సమభావమొప్పఁగన్. 13

వ. సుఖదుఃఖములు 'కావడికుండలు', దీని నెఱింగి మెలంగిన లగ్గగు నన్న నేనును జింతదేఱి, కుత్తుకబంటి శోకమును దిగమ్రింగి, పోయివచ్చిన కార్యంబు సర్వంబు నివేదించి జన్మభూమి దుర్దశాకథనంబు వినిపించి, పురాణకథాశ్రవణకుతూహలుండనై యిట్లు ప్రార్థించితి. 14

క థా ప్రా ర ం భ ము

సీ. శ్రీకృష్ణ చరితంబుఁ జెప్పవే సర్వంబు
పుట్టు పూర్వములన్ని పొందుపఱచి
తల్లిదండ్రు లెవ్వరో ! దాయాదు లెవ్వరో !
తాత ముత్తాతలు భ్రాత లెవరొ !
ఎచ్చోట జన్మించి, యెచ్చోటఁ బెఱిగెనో
పెట్టి పెంచినవారి పేరు లేవొ !
ఎలప్రాయ మెచ్చోట నేరీతిఁ గడపెనో !
యెవరితోఁ బోరెనో యేదికోరి !

గీ. చుట్ట పక్కంబు లెవ్వరో సూడువార
లెవ్వరో ? రాజ్య తంత్రంబు నెవరిఁగూడి
యెట్లు సాగించెనో ! ఫల మేమి వచ్చి
పడెనొ ! యవసానదశ యెట్లు కడపినాఁడొ ?

సీ. మఱి పెంపుఁ బసిగాపుఁ బూఁబోండ్ల పాలిండ్లఁ
బుణికి పుచ్చని దొండు పుట్టఁబోదు
రేఁబవళ్ళనకుండ వ్రేపల్లెలో వ్రేఁత
గడపఁ ద్రొక్కనియిల్లు కానరాదు
పిన్నయై వెన్నంటి వెన్నంటు పంటులఁ
గెలకకుండిన దొండు కలుగఁబోదు
"రార ! పోరా" యంచు రాకొట్టి పిల్వని
పడుచొక్కతైనఁ గన్పట్టఁబోదు

గీ. పోకముడి విప్పనీయని పోఁకలాఁడి
రైకముడి విప్పనీయని సాకులాఁడి
బళిర ! యుండరై రంట వ్రేపల్లెయందుఁ
గృష్ణు పోకిళ్ళచే నిది యెంత నిజమొ !

గీ. వరుస వావులు లేక వ్రేపల్లెనున్న
యట్టి మగవాండ్రు అంకుటాండ్రై రటంచు
సాటి లోకులు వాయెత్తి చాటుచుంద్రు
కృష్ణు పోకిళ్లచే నిది యెంత నిజమొ.

కం. మౌనీశ్వర ! చెప్పంగదె !
బోనము తినలేని పాల బుగ్గలనాఁడే
తా న త్తమిల్లె నందురు
మేనత్తగు రాధఁగూడి మేలజికమునన్.

గీ. గొల్లడందురు కొందఱు గొల్లగాఁడు
యాదవుండను వార్ష్ణేయు డందు రితని
గద్దెపై నెక్కరానట్టి క్షత్రియుండ
టందు రింకఁగొందరు తెల్పరా ? నిజంబు.

గీ. పొగరు విలుకాండ్ర గమికాండ్ర మొగముఁదన్ని
చాలఁగై చాపు లందుకోఁ జాలునట్టి
యేకలవ్యున కీతని కేలపుట్టె
జన్మవైరంబు సంయమీశ్వర ! వచింపు. 20

వ. ఇదియది యననేల ? శ్రీకృష్ణ చారిత్రంబున మీ రెఱింగిన యంత వట్టు మూలముట్టుగఁగల గుట్టుమట్టులఁ జెప్పరే యనవుడు సూతర్షి యత్యుత్సాహంబున నిట్టు చెప్పఁదొడంగెను—— 21

సీ. మిహిర బింబముఁగప్పు మిడుత దండునుబోలె
నార్యులు దండెత్తి యాక్రమింపఁ
బోరిపుచ్చఁజాలక యరికట్టనేరక
ప్రాలేయ భూధర ప్రాంతభూమి
'ద్రావిడమన్నీలు' త్యజియించి యందుండి
మధ్యదేశముఁజొచ్చి మాటుపడుచు
పంచబంగాళమై పొంచియుండిన సేన
గుదికట్టి యందందుఁ గూర్చి పెట్టి

గీ. చిన్నిరాజ్యంబు లెన్నియో సేకరించి
యేలుకొనుచుండ్రి వారు దోర్లీలమెఱయ
వేరమియు నొంటరములేక బెట్టుతోడ
కాల వైపరీత్యమునకుఁ గళవళించి.

సీ. పుండ్రహైహయ చైద్య భోజాంధకదశార్హ
సాత్వత యదువృష్ణి జాతులెల్ల
మధ్య దేశమునందు మహిత బలాఢ్యులై
యీతి బాధలులేక యేలుకొనఁగ
మాగధుండైన దుర్మదవైరివీరభం
జనపటిష్ఠుఁడు జరాసంధ విభుఁడు
సార్వభౌముండయి జనరంజకముగ నే
కాతపత్రముగాఁగ నవనియెల్ల

గీ. నేలుచుండ నార్యులు భీతి యినుమడింపఁ
తేజిపాటుఁ జూడఁగలేక దినదినంబు
కుటిల దుస్తంత్రములు పన్ని కొన్ని యెటులో
వీనిఁ దెగటార్పఁ దలపెట్టి వేచియుండ. 23

ఉ. కొండలచుట్టు నేర్పుమెయిఁ గోటనుగట్టి గిరివ్రజంబునాఁ
గొండొక పత్తనంబు ననుకూలముగా విరచించి దానిలో.
నుండి బృహద్రథాత్మభవుఁ డోడక రాజ్యముఁ జేయుచుండె దో
శ్చండిమ జాతివైరులను జంపుచు నింపుచుఁ గీర్తి యెల్లెడన్. 2

గీ. ఆ గిరివ్రజపురికి రహస్యపథము
కల దొకండందు నెవరైనఁ గాలువెట్ట
దుందుభులు మ్రోఁగుఁ దమయంత తూఁటుగట్ల
నెల్లరికి వారిరాకెల్ల నెఱుకపడఁగ.

కం. దేవీ పూజాశహితుఁడై
పావనుఁడై విప్రభక్తి పరతంత్రుండై
యేవేళ నీతిదొరఁగక
భూవలయము నేలుచుండెఁ బోడిమినతఁడున్.

యాదవపాదపంబునకు నంధక సాత్వత వృష్ణిభోజులన్
మీఁద దశార్హ వర్గమును మిక్కిలి కొమ్మలు వీరలెల్లరే
భేదములేక యెల్లపుడు వేడుకతో మధురాపురంబులో
వాదులు పుట్టకుండఁ బరిపాలనఁజేతురు ధర్మబద్ధులై.

రాజ్యకాంక్ష వీరలు మధురాపురంబుఁ
జేరుటకు ముందరణ్యాని జీవనంబు
సల్పుచుండెడివారు దోశ్శక్తి నమ్మి
వ్యాధవృత్తినిఁ జేపట్టి వాడికల్గి.

సీ. యోజింప యదువృష్ణి భోజాంధకాదుల
రాజవంశమువారు భోజకులులు
రాజయ్యె నందుచే భోజకులుండైన
యుగ్రసేనుండు యథోచితముగ
కంసాదు లాతని కన్నబిడ్డలు దేవ
కీదేవి కంసపృథ్వీదయితుని
పినతండ్రి దేవకజనపాలకుని బిడ్డ
యైనప్పటికిఁ గంసుఁ డామె సాఁకు

గీ. చుండె నుగ్రసేనుఁడు వృద్ధుఁ డోపకున్కి
రాజ్యభారంబువహియించెఁ బ్రాజ్యలీలఁ
గంసభూజాని మధురఁ జీకాకులేక
ప్రజలఁ గాపాడుచుండె దోర్బలముపేర్మి.

ఉ. బాంధవకోటి మెచ్చ నతి వైభవ భాసురలీలతో జరా
సంధుఁడు ధైర్యశాలియుఁ బ్రశస్త గదారణ శౌర్యశాలియున్
సింధురవైరివిక్రముఁడు చేసెను బెండ్లికొమార్త లిర్వురన్
బంధురబాహుశాలియగు పార్థుఁడు కంసునకిచ్చి పేర్మితో.

గీ. వినుము వసుదేవుఁడు కులము పెద్దయయ్యె
సకల యాదవ వారేయ జాతులకును
నతిపురాతన సంప్రదాయమ్ముచేతఁ
గాని బహుబుద్ధిబలమ్ము కలిగికాదు.

వైరి సంహతిఁ గడతేర్ప బలములేక
దేశము జయింపఁ దంత్రముల్ తెలియలేక
యౌర! పదుముగ్గురను బెండ్లియాడె నాతఁ
డొండు తోఁచక యూరకే యుండలేక

గీ. భోజవంశ్యులకును యాదవులకు నెపుడు
లోని పగలును బయలి చెల్మిలును గల్గి
యొకరినొక్కరు లోనమ్మ కుందురెందు
దురభిమానంబు నీర్ష్యయుఁ బఱగుచుండ. 33

కం. జనబాహుళ్యము కలుగుట
జనపతి తమ వంశమందు సంభవమగుటన్
జనులను మెచ్చక మురితోఁ
జనుచుందురు భోజకులులు సంభ్రమపరులై 34

కం. కృతవర్మయు నక్రూరుఁడు
శతధన్వుండును బ్రసేన సత్రాజిత్తుల్
పతులై భోజాంధకులకు
నతులగతిం దోడుపడుదు రవనీపతికిన్. 3

గీ. పెండ్లియయ్యెఁ బన్నిద్దరఁ బెళ్ళుమంచు
భోజకులముతో వియ్యంబుఁ బొందఁగోరి
జంకక పదుమూఁడవసారి శౌరసేని
మరులు పురికొల్పఁ బెండ్లికుమారుఁడయ్యె. 3

ఉ. ఓవనివారలుందెగడ నుబ్బరికించుచు భోజవంశ్యుఁడౌ
దేవకుకూర్మి బిడ్డయగు దేవకిదేవిని బెండ్లియాడె, ధా
త్రీవరుఁడై నయట్టి వసుదేవుఁడు భోజుల ప్రాపుగల్గునం
చీవిధిసంతసిల్లుచు నభీష్టములన్నియుఁ దీరునంచొగిన్. 37

గీ. కట్టి ! దేవకిమెడఁ దాళిబొట్టుగట్టి
నపుడె తన కురిత్రాడంచు నఱయఁడయ్యెఁ
గంసుఁడేమందుఁ జిత్రంబుగాదె ? చెపుమ !
యెప్పుడేపని యెటులౌనొ యెవ్వఁడెఱుఁగు ?

గీ. బావను జెల్లెలిఁ గంస
క్ష్మావరుఁ డనుకంపఁ జీర సారెలనెన్నో
ప్రోవిడి యరణంబిచ్చి మ
హా విభవముతోడ వారి నంపెడివేళన్. 38

గీ. తేజికొన్న దెందములతోఁ దేరిచూచి
తేరుపై నెక్కి వారలేతేరదారి
వారినవ్వారిగా ఘర్మ వారి పట్ట
సేదదేర్చికొనంగఁ బ్రస్వేదముడిపి.

ఉ. తెల్లనియెండ వీడ్వడుచు దేవకియున్ వసుదేవ కంసులున్
జల్లని నీడ చెట్లు వెదఁ జల్లఁగ హాయిగఁ దేరుడిగ్గి య
ల్లల్లన విశ్రమింప నడయాడుచు నందఱు చెట్లక్రిందకున్
మెల్లనపోయిపోయి విరమించిరి యచ్చట నింతలోపలన్. 41

వ. సమయంబునకై నిరీక్షించి, వెన్నాడి వచ్చుచు దట్టంపుఁ బొదల నట్టనడుమ నడంగి— 4

కం. ఆకాశవాణియనుకొనఁ
గూఁకలనిడె నార్యతాంత్రికుఁడొకఁడు "కంసా!
యీ కాంతాష్టమగర్భము
పోకార్చెడి నిన్ను" టంచుఁ బొడఁగట్టకయే.

వ. ఈ మాటలు చెవింబడిన వెంటనే యులికిపడి కంసుఁడు-

కం. కొంచించి యేమిచెప్పక
యించించుక నమ్మినమ్మి యేమయినపరే
వంచించి చెల్లెలిని మా
యించన్ మది నిశ్చయించె నేమనువాఁడన్.

సీ. కుటిలకుంతలఁ జూచి కుటిలాత్మకుండయ్యెఁ
గుటిల ప్రచారముల్ పెటిలుచుండ
శాతోదరినిజూచి శాతసత్వథుఁడయ్యె
శాతాసిఁ బాపంబు సల్పనెంచి
వక్రాలకంగాంచి వక్రమార్గుండయ్యెఁ
బ్రక్రమనయమెల్లఁ బాడువార
చపలాక్షిఁ బొడగాంచి చపలభావుండయ్యెఁ
గృపణవృత్తికిఁ జొచ్చి యపనయింప

గీ. స్వార్థమెంతటి పెడదారి పాలుసేయుఁ
దోడఁబుట్టిన యామెను దోడునీడ
యైన యామెను దరవాయి యలుకతోడ
గొప్పతరవారిఁ జేఁబూని కూల్పనెంచె. 46

వ. అంతటఁ గంసుని ముఖవైలక్ష్యం బుపలక్షించి వసుదేవుఁడడ్డంబు వొచ్చి
దీనస్వరంబున— 47

మ. సిరి సంపత్తులు, భోగభాగ్యములు దాసీదాస సంతానముల్
మెఱుపుందీవలు నీటిమీది బుడగల్ మీసాలపైఁ దేనియల్
పరమార్థజ్ఞులు వీనినమ్మి యెపుడున్ బాపంబు గావింపఁబో
వరుసుంతేనియు ధర్మదూరులయి బావా! నీవు చింతింపవే. 48

గీ. తల్లిమాటునఁ బెఱిఁగిన పిల్ల, బేల,
వాలకం బెఱుఁగని గోల యేల? చాల
వాలుకందోయి కన్నీటి జాలువెడల
బాల బొరిపుచ్చఁ బాడియే జాలిలేక.

సీ. మంగళాభ్యంజన మహితకేశంబుల
నట్టొట్లుపడుట మానంగలేదు
అగురుకెంజిగురాకు నవఘళించెదునట్టి
యడుగుల పారాణి యాఱలేదు

పచ్చబ్రాల్ తలనుండి పడుటచే నైనట్టి
పసుపు బట్టల నేని పాయలేదు
క్రొత్త పెండ్లికొమార్త కొంగ్రొత్తగాఁబొందు
మందాక్షమెనను మానలేదు

గీ. పెండ్లిపీటలపై నుండి పెళ్ళగించి
యత్తవారింటి కంపెద నరణమిచ్చి
యంచుఁ గొనివచ్చి చెల్లెలి నక్కటకట!
గొంతుఁగోయుట ధర్మమా చింతమాని.

కం. కావునఁ గరుణింపవె యొక
త్రోవను జూపింతుదానఁ దొలఁగుసునీకున్
బావా! ప్రాణభయము మఱి
దేవకిజీవంబునిల్పుఁ దికమకలేలా? 51

కం. బిడ్డలు పుట్టినయపుడే
యడ్డంబులు చెప్పకుండ నర్పించెద, నే
నొడ్డులు తలపెట్టక నీ
హొడ్డారింపకయె ప్రోవు ముగ్మలిననినన్. 52

ఉ. భోజకులైకభూషుఁడు ప్రభూతముదంబున నాలకించి యం
భోజముఖిన్ సహోదరిని ముగ్ధను నూరక చంపనేల? యీ
యోజ నుపద్రవంబుడుగు చుండిన నంచుఁ దలంచి వెంటనే
వాజులఁబూన్చి తేరుపయి బావను జెల్లెలిఁ బెట్టితోలుచున్.

గీ. అత్తవారింటి కిర్వుర నంపి, తిరిగి
వచ్చి కంసుండు తల్లడ పాటుఁదొరఁగి
కొంతకాలంబు మధురలోఁ జింతలేక
యుండ నఖిలమాదమఱచి యొక్కనాఁడు.

కం. వసుదేవుఁడు తొలికాన్పును
గసిగందును దెచ్చియీయఁ గంసనృపుండున్
గసిమసఁగం జేయాడక
పసిపాపను నిచ్చి చెప్పె వసుదేవునితో. 55

కం. ఈ పాపని మూలంబున
నాపత్తులు నాకు నేమి యరుదెంచును ? వో !
వో ! పాపనిఁ గొని నే
నీపనిఁ జేయంగనేర నెట్లయిన సరే ! 56

వ. అని చెప్పి కంసభూజాని వసుదేవునిఁ బంపివైవ; నేనాఁడు కంసుండుదరి పడి, తనకుఁ బ్రాణోపద్రవంబుఁ గలుగఁజేయునో, యేనాఁడు తనకన్న బిడ్డనుఁ దనకుఁగాకుండఁజేయునో యను భయంబు నిరంతరంబు పీడించు చుండఁ జేయునదిలేక— 57

కం. ఆనక దుందుభి భయమును
మానక శోకాగ్ని దగ్ధమానసుఁడగుచున్
మానవనాయకుఁ జంపఁగ
దైనందిన మధికకుటిల తంత్రుండగుటన్. 58

కం. చక్కఁగఁ గంసుఁ డిదియెఱిఁగి
గ్రక్కున వసుదేవుఁబట్టి కారనుబెట్టెన్
గ్రుక్కిళ్ళు మ్రింగ సతితో
వెక్కసమైనట్టి కోప వేగముచేతన్.

గీ. గర్భవతిగానఁ జెఱసాలఁ గాపువెట్టి
కన్నబిడ్డను మ్రందించి కత్తివాతఁ
బ్రాణభీతిని సర్వంబుఁ బాపికొందు
ననుచు నట్టహాసంబుతో నతఁడు పల్కె.

వ. మనంబు సంచలింప సంశయగ్రస్తుండై యిట్లు తలంచె — 61

కం. అష్టమగర్భంబనునుడి
స్పష్టముగా నేను విన్నవాఁడనొ లేదో ।
కష్టము నాకేటికి నా
యిష్టము వచ్చిన తెఱఁగున నేఁ జరియింతున్.

కం. బూమెలు చెప్పఁగ నేలా ?
యేమనుజుని నమ్మనేల ? 'యేపుట్టను నే
పామున్నదొ' యెవ్వఁడెఱుఁగు ?
ప్రామిడి యన్నంత నేమి పై బడునంచున్ ? 63

కం. గొల్లరు మనఁ దలిదండ్రులు
నల్లురనెల్లరను బట్టి హతమొనరించెన్
జెల్లాచెదరై పోయిన
యుల్లము కుదుటఁబడఁగంసుఁ డుగ్రుండగుచున్. 64

గీ. అంత గొన్నాళ్ళు చనిన యనంతరమ్ము
చెఱను దేవకి ప్రసవించెఁ జిన్నికృష్ణు
దొంగప్రొద్దున నెల్లరు దొంగినపుడు
కావుకావంచు మార్మ్రోగెఁ గారయెల్ల. 65

గీ తల్లిదండ్రులు శోకమోదములఁబొంది
వీని బ్రదికించు టెటులంచుఁ బిఱికిఁబడఁగఁ
గడకు వసుదేవుఁ డారాట ముడిగి పిదప
నొక యుపాయంబుఁ దలపోసి యొదిగి యొదిగి. 66

ఉ. కావలివారిఁ గట్టికొని కాళుల సంకెల లూడ్చిపుచ్చి యా
త్రోవకు నడ్డమౌ యమున తోయములం దిగి పాటిరేవులో
నావలిగట్టుఁజేరెఁగద యానక దుందుభి నెత్రుకందుతోఁ
గేవల పుత్రమోహమునఁ గ్రిందును మీఁదునుజూడకుండఁగన్.

కం. నెత్తురుకందును బొమ్మన
హత్తించికొని వసుదేవుఁడరిగె నిశీధిన్
బిత్తరపడకడవింబడి
యెత్తిన యీ పుత్రమోహ మెంతకుఁదగదో ? 69

గీ. నందగోపకుండు బృందడగ్గఱకాన
వల్లవులను గూడి పల్లెఁ గట్టి
యాలకదుపులెన్నొ యార్జించెఁ గొల్లఁగా
సొమ్ములన్ని తనకు సొమ్ముగాఁగ.

ఉ. ఎచ్చటఁ జూచినంబసులె యెచ్చటఁ జూచినఁ దొడ్డిపట్టులే
యెచ్చటఁ జూచినన్ గదుపు లెన్నియొమేపు కిలారి మూఁకలే
పచ్చని బీళ్ళపైఁ బరుగు వారెడి చక్కని కోడెదూడలే
ముచ్చటఁ గొల్పుచుండు వనభూముల నందునిపల్లెయంతటన్. 70

కం. గోరాడు గుట్ట మెట్టల
గోరాజులు బటువుగుబ్బ కొమ్ములచేతన్
గాఱలు తిరిగిన మెడలును
గాఱునలుపు మూపురములు గలిగి కడంకన్. 71

సీ. పుల్లావు లొకవంకఁ బుల్లు మేయుచునుండ
నల్లావు లొకవంక నమలుచుండ
కఱియావు లొకవంక గాడివద్దను మేయ
దోరావు లొకవంక దొడ్డినుండ
మసరావు లొకవంకఁ గసవు మేయుచునుండ
మైలావు లొకవంకఁ బాలుపితుక
వెల్లావు లొకవంకఁ బేరెమేగుచునుండ
బొట్టావు లొకవంక బయట నిల్వ

గీ. పొందుకల్గి నందుని యాలమందపట్టు
దోసతోటట్టు చేయుఁ గందోయి విందుఁ
బాడికదుపులు కొదలేక పాడియిచ్చుఁ
దమకుఁ దమవారికిని వెక్కసమగురీతి. 72

గీ. కదలుచేయని కోడెలు కాలుద్రవ్వి
మోరవంచి అంకెలిడ మార్మ్రోగ దొడ్డి
కట్టు కారుపెయ్యలు తోక లట్టెయె త్తి
మెడలు సారించి మూచూచు మేఁతమాని. 73

చం. తలుగులమోపు, చిక్కములు దామెనలున్ మొగముట్టుచుట్టలున్
బలుపులు, కట్టుగుంజగుదిబండలు, పెన్ సెలకోలకట్టలున్
బలుతలత్రాళ్ళు, మువ్వమెడ పట్టెలు, బందము, లెన్నియెన్నియో 74
కలిగిన నందగోష్ఠములు కన్నులపండువు సేయు నిత్యమున్.

ఆ. వె. బడుగుక్రేపుగాని చెడిపెపెయ్యయుఁగాని
గోవయావుతెవులు గొంటుగాని
కరటువంజగాని కనముమందున కైన
నందునాలమంద యందునెందు. 75

గీ. అతని ధర్మపత్ని యశోద యనెడి యామె
యాడుబిడ్డను బ్రసవించె ననుటతెలిసి
యాత్రపాటుతో బిడ్డను నదిమికొనుచు
నేమియో తలంచికొనుచు నేగెనటకు.

గీ. వెలుగుకోటలేని వ్రేపల్లియకునేగి
కదలకుండ నుంత మెదలకుండఁ
బొంచి పొంచి పోయి పురుటాలిపొదిగిళ్ళ
బిడ్డనుంచి యామెబిడ్డఁగొనుచు.

వ. కటికచీఁకటిలో దారితెలియమిచే నిట్టట్టుపడిపోయి తుట్ట తుదకెట్టులో మరల యమునదాటి చెఱసాల బ్రవేశించి, యాడుచంటిపాపను దన పురిటియాలికిచ్చి యేమియెఱుంగని వానిఁబోలెఁగాళ్ళకు సంకెళ్ళు దగిలించుకొని నందు నిదురించుచుండె. ఇంతలోఁ జెల్లెలు ప్రసవించినమాటఁ గావలివారివలనఁ దెలిసికొని కంసుండు గారా గృహంబున కరుదెంచి చెల్లెలు కంటదడిపెట్టి వలవల వాపోవుచున్నను సరకుసేయక పసికూనను బలవంతముగా విసరి లాగికొని యట్టె యాకసమున కెగురవైచి కత్తివాత కెఱఁజేసి మగిడి చనియె. ఇంక నచ్చట వ్రేపల్లెలో— 78

గీ. నందునింటను గృష్ణుఁడా నందగరిమఁ
బెరుఁగుచుండెఁ బెరుఁగుఁద్రావి వెన్నఁదినుచు
నామెతగమేను మిసమిస లాడుచుండ
నేమితక్కువ కలవారి యింటబిడ్డ ? 79

గీ. నందగోపకు చెల్లెలు నాతిమిన్న
రాధయనునామె ప్రేమైక రసముతొలక
సతత మల్లారు ముద్దుగా సాఁకుచుండె
ముద్దుకృష్ణుని దుండగంబుల సహించి. 80

గీ. ముద్దుకృష్ణుండు క్రమముగాఁ బెద్దయగుచుఁ
గొంటెకృష్ణుఁడై యావుల వెంటబడుచుఁ
గానలన్నియుఁ దిరుగుచుఁ గాయనేర్చె
నెటులఁ ద్యజియించుఁ గులవిద్య నెవ్వఁడేని ? 81

గీ. మందకట్టుఁదప్పి మర్యాదలనుదప్పి
మందఁగాయనేర్చె మందలందు
మందకాయువారు మందెమేలమ్మంద
మందలందునేర్చె మాటలెన్నొ. 82

కం. నందుం డా వ్రేపల్లియ
కుందొర యటె లేక లేక కొడుకొక్కఁడచే
దుందుడుకు పనులు నేర్వక
మందునివలె నెట్టులుండు మర్యాదలతో ? 83

కం. గారాపుబిడ్డఁ డగుటన్
మారాములు పెక్కుఁజేసి మఱిమఱియెన్నో
ఘోరాములు గూర్చికొనియె
నారామలతోడఁ గృష్ణుఁ డభిరాముండై. 84

వ. ఒక్కొక్కనాఁడు కొంటెకృష్ణుండు చెలికాండ్రనుగూడి యమునానదీ
తీరంబునఁ విల్లంబులు దాల్చి తిప్పకాయయై— 85

గీ. గోపికలు నెత్తికుదురుపైఁ గుండలుంచి
కొనుచు యమునాజలముఁదెచ్చికొనుచునుండ
నొక్కయమ్మునఁ గుండకు బొక్కవెట్టి
నీరుకారనీ కప్పుడే నిల్పునొకట. 86

కం. మందలకడనుండియుఁ దాఁ
బెందలకడ రాఁడిదేమి వేడబమనుచున్
వందురు నెప్పుడు ముంగిట
ముందల మేనత్తరాధ మఱిమఱిపడుచున్. 87

కం. ఇంటికి వచ్చిన వెంటనె
తుంటరి; మేనత్తరాధ తొందరపడి వె
న్నంటుచు "నాయన్న జడిసి
కొంటివె" యని బుజ్జగించి కొంపోయివెసన్. 88

గీ. ఆపు వెన్నతో నొడలెల్ల నలమి తోమి
గోరువెచ్చని నీర్వోసి కోకఁదుడిచి
యగురు సాంబ్రాణి పొగవెట్టి యప్పుడపుడె
"రార ! నాయన్న !" యని చెప్పి రాధ యంత.

గీ. ఆవునేతిలోఁ బొరలించి నట్టి కూర
గాయలాఱురసంబులు గల్గు మేలు
వంటకము సిద్ధపఱచి సాపడఁగఁబెట్టి
కడను గూర్చుండుఁ కృష్ణుఁడు గుడుచునపుడు. 90

గీ. యాదవుండయ్యె యదువంశ మందుఁబుట్టి
గోపకునియింట వర్ధిల్లి గొల్లఁడయ్యె
దానిచేత గోపకులు యాదవులుగారు
యాదవులు గోపకులను గా రరసిచూడ. 91

కం. యదువంశాంతర్గతమయి
పొదలిన వృష్ణికులమందుఁ బుట్టుటచేతన్
బదిలుఁడు శ్రీ కృష్ణుఁడు భూ
విదితుఁడు వార్ష్ణేయుఁడనెడి పేరన్ వెలసెన్. 92

వ. ఇట్లు శ్రీకృష్ణుఁడు శైశవక్రీడారతుండై నందగోష్ఠంబులఁ దిరుగువేళ— 93

గీ. రాధ యనుగోపబాలికా రత్నమూర్తి
నవ్యతారుణ్యలావణ్య దివ్యగాత్రి
నందు మందఁగీలారి తనమ్మునందు
మెలఁగుచుండును సర్వదా మిట్టిపడుచు. 94

వ. కాలగతి వ్రేపల్లెలో నందుని యాలమందలో నొకరితో నొకరికిఁ బొత్తు కుదుర రాధాకృష్ణు లిర్వురు నీడుజోడై శైశవక్రీడల నిరంతరంబు ప్రొద్దులు పుచ్చుచున్న కతంబునఁ బరస్పరానురాగంబంకురించి క్షణక్షణ ప్రవర్ధమానం బగుచుండ— 95

గీ. ప్రొద్దుపొడుపుమొదల్ ప్రొద్దు గ్రుంకువఱకుఁ
జిన్నికృష్ణరాధలకట్టై చెలిమికల్గి
యొకరినొక్కరు విడనాడి యుండలేక
తనిసి వింత సుద్దులు చెప్పుకొనుచునుంద్రు. 96

గీ. ఊరములనుదూరి యేటితీరముఁ జేరి
చెట్టునీడ నక్కి గట్టులెక్కి
ప్రణయమగ్నులగుచు రాధికాశ్రీకృష్ణు
లాడుకొందు రెవరు చూడకుండ. 97

మువ్వకోడెల మెడనూలి మువ్వలులియ
మురువునడచేత మొలనూలి మువ్వలులియఁ
దమ్మితూఁడుచే నదలించి తఱుముకొనుచు
వచ్చు రాధ శ్రీకృష్ణుని పజ్జకెపుడు. 98

వెన్నెలకారునం జెలఁగి వెన్నెల నవ్వున వెన్నుఁ డొక్కచో
వెన్నెలరేల రాధఁగొని వెన్నెలకుప్పల నాడియాడి యా
వెన్నెలపుల్గులో యనఁగ వీడక జోడునుగూడిమాడుచున్
వెన్నలదొంగ రాధయును బృందఁ జరింతురు బద్ధరాగులై. 99

సీ. ఇఱుకు గుబ్బలమధ్య యిఱికి పిసాళించు
పుంజాలదండ చన్మొనలఁజిక్క
పుంజాలదండలోఁ బువ్వాటలాడెడి
పులిగోరు పతకంబు గులకరింప
తొడవుగా నిడినట్టి మెడనిండ మెలివడ్డ
గురివెంద పేరులు గునియుచుండ
పచ్చరాల్ దాపిన యచ్చగుండుల సరుల్
మిట్టగుబ్బలమీఁద మిడిసిపడఁగ

గీ. నడ్డబాసయు ముంగెఱ నటమటింపఁ
గాలియందెలు గల్లురు గల్లురనఁగఁ
జొక్కపుందీవి రాధిక చొక్కుచుండుఁ
దనదు సోయగంబునుజూచి కొనుచుఁ దనిసి. 100

చం. తుఱుము విదల్చుచున్నపుడు తొంగలితుమ్మెదఱెక్క వెండ్రుకల్
పిఱుఁదులమీఁద జారిపడి పెక్కటిఁ మిట్టిపడంగ ముంగురుల్
మురువుమొగంబుమీఁదఁ బడ ముద్దులమూటనుగట్టు రాధికా
తరుణి హరించుఁజూపరుల ధైర్యము పుత్తడి బొమ్మలాగునన్. 102

గీ. ప్రొద్దుపొడవక మునుముందె పొరలిలేచి
దూవుముడిలోన విరిపూలు తుఱిమి, తుఱిమి
చెలఁగి చిన్నికోలను రాధ చేతఁబట్టి
తోలుకొనిపోవు నామంద దొడ్డినుండి. 103

సీ. జాఱుపయ్యెఁటనట్టె సవరించు నెపముచే
వలుఁదపాలిండ్లఁ గన్పఱచుచుండు
కందోయి మూసికో కలదు చిత్రంబంచుఁ
బూదుమారంబులో ముంచియెత్తు
గుమ్మపాలను దెచ్చి కోకొమ్మ నాసామి
యనిపాలదుత్తను నందియిచ్చు
కనుగొమ్మ నే నెవ్వర్తనొ యంచుఁ గనుమూయు
వెనుకగా బొమ్మలు వెన్నునాన్చి

గీ. తెలిసియో తెలిసికొనకో కలికిమిన్న
దొంగకృష్ణుని ప్రేమంబు దొంగిలింప
జగములన్నియు ఁగ్రమింగఁ జాలుజాణ
కందచందము లెన్నియో యట్టెచూపు.

గీ. మిట్టుగబ్బిగుబ్బల మొనల్ మీటి చింపు
ననుచుఁ జనుకట్టును దొడిగి కొనుటమాని
పైఁట చెఱఁగున బొమ్మల పట్టుఁగప్పఁ
బట్టి యెఱుఁగఁబోమిటువంటి పొదుపులాఁడి.

ఉ. రాగములేని రాధ యనురాగము క్రొన్నన సాగుచుండఁగా
రాఁగ ముదంబు కృష్ణుని సరాగములాడెడి కోర్కెఁపుట్టఁగా
రాగముఁదీయుచున్ సుమపరాగము పై విదలింపఁ బట్టుకో
రాఁగ మురారి, యందకయె తాఁగతనంబున దాటు జాణయై. 105

ఉ. వెన్నుఁడు రెండుచేతులను బిల్లనగ్రోవిని గావిమోవిపైఁ
బన్నుగఁబెట్టి మైమఱచి పాడుచునుండఁగఁ బూవుటెత్తులన్
గొన్నిటిఁదెచ్చి వంశమునకుం గయిసేయుచు రాధ మాయమై
మన్ననమాలి పూఁబొదల మాటున డాఁగిలిమూఁతలాడెడిన్. 106

సీ. కొండగోఁగులపూలు కొండె సిగం జుట్టి
కొండాడుచుండు మా కొండఁడంచు
నెమ్మికుంచియఁ దెచ్చి నెత్తిపైఁ గుదిరించి
కుదిలించి యూఁగించి కులుకులాడు
బుఱ్ఱటకొమ్ములో బుక్కాము విరఁజిమ్మి
"యేర! మాధవ!" యంచు నెత్తిపొడుచు
బొండుమల్లెలదండ దండ చేతికిఁగట్టి
దండంబు నిడుచుండు దండనిల్చి

గీ. పూనిగొల్లెత వాతెఱ పానకంబొ!
పూవుఁదేనియయో! యిచ్చుఁ బుక్కిలింత
కలవిగాకుండ, నాపోవు నామతించి
జాజిపూవుల పొదరింటి చవికెయందు. 107

సీ. కేతకీ కుంజంబు క్రేవల కేగితే?
చెక్కిళ్ళపై నుండెఁ జిన్ని గీట్లు
వకుళావనీజంబు వద్దకుఁ బోయితే?
మొగమెల్లఁ బుప్పొడి పులుముకొనియె

క్రొమ్మావిగున్నల క్రొన్ననల్ కోసితే ?
యెంతో నీ మునివ్రేళ్ల లెఱ్ఱవడియె
ముండ్లతీవెలుగల్గు పొదరిండ్లు దూరితే ?
చెదరి నీకీల్గంటు చిక్కువడియె

గీ. నొక్కచోటను నీవు కూర్చుండలేవె ?
కాలు కుదురదే నీకెందు ? బాలయంచు
చిట్టివ్రేలితో మెల్లగాఁ జెంపమీటి
ముద్దుకృష్ణుండు రాధను బుజ్జగించు.

సీ. కర్ణికారముఁదెచ్చి కర్ణయుగ్మంబున
సొగసుగాఁ గీలించి సొక్కుచుండు
మెట్టదామరదండ మెడనిండ దిగవైచి
ముసిముసి నవ్వులో మునుఁగుచుండు
కలువపూవులపేరు కలకంఠి సిగచుట్టు
జాఱకుండఁగఁ జుట్టి సంతసించు
పొగడొందు క్రొందావి పొగడపూవుల సరుల్
మణిబంధమునఁ జుట్టి గొణుగుచుండు

గీ. మోముదమ్మిపైఁ బుప్పొడి బొట్టుపెట్టి
యూఁగు నెమలియీఁకలఁజూచి యురలినవ్వ
ముద్దుకృష్ణుని రాధిక ముద్దులిడుచు
మెలఁగు బృందావనీవీథి మేనుమఱచి.

సీ. రోమాంచములచేత రోమంథములు మాని
నిలువుగ్రుడ్డున నాలు నిలిచియుండ
కాళింది బేడిసమీలెల్ల నెదురెక్కి
వేలంబునకుఁజేరి వినుచునుండ

గంధ్రమాకుల డిగ్గి కాలాహితండంబు
నిలువునఁ బడగెత్తి నిలిచియుండ
ప్రేపల్లెలోనున్న ప్రేతలు గుదికట్టి
పనిపాటలను డించి వచ్చుచుండ

గీ. చాల విరిపూలు జలజల రాలుపొగడ
నీడలోనఁ ద్రిభంగిగా నిలిచియుండి
మురళి చేఁగొని విశ్వ సమ్మోహనముగఁ
బాట పాడును దనరాధ ప్రక్కనున్న. 110

ఉ. ప్రొద్దున మేలుకాంచి నవ మోహిని రాధఁ దలంచికొంచు పే
చద్దిని వెన్నతో మెదిపి సాపడి మెల్లననూదు గ్రోవినిన్
దద్దయుఁబట్టికొంచుఁ దన దారిని మందకుఁబోవు నెప్పుడున్
ముద్దియయైన రాధ నెటి ముద్దుమొగంబునుజూచు కోర్కెమై. 111

కం. వాగరమ్ముల వలె నను
రాగాతిశయమ్ముచేత రాధాకృష్ణుల్
భోగా భోగముల మఱచి
యోగీశ్వరులట్లులుందు రొకటై యెపుడున్. 112

గీ. ఇంటికడ మందకడ రాధ కృష్ణమూర్తి
కన్నుదోయికి నిండారఁ గానుపించుఁ
గృష్ణునకు రాధమయమయ్యె నీజగంబు
పగలురేలను భేదంబు పాసిపోవ. 113

గీ. బృందయంత గోగోపికా బృందమెల్లఁ
గృష్ణమయమై కనంబడు నెల్లయపుడు
రాధికాచకోరాక్షి నేత్రయుగమునకు
నొండుగనరాడు శ్రీకృష్ణుఁ డొకఁడుదక్క. 114

కం. ఓరంత ప్రొద్దోకండే
యూరంతయుఁ దిరిగితిరిగి యుబలాటముతో
గోరంత భయములేకయె
కేరింతలనింటి కరుగుఁ గిలకిలనగుచున్.

సీ. ముక్కు-గోళ్లబికించి మోరెత్తుముడిగిబ్బ
నఱచేతి దెబ్బతో నదిమిపట్టు
కాల్ద్రివ్వి పోరాడు కారుగిత్తలనొత్తి
యొక్క-ఁడే పోరాట ముడుపుచుండు
ఱంకెవేసెడికోడె యంకెవేసిన ముట్టి
తెగియించి చెవిఁబట్టి తెచ్చునొకఁడె
కాళ్ళబంధముదూసి క్రేళ్లవారెడినఱ్ఱ
బదరించియొక్క-ఁడే పట్టితెచ్చు

గీ. ఒరులు సేయంగనేరని బిరుసుపనుల
నెన్నియెన్నియొచేయుచు నెన్నరాని
మిత్రకోటిని గడియించి మెలఁగు ననవ
రతము, కృష్ణుండుయౌవనారంభవేళ.

సీ. జగజెట్టిచనుదేరఁ జలపట్టి పోరాడి
తనచల్లడముక్రింద నణుపుచుండు
బుసకొట్టునెలత్రాఁచుఁ బుట్టకల్గుననుండి
వెస బైటకునులాగి విసరికొట్టు
అలవోకకారుదున్నల కొమ్ములనుబట్టి
నిమిషంబులో వాని నిల్వరించు
ఎత్తైన నెత్తమ్మ్రి లెగఁబ్రాఁకి గండభే
రుండకులాయముల్ రోయుచుండు

గీ. ఆకతాయి పనులనిట్టు లాచరించు
గోపబాలురతోఁగవ గూడిబృంద
నిండుమురితోడఁ జరియించు చుండు ననవ
రతము కృష్ణుండు యౌవనారంభవేళ. 107

మందా. వాసింపన్ శారద రజనులన్ బాండురజ్యోత్స్నచే ను
ల్లాసంబొప్పన్ వ్రజ తరుణులెల్లన్ బిసాళింప రారా
జైసంతోసిల్లి మురహరుఁడున్ యౌవనారంభవేళన్
రాసక్రీడా చతురుఁడగుచున్ రాజిలున్ బృందలోనన్. 18

సీ. కారానిపోరాని గహన భూములనెల్ల
ద్రిమ్మరీఁడై దిమ్మ దిరుగనేర్చె
తెలినీట యమునలో జలకమాడెడి గోపి
కల కోకలను మూటఁ గట్టనేర్చె
తనతోడనాలమందలఁగాయువ్రేతలన్
జిట్టంటు చేతలన్ ముట్టనేర్చె
కొండాటముంగోరి కొంపకొంపలు దూరి
మిసిమివెన్నలముద్ద మెసవనేర్చె

గీ. కొంటెతనమేల రాకుండు గొప్పయింటి
బిడ్డకును జెల్లుబడి యుండ నడ్డమేమి ?
అవును గాదనువారెవరైన నుండు
వారె నిజముగా నొక గొల్ల పల్లెయందు.

వ. క్రమముగా శ్రీకృష్ణుండు పెఱిగి పెద్దయై చెలరేఁగి—

సీ. ఒకనాఁడు పెనుబండి నూడి కూలఁగఁదన్ని
నొకనాఁడు పెన్త్రాఁచు నుక్కడంచు
ఒకనాఁడు సుడిగాలి నురలించియెగఁజిమ్మె
నొకనాఁడు కార్చిచ్చు నుమిసివైచు

ఒకనాఁడు గాడిద నోడించి పౌరిపుచ్చు
నొక్కనాఁడాంబోతు నుసురుఁదీయు
ఒకనాఁడు యమునలో నుంకించి వెసదూఁకు
నొకనాఁడు రాకాసి మొకముఁఁబన్ను

గీ. వీనిఁ గనుచున్న రాధిక బేలుపోయి
దేవునంతటివాఁడంచు భావమందు
నమ్మి ముద్దుకృష్ణుని ప్రక్క నక్కియుండి
నిరతమాతని జపియించుఁ బరవశమయి. 121

గీ. మరులు జడవేసి కై సేసి మరులు గొల్పఁ
"జెన్నకృష్ణుండు" రాధిక చీర చెఱఁగు
గట్టిగాఁబట్టికొని, పోవుఁ గాలికొద్ది
మరులు జడఁద్రొక్కినటువంటి మనుజుఁబోలె. 122

చం. పసులను గాయఁబోయెడి నెపంబున మందకుఁ బోయికృష్ణుఁడున్
బసులనుగాయకుండఁ బొరపాటుననైనను, రాధఁగూడుచున్
దుసికిలుచుండెనంచువిని త్రొక్కిపలాడక మేనయత్త తా
ముసిముసినవ్వునవ్వుకొని మోదమునందుచునుండు రాధయున్. 123

ఉ. రాధికఁగూడిమాడి యనురాగమునన్ నిరతంబునున్ రసాం
భోధినిమగ్నుఁడయ్యుఁ దల మున్కలుగాఁ జరియింపుచుండియున్
మాధవుఁ డెంతమాత్రము, ప్రమత్తుఁడుగాక మనంబులో సదా
ఘ్మెధవుఁడైన మాతులునిఁ గంసునిఁగూర్చి తలంచె నీగతిన్. 124

ఉ. క్రోధపరీతమానసుఁడు క్రూరుఁడు భోజకులాభిమాన సం
బాధితుఁడైన కంస జన పాలుఁడు జీవముతోడ నున్నచో
గాథలు చెప్పనేమిటికి ? గల్గునె యోగము రాజభోగమున్ ?
బాధలు తీరునే ? తుదకుఁ బ్రాణముమీఁదికి రాకయుండునే. 125

గీ. భోజ దౌర్జన్యవాహిని పొంగి పొరల
నానకట్టను వేయక యాఁగియున్నఁ
బొడిచి యాదవ ద్వీపంబు ముంచివైచు
నంచు నిరతంబు లోలోఁ దలంచుచుండు. 126

గీ. సార్వభౌముండనని జరాసంధ విభుఁడు
సరకు సేయుటమానె నెవ్వరినిఁగూడ
వానిఁదెగటార్పకున్న లాభంబులేదు
పురుషకారంబు మానుట పోలదిపుడు. 127

గీ. హంసడిచికసాళ్వనరక కంస దంత
వక్త్రశిశుపాల పౌండ్రక వాసుదేవ
దివ్యధానుష్కమత్యేకలవ్య ముఖర
యోధులను గూడి వర్తించు చుండు నతఁడు. 128

ఉ. ఒక్కొకవంకఁ బెట్టుకొని యొక్కొక వీరవరున్ గ్రమంబుగా
నొక్కకపట్టునందు సమరోర్వినిగూలిచి మాగధేంద్రునిన్
ఱెక్కలులేని పుల్గునొనరించి హరించుట యొప్పుఁగానిచో
దక్కునె రాజ్యభోగములు ? దక్కునె రాచరికంపుమన్ననల్ ? 129

గీ. కాని కథయొక్కటున్నది కదనమందు
నొంటరిగఁ బోరుసల్పుచో నోటమబ్బు
మాగధుఁడు దివ్యసేనా సమన్వితుండు
శత్రుభీకర యుద్ధ విశారదుండు. 13

ఉ. నిట్టలమైన నేర్పుమెయి నిత్యము మాగధవైరిపాళితోఁ
జుట్టఱికంబుఁజేసి రణశూరుల వీరులఁ గ్రోవుచేయుచున్
గుట్టుగ సైన్యసంపదను గూర్చుటమిక్కిలి రాజనీతి, యే
దెట్టులనైన సాయమగు నీపనిచేత దురంబుకల్గినన్. 131

గీ. అంచుఁ గృతనిశ్చయుండయి యావులించి
యప్పుడే యుద్దవిడిలేచి యరిగె నింటి
కొకఁడె రాధకడకుఁబోక యొక్కనాఁడు
కార్యభారంబు మనసులోఁ గలఁతపెట్ట. 132

సీ. చరణాబ్జ యుగ్మలాక్షారసం బొకమాటు
పగవారిక్రొన్నెత్తు వాఁకయొకట
ముగుద వాలుంజూపు మొత్తంబు లొకమాటు
వైరుల తూపుల బారులొకట
మదనరంగస్థలీ మండనం బొకమాటు
కదనరంగస్థలీ గరిమమొకట
కామతంత్రపరీత కార్యంబు లొకమాటు
రాజ్యతంత్ర రహస్య రాజినొకట

గీ. కలలు గనుచుండె రేలెల్లఁ గళవళించి
యన్యదుర్లభమైన కార్యంబుఁజేయఁ
బూనికఁ గైకొన్నవాఁడౌటఁ బోహళించి 133
కునుకుపట్టునే కార్యాతురునకు నెందు ?

వ. దూరదృష్టియు, దివ్యదృష్టియుఁగల్గి శ్రీకృష్ణుండు వెంటనే బహుబాంధవ సంపాదనంబునకై నడుముకట్టికొని బహుళ ప్రయత్నంబులఁ జేయసిద్ధపడి— 134

సీ. భోజక్షమానాథు పుత్రి రుక్మిణి చెట్ట
వట్టెను రాక్షసోద్వాహమందు
బూటకంబులు చెప్పి పొరపుచ్చి సత్యభా
మను వివాహంబాడె మరులుచూపి
విందానువిందుల ప్రియసహోదరి మిత్ర
విందను మెలపుతోఁ బెండ్లియయ్యె
నగ్నజిన్నృపుని నందన నాగ్నజిత్తిని
బరిణయం బాడెను బందెమొడ్డి

గీ. నరకుఁ బొరిపుచ్చి దురమందు నరులుబెగడఁ
బెండ్లిపెండ్లంచుఁ బదియారు వేల రాచ
కన్నెలకుఁ దాళిఁబొట్టును గట్టివైచె
మధ్యదేశంబు బాంధవమయము గాఁగ. 135

గీ. అతి భయంకరాటవులందు యమునయొద్ద
స్వైరవృత్తిని నిరతంబు సంచరించు
నాటవికకన్య కాళింది యనెడు నామెఁ
బరిణయంబయ్యెఁ దనవార లెఱుఁగకుండ. 136

గీ. మద్రవసుమతీనాథు కౌమార్తయైన
భద్ర గుణసముద్రను భూరి వైభవమున
మత్స్యయంత్రంబుఁ బడఁగొట్టి మహితశక్తిఁ
బెండ్లి పెద్దలు వెఱగందఁ బెండ్లియాడె. 137

గీ. కొండగవులయందుఁ గ్రుమ్మరు భల్లూక
జాతి జాంబవంతుఁ జావఁగొట్టి
వానిబిడ్డ జాంబవతిని బెండిలియాడె 138
నడవిజాతి పొందు నానఁజేసి.

గీ. యాదవాన్వయులకును భోజాంధకులకుఁ
గలుగు వైమనస్యంబెల్లఁ దొలఁగిపోయె
రుక్మిణీ సత్యభామా సరోజ పత్ర 139
నేత్రల వివాహములచేతఁ జిత్రముగను.

వ. ఇట్లు గృహచ్ఛిద్రంబులనెల్ల నుడిపికొని బలవంతుండై మంత్రదత్త ప్రభావంబుచే నత్యుత్సాహంబునంజెలరేఁగి, మింటికి మంటికిఁ దాళమువేయ నెంచుచుండ—

ఉ. మాగధుఁ డీయుదంతము సమ స్తముఁ జారులచే గ్రహించి యీ
యాగడ మేమి ? యాదవునకా తలవంచుట మాగధుండు ? భూ
భాగమునన్ జరాసుతుని బాహుబలంబున కడ్డుగల్గునే ?
సాగునె యిట్టిచిత్రములు ? సాగునె యీ విపరీతకర్మముల్. 141

గీ. ఓడుగోరు పెచ్చని నల్ల నొలసి ముద్ద
కట్టినట్టి కృష్ణుని యెమ్ముక పొడి యనెడి
కుంకుమున బొట్టుపెట్టెదఁ గొంకులేక
యలుగుసెలచేత జయలక్ష్మి యలికమందు. 142

గీ. ఎవనిఁగాఁదల పోసెనే ? యీ జరా త
నూజు ? ఎవరిగాఁ దలపోసెనో మగధనృ
పుని బలంబుల ? అడవి మూఁకనుచు నాత్మఁ
దలఁచెనో యతఁడె నిజంబుఁ దెలిసికొనును. 143

వ. అంచు దండనాయకులం బిలిపించి పణవఢక్కాది ఘోషంబులచే ఘూనఘోంతరాళంబు బీటలువార నతులచతురంగ పృతనావితాన పరీవృతుండై, కృష్ణునిపై దాడివెడలి నాల్గహోరాత్రంబులు హోరాహోరింబోర యాదవ సైన్యంబులు, పంచబంగాళమై, వీటతాటమై, చెల్లాచెదరై పోవ, శ్రీకృష్ణుండు చేయునదిలేక యాప్తబంధు సహితంబుగా బలాయితుండయ్యె. జరాసంధుండు మగిడిమగధం బ్రవేశించెను. శ్రీకృష్ణుండు విసుగువిరామము లేక, విఱిగి పాఱిన సైన్యంబులఁ గూర్చికొని, మరల యుద్ధప్రయత్నములు సేయుచుండ మాగధుండు వెండియు దండెత్తిపోయి పరాభూతునిం జేయఁ జేఁజిక్కక శ్రీకృష్ణుండు దుసకిల్లెను. ఈ కైవడి నిరువదిమాఱు లోడించి శ్రీకృష్ణునిఁ బలాయనసూత్ర పరాయణునిగాఁ జేసెఁ దత్కారణంబున జరాసంధుఁడు యాదవునిఁ బట్టుకొన నేరకపోయె. ఈ పోరిట్లు రేఁగుచుండ— 144

కం. మధురాధిపుఁడగు కంసుఁడు
పృధు సైన్యంబులను గూర్చి కృష్ణుని నెట్లో
వధియించుట ధర్మంబని
క్రుధతోఁ దలపోయుచుండెఁ గుసిలింతలతో. 145

చం. ఇది కనిపెట్టి నేర్పుమెయి వృష్ణికులుండిటు నిశ్చయించె నే
యదనుననైనఁ గంసవసు ధాధిపుపైఁ బడుచున్ హఠాత్తుగా
గుదియను దచ్చిరంబుఁ బడ గొట్టుచుఁ జుట్టలు రాకమున్నె త
ప్పదవిని నాక్రమించికొనఁ దప్పదు తప్పినఁ గార్యముండెడున్. 146

గీ. మాగధనృపాలకుం డనుమానపడిన
నతుల సైన్యంబుతోడ సాయంబువచ్చు
జగతి "నాలస్య మమృతమ్ విషమ్మ"నంగ
వినమె ? పెద్దలనుడి రిత్త చనునె యెందు ? 147

గీ. కృష్ణుఁ డీరీతిఁ దలపోసి కితవబుద్ధి
నన్నతో మధురకు నేగి యందుఁ గృష్ణు
నింటి దాసియైన త్రివక్ర యింటికేగి
ప్రేమతో నామెతో నొక్క రేయి కడపి. 148

మ. ఖలసంయోగమటంచు దానెఱిఁగియున్ గార్యార్థి శ్రీకృష్ణుఁ డా
కులపాటుం గనకుండ దాసియను సంకోచంబులేకుండఁ బు
వ్వులసెజ్జన్ గఱగించెఁ గుబ్జనుగడున్ హూత్కారసీత్కారముల్
గళరావంబులు ధూత్కృతంబులు సెలంగన్ గామశాస్త్రజ్ఞుఁడై. 149

చం. అనునయసూక్తులాడుచు రహస్యములన్నియు సంగ్రహించి కు
బ్జను మఱపించి మాటుపడి సాహసపద్ధతిచేత నన్నతో
జనపతి కొల్వుకూటమును జయ్యనచొచ్చి ప్రశాంతచిత్తుఁడై
షునిశితఖడ్గమబ్బికొనుచున్ దెగవై చె శిరంబు రెండుగన్. 150

గీ. సభికులాహారవంబులు సల్పుచుండ
భటులుచెదరి నల్దిక్కులు పాఱుచుండఁ
గొలువుకూటంబు గందరగోళమయ్యె
వాసుదేవుని సింహరావంబుచేత. 151

చం. కలగుడు బొందుచున్ మధురఁ గ్రక్కున వీడుచుఁ గంసభీతిచే
వలసకుఁబోయినట్టి తమవారలఁ బిల్వఁగఁబంచి కృష్ణుఁడున్
నెలవులు వారికేర్పఱచి నీతులుసెప్పి బహూకరించియే
యలజడియుండదంచు నభయంబునొసంగి ప్రమోదచిత్తుఁడై. 152

ఉ. పిమ్మటనుగ్రసేన పృథివీపతిఁదాతను బైడిగద్దెపై
నిమ్ముగనుంచి రాజనుచు నెల్లరకుం బ్రకటించి మంచినే
స్తమ్ముగడించి కొన్ని దివసమ్ములపాటటనుండుచున్ స్వప
క్షమ్మును బెంపుఁజేసికొనె సారసనేత్రుఁడు మంత్రవేత్తయై. 153

చం. పతిమృతియాలకించి యతి పాపుఁడు యాదవుఁ డెంతకార్య మీ
గతినొనరించి పోయెఁ గడగండ్లు సదా మముఁ జుట్టుముట్ట భూ
పతికిదియంతయుం దెలిపి వానినిజంపఁగఁజేతుమంచుఁ దా
మతికుపితాత్మలై చనిరి హస్తియుఁ బ్రాస్తియుఁ దండ్రియొద్దకున్. 154

గీ. తండ్రియగు జరాసుతుని చెంతకునుబోయి
బిట్టు కంటినీరోడికఁ గట్టుచుండ
వెక్కివెక్కి యలందురి విభుని యాద
వుండుగూల్చిన విధమెల్ల బొగిలిచెప్ప. 155

కన్నబిడ్డల దుఃఖంబుఁ గంటఁజూచి
యల్లుఁడేకాదు పరమాప్తుఁడైన బంటు
నొకఁడు చంపెననుటచేత నుమ్మలించి
పల్కె మగధభూనేత కట్టలుక నిట్లు. 156

కం. పదిదినములు చనకుండన్
దుదముట్టించెదను గృష్ణు దోర్బలలీలన్
విదళించెదఁ గనుగొనుఁడో
సుదతీమణులార నాదు శూరత్వంబున్. 157

గీ. వందలకొలఁది యున్నారు భార్యలతని
కందఱిని మిమ్ముఁబోలెనే నగతికలను
జేసిపుచ్చెద క్షణములోఁ జింతఁదక్కి
పొద్దుఁదీర్చెద నో కన్నబిడ్డలార. 158

అనుచు బుజ్జగించి తనయల నిర్వురలోనికంపి యతిరోషావేశంబున యుద్ధసన్నాహంబుఁ గావించి దిక్కుల పిక్కటిల్ల భూమిగ్రక్కదలఁ బ్రస్థాన భేరి వేయించి— 159

సీ. నడగొండ లన్నట్టు లెడమీక నడతెంచు
గుడికొన్న పొగరేన్గు గున్నదండు
కాలిగిట్టలగాలి నేలఁబై కెగఁజిమ్మి
తేలిపేరెమువారు తేజిపౌజు
మిఱుమిట్లు గొనునట్లు మిట్టాడఁ గొఱముట్లు
దిటవుగాఁగల మేలు తేరిబారు
వీఁకమై రిపుసేన చీకాకుఁబడఁదూఁకి
పడనూకుజోకకాల్బంటుమూఁక

గీ. కల్గిదుర్జయంబైన మాగధనృపాల
చంద్రచతురంగవాహినీ సముదయంబు
యాదవద్వీపమును ముంచునట్లు బయలు
దేరె దుర్వార భండనోద్రేకగరిమ. 160

కం. వచ్చిన మాగధసైన్యముఁ
జెచ్చెర యాదవులుగాంచి సిద్ధంబగుచున్
గచ్చలు బిగియించికొనుచు
విచ్చలవిడి వచ్చిపడిరి విద్వేషులపై.

కం. ఏటున కొక్కనిఁ గూల్పఁగఁ
బోటరియగు యాదవుండు పోపో యదియున్
ప్రేటా ! యని మాగధుఁడిదె
నూటికి సెలగంచుఁ జంపె నూర్వుర నొకఁడే.

కం. సెలవింటిదెబ్బ నెత్తుటి
సెలయేరులుపాఱ మగధ సేనాసుభటుల్
సెలరేఁగి పగరనలుగుల
సెలచే గుదిగ్రుచ్చిసెలగి సెలఁగుదురంతన్.

సీ. కోటానకోటులుఁ కుప్పఁగూరఁగఁ గూలఁ
బంచబంగాళమై పాఱ రిపులు
వెన్నాడి మాగధ వీరాధివీరులు
పాఱదోలిరి యాదవ ప్రవరుల
కృష్ణుఁడీయోటమి నీక్షించి యన్నయౌ
బలరాముతోఁగూడి పాఱిపోయి
యవతి దూరమునందు నలరు ప్రవర్షణ
గిరిఁజేరి డాగెఁ గందరమునందు

గీ. నిది జరాసంధ భూపాలుఁ డెఱిఁగి గిరికి
నగ్గి దాకొల్పనందుండి యన్నతోడ
మాగధునికంటఁ బడకుండ మాయమయ్యె
వ్రేత యిండ్లఁదిరుగు ప్రాఁత వెన్నదొంగ. 164

వ. వినవి జరాసంధ సార్వభౌముండు మరలి మగధరాజ్యంబుఁ జొచ్చి మంత్రా
గంబుఁ జేయుచుండె—

## హంసడిచికుల మృతి

గీ. మాగధపృతనాధీశు లమాత్యవరులు
హంసడిచికులు రాజసూయాధ్వరంబుఁ
జేయ సమకట్టి యుప్పుకై చీరియొక్క
బ్రాహ్మణునిఁ బంపిరప్పుడు ద్వారవతికి. 1

ఉ. ద్వారకకేగి బ్రాహ్మణుఁడు పద్మదళాక్షుని దర్శనంబు దై
వారఁగఁజేసి పిమ్మటను వచ్చిన కార్యముఁదెల్ప శ్రద్ధతోఁ
బాఱుఁడువల్క నెన్నుడుల వక్కణయెల్లను నాలకించి లో
సారెకు నీగతిన్దలఁచె సాధకబాధకముల్ మురారియున్. 2

గీ. 'వెదుకఁబోయిన తీవెయే పదములందుఁ
దగిలె'నన్న సామెతరీతి ధరణిసురుఁడు
తంత్రమును నడ్పుచుండె హితమ్ముఁగోరి
సంశయింపంగఁ బనిలేదు సమయమంచు. 3

వ. వితర్కించి శ్రీకృష్ణుండు కొండొకసేపు మౌనము వహించి యెట్టకేలకు
ధరణీసురునితో నిట్లు వచియించె— 4

ఉ. ఓ ధరణీసురా! చని హితోక్తులు చెప్పుము మీదుధారుణీ
నాథునితోడ యాదవులనన్దలలొగ్గరు వైరి పాశికిన్
గాథలు చెప్పనేల? యపకర్ష సహింపరు ప్రాణభీతిచే
సాధక బాధకంబు లొకసారిఁ బరీక్షను జేయమేలగున్. 5

గీ. ఉప్పుఁదెమ్మంచు మీతోడఁ జెప్పెనోటు!
వింత విడ్డూర మిప్పుడు వింటి ముప్పు
గోరుచెల్లను దమముప్పుఁ గోరుకొనుచె
యనుచు మీరాజచంద్రుతో నాడఁదగును. 6

ఉ. మీరలు ధర్మమూర్తులరు మేమిఁకమాటలఁ జెప్పబోమదే
మా రణభేరి చెప్పెడుసుమా ! యతిమాత్రము మాకు మారుగా
మా రణకేళి నిక్కముగ మారణకేళి విచారమేల ? ని
ష్కారణయుద్ధ మేమిటికిఁ ? గల్గునె లాభము దానఁజెప్పవే. 7

వ. కావున మీరు వెంటనే చని యీ యుదంతమంతయు మీ భూకాంతుల స్వాంతంబున కెక్కునట్లు లెఱింగించి, పోలిన తెఱంగున బుద్ధులు గఱపుఁడు. మా ముక్కున నావియున్నంతవఱకుఁ బరులకు జంకి యుప్పిచ్చువారము మాత్రము కాము. ధర్మయుద్ధమున వీరశయ్యాసుఖ మనుభవింప నిచ్చించువారమనుఁడు విప్రుండు లేచి వాసుదేవునివద్ద సెలవుంగైకొని ప్రయాణోన్ముఖుండయ్యె. అంత— 8

కం. ఆనక దుందుభిసూనుం
డానక దుందుభివిరావ మతిభీషణమై
మానక మ్రోఁగుచునుండఁగఁ
బూనికఁ దన సేనఁగొంచుఁ బోరికి వెడలెన్. 9

వ. అంతకుమున్నె జరాసంధుఁడు చారులవలన శ్రీకృష్ణరణప్రారంభ మెఱిఁగి, సమరోత్సాహంబున సైన్యములఁ గూర్చికొని, హంసడిచికులకుఁ దోడ్పడ గంగాతీరంబున దండువిడిసి, యాదవసేనకై యెదురుచూచుచుండెను. కోలాహలంబుతో యాదవ సైన్యంబు లరుదేర దోఃకండూతినిరాసంబుగాఁ బోరఁదొడంగెను— 10

చం. అలమటఁ బొందకుండఁగ బృహద్రథపుత్రుఁడు వైరిసైన్యమున్
దలపడి పోరనొక్కెడ వితాకును జెంద మఱొక్కచోట ను
త్తలపడి యాదవుల్ పఱవఁ దార్కొని హంసుఁడు యుద్ధమాడఁగా
విలయముఁజేయు నాడిచిక వీరుఁడు వేఱొకచోట నుద్ధతిన్. 11

వ. ఈ వీరత్రయంబుచేయు కోల్తలకు నిలువంజాలక తలచీరలూడ యాదవ సైన్యంబు క్రేళ్లుఱుకుచుండఁ గాంచి, శ్రీకృష్ణుండు సైన్యరక్షణం బవశ్య కర్తవ్యమని నిశ్చయించి— 12

డెప్పరముగ నొక్కట పోరుడిచికు కడకు
వార్తc బుత్తెంచె హంసుండు ప్రథనభూమి
నీల్గెనని దీని నాలించి యెన్నరాని
శోకమున మున్గి డిచికుండు సూరుcడయ్యె. 13

గీ. అన్నలేని రాజ్యంబేల ? యాయువేల ?
భోగభాగ్యంబు లవియేల ? భూములేల ?
యంచు మిక్కిలి వగచేత నొడుcగఅచి
గంగలోcదూcకి ప్రాణముల్ గంగcగలిపె. 14

తమ్ముcడు గంగలోదుమికి తా మరణించెనటన్న వార్త శో
కమ్మను గూర్పcగా నడలి గ్రక్కునc దమ్ముcడు లేనిరాజ్యమున్
దమ్ముcడులేని వైభవము తమ్ముcడులేని సుఖంబులేల ? నా
కిమ్మహినంచు గంగcబడి యీల్గెను హంసుcడు ధీరచిత్తుcడై. 15

అన్నదమ్మ లీగతిc దెగ టారినంత
బహుళ తత్సైన్యములు పటాపంచలగుడుc
బొంగి బార్హద్రథియు నాల్గు మూపులగుచు
యాదవులనెల్ల నరికట్టి యాcగినంత. 16

గీ. వాసుదేవుండు తనసైన్య పటలినెల్లc
జేయునదిలేక మరలించి చెప్పకుండc
బ్రథనభూమిని విడనాడి పాఱిపోయెc
బౌరుషము మాఱుcగు భగవంతుcడనుచు. 17

గీ. మధురకడనున్నc బ్రాణముల్ మఱియుc దక్క
వంచు లోనెంచి శ్రీకృష్ణుc డాప్తబంధు
సుత కుటుంబసహితముగా హితులతోc గు
శస్థలీవిషయమునకుc జనcగ వెంచి. 18

చం. పడమటి సంద్రమందు ఫలవంతమునై వెలుగొందు దీవిపై
గుడులును గోపురంబులును గోటలు పేటలు రాచబాట క్రొ
త్తడములు మిద్దెమేడలును దద్దళముల్ మిఱుమిట్లుగొల్పఁ బు
త్తడి యడుసోడిగించి పనితంబుగఁగట్టిరి ద్వారకాపురిన్. 19

గీ. ద్వారవతియన వెల్గు నీ పత్తనంబు
వైరి దుర్భేద్యమై యిందు వాసుదేవుఁ
డెలమి యదువృష్ణి భోజాంధకులను గూడి
రాజ్యమును సేయు నే అద్ది అవ్వలేక. 20

మ. దివ్యజ్ఞానము దివ్యదృష్టి వెలుఁగన్ దేదీప్యమానంబుగా
నేవ్యాసంగములేక యబ్జనయనుం డేకాగ్రతన్ భూరి శ
త్రువ్యూహంబుల మంత్రతంత్రములచే దూలింప యత్నింపుచున్
దీవ్యత్సైన్యము గూర్చి పెట్టికొని యుందే యుండె నిశ్చింతతో. 21

ఉ. ద్రావిడ జాతినిందొఱఁగి ద్రావిడసంఘము పొత్తుమాని యా
ద్రావిడసార్వభౌముపయి దర్పముఁజూపఁగ నెంచినందునన్
ద్రావిడులెల్ల మార్తురయి దగ్గరఁజేరఁగనీకపోవుటన్
ద్రోవమఱొండులేక పెఱ తోయమువారలఁ జేరనెంచుచున్. 22

గీ. అనువుగల్గిన యపుడెల్ల యాదవుండు
సహచరులతోడఁ జెప్పును జాత్యహంకృ
తి విడనాడి కార్యంబు సాధించుటొప్పు
బాగుపడనెంచు వారికెప్పాటనైన. 23

గీ. దేశకాలపాత్రంబులఁ దేరిచూచి
మొనయు వల్లడిఁ దప్పించు కొనుట మేలు
మొండితనమును జూపింప మొదటికంట
నాత్మనాశంబుగల్గు న టంచు జెప్పె. 24

# చతుర్థాశ్వాసము

మ. ఒకవంకన్ శిశుపాలుఁడుండ గురు యుద్ధోద్యోగసంరంభియై
యొకవంకన్ మగధక్షితీశ్వరుఁడు సైన్యోపేతుఁడై యుండ మీఁ
దకు లంఘింపఁగ దాయలో కపటులై తారాడుచుండంగ వే
తొకవంకన్ మనమున్ సురక్షితులమై యుండన్ సదాశక్యమే. 25

ఉ. కావున నార్యులం గలిసి కాలముఁబుచ్చుట యొప్పు లేనిచో
దేవుఁడెఱుంగుఁగాదె మన తిప్పలు తప్పవు చావులక్కటా!
నావచనంబులన్ విని వినాశముఁ బొందకుఁడంచు నార్య ధా 26
త్రీవరమైత్రి కిష్టపడు రీతినిఁ జేసి స్వజాతివారలన్.

అంతకుమున్నె పాండునృపుఁ డంతలపొంతల చుట్టమౌటచేఁ
జింతయొనర్చుచున్ సవతి చెల్లెలిఁ జిత్రను గ్రీడికిచ్చెఁబో
పంతముతో సహోదరుఁడు వద్దని చెప్పుచుఁ బట్టుఁబట్టినం
గంతులువైచు నగ్రజుని కండ్లకు గంతలుకట్టి మూయుచున్. 27

గీ. కొన్నియేఁడులిట్టులు కడచన్న పిదప
నన్నకూతురి మేనల్లుఁ డర్జునాత్మ
జుఁ డభిమన్యునకు నొసంగి సోదరుండు
వలదు వలదన్న దొంగపెండిలినిజేసె. 28

సీ. సురటియై యుయ్యాలొ జొంపాలొ యనుచుండు
నెమ్మియీఁకలకుంచె నెత్తిఁజూచి
"నా పితృవ్యసుతుండు నళినాక్షుఁడ"ని చెప్పు
నేకలవ్యునిమాట లాకలించి
"నన్నుఁబెండ్లాడవా నాముద్దు చినకృష్ణ"
యనెడి చెంచెతపల్కు లాలకించి
కారుమబ్బులతోడఁ గయ్యమాడఁగఁజాలు
నిద్దంపుమైచాయ నిగ్గుఁగాంచి

గీ. చెంచులకు నింటివేల్పయి మించుకృష్ణు
నేకులమునందు నేజాతి నెందు బుట్టె
నని వితండ వాదముఁ జేయనగునె చెపుమ
తేటపఱచవే యవియెల్లఁ దెల్లముగను ? 29

ఉ. కిట్టని మాట యౌనె ? యొక కేలను వేణువుగల్గఁ మౌళిపై
నట్టువపిట్టకుంచియ కనంబడుచుండఁగఁ జెంచువారితోఁ
జుట్టఱికంబు గల్గఁ గడుఁ జొక్కపు నల్లనిమేనిచాయక
న్పట్టఁగఁ జెంచుకాఁడనుచు వాకొన సత్యవిరుద్ధమేకదా ! 30



# ఏకలవ్యుని వృత్తాంతము

గీ. అఖిలయదువృష్ణి భోజాంధకాది జాతు
లన్ని తొలుదొల్త మ్లేచ్ఛులై యెన్నఁబడియె
నార్యజాతికి భిన్నంబు లగుటచేత 1
నడవిపల్లెలు కాపురంబగుట చేత.

గీ. ఆర్యసంబంధమును బొంది యణఁగి మణఁగి
వర్తిలుటచేత శ్రీకృష్ణు వంగసంబు
క్రమముగా గడించెను గొంత గౌరవంబు
దానఁబరులు మ్లేచ్ఛులనుట మానినారు.

కం. ఆర్య జనాచారంబులు
నార్యమతవిశిష్టధర్మ మనుపమనుచున్
గార్యజ్ఞులగుచు యాదవ
వర్యులు గైకొన్నవారు బ్రమపడివానిన్. 3

గీ. ఆర్యజనులకు "దాసోహ" మనిన యాద
వాళి మ్లేచ్ఛదశను బాసి యబ్బురముగ
క్షత్రియత్వం బొక లవలేశంబుఁ బొంది 4
బొమ్మికములేని రాజులై పోయినారు.

గీ. జాతివిడనాడి తొలఁగుట జాతిధర్మ
ములను సంత్యజించుట పాపమూల మంచు
జాతివీడకనిల్చిన శబరులెల్ల 5
శబరులుగ నుండిపోయిరీ జగతియందు.

కం. అభిమానంబునఁ బెనఁగుచు
వ్యభిచారముసల్పఁ బోక వర్తిలువారల్
శుభములఁ బొందంజాలక
యభిఘాతములందు బొక్క యబ్బుర మగునే ? 6

కం. ఆర్యులపురములఁ గని యని
వార్యంబగు సంతసంబు పరిగొనఁగా నా
యార్యులరీతిగ నుండఁగఁ
పర్యాలోచించి మోహ పరవశులగుచున్. 7

చం. వనములనుండలేక యదువర్యులు కొందఱు సంభ్రమంబునన్
దనియక కొంచెమేని నవనాగరికంబును బొందఁగోరి ప
త్తనములఁ గట్టుకోఁదలఁచి దారసుతాదులఁగూడి యేడకో
చనిరి నితాంతహర్షమున జయ్యనఁబిమ్మట నొక్కయిమ్మనన్. 8

కం. అధికోత్సాహంబున మరి
పృథుసామర్థ్యంబున యదువృష్ణ్యంధకులున్
మథురాపురి నిర్మించిరి
ప్రథితంబుగ నెల్లవారు ప్రస్తుతిసేయన్. 9

కం. వసుదేవాదులు తమ దా
రసుతాదులఁగైకొని మధురాపురమునకున్
వసియింపఁగ బోయిరచట
వసతి గలదటంచు భోగభాగ్యములందన్. 10

కం. పిమ్మట నావసుదేవుని
తమ్ముఁడ 'నాధృష్టి' యనెడి ద్రావిడవరుఁడున్
సమ్మతిపడఁడయ్యె నర
ణ్యమ్ముల దిగఁబెట్టి పోవ నా నగరునకున్. 11

వ. అనాధృష్టికి నశ్మకి శ్రుతదేవ యను కళత్రద్వయంబు కలదు. శ్రుతదేవ యందు శత్రుఘ్నుండను నామాంతరముగల యేకలవ్యుండు జనియించి మహావీరలక్షణ లక్షితుండయి పెరుగుచుండ నొక్కనాఁడు తండ్రియగు ననాధృష్టి కొడుకుం జూచి యనురాగంబున నిట్లనియె. "కుమారా! శస్త్రాస్త్ర విద్యాప్రాగల్భ్యంబు మనకుఁ దరతరంబులనుండి కలదు. అది మనకక్కఱకు

వచ్చున ట్లితరులకురాదు. మహదరణ్యానిఁ గాపురముంటిమి, ధనుర్గురుండగు ద్రోణాచార్యుని కడకుంబోయి, ధానుష్క శేఖరుండవై రమ్మ" నవుఁడు— 12

ఉ. మేచకదేహకాంతి మిఱుమిట్లు గొనం, దల మేచకంబు వ్యా
కోచముగాఁగ విల్లును లకోరులునింపిన తూణయుగ్మమున్
గోచతనంబుఁ బోవిడచి కుఱ్ఱఁడు గైకొని, కాసెఁగట్టి సం
కోచముమాని కూర్మిపితకున్ నతిసేసి సెలంగిపైనమై. 13

కం. చని ద్రోణాచార్యునిఁగని
ప్రణతియొనర్చి విలువిద్య పారము ముట్టన్
దనకున్ నేర్పుఁడటంచును
వినయంబున వేడి వేడి విఫలుండగుచున్. 14

వ. మగిడి కాననసీమకుంబోయి జనకుంగాంచి విషణ్ణచిత్తుండై దైన్యంబున సర్వంబు వినిపించి, రెట్టించిన పట్టుదల నెట్టయిన నస్త్రవిద్యా పాండిత్యము సాధింప దీక్షవహించి, పరాకాష్ఠతో నేకాగ్రచిత్తుండై ద్రోణుని ప్రతి రూపంబున దృష్టినిబద్ధముంజేసి, దృఢముష్టిలక్ష్యలాఘవంబుల నిరంతరాభ్యాస పటిమంబుచేఁ గౌశలంబు సంతరించి, యొరులు తేరిచూడఁగ రానిరీతి విక్రమోపేతుండై వెల్గుచుఁ దన యశశ్చంద్రికలు గహనసీమ నాల్గుకొనలు వ్యాపింపఁ దేదీప్యమానంబుగా విరాజిల్లుచు జనకుని మరణానంతరము రాజ్యంబు వహించి పూజ్యభావంబునఁ బ్రజలను గాపాడుచుండెను. 15

సీ. కన్నుఁ బొడుచుకొన్నఁ గనరానియడవులఁ
జిమ్మచీఁకటులెల్లఁ జిమ్మివైచె
కాలు వెట్టఁగరాని కఱకునేలలనెల్ల
సవరించి తిన్నఁగా సాఁగుచేసె

వన్యమృగంబుల వల్లడిఁ దప్పింప
వలఁజుట్టి దిట్టమౌ వెలుగువేసె
చిలుగుతొడుగుకంపఁ జెలగివేయుచు మంచి
యాఁకతోఁటలగుంపు నలవరించె

గీ. పోసరించిన బలుదిట్ట పోటు బంటు
లోర్మిఁ దనయాజ్ఞఁ బాలించుచుండ నెపుడు
ధర్మమొకవీసమేనియుఁ దప్పకుండ
నేకలవ్యుండు రాజ్యంబు నేలుచుండె. 16

వ. చెంచుజేని యటవీరాజ్యంబున నాకలిదగదప్పు లెఱుంగక, కుసిలింత లెఱుంగక, యసంతుష్టి యెఱుంగక—— 17

గీ. పుట్టతేనెగలిపి ముదురు వెదురుప్రాలు
కడుపునిండఁ గుడిచి గఱుమంచుఁ
ద్రేచి తనివిఁజెంది తిరుగాడుదురు తప్పు
లెంచరానివారు చెంచువారు.

గీ. పాయకట్టుకట్టుఁ బాయఁగొట్టఁగలేరు
మానటీఁడులైన మనుజులైనఁ
పలికి బొంకువారు గలుగఁబోవరుసుంత
యేకలవ్యనృపతి యేలుబడిని. 19

ఉ. ఏసినతూపుతప్పి చని యెప్పుడు జిత్తగఁబోవ లేదొరన్
దీసినకత్తి యెప్డుపనిఁ దీర్పకయుండఁగలేదు భీతిచేన్
డాసినవారికెప్డు శరణంబు నొసంగమిలేదు వానికై
వాసిగ నేకలవ్య సరిజంటొకరుండుగలండె భూమిలో ,

యదుకులంబునఁ బ్రభవించి నట్టివాఁడు
కాననాంతర రాజ్యంబు గలుగువాఁడు
వినుము కృష్ణుని పినతండ్రి యనుఁగుబిడ్డ
యేకలవ్యుండు శబర జాత్యైకవిభుఁడు. 21

ఉ. జాతిని బాసి తామయిన క్షత్రియులంచుఁ దలంచి గొప్పఁగా
నేతుమటంచు నిక్కుచును నీల్గెడివారలతోడఁ బోకహో ।
జాతిని ధర్మమున్ విడువఁ జాలనివారికిఁ జెంచువారికిన్
భూతలనాథుఁడై వెలసెఁ బోటరిమాటరి యేకలవ్యుఁడున్. 22

అరయ రెండుపాయలైన యాదవులకు
నుద్దిలేనిరాజు లిద్దరైరి
యొకరు మధురలోన నొక్క రడవియందుఁ
గృష్ణుఁ డేకలవ్యుఁ డేలుచుండ్రు. 23

వెన్నునిఁ గన్నఁ గన్నెఱుపు వెక్కసమౌఁగద చెంచుతేనికిన్
వెన్నుని మాటయన్నఁ బ్రభవించెడివేరము చెంచుతేనికిన్
వెన్నుని బూటకీఁడనుచు విక్కుచుఁ జెప్పును నేస్తకాండ్రతో
వెన్నుని నమ్మఁడెన్నఁడును వీరశిఖామణి యేకలవ్యుఁడున్. 24

శా. జ్ఞాతిద్రోహి యధర్మమంచు ననకేస్వార్థంబపేక్షింపుచున్
జాతిన్ వీడి యొనర్చెనార్యతతితో సంబంధబాంధవ్యముల్
గోతం బెట్టెదనంచు నుండు శబర క్షోణీశుఁడత్యుగ్రుఁడై
'జ్ఞాతిశ్ఛేదనలేనకిమ్మ'నెడి వాక్యస్ఫూర్తి దీపింపఁగన్. 25

ఏతరి నేకలవ్య మొగమించుక చూచినఁ గృష్ణుఁడద్దిరా ।
యీతఁడు జాతిజాతియని యెప్పుడు ద్రుళ్ళుచుఁ గల్వరించుచున్
జాతిని గూడియుండు నతిసాంద్రవనంబుల జాతివైరమున్
సైతము మానఁడంచు నెకసక్కెము లాడుచు గెలిసేసెడిన్. 26

వ. ఇట్లు పరస్పర విరోధభావంబులచే భావంబులు కలవరపడుచుండ— 27

చం. గరువతనంబుచేతఁ జెలికాంఁడ్ర నొకానొకనాఁడు గూడుచున్
గురుతర కాననస్థలికిఁగోయని యార్చుచుఁబోయి యందఱున్
గరమరుదైనవేట తమకంబున రేఁగుచు సంచరింపుచున్
దరమిడి క్రూరజంతువుల దద్దరిలంగను జేయుచున్నెడన్. 28

గీ. కఱకు పదనుగల్గు కాండంబునొకదాని
వింటఁదొడిగి పందివెంటఁబడుచు
నేకలవ్యుఁడొక్కఁడే కాకియైపోయి
యేకలంబు సురుగనీక తఱుమ. 29

ఉ. కొండొకపైపునుండి రణకోవిదుఁడైన కిరీటియప్పుడే
కాండము వింటనుండొడిగి గమ్మున నేసెను వేసినంతనే
యొండొక బాణమో రభసమొప్పఁగ జివ్వన వచ్చి సూటిగా
నిండుమొగంబుఁదాకి ధరణీస్థలిపైఁ బడఁగూల్చెఁ బందినిన్. 30

గీ. లక్ష్యశుద్ధి యద్భుత శరలాఘవంబుఁ
గాంచి నరుఁడేకలవ్యునిఁ గంటఁజూచి
యీడుగానని చెప్పి తానీడఁబోయి
తేరి పాఱఁజూచి యపుడె తిరిగిపోయి. 31

కం. ఇంతటి విద్యానైపుణి
యింతటి శరలాఘవంబు నెన్నండెఱుఁగన్
వింతకదా ! యితఁడెవఁడో
యంతెఱుగుట మేలటంచు నాతండపుడే. 32

. చాపాచార్యుండగు ద్రోణాచార్యునింజేరి వినయంబుట్టిపడ దీనాననుండై—

కం. ఎఱు కొక్కనిఁగంటిని ద
చ్ఛరలాఘవమెల్లఁగంటి సాంద్రాటవిలో
గురువర ! యాతని రూపము
మఱువఁగ రాదయ్యె నాకు మాపులుజేపుల్. 33

గీ. మూఁడులోకాల విలుకాండ్ర మొత్తమందు
నన్ను సరిలేని బంటునొనర్తునంటి
వదియు నేఁటికి వమ్మయ్యె నక్కటకట ।
మీరలేమిసేతురొ నాకు మేలు నేఁడు. 34

సరియె కాదయ్య నాకంటెనురువగునతఁ
డెచటనేర్చెనొ విలువిద్య నెఱుఁగరాదు
బాసమాత్రము తీర్చుకోవలయునన్న
గురుఁడు చింతించి మిగుల సంకోచపడుచు. 35

వెంటనె క్రీడిఁగూడి యటవీస్థలికేగ గురుండు సిద్ధమై
జంటఁగనంటి వెంటఁబడి ఛాత్రుఁడు ముందుగ దారితీయ గో
రింటల డొంకలన్ నడచి త్రిప్పులు పొందుచుఁ గాంచిరొక్కెడన్
వంటెముకాని గూడెమును వారలు దానిని డాసినంతటన్. 36

సీ. నెట్టెంబుఁ గై సేయు నెమ్మిపురితురాయి
కనువిచ్చి దెసలెల్లఁగాంచుచుండ
దొనల రారాపుచేతను గాయగాసిన
యెగుమూపు దోయిమై బిగువుచూప
ఎన్నెన్నొ కత్తెరి వన్నెపూసల పేరు
లెదురొమ్ముపైఁబడి కదలుచుండ
మొలచుట్టుచుట్టిన మోటువన్నియ ప్రాత
మోకాలు దిగజారి పోకయుండ

గీ. నింటిముంగలియఱుగుపై నొంటరిగను
రెడ్డిగమువేసి కూర్చున్నదొడ్డఘేని
శబరజాతి క్షమానాథుశౌర్యరాశిఁ
గాంచి గురుశిష్యులిర్వురు కొంచెపడిరి. 37

గీ. అతిథులిద్దరింటికి వచ్చుటల్లకాంచి
దూరముననుండి తొందరతోడలేచి
యర్ఘ్యమును బాద్యమునునిచ్చి యాదరించి
వారి పయనంపు బడలికఁ బాపనెంచి. 38

మత్త. చారపప్పును నూచబియ్యము సన్నమండిగ గుగ్గిళుల్
దోరముగ్గిన మావిపండులు దుర్లభంబగు ద్రాక్ష ఖ
ర్జూర పక్వ ఫలాళి తంగెటి జుంటితేనియఁజక్కఁగా
నారకాగిన యావుపాలను నారగింపఁగఁ బెట్టుచున్. 39

కం. ఇంటికి వచ్చిన పెద్దల
వెంటనె పూజించునియతి విహితంబుగఁ జే
కొంటిమి యాతిథ్యమె మా
పంటలు వీనిఁగొని సేదఁ బాపుకొనుండీ. 40

వ. అని బహుప్రకారంబుల వేడిన ద్రోణార్జును లతిథి సత్కారముల గ్రహించి
తృప్తులైన యనంతరంబు వారలంజూచి యేకలవ్యుండు— 41

ఉ. ఏపనిఁబూని మీరలిటులిచ్చటికింజనుదెంచినారు ? మీ
కాపురమేది ? నావలనఁ గాఁగలకార్యముఁజెప్పఁ డున్నచో
నాపనిఁదీర్తు నాకలవియైన నటంచు వచించినంతనే
చాపగురుండు పల్కెను నిజంబును దెల్పుచుఁదత్క్షణంబునన్. 42

కం. నా పేరు ద్రోణుఁడందురు
చాపాచార్యుండ నిఖిలజనపాలసుతుల్
నాపజ్జ నేర్చికొందురు
చాపాభ్యాసంబు దివ్యశరలాఘవమున్. 43

ఉ. క్రీడియితండు ఘోరరణకేళివిదగ్ధుఁడు మొన్న మొన్న వేఁ
టాడఁదలంచి యీయడవియందునఁజొచ్చి చరించుచుండఁగాఁ
గ్రోడముతోడవచ్చి యిటకున్ గుఱివెట్టి శరంబుఁబుచ్చఁ దో
డ్తోడఁద్వదీయబాణము కడున్ రయమారఁగ దానిఁగూల్చెడున్. 44

ఉ. నీ శరలాఘవంబు గని నివ్వెఱపాటెనయంగ వేగ నా
వేశముఁజొచ్చి యీయెడకు వ్రేల్మిడిఁదెచ్చెను నిన్నుఁజూపఁగా
నో శబరేశ్వరా ! పలుక నోడకు పేరు నుదంతమెల్ల నీ
వీ శరవిద్య నెప్పుడెటు లెవ్వనివద్దను నేర్చినాఁడవో. 45

కం. అనినంత నేకలవ్యుఁడు
వినయాదర మొప్పుచుండ విస్పష్టముగాఁ
దనుగురునితోడను బలికెఁ
గనుదమ్ములవింతకాంతి గంతులువైవన్. 46

కం. ఏమేమీ ! యితఁడర్జునుఁ
డా ? మీరలుద్రోణగురువులా ? మోదంబా
హా ? మీరాకను ధన్యుఁడ
నే మీకడఁగాదె విద్య నేరిచికొంటిన్. 47

ఈ మాటలాలించి ధనురాచార్యుండు కలగుండువడిన మనంబు కలవాఁడై, బోయతుంటరియై, మెఱమెచ్చులకో, మిడిమేలమునకో, మేలమునకో యిట్లాడుచుండెనని సంశయించి, యేకలవ్యుని ముఖలక్షణంబుల నుపలక్షించి, విలక్షణంబులేమియుఁ గన్పట్టమిఁ గుదుటఁబడిన మనంబుకలవాఁడై — 48

ఉ. చిత్రముఁ జెప్పుచుంటివి, హసింపఁగనేమొకొ నిన్నెఱుంగఁబో
ఛాత్రుఁడవై మముంగొలిచి సాంగముగా విలువిద్యనెన్నఁడే
మాత్రము నేర్పవీవిటుల మాటలుచెప్పఁగనేల ? నీదు చా
రిత్రమువిస్మయంబుఁ బచరించెడినంచు వచింప బోయఁడున్. 49

చం. ఎఱుఁగకపోవుటేమిననుు ? నే విలువిద్దె గ్రహించు కోర్కెతోఁ
జిఱుత తనంబునందు మిముఁ జేరి భయంబునఁ జాఁగిపేడఁగా
నెఱుకకుఁ జెప్పరాదనుచు నెన్నియొ శాస్త్రములున్నవందుచేఁ
గఱపఁగజాలనంచు ననుఁ గ త్తరిమాటలనాడి పంపరే. 50

గీ. అట్లు మీచేత నవమాన మంది దుఃఖి
తాత్ముఁడనయి యేమియుఁదోఁచ కలమటించి
యించుకంతవంచిన తల యెత్తకుండఁ
దిరిగి మా చెంచుగూడెంబు దరియఁజొచ్చి. 51

కం. సతతము కొలిచితి నే మీ
ప్రతిమా రూపంబు భక్తిపరతంత్రుఁడనై
జితకాశినై తి దానన్
కృతహస్తుఁడనైన నాకు నెదురునెఱుంగన్. 5-

వ. నా పేరేకలవ్యుండు, ఈ యాటవిక ప్రదేశంబు మదీయ బాహువప్రయుగళీ గుప్తంబై, దొంగతోడుబోతులవలని వల్లడిదక్కి చల్లగ వర్ధిల్లుచుండు. నాకదురుగాని యెదురుగాని లేక యుండె వసియింతు— 53

ఉ. మాకొరవంజిగూడెములు మాటలు తప్పవు తప్పినంతనీ
లోకములోనఁ బుట్టుగతులున్ మరియుండవు చుట్టపక్కముల్
బాకులుదూసి మీఁదఁబడి ప్రాణములన్ హరియింతురట్టి యీ
మూఁకలకెల్ల నే దొరను బొంకులెఱుంగని కారుకోనలో. 54

ఉ. అంతట ద్రోణుఁడిట్టు హృదయమ్మునఁ దాఁదలపోయఁజొచ్చె వీఁ
డంతక కల్పుఁడీతని యుదంచితభీషణ బాహుశౌర్య వి
క్రాంతియు వీనినిస్తుల పరాక్రమ మీతనిచాపవిద్య, ప్రా
ణాంతక మార్య కోటి కెటులైనను హీనునిఁజేయుటొప్పగున్. 55

గీ. వీనివింటికి నెదురెత్తివింటినారి
లేశమైనను మ్రోగింప లేఁడెవండు
వీని భుజశక్తిఁ బొరిపుచ్చ లేనియెడల
మాకు బ్రదుకుట దుర్లభంబయని యెంచి. 56

కం. ఎఱుఁగవె శిష్టాచారం
బెఱిఁగియు నిట్లాచరింప నెఱుకకుఁదగునే
గురుదక్షిణఁ బెట్టని యా
కఱటికి సద్గతులు పుట్టఁగలవేయెందున్. 57

వ. ఇట్లు గురుండు కుత్సితుండై తనయభీప్సితంబును మఱుగుపుచ్చి పల్కినవెంటనే
యేకలవ్యుండు— 58

కం. "తల తల మను కత్తిగో !
తలయిదిగో ! కోరుకొన్న దానిని నిపుడే
తలఁగక యిచ్చెద గురువర !
తలఁగోసిమ్మనుదొలేక ధన మిమ్మనుదో !" 59

కం. చెడుతలఁపున ద్రోణుండ
ప్పుడు పలికెను నాకదేదిపోలదుగానీ
కుడిచే బొటమన వ్రేలో
క్కఁడు చాలును దానినిమ్ము గురుదక్షిణగా. 60

ఉ. చెంగట నిల్చి కుంభజుఁడు చెప్పినమాటలనాలకించి యం
దుంగల మోసముందెలిసి తొట్రిలకుండఁగ నేకలవ్యుఁ డా
యంగుటముంగరుక్కిన ఖరాసినిగోసి యిదే గ్రహింపవే
వెంగలికాఁడహో ! శబర వీరుఁడు బాసను దప్పఁడెన్నఁడున్. 61

వ. ఇట్లు వచించి, నిర్వికారంబున— 62

చం. తలతలలాడు కత్తి నొఱఁదాల్చి విషణ్ణతఁబొందకుండఁగా
జలజల రాలుచున్న క్షతజంబును సుంతయు లెక్క పెట్టకే
కలకలలాడు నెమ్మొగము కాంతులు పర్వఁగ మాటలాడఁగా
బలపలనొచు ద్రోణుఁడును ఫల్గునుడంతట బిత్తరింపుచున్. 63

గీ. ఏకలవ్యుని గురుశిష్యులిర్వురంత
చిట్టకంబునఁ బొడఁగాంచి సెలవుఁబొంది
కోర్కెలీడేఱెనని చెప్పి కులుకుతోడ
మరలిపోయిరి తమవీటి తెఱవుఁబట్టి. 64

వ. ద్రోణార్జునులు మగిడిపోయినపిమ్మట నేకలవ్యుండు తనమనంబున నిట్లు
తలపోయసాఁగెను— 65

చం. గురుఁడఁటవీఁడు నన్ను వెడకోర్కులు గోరుచునంగుటంబునన్
నఱకఁగఁజేసి కైకొనియె న్యాయమ ? శిష్యునిఁ బుండలింపఁగా
గురుజనుఁడున్ స్వలాభమును గోరఁగవచ్చునుగాని శిష్యునిన్
గరుణయొకింతలేకయ పకారమునన్ గ్రసియింపధర్మమే ? 66

కం. చింతింపక యొకనికినై
యంతఃకరణ ప్రవృత్తి నావలనిడెఁబో
యంతే ! వాసిచెఱుచుకొనె
నంతేవాసి చెడఁడింతయైనను గనుఁడీ. 67

వ. హృదయంబు కలవరపడుచుండఁ దన్నుదానూరడిఁచుకొని— 68

గీ. కృష్ణమూర్తి మేనత్తయౌ పృథకుఁగొడుకు
నరుఁడు వానిగురువుచాపగురుఁడుగానఁ
గృష్ణుఁడీపనియెల్లఁ జేయించియుండు
వేఱువిధముగాఁ దలపోయ వీలులేదు. 69

వ. ఇంతమాత్రంబునకు నైనదియేమి ? త్రిజగంబులు విస్మయంపడ శ్రీకృష్ణుండు
సంగ్రామరంగంబున నాప్రళయతాండవముంగనుంగొని ఱిచ్చపడుఁగాక— 70

సీ. అడ్డంబువచ్చిన హరిహరాదులనైన
"ఉప్పు"ని క్షణములో నూదివైతు
శ్రీకృష్ణుఁడేవచ్చి డీకొన్నచో వాని
వేటారుతునియల విఱుగవైతు

దండెత్తిపోయి నే ద్వారకావతిలోన
దండాటలాడింతు దండునెల్ల
పాండుపుత్రకులెతోడ్పడవచ్చుచో ముట్టి
పెలుచవారల తలల్ దులిచిపుత్తు

గీ. వెలయఁ బదిర్వేళ్ళలో నొక్క వ్రేలుపోయి
నంతమాత్రాన నేమి దురాశగాక ?
ఏకలవ్యుండు సర్వలోకైక ధార్మి
కుండనఁగ మారుమ్రోగింతుఁ గుతలమెల్ల. 71

వ. అంచు రోషించి మంచికొలరులఁబంచి, చెంచు గూడెములనుంచి చెంచు దొరలం బిలిపించినఁ బేరుమోసిన సెలవిలుకాండ్రు, తడవిలుకాండ్రు, వెదురు విలుకాండ్రు, వెడవిలుకాండ్రు నెదురులేక యొకరి నొకరు పిలుచుకొని, మించిన భక్తితో తేనికడకురా నేకలవ్యుండు రణభేరివేయించి, పైనంబుఁజేసి ద్వారకాపురినిడాసి, చుట్టుముట్టఁగి పైఁబడి యాయాదారులనెల్ల నరికట్టి, పురంబుననున్న సరదారుల నాదారులంజేసి, కట్టెదుటనున్న తోఁటలను, దొడ్లను బాడుచేసి, జోదుల పెక్కండ్ర మడియించి, కృష్ణుండు లేమిచే మగిడివచ్చె. పదంపడి కొండొక కాలంబున మరల యుద్ధంబు ప్రవర్తింపనందు నన్యాయంబుగాఁ గృష్ణునిచే నతఁడు నిహతుండయ్యె. 72



# ధర్మజ రాజసూయము

వ. నిరంతర ఘోర సంగ్రామవ్యాపారసంక్షుభిత మనస్కుండై శ్రీకృష్ణుం డొక్కనాఁడేకాంతంబున, నవరత్నస్థగిత కుడ్యపరిభ్రాజమాన నిజసౌధాభ్యంతర చంద్రశాలలో, సాంద్ర చంద్రమరీచి జాలంబు హృదయాహ్లాదంబు కలుగఁజేయుచుండ నెమ్మదిఁ గూర్చుండి యిట్లు తలపోయసాఁగెను— 1

కం. మురనరకహంసడిచికళ
బరభూవరకంసముఖర పరనరవరులన్
బొరిగొనితి నను పెకానీ
యెఱుగనయితిఁ గంటినిండ నెన్నఁడునిద్రన్. 2

సీ. ఒకమూల మాగధుం డూర్జితసత్త్వుఁడై
దండెత్తిపైఁబడఁ దలఁచుచుండ
ఒకవంక శిశుపాలుఁ డుద్భటారభటితోఁ
గోలాహలముఁజేయఁ గొంకకుండ
ఒక చెంప పౌండ్రకుం డుత్సాహవంతుఁడై
దెప్పరంబుగ ముట్టడింపనుండ
ఒకప్రక్క సాల్వుండు వికటాట్టహాసియై
కెలాటములు పెట్టఁ గదలుచుండ

గీ. కాలయవనుడొక్కట నౌడు గఱచుచుండ
దంతవక్త్రుండు తనదండఁ దట్టుచుండ
వీరివారిఁ దప్పించుక వేగుపెటులో !
కలలలో వీరిమూర్తులే కానిపించు. 3

కం. వినరాదువీరి పల్కులు
కనరాదిసుమంత వీరి కార్యచయంబున్
మనరాదు వీరిపొత్తునఁ
జనరాదొక యింత వీరి సంగడికొఱకై. 4

సీ. ఆర్యసంఘంబుతో నైక్యమైతినటంచు
మాజాతివారెల్ల మసకపడుచు
ననుఁజూచి కినుకతో నాయందు లేని త
ప్పులమోపి దవ్వుగాఁ దొలఁగిపోయి
చతురంగసైన్యంబు సమకూర్చి నిరతంబు
వెంటాడుచుండిరి విసుగులేక
కంటినిద్రయెఱుంగఁ గడుపుకూడు నెఱుంగఁ
జాలకాలమునుండి జడుఁడనైతి

గీ. నొంటరిగ వీరితోఁబోరుచుండలేక
జన్మభూమిని గాపాడు శక్తిలేక
కానిద్వీపంబులోనిల్లు గట్టుకొనుచు
నిట్లు లారాటపడుచుంటిఁ దుట్టతుదకు. 5

పాపియగు జరాసంధుఁడైశ్వర్యమత్తుఁ
డగుచు రాజచక్రమునెల్ల నానకట్టి
తోలుచుండె నామీఁదకు ధూర్తుఁడతఁడు
జాతివిద్రోహినని చెప్పి సాకువెట్టి.

అతనిపేరు సింహస్వప్న మగుటచేతఁ
దొలఁగియుండుట లగ్గంచుఁ దలఁచినేను
మధ్యదేశంబు నెడఁబాసి మాటుపడుచు
వచ్చియిందుంటి బాంధవ వ్రజముతోడ. 7

కం. ఎచ్చటి పచ్చికబీళ్ళను
విచ్చల విడిమేయు ధేనువిసరంబులు నా
కిచ్చినవా గుమ్మపాలను
నచ్చటి భూములను వీడనాడఁగవలసెన్. 8

గీ. జన్మభూమియౌ మధ్యదేశంబునందు
నిలువనీడ లేకుండఁ జేఁ గలిగినాఁడు
వీనిరాజ్యంబు కూఁకటి వ్రేళ్ళతోడఁ 9
బెళ్ళగింపకుండినఁ బేరుపెంపు చెడును.

కం. ద్రావిడ జనముల పంచకుఁ
బోవక యెట్లయిన నార్య భూమీశ్వరులా
పోవఁదలలోని నాలుక
కై వడినే సంచరింతుఁ గార్యార్థుఁడనై .. 10

సీ. సంజకెంజాయలోఁ జలువతిన్నెలమీఁద
విరమించు భాగ్యంబు వెడలిపోయె
పండువెన్నెల నారుబైటలోఁ బవళించు
సౌభాగ్యగరిమంబు సమసిపోయె
ముప్పొద్దులందుఁ బుప్పొడి దుమారంబులో
మునిఁగితేలుట యెల్ల ముగిసిపోయె
పున్నాగములకూడి పున్నాగములనీడ
పన్నాగములఁబన్ను చెన్నుపోయె

గీ. జన్మశతములకైన నా జన్మభూమి
సౌఖ్యములమాట మఱవంగఁ జాలనౌర
రాజచండాలుఁడైన జరాతనూజు
వల్లనింతవల్లడి గల్గె వల్లమాని. 11

కం. అమ్ముడువోయితిననుచున్
సమ్మతిఁ జూపింపలేక సందేహముతో
నమ్మరు ద్రావిడజనములు
నమ్మినలాభంబులేదు నాకిఁక వారిన్. 12

చం. అరయఁగ నార్యసంఘమున యందిపుడిప్పుడె భేదభావముల్
పొరయుచునుండెఁగాన నెటి పూనికతో నెటులైన వానినిన్
ఖరయఁగఁజేసి చిక్కులను బెట్టి నిజంబుగ రెండుపక్షముల్
స్థిరముగఁ గూడకుండునటు చేసినమేలగు రాజనీతిచే. 13

కౌరవ పాండవుల్ తొడరి కౌరవ రాజ్యరమానిమిత్తమై
పోరఁగనున్న వారలని పొక్కెను వార్తలు కాన వెంటనే
వారి విరోధముల్ చతురుపాయములన్ నిగుడింపఁజేసి యే
తీరుననైన దగ్గరకుఁ దీయుట మంచిది యొక్కపక్షమున్. 14

కం. చతురంగబలముతోడన్
సతతము సప్తాంగ బహుళ సంపదతోడన్
ధృతరాష్ట్రపుత్రుఁ డుండెను
జతపడునేవానిపొత్తు సరిపడి మాకున్ ? 15

ఉ. పర్యవసాన మేమయినఁ బాపమొ గీపమొ తప్పకుండ నా
యార్యులఁ జీలఁదీసి సమయజ్ఞత వారలు కూడకుండఁగా
ధైర్యముతోడ నీపనిని దప్పక చేయకయున్న బాపురే !
కార్యము తప్పిపోయి యడకత్తెఅలోపలి పోకనయ్యెదన్. 16

కం. బలవంతునితో నెన్నఁడు
చెలిమింజేయంగ రాదు చేసిన యపుడే
సిలుగులు తప్పకకలుగును
జెలిమియు బగయౌచునుండుఁ జిట్టచివరకున్. 17

ఉ. పగ్గెకలట్టివారు బహు బాహుబలాఢ్యులు నెట్టివారికిం
దగ్గరు పంచపాండవులు దర్పసమగ్రులు యుద్ధభూమి. మా
దగ్గర చుట్టముల్ గనుక దగ్గఱతీసి వివేకమొప్ప నా
యగ్గముఁ జేసికొన్నఁబని యంతయు నెగ్గును నెగ్గులేటికిన్ ! 18

కం. అన్నన్నా ! నన్నెంత వి
పన్నునిఁ గావించినాఁడు బార్హద్రథియున్
గన్నీటి ధారలొలుకవ్
మున్నీటి మయమ్మునందు మునుగఁగవలసెన్. 19

గీ. చుట్టపక్కాలు తక్కువ చుట్టునున్న
యట్టి బలగంబు తక్కువ యగునుగానఁ
బరమసంతుష్టులగుచు నా ప్రాపు ప్రోపు
నొందఁ బాండవు లువ్విళ లూరుచుండ్రు. 20

కం. కావున నామాటలపైఁ
గావలసినయంత నమ్మకంబుంతురు గా
దే వారలు దానివలన
నావచనములేవియైన నచ్చఁగవచ్చున్. 21

ఉ. చండమదంబునన్ దిరిగి సాహసచర్యల నాచరించు రా
ణ్మండలి వారికిన్ బృధకుమారులకుం బగఁజేసిపెట్ట నా
యండను బాయకుండెదరు ప్రాణభయంబునఁ బాండవేయులున్
నిండు బలంబు చేకురును నిక్కము మేలగు నాకు దానిచే. 22

గీ. రాజసూయాధ్వరంబొనర్పంగఁ బాండ
వులను బురికొల్పి నంతటఁ బుడమిఁ బొడమి
యారిపోవని శత్రుత్వ మఖిల రాజ
రాజితోడ క్షణంబులో రాజఁగలదు. 23

వ. అని యీరీతి రాజనీతిజ్ఞుఁడై లోతు విచారించి, వితర్కించి; వెంటనే దేవర్షి యగు నారదుని బిలిపించి, కార్యవిధానంబు సర్వంబు నిరూపించి చెప్పింప, నారదర్షియు నింద్రప్రస్థంబునకేగి పాండవులచే నర్ఘ్యపాద్యాది విధులం బూజింపఁబడి, క్షేమసమాచారంబు లెఱింగి, ప్రసంగవశమున నేమియు నెఱుంగని వానింబోలె నిట్లు చెప్పదొడంగె— 24

కం. మొనమొన్ననె త్రిదివమునకుఁ
జనివచ్చినవాఁడ నేను జనపాలా ! మీ
జనకుని నటఁ గాంచితి నా
యనఘుఁడు సౌఖ్యముల నోలలాడుచునుండెన్. 25

మ త. నన్నుఁగాంచినయంత మీపిత నాకమందున వెంటనే
నన్నుడగ్గరి మీదుక్షేమము నాముఖంబున సర్వమున్
విన్నవాఁడయి సంతసిల్లుచు బిక్కమోమున నాపయిన్
గొన్నిమాటలు మీకుఁజెప్పఁగఁ గోరి యిట్లనిచెప్పెఁగా. 26

మ త్త. భూతలంబున నున్నయప్పుడు భూతలేశులఁగూల్చుచున్
భూతిఁగూర్చుటెకాని మీకయిబుద్ధిపుట్టకపోయెఁగాఁ
భూతయజ్ఞము లాచరించుచుఁ బ్రోవనైతిని బుణ్యమున్
భూతలంబును వీడినప్పుడు పుణ్యలోకముఁ జేరఁగా. 27

మ త్త. అజ్ఞుఁడయ్యునధర్ముఁడయ్యును నల్పుఁడయ్యును నెవఁడే
యజ్ఞమొక్కఁడు చేసియుండునొ యట్టివానికినిత్యమున్
బ్రజ్ఞగల్గును సత్యలోక నివాసమొందఁగ సర్వదా
ప్రాజ్ఞులయ్యును నాకమందునఁ బ్రాకులాడెదరన్యులున్. 28

ఉ. ఎద్దడిలేని భూమితలమెల్లనునేలుచునుంటి వింటికిం
బెద్దవుపెద్దవీవయనిపించుకపేరును మోసినావు నీ
కెద్దియు నడ్డులేదు పృథివీశులు తమ్ములు రాజసూయమున్
వద్దనఁబోరు తోడుపడవత్తురు జన్నముసేతునన్నచో. 29

శా. నాకంబెన్ గుణహీనులైననృపులున్ నాకంబె ధర్మచ్యుతుల్
నాకంబెన్ గడులుబ్ధులుండిరిగదన్నా ! సత్యలోకంబులో
నాకుంగూర్పుము సత్యలోకము మహానందంబు వాటిల్లఁగా
సాకల్యంబుగ రాజసూయమను యజ్ఞంబొండుగావించుచున్. 30

గీ. కానఁ బిత్రాజ్ఞఁబాలించి మానసీయ
చంద్రవంశ మర్యాద దేశములయందు
నిలిపి, నన్నుద్ధరింపంగ వలయునంచుఁ
బలికి ధర్మజా ! నన్ను మీవద్దకంపె.

కం. నారదుఁడాడిన మాటల
గారవమున నాలకించి కంపిల్లుచుఁ గ
న్నీరొలుకఁగ నిట్లనె వసు
ధారమణుఁడు తండ్రిపాట్లు తత్తరపెట్టన్. 32

కం. తండ్రీ ! చెప్పితి గదె మా
తండ్రీ దివమునందు నందు తాపంబును నే
మంద్రౌజనంబులు విన్నన్
తీండ్రించుచునుండె శోకతీవ్రత నన్నున్. 33

గీ. తండ్రి యానతి నేఁదలఁదాల్చి చేతు
రాజసూయ పవిత్రాధ్వరంబు నిపుడె
కాని మాకేడుగడయైన కంసవైరిఁ
బిల్చి చెప్పవలసియుండుఁ బెద్దమాకు. 34

వ. అనుచున్న వెంటనే దౌవారికుండు చనుదెంచి శ్రీకృష్ణు నాగమనంబు విని
వింప యుధిష్ఠిరుండు దిగ్గన లేచి యెదురేగి, సాష్టాంగ దండప్రణామంబు
లాచరించిన శ్రీకృష్ణుని గ్రుచ్చి కౌఁగలించి యుచితాసనంబునఁ గూర్చుండఁ
బెట్టి, కుశలసంప్రశ్నముఁ జేసి, నారదుండు చెప్పిన యుదంతంబు
విన్పింప దరహసితవదనుండై యదూద్వహుండు— 35

గీ. ఇంతకన్నఁ గావలసిన దేమిమనకు ?
తండ్రికన్న వేఱుగలండె దైవమొకఁడు ?
తండ్రి సంతుష్టిఁ బొందినఁదప్పకుండ
భువనమంతయు సంతుష్టిఁబొందఁగలదు. 36

వ. దైవజ్ఞుల రావించి సుముహూర్తంబు నిశ్చయించి వెంటనే— 37

ఉ. నల్వుర తమ్ములం బిలిచి నాలుగుదిక్కుల కప్పనంబులన్
గొల్వఁగఁ దేరఁ బంపు సమకూర్పుము ద్రవ్యములన్ని చక్కఁగాఁ
బిల్వఁగఁ బంపు చుట్టములఁ బెత్తనముం బొనరింప నిప్పుడే
పల్వురచేత యజ్ఞము సెబాసనిపించెదఁ దండ్రి హర్షిలన్. 38

కం. కానుకలీయకయున్నన్
మానక దండెత్తిపోయి క్ష్మాపాలకులన్
దీనులఁజేయుచు నీ స్వా
ధీనముఁగావింతు వారిదీమసమెడలన్. 39

గీ. అధ్వరసమాప్తి యయ్యెడు నంతవఱకు
నిందెయుండి సంబారము లెల్లఁగూర్చి
పెట్టి మెప్పించెద విరోధి వితతిచేతఁ
గలఁతపడనేల యీపాటి కార్యమునకు 4

మ. అని ప్రోత్సాహముఁ జేసినంతటనె యజ్ఞారంభసంరంభియై
తన తోఁబుట్టుల నల్వురం బనిచెఁ బంతంబొప్ప నల్దిక్కులం
గని రాజన్యులనుండి యప్పనములం గైకొంచు రమ్మంచుఁ జ
య్యనఁ గుంతీతనయాగ్రజుండపుడె పిత్రాజ్ఞానిబద్ధాత్ముఁడై. 41

గీ. కొన్ని దివసంబు లట్టులే చన్నపిదపఁ
గవలు వడముడివచ్చిరి కానుకలను
సకల రాజచంద్రులనుండి సంగ్రహించి
వాసుదేవ ధర్మజులు సంతోసమంద. 42

గీ. బేలువోయిన మనసుతో విజయుఁ డొకఁడు
వట్టిచేతులతోఁ దిరిగివచ్చెనకట !
సిగ్గు ముప్పిరిఁ గొనుచుండఁ జెప్పలేక
చెప్పె నగ్రజుతోఁ జిట్ట చివరకిట్టు. 43

ఉ. రాజగృహంబుఁజొచ్చుచు రాజసుతుఁ గన్గొని యొంటిపాటునన్
నేఁ జనివచ్చినట్టి పనినిన్ వినిపింపఁగ నవ్వి యిట్లనెన్
రాజటె ధర్మసూనుఁడవురా ! యిది యెన్నఁడువచ్చి పైఁబడెన్
రాజనుకొన్న మాత్రనె జరాసుతుఁడిచ్చునె యప్పనంబులన్ ? 44

కం. అరియప్పనంబులీయం
డరివారముఁ ద్రుంచుఁగాని యరుదెంచిన నా
హరిహరులరిఁ గొనఁదలఁగక
యరిగాపులఁ జేసికొనును నరి నరవరులన్. 45

గీ. ఇటు జరాసుతుఁ డాడ నే నేవపడియు
నోరు కదలింప కరికట్టి యూరకుంటిఁ
జేయునదిలేక యచ్చట సిగ్గువడితి
రాజచంద్ర ! దుస్సహ మీ పరాభవంబు. 46

ఉ. వానినిఁజంపి కాని కయివాల్చను నాకనుదోయి జెప్పలన్
వానిఁ జంపికాని కుడువం దలపోయను భోజనంబునున్
వాని కఠోరవాక్యములు వానిఛలోక్తులు నీసడింపులున్
మానవనాథ ! నాచెవుల మానక గింగురుమంచునుండెఁబో. 47

చం. అనవిని కృష్ణుఁడిట్లనియె నౌర ! జరాసుతుఁడన్న నల్పుఁడే ?
యనిమొనఁ జూచితీరవలె నాతనిచేవ, బలంబు, సొంపు, నా
తని పటుముష్టియుద్ధము, గదారణపాండితి, శ్రతువీరులై
నను నుతియించి తీరుదురు నాపలుకుల్ వినియూరకుండుమా. 48

కం. భీమార్జునులిర్వుర నా
తో మానవనాథ ! పంపు తొందరపడ కె
ట్లో మాగధు లోఁబఱచెద
సామముననొ లేక ఘోర సమరమ్ముననో. 49

వ. నేటికిఁ గొల్వు చాలింతమని చెప్పి లేచి శ్రీకృష్ణుండు కొండొక క్షణంబు ధర్మజునితో రహస్యాలోచనంబుఁ గావించి, రాత్రిఁ గడపిపుచ్చి మఱు నాఁడు పెందలకడనిద్దురలేచి భీమార్జునులను గూడి గిరివ్రజపురంబునకుఁ బ్రయాణోన్ముఖుండయ్యెను—

గీ. వెలయ స్నాతక బ్రాహ్మణ వేషములను
గొనబుగా సంతరించి ముగ్గురునుగూడ
వెడలి ముచ్చిచ్చురీతిగా బిడియపడక
చనిరి యప్పుడడ్డె గిరివ్రజపురమునకు. 51

ఉ. ఒద్దికవారు మూవురును నుబ్బకు నెండకునోర్చి దారిలో
సుద్దులుకొన్ని చెప్పికొనుచుం జనుచుండఁగ నోర్మినొక్క నాఁ
డద్దమరేయియైన యపుడందఱు రాజగృహంబు చెంతకున్
దద్దయుఁజేరి యొక్కయెడ దారికిమారమునందునిల్వఁగన్. 52

గీ. వాసుదేవుండొ యిటునటు పాఱఁజూచి
చీమ చిటుకుమన్న నులికి చివుకురుమనఁ
దోడవచ్చిన పార్థులతోడ నేమి
పలుకులో పల్కి యచ్చోటనిలువనీక. 53

గీ. రాచబాటను దిగఁద్రొక్కి కోచలగుచుఁ
గొండకోనలో లోయలోగుండ నడచి
కాలి సవ్వడి కాకుండఁ గట్టకడకు
గదలివచ్చి నిల్చిరి కోటగమిడివాత. 54

చం. ఎఱిఁగినవాఁడుగాన మును కృష్ణుఁడు పాండు నృపాలపుత్రు లి
ద్దరి విడి దుందుభుల్ గలుగుతావున కేగి యగల్పివైచుచున్
బిరబిరవచ్చి వారలను వెంటనె తోడ్కొని పట్టణంబునున్
జొరి చనె నెట్టి సంశయము చొప్పడకుండఁగ నెట్టివారికిన్. 55

గీ. రాజమందిరమేగి యారాత్రిపూట
వార్తఁబంపిరి కావలివానితోడ
స్నాతకులు మువ్వురు తమ దర్శనముఁగోరి
నిలిచియున్నారు మొగసాల నీడ ననుచు. 56

గీ. శైవపూజానిమగ్నుఁడై సర్వమాద
మఱచియున్న జరాసంధ నరవరునకు
సౌవిదల్లుఁడు మెల్లగాఁ జనియచటకు
విన్నవించె నీవార్త భూవిభునితోడ. 57

కం. వచ్చినది విప్రుఁడగుటన్
జెచ్చెర వినిపింపకున్న శిక్షించునొకో
మచ్చరపడి భూపతియని
క్రచ్చర వినిపించెనపుడు కావలివాఁడున్. 58

ఉ. ముంగిటియందు బ్రాహ్మణులు మూవురు నిల్చిరటన్న వార్త వ
ల్లంగలగుండుఁ బొంది పదిలంబుగఁ బూజనుమానివైచి క
న్నుంగవబాష్పముల్ దొడర, నూత్నవికాసము మోముగ్రమ్మఁగా
ముంగల వంగజాల వడిఁ బోవుచునుండఁగ దారితీయుచున్. 59

గీ. పంచరత్ని ప్రమాణంబు బహుళమాంస
లాంగకములుగల్గు శరీర మగ్గలింప
విపులవక్షఃకవాటంబు వెల్గుచుండ
వంగణమున జరాసంధుఁ డవతరించి. 60

ఉ. మువ్వురిమూర్తులంగని యపూర్వము వీరల బ్రహ్మతేజమున్
మువ్వురియందుఁ గన్పడదు పూర్తిగ వీరలు విప్రులౌదురా।
యెవ్వరొ వీర లెందుకయి కృత్రిమ వేషములిట్లు తాల్చిరో
నివ్వెఱ గల్గుచుండె గమనించుట మంచిది వీరి చర్యలన్. 61

వ. అంచు నీగతి లోలోన వితర్కించుకొని జరాసంధుండు డోలిక పోలిక మాగులాడు మనంబుతో వారలంజూచి— 62

ఉ. ఏనినిఁజూడఁగోరి యిటులిచ్చటికిన్ జనుదెంచినారు ? మీ
మీనివసించు భూములయు మీనరపాలుర పేరులేవియో
యీనడిరేయి యేమిపని కిచ్చటి కీగతి వచ్చినారలో
నేననుమానముంబడితి నిక్కముచెప్పుఁడి దాఁచకుండఁగన్. 63

కం. ఈ మాటల నాలించిన
తామరసాక్షుండు పల్కె దంబముతోడన్
మోమున విలక్షణంబుల
నేమియుఁ జూపట్టనీక యెంతొ కపటియై. 64

గీ. స్నాతకులమైన మాకొక్క సమయముండె
రెండుజాముల మునుముందు రేయియందుఁ
బల్కరింపము పల్కము పరులతోడ
నిందుచే వచ్చితిమి యిట కీ యవేళ. 65

కం. మీతోడంబని గల్గుట
చేతన్వచ్చితిమి యీ నిశీథిన్ దేవా !
మీతోఁ జెప్పెదమంతయు
నేతావునకైన పోదమేకాంతముగా. 66

కం. అనినంతనె వెంట జరా
తనయుఁడు భీమార్జునులను దామోదరునిన్
గొనిచనె నిర్వాతమయిన
తన పూజాగృహమునకును దద్దయుఁ బ్రీతిన్. 67

చం. నలువురు లోనికేగిన యనంతర మర్జునుఁగన్ను సైగచేఁ
దెలుపఁగ యాదవుండతఁడు దీనినినెల్ల గ్రహించి వెంటనే
తలుపులుమూసి మాగధునిదగ్గరఁజేరుచుఁ జుట్టుమూఁగియే
పలుకులొకొన్ని పల్కుచును వాదములోనికిదింపి యంతటన్. 68

కం. జిలిబిలిపలుకులు పలుకుచుఁ
జెలిమిని నటియించి కొంతసేపు తటుకునన్
దొలకరిమెఱుపులఁ బలెఁ బైఁ
గలియంబడి మూవురొకటిగా మాగధుపై. 69

చం పిడికిటిపోటులం బొడిచి పెళ్కురిపోవఁగ నజ్జనజ్జుగాఁ
గడిమిచెడంగఁ బాదముల గట్టిగఁదాకుచు గొంతుఁబట్టుచున్
సుడిబడఁ గ్రుమ్మిమర్మముల స్రుక్కఁగఁజేయుచు మూవురొక్కటై
మడియఁగఁజేయుకోర్కెమెయి మాగధుఁదాకిరి భీకరంబుగన్. 70

చం. మొనసిజరాతనూభవుఁడు మూవురితోడను మూఁడుమూర్తులై
కినిసిప్రచండవేగమునఁ గిట్టిచలంబునఁ గీలుకీలునున్
దునిసిపడంగ వారిపయి దూకుచు నూకుచు రెండుమూర్తముల్
పెనగెను ముష్టియుద్ధమున వీరుఁడితండని తెల్పనోయనన్. 71

కం. మూవురు మిక్కిలి రోజుచు
చావులు దప్పించుకొనఁగఁ జకితాత్మకులై
పైవచ్చి పడుటమానుచు
లావును దగ్గింపఁగను వెలార్చిరి వానిన్. 72

కం. క్రమముగ బలముడుగుటఁగని
సమయమరుగుదెంచెననుచు సాహసలీలన్
బొమముడిఁ బెట్టుచుభీముఁడు
తమకమ్మున మీఁదికుఱికి ధరఁబడఁగొట్టెన్. 73

ఆ. పడినవానిఁ గృష్ణార్జునుల్ పట్టుకొనుచు
నదిమిపెట్టంగ భీముండు కదిసి కాలు
పట్టి పెళపెళారావంబు లుట్టిపడఁగఁ
జీల్చివైచె జరాసంధు శీర్ణదేహు. 74

కం. తెల తెలవారకమున్నె
బలవంతపు జేనిచావు పట్టణమెఱిఁగెన్
గలగుడుపడి చెడిపోయిరి
పలపలనయి యెందుఁగల్గు బవిసీంద్రెల్లన్. 75

గీ. పేరుమోసిన రారాజుపేరు మాసి
పోవఁ బురిలోననున్నట్టి పోటుకాండ్రు
బిత్తరిల్లిరి యెదురెక్కి పెనఁగులాట
మాటఁ దలపెట్టరైరి డబ్బాటుచేత. 76

గీ. వీరగంధము నొడలెల్లఁ బెటిలఁబూసి
యెఱ్ఱ కనుగ్రుడ్లు మిక్కిలి యెఱ్ఱపూల
దండ లెఱ్ఱవల్వలును మైనిండఁదాల్చి
రాచబాట నిలిచిరి వీరత్రయంబు. 77

స్నాతకు లొకక్షణంబులో నల్లఁద్రావు
కటిక వారలై పోయిరి కాలమహిమ
ఘోరహత్యలు చేయఁగాఁ గొంకరెందు
మానవులు రాజ్యకాంక్షచే మఱుగునపుడు. 78

ఉ. గిట్టిజరాతనూభవునిఁ గీటడఁగింప నరాజకంబుగాఁ
బట్టణమెల్లఁ బాడఁవడ వందురుచుండుటఁగాంచి తత్సుతున్
దిట్టతనంబులేని సహదేవుని రమ్మని పిల్చి వానికిం
బట్టముగట్టి పాడిమెయిఁ బాలనసేయుమటంచుఁ దెల్పఁగన్. 79

గీ. తండ్రిచావుచే భీతిల్లి తత్తరించి
జడిసి సహదేవుఁ డుడుగరల్ చాలఁదెచ్చి
కృష్ణు సన్నిధిఁ బెట్ట నాకేటి కనక
వాని నన్నింటిఁ జేకొని వరుసఁబెట్టి. 80

ఉ. మాగధుచేత నోటువడి క్రుగ్గుచునుండిన రాజలోకమున్
మాగధుకార నుండిరనుమాట యెఱింగి యదూద్వహుండు తా
వేగమె వానినెల్ల విడిపింపగఁ బోయిరి వారువీళ్ళకున్
భోగములందు కోర్కెపరిపూర్ణముగాఁదముఁ దొందరింపఁగన్. 81

ఉ. పోయిన రాజులెల్ల యదు ముఖ్యపృథాతనయాభిమానులై
పోయిరి కారయున్ వదలిపోయె నటంచును నేఁటితోడ నా
పోయిరి పూర్వబాధఁదలపోయుచు మిక్కిలి తందరించి వా
పోయిరి సొంతవీడులకుఁ బోయిరి క్రోధపరీతచిత్తులై. 82

వ. ఇట్లు జరాసంధ జీవోత్పాటకులైన యాదవ పౌరవ వీరులింద్రప్రస్థపురంబు
నకు నేగి, చింతాకులుండై యెదురుచూచుచున్న ధర్మసూతికి నఖిలంబు
నెఱింగింప, నాతండు విస్మయాకుల చిత్తుండై యద్భుత రసావేశమగ్నుండై
శ్రీకృష్ణభీమార్జునులఁగాంచి గాఢపరిష్వంగ సుఖంబునఁ దేల్చి రాజసూయ
మహాధ్వరారంభ ప్రయత్నంబుననుండ— 83

గీ. దూరభారమనక మాఱుమూలలజనం
బధ్వరంబుఁజూడ నరుగుదెంచెఁ
బిక్కటిల్లిపోయె నొక్కొక్క గేహంబు
నేలయీనినట్లు నిండెఁబురము. 84

దిక్కులనుండి భూపతులు తెచ్చిరి కాన్కలు చుట్టపక్కముల్
పెక్కురు ద్రవ్యరాసులను బెక్కులు తెచ్చిరి మేలివస్తువుల్
మిక్కిలి గూర్చితెచ్చిరి సుమీ యభిమానము గల్గు రాజు
లమ్మక్క ! యటంచునుంబొగడి రాపురమందలి యమ్మలక్కలున్. 85

వ. దైవజ్ఞోపదిష్టంబుగా ధర్మజుండు మంగళస్నానం బాచరించి సహధర్మ
చారిణియైన ద్రౌపదింగూడి దీక్షితుండై యజ్ఞప్రారంభంబుఁ గావించి
శాస్త్రానుసారంబుగా నగ్రపూజాపరిశిష్టంబుగా ముగియించి, తత్పూజార్హు
లెవ్వరాయని లోవితర్కించికొనుచుఁ దుట్టతుదకు— 86

మ. తమమాటన్ దలపెట్ట కెప్పుడు దయాదాక్షిణ్యభావంబుతోఁ
గనుదోయింగను తెప్పలట్టులు మమున్ గాపాడు చున్నట్టి వె
న్నుని సంప్రీతుని గాఁగఁజేసికొని సంతోషించు భాగ్యంబు క
న్నను నాకున్ మఱి వేరుధర్మ మొకటైనను గల్గునే ధాత్రిలో 87

నాకంటెన్ బలవంతులైన నృపులున్ నాకంటె శౌర్యాఢ్యులున్
నాకంటెన్ రణదక్షులైన నృపులున్ నాకంటె ధైర్యాత్మలౌ
భూకాంతుల్ గలుగంగ నీసవనమున్ భూపాలకశ్రేణియున్
నాకౌకుల్ వెరగందుచుండ నిపుడున్ నాచేతఁజేయింపఁడే. 88

కం. కృతకృత్యుఁడ నయ్యెదనేఁ
గృతజ్ఞతను గానిపింతుఁ గృష్ణుని సభలో
నతిభక్తిఁ బూజచేసెదఁ
బ్రతిపక్షుల తోడనాకుఁ బనియేముండున్. 89

వ. ధర్మజుఁడు తన మనంబులో నిట్లు నిర్ధారించుకొని. 90

శా. పూజాద్రవ్యములన్ గ్రహించుకొని సంపూర్ణోత్సుకత్వంబుతో
రాజీవాక్షుని పాదపద్మముల నారాధించి సద్భక్తితోఁ
బూజించెన్ గద తత్సభాముఖమునన్ బోరామియేపారఁగాఁ
దేజఃపుంజముచేత మోము వెలుఁగన్ దేదీప్యమానంబుగా. 91

కం. కొందఱు సంతోషించిరి
కొందఱు మౌనంబుఁదాల్చి కూర్చుండి రిఁకన్
గొందఱు గుందిరి చైద్యుం
డందఱి నదలించి యాపి నతఁడిట్టనియెన్. 9

ఉ. పేరున ధర్మరాజనని బెట్టుగ నుంటివి యింతమాత్రమా
రౌర ! యెఱుంగఁజాలవొకొ యారడియయ్యెను వృద్ధసేవ నీ
పేరుప్రతిష్టలున్ జెడియె వెంగలివైతివి యిప్పు డీ సభా
గౌరవమేల యిచ్చితివి కంటిమె వింటిమె యిట్టి చిత్రముల్ ? 93

సీ. క్షత్రియుండని కాళ్లు కడిగి పూజించితే
యుండఁడేయిందు దుర్యోధనుండు ?
ఆచార్యుఁడని చెప్పి యరసి యర్చించితే
కలుగఁడే యిందు గంగాసుతుండు ?
వృద్ధుడంచును విచారించి సేవించితే
వర్తింపఁడే యిందు బాహ్లికుండు ?
వేదవేత్తని చెప్పి పిలిపించి కొలిచితే
వరలఁడే యిందు ద్వైపాయనుండు ?

గీ. కులములేదు జాతియులేదు గుణములేదు
ధర్మ మెఱుఁగఁబోఁడాచార్య తత్వమెఱుఁగఁ
డేల పూజించినాడవో కృష్ణునిపుడు
సభికులకుఁ దలవంపులు సంభవింప. 94

ఆ. ఔర ! నిన్న మొన్నటిదాఁక యదుకులంబు
మ్లేచ్ఛజాతిగా నున్నది మేదినీశ !
యెఱుఁగవా యట్టివానికి నిప్పు డగ్ర
పూజనిత్తువా యీ సభాముఖమునందు ? 95

ఉ. ఉత్తమ రాజవంశ్యులకహో తలవంపులు చేసినావు నీ
చిత్తము నేఁటికిందెలిసె సీ ! యిది ధర్మమె ? యెందతోనినున్
మెత్తనివేఁగివందురది మిధ్యయొకించుకకూడఁగాదు యా
వత్తునెఱింగి భీష్ముఁడొక పల్కును పల్కఁడు మూఁగలాగునన్. 96

కం. గుసగుసలాడుచె కానీ
బిసవిడి మాటాడరిందుఁ బిఱికితనముచే
నిసిరో ! యిట్టి సభికులున్
వసుధం జూపట్టువారె పరిశీలింపన్ ? 97

చుట్టమైనచోఁ గుడువను గట్టనిచ్చి
పూజలొనరించెదవు గాని బుద్ధిలేక
పూజ్యుల యెదుటఁ బూజించి పొగడుటేల 98
గొల్లవారింటి గజదొంగఁ గొంకులేక ?

కం. ఏటికి మముఁ బిలిపించితి ?
వేటికిటు పరాభవింప నీ సభలోనన్
జీటికి మాటికి నిటు కై
లాటముతో సంచరింప లగ్గగునొక్కో ! 99

కం. బాలుండగు శిశుపాలుం
డీ లీలం బలుకుచుండ నిదియదియని వా
చాలుండ్రై సభికులలోఁ
గోలాహల మట్లెపుట్టెఁ గొల్లుగ నపుడున్. 100 100

వ. అంతఁ దోకఁద్రొక్కిన మహానాగంబు చందంబున రోజుచు నతి రోషంబున
సహదేవుండు లేచి నిలువంబడి— 101

ఉ. ఊరక ప్రేలుచుండితివి యో శిశుపాల ! సభాముఖంబునన్
బాఱులు క్షత్త్రియోత్తములు పండితులుండిరటంచు నెంచ వె
వ్వారలు మమ్ముఁగాదనుచుఁ బ్రల్లదముల్ వచియించువారలో
వారలఁ దన్నిపంపెదము పంతముతో నిది చెప్పుచుండితిన్. 102

కం. బాలుఁడవయ్యున్ బెద్దలఁ
బోలెన్ ధర్మంబుఁ జెప్పఁ బోలునే ? పోపో
బాలిశ ! పెద్దల సభలో
నాలోచింపక ప్రసంగ మాడందగునే ? 103

కం. సహదేవుని వాక్యంబుల
సహనము విడనాడిపోవ సంభ్రమపరుఁడై
యహమహమికతో నప్పుడు
సహదేవునిఁ జూచిపలికెఁ జైద్యుండిటులన్. 104

ఉ. తన్నెదనంచు నెత్తిన పదంబిదె పెద్దలు చూచుచుండఁగాఁ
దిన్నఁగ నాకటారిఁ దెగితీరును మిక్కిలి ప్రల్లదించినన్
దన్నఁగలట్టి శక్తి కలదా ? తమవద్దను జాతమేది ? నీ
యన్నలులేక తన్నఁగలవా ? సహదేవ ! యెఱుంగనింతకున్. 105

కం. తన్నెదననుచున్ సభలోఁ
దన్నక కూర్చుండి మాటఁదప్పినవానిన్
మన్నింపరు పెద్దలెపుడు
తన్నుటొ తన్నించుకొనుటొ తప్పదు నీకున్. 106

ఉ. మూగురు దొంగవేసములబూని యధేచ్ఛమహానుభావు మా
మాగధు విప్రబంధుని బ్రమత్తుని నిర్మలు స్నేహపాత్రునిన్
మూఁగుచు నర్ధరాత్రిఁ బొరిపుచ్చుట మాత్రము కాదురోరి ! మీ
యాగము సాగునా యిఁకను యాగమునందిటు దూరి పల్కినన్. 107

కం. శిశుపాలునితోఁ బోరుట
వశమగునే నిన్నుఁబోని పందకుఁజెడుగా !
శశిధరునంతటివాఁడు వి
వశుఁడయ్యెడు వానిబారిఁ బడినంతటనే. 108

వ. అని గంభీరవచనంబుల నుడివి ధర్మనిర్ణేతలు ధర్మంబు నెఱింగియు, ధర్మ నిర్ణయంబుఁజేయక యధర్మంబు సాగనిచ్చుటంజేసి యిందుండఁ దగవు కాదని లేచిపోఁబోవుచుండ, ధర్మజుండు శిశుపాలుని వెంటంజని వానిం బటువఱచి తోడ్కొని మగిడివచ్చెను. శిశుపాలుండును బాలుండగుటచేఁ బరుషవాక్యపరంపరల విరమింపఁడయ్యె. భీమసేనుండు దాన రోషకషాయిత నేత్రుండయి భుజాస్ఫాలనంబుఁజేసి యుద్ధోన్ముఖుండయ్యె. భీష్మం డిది చూచి భీముని నదిమిపట్టికొని శిశుపాలుం డలంతి యని తలంచితివే ? నీ కసాధ్యుం, దూరకుండుమని బోధింపమిన్నకుండెను. శిశుపాలుని పరుష వాక్యంబులకు, వీరవాక్యంబులకు వికత్థనంబులకు యాదవ పాంచాలురు

సంక్షుభిత మనస్కులైరి. చైద్యులును సంగరోన్ముఖులగుచుండిరి. సభ యంతయు నల్లకల్లోలమైపోయెను. ఈ సందడిఁ గనిసెట్టి చైద్యుండు ప్రమత్తుండై యుండుటంగాంచి— 107

కం. ఎగుమూపునకున్ నేర్పునఁ
దగిలించినయట్లి చక్రధారను శిరమున్
దెగిపడఁ దటుకునఁ గృష్ణుఁడు
మొగిసి ప్రయోగించెఁ జక్రమును సభ చెదరన్. 110

ఉ. ఈగతి రాజసూయము మహీశుఁడు సాంతముఁజేసి దూరదే
శాగతబంధులన్ బనిపి యందఁడు మోదము, కాని కృష్ణుఁడున్
బాగని లోఁదలంచె శిశుపాల జరాసుతులిర్వు రింతలో
నేగిరి స్వర్గలోకమిఁక నిక్కటులేవియుఁ రావటం చొగిన్. 11

మ. కలిగించెం బగ చేదిరాజమగధ క్ష్మాపాలసంహారమున్
గలఁగించెన్ గురురాజుమానసము యజ్ఞంబింక మాయిక్కటుల్
* తొలగెంబొమ్మని ధర్మరాజుకడనెంతో భక్తి శ్రీకృష్ణుఁడున్
సెలవుంగైకొని ద్వారకానగరముం జేరెన్ బ్రమోదంబునన్. 1

ఉ. ద్వారకఁజేరి యందుఁగల తల్లిని దండ్రిని నన్నదమ్ములన్
గూరిమి బిడ్డలంగనుచుఁ గొన్నినెలల్ గడుపంగ నారిటం
కారములున్ వినంబడవు గంధగజేంద్ర ఘటాకఠోర ఘీం
కారములున్ వినంబడవు, క్ష్మాస్థలి శాంతిగ నుండె, నింతలో. 13

ఉ. చైద్యునిఁజంపెఁ గృష్ణుఁడను సంగతి సాళ్వుఁడెఱింగి క్రుద్ధుఁడై
చైద్యుఋణంబుఁ దీర్చెదను సంగరమందునఁ గృష్ణుఁజంపి యీ
యుద్యమమందు నాయుసురులుంకువఁజేసెద నెవ్వరడ్డినన్
జైద్యునిచావు ద్రావిడుల శౌర్యము నింకఁగఁజేయఁజాలునే. 114

ఉ. ఎప్పుడు నిట్టివాఁడెయగు కృష్ణుఁడెఱుంగమె ? ఔర వీనికిం
దప్పులులేవు, లేదు రణధర్మము శూరకులంబునందునన్
జొప్పడఁ బుట్టియుండినను సుంతయెఱుంగఁడు శూరధర్మముల్
ముప్పొడఁ గూడు నిక్కముగ ముక్కున వీనికి నావి యున్నచో.

కం. చచ్చుటొ వీనిం జంపుటొ
మచ్చరమునఁ బోరుసల్పి మానకయనుచున్
జెచ్చెర సాళ్వనృపుండు వి
యచ్చరులెల్ల గుమిగూడి యచ్చెరువందన్.

ఉ. దంభనృపాలకోటి మదదర్ప సమగ్ర భుజావలేప సం
స్తంభన మాచరింపఁగల దారుణబాణకృపాణయుక్తమౌ
సౌంభకపట్టణంబు రిపుజాలముఁదూల్పక వ్రేల్పకెల్ల వి
శ్వంభర దిర్దిరం దిరిగి వాలక వ్రాలక యుండ నుంచునే.

గీ. ప్రళయతాండవమాడింతు భగ్నరథము
శిథిల సమరాయుధంబు; విశీర్ణ దేహ
మై రణస్థలి గోమాయువాహరించి
మిగుల విహరించు భోగభూమిని నొనర్తు.

వ. అని వచియించి కృతనిశ్చయుండయి—

సీ. తుంగమాతంగ తురంగశతాంగ స
ద్భటరాజి నెక్కించ పదిలపఱచి
ఆయుధాగారంబులన్నింటి శస్త్రాది
నిఖిలాయుధంబుల నింపివైచి
వివరించి స్త్రీ బాల వృద్ధరోగార్తుల
మంచిమాటలు చెప్పి దించివైచి
మేఘమండలిపైకి మెలపుతో నెగయించి
యలవోక తనదారిఁ దొలఁగనీక

గీ. సౌంభకవిమాన నగరంబు సాళ్వుఁడెక్కఁ
జండభయదవలాహక స్వనితతులిత
చటుల గంభీర భేరికాస్వనమునిగుడె
జైత్రయాత్రాసముత్సాహ సమయమందు. 120

చం. తలఁగక యాదవుల్ కడలి దాపునబందరునందు సాళ్వునిన్
దలపడి లెక్కపెట్టక వితాకును జెందక పోరుచుండఁగా
నలవు జలంబుతోడను భయంకరరీతి జయాభిలాషచేఁ
దొలఁగెను మాసముల్ జయము తోఁపకపోయె లవంబుసైతమున్. 121

గీ. ఆరునెలలు పోరు ఘోరంబుగాఁజేసి
సాళ్వభూమి ధవుఁడు సమసిపోయె
గాలిజోగుప్రోలు కడలిలో దిగఁబారి
పేరు మాసిపోయె విభునిఁగూడి. 122

ఉ యాదవ సాళ్వవీరు లిటు లాలముఁజేసెడి కాలమందునన్
జూదమునాడి పాండు నృపసూనుఁడు కోల్పడిపోవ రాజ్యమున్
గాదిలితమ్ములన్ సతిని గౌరవనాథుఁడు యాజ్ఞసేనినిన్
ఖ్మెదయితుల్ కనుంగొన సుమాళముతో సభకీడిపింపఁగా. 123

చం. కనుగొనలందు నశ్రువులుగ్రమ్మఁగ బోరుననేడ్చెఁదత్సభన్
గనుగొనఁ గాచువారలటఁ గానమిఁ గృష్ణుఁడు సాళ్వరాజుతో
డ నని యొనర్చుచున్ మిగుల డస్సి భయంపడి వేగవీనినిన్
దునుముట యెట్టులో యనుచు దూబయియిచ్చట నేడ్చుచుండఁగన్. 124

## పౌండ్రక వాసుదేవుఁడు

చం. కలడొక ద్రావిడప్రభువు గండరగండఁడు పుండ్రజాతికిన్
గులపతి వాసుదేవుఁడను క్షోణిధవుండభిమానవంతుఁడున్
జలజదళాక్షుసన్నిధికిఁ జారునిబంపె నొకప్పుడీగతిన్
బలుకుమటంచుఁజెప్పి తనభావము తేటపడంగఁ జెప్పెరన్. 1

గీ. వాసుదేవుఁడన్ పేరుగా వలసెనోటు
ఇపుడు శంఖచక్రములు నీకేలవలసె ?
నెంతవాఁడవై తౌరౌర ! యింతలోనఁ
గృష్ణ ! గోపీకుచాలంకరిష్ణు వీవు.

ఉ. ఏమిర కృష్ణ ! చిత్రములనేకముఁజేయుచు నుంటివంట నా
నామము బూనినావఁట వినాశము నీకిఁకఁదప్పఁబోదు పైఁ
గా మము ధిఃకరించుటకుఁ గైకొనినావఁట శంఖచక్రముల్
నీ మతి పోయెనే ? బ్రదుక నేరవె ? తీరని వైరమేటికిన్.

ఉ. పేరు ప్రతిష్ఠలేల ? యదువీర ! చలంబును మాని వీడు నా
పేరును శంఖచక్రముల వీడకయున్న శరీరమంతయున్
బేరుకొనంగ నెత్తు అరివీరులు పేరుకొనంగ నన్ను నీ
పేరునడంతు నీక్షణమ పేరులకోరుల గ్రొచ్చిపాతుచున్.

ఉ. చారుముఖంబునన్ విని విచారములేకయె కృష్ణుఁడీ సమా
చారము యాదవప్రజకు సర్వము చక్కఁగ విప్పిచెప్పి గో
చారఫలంబుఁ జూచికొని సంగరభూమికి భూరి సైన్యసం
చారముతో బయల్వెడలెఁ జయ్యన వైరులు పిచ్చలింపఁగన్.

ఉ. గాంఢ్రని బొబ్బరింతలిడు గండుపులింబలె గ్రుడ్లుద్రిప్పుచుం
బౌండ్రక వాసుదేవుఁడు జవంబున యాదవ వాసుదేవునిన్
దీంఢ్రిలివచ్చి దాఁకెఁ గడతేర్చెదనంచు జయాభిలాషచే
వాంఢ్రును వీంఢ్రు నీపగిది వచ్చిన సైఁతునెయంచు గర్వియై.

మ. శరసంధానముఁజేసి లాఘవముతో సవ్యాప సవ్యంబుగా
దురముంజేసిరి వాసుదేవయుగమున్ దోస్సారదుర్వారులై
పరిపోరాటమ్మటంచు వీరభటులాశ్చర్యంబుతో వింతతోఁ
బరికింపం దివసంబులేగె సమరవ్యాపార మేపారఁగన్.

శౌరి గర్జించి నిర్నిద్ర శక్తిపటిమ
ఖండనంబునఁ బౌండ్రక వాసుదేవు
శిరము చక్రధారాహతి దొరలనేసెఁ
బుండ్రజాతి దొరలు నేల పొరలి దొరల.

ఇటు యాదవుండు ద్రావిడలోకంబునంగల దొరల నొక్కొక్కరిం బట్టుకొని చతురుపాయంబుల ద్రుమందించి పరిశ్రాంతుండై యెగుడుదిగుడు లేక కాల క్షేపంబుఁజేయుచు నార్యలోకంబునందు తన మంత్రాంగంబుచేఁ గల్గిన విభేదంబు లెట్లు విస్తరిల్లునాయని యోజించునవసరంబున—



# కృష్ణుని రాయబారము

సీ. ద్యూతమాడుటకునై దుర్యోధనుఁడు పిల్వ
క్షత్ర ధర్మమటంచు సాకువెట్టి
తనకున్న యక్ష విద్యాప్రౌఢి నెఱనమ్మి
పూర్వాపజయముచేఁ బొగులుచుండి
కురురాజ్య విభవంబుఁ గొల్లఁగొట్టఁగవచ్చు
ననిచెప్పి పాండవేయాగ్రజుండు
పదిరెండు వర్షముల్ వనవాసమామీఁద
నొకయబ్దమజ్ఞాత మొనరుపంగ

గీ. నిండుసభలోనఁ బందెంబు నిర్ణయించి
శకునితో జూదమాడి సభికుల యెదుట
నోడి, పెండ్లాము తమ్ముల తోడఁగూడి
బయలుదేరెఁ దక్షిణమ ప్రవాసదీక్ష. 1

ఉ. అవ్యయమైననోర్మి సమయాబ్దములన్ గడువంగఁబుచ్చి నా
నావ్యథలంది ఘోర గహనంబులఁ గ్రుమ్మఱి యెట్టెటో యుప
ప్లావ్యపురంబుఁజేరి తమభార్యను దమ్ములఁగూడియుండి కా
లవ్యవధిన్ సహింప కుబలాటముతోడఁ బృథాతనూజుఁడున్. 2

చం. చిడిముడిపాటుతోఁ గలఁతఁ జెందిన డెందముతోడఁ బాలలో
బడినటువంటి బల్లివలెఁ బాండుతనూభవుఁడుండి చాలసే
పెడతెగకుండ లోఁదలఁచి యేమియుఁ దోచక బేలుపోయి యొ
క్కఁడె తుదకీవిధంబు మతకంబునఁ జేయఁగనెంచెఁ గార్యమున్. 3

గీ. రణము రణమన్న వత్తురో రారొ ! రాజు
లఖిల బంధువర్గము వెనుకాడునేమొ !
యేదొ యొక యుపాయమ్ముచే నిటకు నెల్ల
వారి రప్పించి యెసకొల్ప వలయునంచు. 4

ఉండెఁగా యభిమన్యు నుద్వాహకార్యంబు
సరవితో నేఁడెల్లి జరుగవలసి
యదిసాకుగా నిప్పు డఖిల బంధుజనంబు
విహిత సంఘంబుఁ బిల్పించువాఁడ
పెండిలియైనంత పెద్దవారలముందు
మాగోడుచెప్పి బాగోగులెల్లఁ
జక్కవిచారించి సామరస్యముతోడ
సంగోరు నిప్పించి సంతరింప

వేడికొనువాఁడ నెటులైనఁ బెండ్లిపెద్ద
లందఱిని బోరుపెద్ద లౌనటులఁజేసి
రాణువను సేకరించి రారాజుతోడఁ
బోరుసాఁగించు పనిఁజేయఁ బోలునంచు. 5

వ. ధర్మజుఁడు వెంటనే మౌహూర్తికుల రప్పించి లగ్ననిశ్చయంబు గావించి నిఖిలబంధువర్గంబునకును, మిత్రులకును, విహితులకును శుభలేఖలఁబంపి వారిరాకకై యెదురుచూచుచుండ—

కం. కౌంతేయు లేఖలందినఁ
జింతింపక తత్క్షణంబ స్నేహితులగు భూ
కాంతులు బాంధవులును న
త్యంతామోదంబుతోఁ బయనమై యపుడే. 7

కం. అరుదెంచి దండువిడియఁగఁ
బరివారముతోఁ బ్రభూత పరివాహముతోఁ
దెఱపేమియు లేకయె క్రి
క్కిఱిసి యుపప్లావ్యమంత కిటకిటలాడెన్.

గీ. కుంతి భోజులు కొందఱు గొంతి యన్న
దమ్ములును మాద్రిదేవి సోదరుఁడు శల్య
ధారుణీనాథుఁ డొకఁడును దైవగతిని
బాండవులఁ జేరరారైరి పల్కరైరి. 9

ఉ. పోసరమెత్తి చిత్తముల భూవరులత్తరి బిత్తరించి మా
మీసములుండిరేయనుచు మీసములన్ మెలిపెట్టి దువ్వుచున్
రోసపుఁ బల్కులాడుచును ఱొచ్చుచు వారలొకళ్లొకళ్ళతో
గోసుఁ దలంపకుండఁ దెగఁ గోయుచునుండిరి కోఁత లెన్నియో. 10

ఉ. వేఱుగ ద్వారకాపురికిఁ బెండ్లికి రమ్మనువార్త వచ్చుడున్
సారసపత్రనేత్రుఁ డొకసారి మనోజ్ఞమునందు సర్వమున్
బాఱఁగఁజూచి పాండవులపాలికిఁబోవుట కర్జమంచు ని
ర్ధారణఁజేసి పైనమయి దారుకు రమ్మని చెప్పినంతన్. 11

సీ. కౌమోదకీనందకసుదర్శనంబుల
బహు జాగరూకుఁడై భద్రపఱచి
శుభ్ర చిహ్నితశైబ్య సుగ్రీవ మేఘ పు
ష్పవలాహకాశ్వరాజములఁబూన్చి
వైరి దుర్లోక దుర్వారమై క్రూరమై
తనరారు గరుడ కేతనముఁగట్టి
దారుకుండు రథచోదకుఁడై శతాంగంబు
నిటు పన్నికొనితెచ్చి యెదుటబెట్ట

గీ. బలుఁడు కృతవర్మ సాత్యకి ప్రభృతు లెల్ల
బయలుదేర వెంటనె యుపప్లావ్యమునకు
దారిలో వాసుదేవుండు తలఁపసాగె
భావికార్యంబులను గూర్చి యీవిధంబు. 12

ఆర్యసంఘమందున నేఁటి కవతరించె
ఘోర వైరాగ్ని దానిఁజల్లారకుండఁ
బట్టుదలతోడఁ గాపాడవలయుఁ గాన
సంధి చెడఁగొట్టితీరెద రంధిఁజేసి. 13

సంధి నియమంబులను విన్న జగతియెల్ల
బళి ! బళీ ! ! యంచు శ్లాఘింపవలయు, సంధి
కుదురకుండఁ బోవలయు లోకులకు రాజ
నీతి నైపుణిఁ జూపింపనేర్తు నేఁడు. 14

వ. నా పూనుకార్యంబున కుపోద్బలంబులగు పరిస్థితులు పెక్కులు గలవు. 15

కం. గురు ధనుర్వేది పాంచాలకుల విరోధి
గురుఁడు తనయూళ్లు పాలించుకొనుచునుండ
బ్రదికి యున్నాఁడు జీవచ్ఛవంబు కరణి
మానధనుఁడైన పాంచాల మనుజవిభుఁడు. 16

కం. కురుపాండవు లొక్కటియై
గురుదక్షిణకొఱకుఁ జావఁగొట్టి ద్రుపద భూ
వరు వారణావతంబును
మఱి మాకందిఁగొనుటెల్ల మాకుంచెలియున్. 17

కం. గురుదక్షిణ యనుచు ధను
ర్గురునకు నీయూళ్ళు రెండు గొనియిచ్చిరి మున్
కురువర పాండుకుమారులు
గురువశమై యుండె నాఁటఁ గొలె నవిరెండున్. 18

ఉ. దుర్మదుఁడై విభాకరసుతుండు మముందెరలించి యెన్నఁడో
దోర్మదమొప్పఁ గైకొనియెఁ దొల్లి చలంబున మాకుశస్థలిన్
మర్మముఁ జీల్చుచుండెఁగద మమ్మది నేఁటికి బూటకంబులన్
ధర్మజు సమ్మతింబఱచి దానిఁగ్రహింపఁగఁ బోలు నేర్పునన్.

గీ. కావునఁ గుశస్థలియును మాకందివార
ణావతముల వృకస్థలిం దప్పకిచ్చి
మఱియు నేదేని యొక యూరు మాకునీయ
సంధియగు నంచుఁ జెప్పింతు జడియకుండ. 21

వ. దీనంజేసి స్వార్థపరాయణత్వమునఁ దప్పక— 21

కం. పాంచాలురు నాపట్టయి
కొంచింపరునన్ను గొల్వఁ గూరిమితోడన్
గొంచెంబై నను మమ్మెది
రించంగలవారలుందురే సభలోనన్. 22

కం. ఐదూళ్ళనడిగించెద
నైదూళ్ళనుగూడ నీయనని కురుపతిచేఁ
గాదనిపించెదగట్టిగ
నాదోషముఁ గప్పిపుచ్చి నటియించెదనే. 23

గీ. రాయబారంబు నడపెద రాజరాజు
కడకు నారాజనీతి ప్రకారమెల్ల
బయలుపడకుండ రాజప్రపంచమంత
నన్ను నగ్గింపఁ జూపింతు నాదుశక్తి. 24

గీ. కౌరవులు భీతులై సంధిఁ గోరి పాండ
వులకు నీయూళ్ళ నైదీయఁ గలుగునొక్క-
మేలు; కాకున్నచో రెండు మేళ్లుగలుగు
లగుగాని యిందేమియు నెగులేదు. 25

శ్రీకృష్ణుం డిట్లు తర్కించుకొనుచు, బలరామ కృతవర్మ సాత్యకి సహితుండై యుపప్లావ్యంబుఁజేరి తనకై యెదురు చూచుచున్న రాజలోకంబును సమాదరించి, పాండవులం గుశలసంప్రశ్నముంజేసి, రాజహంసంబురీతి నడయాడుచు, నిష్ఠగోష్ఠిఁ గొంతప్రొద్దుపుచ్చెను. పదంపడి యభిమన్యు పెండ్లి

ముచ్చటలుదీర, నేకాంతంబునఁ గృషుండు ధర్మజుంగూడి పెద్దప్రొద్దు సంధి విషయంబుఁ గూర్చి చర్చించి మెత్తఁబఱచి, యైపూళ్ళనడుగుటకు ధర్మజు నొడంబఱిచి, నిండోలగంబున నియ్యది నిర్ధారణఁజేయుట యుత్తమంబని యూహఁజేసి యేమెఱుంగనట్టు మిన్నకుండెను. 26

ఉ. అమఱునాఁడు నిండుసభయందున రాజులుకొల్వుదీర్చి యీ
బామునఁ బాండవుల్ వడిన బన్నములందలవోసి, యింక సం
గ్రామము దప్పఁబోదు, కురురాజనరాని వృథాభిమాని తా
నేమెయిఁ బంచిపెట్టఁడెవరెన్నివిధంబుల నొక్కిచెప్పినన్. 27

కం. ఆమాటల నీమాటలఁ
దామసులై యిట్లుచెప్ప ధరణీపతులన్
మోమోటపఱచి మెల్లఁగఁ
దామసిలఁగఁ గోరిపల్కె ధర్మజుఁడంతన్. 8

ఉ. ఓనృపులార ! మీరుకని యుంటిరె ? వింటిరె ? యెన్నఁడేనియున్
గానలకేగు పందెమునుగల్గిన జూదము మోసగింపఁగా
నీనియమంబువెట్టి మము నెల్లరఁ గానలకంపినారు మే
మానియమంబుఁ దీర్చియిపు డందఱి ముందఱనుంటి మీగతిన్. 9

కం. జూదము పూర్వములేదా ?
జూదములోఁ జూఱ గొన్న శూరులులేరా ?
యేదీ వారిటు చేసిరె ?
జూదపు గెలుపొక్క గెలుపె సుజనులకెందున్ ?

ఉ. సిగ్గుచుండె మీయెదుటఁ జెప్ప రజస్వల నేకవస్త్రనున్
బెగ్గిలఁ గొప్పువట్టి పదివేవురు చూడఁగఁ గొల్వులోనికిన్
నెగ్గలకీడ్చి తెచ్చి యెకసెక్కములాడరె క్రొవ్వుచేత ? నీ
యెగ్గులు రాచబిడ్డలు సహించెదునట్టివె ? మీరుచెప్పుఁడీ. 31

ఉ. పెద్దలు ద్రోణభీష్ములును బెద్దలు బాహ్లిక సోమదత్తులున్
వద్దనరైరి జూదమును వద్దనరైరి పణంబులొడ్డ మా
వద్దనయుండి చూచెదరు వద్దన వారికి మాకు నిట్లు స
య్యొద్ద తొలంగునే యిటుల ? యుద్ధమువచ్చునె సర్వనాశమై ? 32

ఉ. జూదమునాడు నాఁడనిన చొప్పుననే పదుమూడు వర్షముల్
కాదనకుండఁ గ్రుమ్మరుచు గాననసీమలయందు డాఁగి యె
ట్లోదరిఁజేరఁ గల్గితిమి లోకులఁ జూడఁగనింక మీఁదటన్
మీ దయ యెట్లు చేసినను మీరలె దిక్కైయినారు నేఁటికిన్. 33

చం. అడుగుటలేదు మేము సమయంబనియన్యుల భాగమీయఁగా
నడుగుట లేదు భూతలము నంతయు మాకును గట్టఁబెట్టఁగా
నడుగుటలేదు మేమిపుడ యన్యులరాజ్యముఁ బంచిపెట్టఁగా
నడిగెదమింతె మా జనకుఁ డార్జనఁజేసిన యర్థభాగమున్. 34

35

వ. కావున—

గీ. రాజరాజుకడకు రాయబారమునంపి
యిచ్చినట్టిదేదొ పుచ్చుకొనుటొ !
కాక రణముఁ జేసి కైకొందమందుఁబో
చేతఁబడిన పుడమిఁ జెప్పుడన్న. 36

మ. బలరాముండిది యాలకించి పలికెన్ బౌరవ్యవంశాగ్రణీ !
బలమున్ నమ్మి రణాంగణమ్మునకుఁ బోవన్ ధర్మముంగాదు మీ
రలు దోషంబున సంధియత్నము లొనర్పన్ మాని, కాల్దువ్వ తో
కులు నోనాడరె మీదెదోషమని మీకున్ మేలు చేకూరునే. 37

గీ. అన్నదమ్ముల బిడ్డలరైన మీర
లోకపవిత్రాన్వయంబున నుద్భవించి
పంచుకొనలేక పోరు సాగించిరన్న
విన్నవారలు నవ్వరే పృథ్విలోన ? 38

పాలడుగంగఁ గౌరవుని పాలికిఁ బంపుము రాయబారమున్
మేలగు సంధియైనయెడ మీకునువారికిఁ గాకపోయినన్
నాలుగుమూలలన్గల జనంబు మిముంగొనియాడియాడి యే
వాటుననేని మీరెగెలువన్ వలెనంచుఁ దలంతురన్నచో. 39

చం. శనివరుఁ డాలకించి యిటుచెప్పెను బిమ్మటఁ దత్సభన్ సుయో
ధనుఁడతి లోభి వానికిని దగ్గరనుండిరి కర్ణసౌబలుల్
మనలను లెక్కఁబెట్టఁడు సుమా వృథ ! వానికి రాయబారమున్ 40
బనుచుటగాన నీమెయిని వెరమెచాటుట నామతంబగున్.

ఉ. బంధుజనంబులోఁ గలఁత వచ్చిన నిద్దురఁ బోక యెట్టులో
సంధియొనర్చి యెల్లరకు సౌఖ్యముఁ గూర్పఁదలంచు దుష్క్రియా
గంధములేదు కల్లయెఱుఁగంజనఁ డుత్తయమాయకుండునున్
బంధుజనప్రియుండు సమభావుఁడు మాబలదేవుఁ డెప్పుడున్. 41

గీ. కార్యగతి తెఱంగెఱుఁగండు కపటిగాఁడు
కాన నామాటలనునెల్ల గట్టిపెట్టి
గఱువచందంబుఁ దలపోసి కత్తిఁగట్టి
పాలు పంచించితీరఁగావలయు నిపుడు.

గీ. దండిమగలు కలరు మన దండునందు
భయముపడనేల ? సంధికిఁ బంపనేల ?
భయదఘోర బాణకృపాణ పాణులగుచు 43
సదమదింతురు కురురాజ సైన్యపటలి.

కం. ఈమాట లాలకించుచు
దామోదరుఁడపుడు పల్కెఁ దగ దనకుండన్.
భూమీశ్వరు లాసభలోఁ
బ్రేముడి నందఱును జెవులు ఱిక్కించి వినన్. 44

ఉ. లోకులు పాండవేయులదె లోపమటంచును జెప్పికొందు రే
పోకలు పోయినన్ గురువిభుండటు కావున సంధియత్నముల్
మేకొని చేయఁగావలయు మీరలు కౌరవరాజు సంధినిన్
బోకడఁ బెట్టకుండఁ డతిమూర్ఖుఁడు గల్గను దీన లాభమున్. 45

కం. జనవాక్యమ్మనుకూలము
మనకగునది కల్గునెడల మనకుం జేకూ
రును బలమెంతో కావున
మనుజేశ్వరులార వద్దు ! మానఁగ సంధిన్. 46

ఉ. కౌరవరాజు పక్షమునఁ గయ్యము సేయఁగ నున్నవారు దు
ర్వారులు ద్రోణభీష్మ లతి బాహుబలాఢ్యులు సంధియత్నముల్
మీరలు సేయకున్న మితిమీఱిన కోపముఁ బొందవచ్చు నె
ట్లో వెరవార వారలను లొంగఁగఁదీయుట మేలు ధర్మజా ! 47

గీ. కౌరవేశ్వరుండు కలుషాత్ముఁడై సంధి
కిచ్చగింపకున్న నేవగించి
పక్షపాతమూని వారిర్వురు మనకు
మేలుసేయవచ్చు జాలిపడుచు. 48

కం. జలజాక్షుని నుడువులు విని
తలలూఁపిరి యిదియె మంచి దారియనుచు భూ
తలపతులు ధర్మసూనుఁడు
పలికెను నిండోలగమునఁ బదపడి యిటులన్. 49

చం. గతజల సేతుబంధనము కల్గఁగఁజేయునె యెందు మేలు ? దు
ర్గతులనుబొంది యింతదనుకన్ గొఱప్రాణముతోడనుండి మీ
యతులిత బాహుశక్తి విజయమ్మను నమ్ముచుఁ దండ్రిపాలు గో
రితి మదికూడ నీయనని ప్రేలుచునుండెను ధార్తరాష్ట్రుఁడున్. 50

గీ. పద్మనాభునికన్న నుపాయశాలి
లేఁడు మనపక్షమందు గాలించి వెదుకఁ
గాన రాయబారిగ నేను వాని బంపు 51
చుంటి దేవునిపై భారముంచి నేఁడు.

వ. శ్రీకృష్ణుఁ డీ ప్రసంగంబాకర్ణించి తన మంత్రంబు పాఱెనని యెఱింగి,
దౌత్యంబుఁ బూననంగీకరించిన, ధర్మజుం డతిహృష్టుండై — 5

గీ. దేవగురునంత వాఁడవో దేవ నీవు
నీకు నీతులు గఱపంగనేర మైన
మా మనోగతు లెఱిఁగించి మనలకుందు
మవల నీయిష్టమెట్లొ యట్లాచరింపు. 53

ఉ. పాండునృపాలు బిడ్డలము పాండునృపాలుని పాలు పంచి మా
కిండని మేముగోరఁదగదే ? యిదితప్పని చెప్ప పెద్దలిం
దుండిరె ! తండ్రి సొత్తుపయి నుండదె బిడ్డల కాన ? మాకు ని
ట్లుండుట నేరమౌనె చెపుఁడో నృపసత్తములార మీరలున్. 54

గీ. కూల్పఁజాలము మాపాలు కోసరంబు
నిఖిలి భూపాలచంద్రుల నేలపాలు;
ఆర్తరావముల్ మినుముట్ట నవని నేలఁ
జాలమింకేల జాలంబు సంధిసేయ ? 55

గీ. పద్మనాభ ! మా సాఁబాలు పంచిపెట్ట
నిష్టపడకున్నచోఁ గౌరవేశ్వరుండు
నిఖిలజనపాలలోక సమ్ముఖమునందు
వినుము కడసారిమాటఁ జెప్పెదను నేను.

గీ. కదనమన్నచో భయపడికాదు సంధి
సల్ప, వంశక్షయమునకు జంకి కాని
కాన నైదూళ్ళ నిచ్చుచోఁ గాదునాక
యొప్పు వారల మీమాటఁ దప్పఁబోము. 57

వ. అవి యెవ్వియంటివేని వృకస్థలి కుశస్థలి మాకంది వారణావతంబు మఱి యేదేని నొక గ్రామంబు. ఈ మాటలు ధర్మజుని నోటినుండి వెలువడి నంతనే ధర్మజుం డింత పేదఱికంబుఁ జూపునే యనువారును ధర్మజుం డెంత పాపభీతి కలవాఁడనువారును, సాత్యకి ధృష్టద్యుమ్నులు గలుగఁ దనకింత పిఱికితనమేల యనువారును, ధర్మజుఁడు సామాన్యుఁడె ! యిందేదియో నిగూఢ రహస్యం బిమిడియున్నదని తలంచువారునై సభ యంతయు గుసగుసలతో నిండిపోయెను—— 58

గీ. ధర్మపుత్రునిమాటలు తనదు చెవులఁ
బడెనొ పడలేదొ ద్రుపదభూపాలపుత్రి
చిఱ్ఱుబుస్సుమనుచు లేచి చెప్పె బొమలు
ముడివడఁగ నేలిదపు మూతి ముఱకటించి. 59

ఉ. ఏమని సంధి, సెప్పవుగ, యే వినఁగూడదె సంధిమాట ? ని
న్నేమని చెప్పఁగోరెను నరేంద్రుఁడు కౌరవరాజు కొల్వులో
నేమఱియుంటి గృష్ణ యిది యిట్టనిచెప్పిన నాలకించి యెం
తో ముదమందెదన్ బతులతోడిద లోకమ యాడువారికిన్. 60

ఉ. ఊళ్ళయిదిచ్చుచో దనివి నొందెదమంచనినాఁడె ధర్మరా
జిళ్ళను వాకిళుల్ దమకునేవియుఁగల్గమి నిన్నమొన్నదాఁ
కేళ్ళకొలంది కాఱడవు లేలినరాజులువీరు; వీరి కై
దూళ్ళనుగూడ లేనియెడ నుండగనేర్తురె రాజశీవితో ? 61

ఉ. నామగలేవురుంగలిసి నాపగఁ దీర్పక మిన్నకున్న నే
నేమనుదాన ? నీయెడకు నిప్పుడువచ్చిన రాచవారలో
యేమిమొగంబుఁ బెట్టికొని యిండ్లకుఁబోదురు వాసుదేవ ! యీ
భూముల నాడువారలకుఁ బుట్టుగతుల్ మఱిలేవె చెప్పుమా ! 62

గీ. ఎఱుఁగవే నీవు వారునన్నెంతలేసి
మాటలనినారొ సభలోన మఱవఁగలనె ? 63
వారునన్ బఱచినపాట్లు వాసుదేవ !
యెచ్చటేని యిల్లాండ్రు సహింపఁగలరె ?

ఉ. ఏమని సేతుమంచు నృపు లిచ్చటనిందఱుకూడి యుండఁ దా
నేమని సంధిసేయుమనె నీ మనరా జను గాక కృష్ణ ! నీ
వేమిమునింగిపోయెనని యీవెడ సంధికి రాయబారివై 64
యేమనియుండ హస్తినికి నేగుచునుంటివి నాకుఁ జెప్పవే.

కం. ముడికోకఁ గట్టుచుంటిని
ముడివేయకయుంటిఁ గురులు ముడిబొమదక్కన్
ముడి దుర్యోధను కుత్తుక 65
ముడి యూడకరముడి శాంతిఁ బూనంగలనే.

గీ. చెనఁటియైన దుశ్శాసను చేతివ్రేళ్ళ
సగముద్రెస్సినయట్టి కేశంబులివిగొ !
దాఁచియుంచితి నిన్ని వత్సరములెల్ల 66
దారుణపరాభవాగ్ని చల్లారకుండ.

ఉ. ఎట్టయినన్ దరించితిమి యేడుతరంబులదాఁక నేఁటికీ
చుట్టఱికంబు చేతననుచున్ ముదమొందఁగమాదుతండ్రిచే
పట్టితిఁబంచపాండవుల బాగుగఁగోటరికంబుఁ జేసినే
బొట్టెలఁగాంచితిన్ భరతభూమిని వన్నెకువాసికెక్కితిన్. 67

గీ. ఇన్నియుండియు నాబ్రతు కిట్టులయ్యెఁ
బతులుచూడంగ నన్ గొప్పువట్టి సభకు
నీడిపించిన యాచేయి యేనుఁజూడఁ
ద్రెళ్ళిపడదయ్యె నాయేడ్పు తీరదయ్యె. 68

గీ. పంచపాండవులైదూళ్ళ పాలిగాంద్రె
యంచు మాతండ్రి యెఱిఁగి యున్నట్టియెడల
నిట్టి సంబంధమునుగూర్చ నిష్టపడఁడు
పెళ్ళి సేయఁబోవఁడు వారి కాళ్లకడిగి. 69

చం. కొలువున కీడిపించెననుఁ గొప్పును బట్టిన దుస్ససేనుచే
గిలగిలమంచు కొట్టుకొని కెవ్వున కేకలు వేయుచున్ రజ
స్వలనని చెప్పుచున్నను సభన్ విననొల్లక కౌరవేంద్రుఁడున్
గిలకిల నవ్వె నాతనికిఁ గీడును రోయక యుండనేర్తునే? 70

గీ. వగలు కండ్లారఁజూచి నా మగలు పగలు
దీర్చి నాయెగులుదిగులు దీర్పకున్న
సెగలు చిమ్ము తూపులు గల్గు జెట్టిమగలు
నా సహోదరుల్ తండ్రియు నాకు లేరె? 71

గీ. రాచపుట్టువుఁ బుట్టియు రాచదొరలు
మలయు పేరోలగమున నా మగల యెదుటఁ
బరులచేఁ దిట్లు తిని యేల బ్రదుకవలయు?
యెంత తీపియా ప్రాణంబులన్న కృష్ణ? 72

కం. పామైన మఱచిపోవును
భామిని మఱవంగఁబోదు పగనెన్నఁటికిన్
దామోదర! యాలింపుము
నామాటలు, సంధినాకు నచ్చదు నేఁడున్. 73

కం. ఏటికి దొరలెల్లరు నీ
వీటికిఁ జనుదెంచినారొ విల్లంబులతో?
నేటికి నిటఁగూర్చుండిరొ?
బోటికి నభయంబు నిచ్చి బ్రోవకయున్నన్. 74

చం. అతిరథులున్ మహారథులు నందఱుకూడిన నిండు కొల్వులో
నతివయొకర్తు చెప్పవలెనా ? యిది క్షత్రియధర్మమంచు భా
రతకుల వీర్యమున్ మఱచిరా ? తగునా ? యిటువంటి జోలికూ
డుతినుతలంపుమీకు టకటొంకులు చెల్లునె సంధిగల్గునే ! 75

గీ. భీమసేను గదను విజయుగాండీవంబు
నెడదనమ్మి మోసపడినదాన
నిండుకొల్వులోన నేఁబడ్డబన్నంబుఁ
దీర్పఁగల్గునట్టి దిక్కులేదు.

ఉ. మా కులగౌరవంబు కనుమాయకయుంపఁగఁ గోరుచున్న యీ
మా కుల దైవతంబయిన మాధవుఁడేమనె ? ద్రోణ భీష్ములో
యా కురురాజుపక్షమయి వత్తురటంచునుగాదె ? చెప్పుఁ డీ !
మీకు భయంబుకల్గునెడ మీరలు నిండ్లకుఁబోవవచ్చుఁగా. 77

గీ. ముసలి వగ్గు లిర్వురునేఁడు బుసలుకొట్ట
భయముకల్గిన మీరలు పాటిపొందు
కాంచెదముగాక యేమౌనొ కట్టకడకు
దారిలేనట్లి యీయాఁడుదాని బ్రదుకు. 78

అయినను రణపరాఙ్ముఖులు కాకున్న మీతో నేమి చెప్పనేర్తు. ఇన్నింటికి
మిమ్మనవలసిన పనియేమున్నది ? 79

నన్నుఁగాంచిన పాంచాల నరవరుండు
నన్నుఁబెంచిన జోదుమాయన్నకలరు
కయ్యమును వారు చేయరే కత్తిఁగట్టి
పేరు చెడ నామగలు సంధిఁ గోరుచున్న ? 80

వీరపత్నినని నేను గర్వించుట నేఁటికి సంశయాస్పదమయ్యె. కాని నేనింకను
వీరసువుగనే యుంటిని. 81

కం. హైడింబేయుఁడు లేఁడా ?
లేఁడా యభిమన్యుఁడింక లేరా ? ననుఁగా
పాడంగా నా బిడ్డలు
నాడింపనె కౌరవేంద్రు ననిమొనలోనన్. 82

ఉ. బాణము చేతఁబట్టిన నృపాలుఁడు ప్రాణము లెక్కపెట్టకే
బాణమువేసెఁదొల్లి తలప్రాణము తోకకు వచ్చుచుండినన్
బాణమువేయ జంకెదరు ప్రాణభయంబుననేఁడు మీరలీ
క్షోణిని మిమ్ముఁబోని రణశూరులఁగంటిమె యెన్నఁడేనియున్. 83

వ. సంగరభయ నిరాసంబును, రణోత్సాహజనకంబునైన యీ ద్రౌపదీ వాక్యంబు లాలించి, కొల్వంతయు నిస్తరంగ నీరాకరంబుఁబలె నిశ్శబ్దముగానుండ, వాసుదేవుండు మెల్లగఁ బీఠంబుననుండి లేచి ద్రౌపదీదేవి దిక్కునకు దరహాస చంద్రికల బ్రసరింపఁజేయుచు మృదూక్తుల నిట్లు ప్రసంగించె— 84

చం. ఎఱుఁగవె తల్లి నన్నుఁ బగనీగకయుందునె యెన్నఁడేని ? నే
నెఱుఁగనె నిన్నుఁ గౌరవనరేశ్వరుఁడా సభకీడ్చితెచ్చి యం
దఱు వినుచుండఁ బల్కినవిధంబును దుస్సహవర్తనంబు ? నే
నెఱుఁగక చేయుచుంటినని యెంచకు మీపని యిద్దు సోదరీ ! 85

చం. ఉడుగుము శోకమేఁబ్రదికి యుండిన నీపగయెల్లఁ దీర్తు నీ
వడుగకయున్నచో మఱతునా ? యిపుడెంతటి బేలవైతి వీ
యడుగులు రెండునున్ బవరమందున మార్తుఱ నెత్రుటేటిలోఁ
దడిపెదనంచు నేను శపథంబును జేయుచునుంటి సోదరీ ! 86

గీ. వేడినెత్తుటి తొంగిళ్ల వ్రేళ్ళనుండి
జారిపడుచుండ యువరాజు సంతసమున
జడలుగట్టిన నీకురుల్ చక్కదువ్వి
మరులు ముడివేయఁ గలఁడమ్మ మాటలేల ? 87

వ. ఇట్లు సమాధాన వాక్యంబులఁజెప్పి ద్రౌపదిం బట్టువఱచి, యూరార్చి— 88

గీ. పోయివచ్చెదఁ గాకేమి పోరుమాన్పి
సంధిసేయ దుర్యోధన చక్రవర్తి
సన్నిధికినైన మీరెల్ల సైన్యములను
గూర్చి పెట్టుకొనఁగ మేలు గూర్చుననుచు. 89

శ్రీకృష్ణుండు ప్రయాణోన్ముఖుండగుట, సహదేవుండు తిలకించి సీదరించు
కొనుచుఁ, గృష్ణునిఁజూచి యీగతి నుడివె— 90

ఉ. ఒచ్చెములేదు కౌరవులు యుద్ధముమానిన మానకున్న ని
క్కచ్చిగ మాటలాడి మన గౌరవముం జెడకుండ సంధికై
యిచ్చకముం గనంబఱపు మింతియె పెక్కులువద్దు వారలున్
గచ్చియమానకున్న మన కచ్చెను దీరిచికొందమంతయున్. 91

వ. అయిన నది యటులుంచి యిటు వినుము— 92

గీ. రాజునకును నే నెదురాడ రాదు గాని
చెప్పుచున్నాఁడ నొకమాటఁ జెవినిజేర్పు
సంధిసేయంగ నీకెట్లు సాధ్యపడునొ!
ధర్మనిర్ణేతవైతి వీ తరుణమందు. 93

జూదమునాడు నాఁడుమనజూదరిపందెముఁ బెట్టినాఁడొకో!
మాదగుదాయమెల్లఁ గురు మానవ నాథున కిత్తునంచు; వాఁ
డో! దయమాలి సర్వమును దొంగిలె నీపదుమూఁడు వర్షముల్
పేదఱికంబుఁ బాపుటకుఁ బెత్తనముం బయివేసికొంటివే? 94

కం. పదుమూఁడేఁడుల యాయము
పదిలంబుగ సంప్రతించి వశపఱచనిచోఁ
గుదురింతువె సంధిని ? నీ
పదకంబేమియొ తెలియదు బావా! నాకున్. 95

వ. శ్రీకృష్ణుం డీ వాక్యముల నాకర్ణించి సహదేవుని భుజంబుఁ దట్టుచు నీ చెప్పిన ధర్మసూక్ష్మంబు బుధజన గ్రాహ్యంబు, కౌరవరాజు సభలో సంధి ప్రస్తావన సమయంబున నీనుడులు మనస్సునం దుంచికొనియె ముచ్చటించెదనని బుజ్జగించుచుఁ బ్రయాణంబు సన్నద్ధపఱచి వివిధాయుధంబుల రథంబునందిడికొని సాత్యకిని రథం బెక్కించికొని తనప్రక్కఁ గూర్చుండఁ బెట్టికొని హస్తినాపురోన్ముఖుండై పోయి— 96

గీ. ఎవని ధార్తరాష్ట్రుఁడు తన హృదయమందు
సతము లేశంబు నమ్మక సంచరించు
చుండి యొకకంటఁగనిపెట్టి యుండునట్టి
విదురునింట శ్రీకృష్ణుండు విడిది దిగియె. 97

వ. సుయోధన సార్వభౌముని కొలువుకూటంబుఁ బ్రవేశించి సంధి విషయక ప్రసంగంబుఁ గావింపకమున్న హస్తినాపురము నందలి రహస్యంబులఁ దెలిసికొనుట భావ్యంబనియెంచి విదురుండు తొలుతనుండియుఁ బాండవ పక్షపాతియని యెఱింగిన వాఁడగుటచే శ్రీకృష్ణుండు విదురునింట బస చేసెను. సుయోధనుం డిది యెఱింగి మంత్రిసామంత పరివృతుండై, విదురునింటికిం జనుదెంచి కుశల సమాచారంబు లడిగి తనయింటికి విందారగింప రమ్మని శ్రీకృష్ణునిఁ బ్రార్థింప— 98

గీ. పాండుపుత్రులకును బగవాఁడవౌట
నాకుఁ బగవాఁడవై తివి న్యాయమగునె
యెంచఁ బగయింట విందారగించుటనుచుఁ
బుల్లవిఱుపు మాటల నంపివుచ్చె రాజు. 99

వ. మఱునాఁడు రారాజొడ్డోలగంబుఁ దీర్చి సంధివిషయక ప్రసంగంబు విన శ్రద్ధాళువై సింహాసనంబునఁ గూర్చుండఁ గమలనాభుండు సాత్యకి కృతవర్మలంగూడి కొలువుంజొచ్చి యామాటల నీమాటలఁ గొంతతడవు పుచ్చి జల్పాకుఁడై ధర్మరాజంపిన టట్టువోలె— 100

సీ. పాలబుగ్గలతోడఁ బాఱాడునప్పటి
నుండి ధర్మాత్ములు పాండుసుతులు
గురువృద్ధజనముల గురుభక్తి సర్వదా
కొలిచి సేవించిరి కొఱఁతలేక
పంచజనులకెల్లఁ బంచప్రాణములౌచు
సంచరించిరివారు శ్రద్ధతోడ
దాసదాసీజన తండంబుఁ బ్రేమతో
నిరతంబు సాకిరి నిన్నుఁబోలె

గీ. పెక్కుమాటలేటికి ? నింటి పెద్దవనుచు
నడుగులకు మడ్గులొత్తిరి యహరహంబు
నీకు నట్టివారలను దృణీకరించి
పరుల పంచలఁ బట్టింపఁ బాడియగునె ? 10

చం. తడయక వారు ధర్మమొ యధర్మమొ జూదపుఁ గట్టుబొట్లచే
నడవులయందుఁ గ్రుమ్మరుచు నాకలిదప్పుల కోర్చి యెట్టులో
విడివడి వచ్చి నేఁడు పృథివీపతులందఱిఁ జూడఁగల్గి రీ
యెడ మిమువంటిధర్మపరు లెద్దడిచేయుట ధర్మమౌనొకో ! 102

ఉ. పాండునృపాలు పాలు తమ పాలొనరింపుమఁటంచు జాలితో
నిండుసభన్ వచింపుమని నేర్పునఁజెప్పిరి యాంబికేయ ! నీ
కండఁగనుండ నేర్తురు యథార్థముఁ జెప్పుచునుంటి నిప్పుడే
యొండనకుండఁ బాండవుల నొప్పరికింపక పిల్వఁబంపుమీ. 103

సీ. దుర్యోధనుండతి ధూర్తుఁడై చిననాఁడు
పెక్కుకష్టంబులఁ బెట్టినాఁడు
లక్కయిల్ గట్టించి లాలించి యందుంచి
వంచించి తగులఁ బెట్టించినాఁడు

నీచాతినీచమౌ నెత్తంబు లాడించి
మించియిల్ వెడల గొట్టించినాఁడు
కాకోదరములెన్నొ గడియించి తెప్పించి
భీమసేనుని గఱపించినాఁడు

గీ. ముట్టుతను సభకీడ్పించి ములుచయగుచుఁ
బల్వురి యెదుట నవమానపఱచినాఁడు
చేయరానట్టి పనులెన్నొ చేసినాఁడు
సాధువని యెంచఁ గలవె దుర్యోధనుండు. 104

ఉ. కావున దమ్ముబిడ్డలను గాదని చెప్పుటకన్న నీసుతున్
భూవర ! త్రోసిపుచ్చిసరిపుచ్చవె దాయము పంచిపెట్టవే
వేవురు మెచ్చికొందురు వివేకముఁ జూపితివంచు దాన ఘో
రావహమెల్లఁ దప్పు నృపులందఱు సౌఖ్యమునందుచుండఁగన్. 105

గీ. కర్ణసుబలపుత్రుల ప్రసంగంబు విన్న
భారత కులక్షయమునకే దారిచూపుఁ
జెడుగుమాట లాకర్ణించి చెడఁగనేల ?
పరువు మర్యాదలు పెలంగ బ్రదుకలేవె ? 106

వ. కృష్ణుం డీగతిఁ బెక్కు తెఱంగులరాజనీతి వైశద్యంబు విశదంబగుచుండ ముచ్చటింప— 107

గీ. సంధివిషయప్రసంగంబు సల్ప మొదలు
పెట్టినపుడెందఱో భూమివిభులు సంధి
సుముఖులై యుండి కృష్ణుని సూక్తులెల్ల
ముగియువేళకెల్లరు పరాఙ్ముఖులెయ్యెరి. 108

వ. అంత సుయోధనుం డుద్రిక్తనయనుండై లేచి సభనెల్లఁ గలయంజూచి వాసుదేవుని దిక్కు మొగంబై "బావా ! యీ సంవేదంబుతోఁ బనియేమి ? 109

మ. అవిభాజ్యంబగు రాజ్యమైన కురురాజ్యంబందు భాగంబు నీ
వెవియో చెప్పుచుఁ బంచిపెట్టుమన నే నెవ్వండనో ! నీ వెఱుం
గవె ? ముత్తాతగు బాహ్లికుండడుగొ ! భాగంబాతఁడర్థించెనే ?
వివదింపన్ దలపోసి పంచుమనుచున్ వేలార్చెనే యన్నునున్ ? 110

వ. ఓ యదునందనా ! పెక్కుమాటలేటికి ? 111

గీ. నిఖిలధారుణీ చక్రంబు నేఁటిదాఁకఁ
దళుకు నాకత్తి మొనయందు నిలిచియుండెఁ
బరుల బ్రార్థింప నీకేమి వచ్చిపడును ?
మాట వ్యయమౌట యొక్కటే బూటకీఁడ." 11

కం. సారసనేత్రుని నుడువులు
రారాజు వచించినట్టి ప్రతివచనంబుల్
కౌరవపక్ష నృపాలకు
లోరిమివిని తలఁచిరిట్టు లుల్లములందున్. 113

గీ. పాండవులు ధర్మపరులు గావచ్చుఁగాని
యితఁడు రారాజు దూషింప నేలయనుచు
నపుడు గ్రుడ్లెఱ్ఱఁజేసి ధరాధిపతులు
కత్తులను ముట్టసాఁగిరి బిత్తరించి. 114

ఉ. కౌరవపక్షయోధులకుఁ గల్గినయట్టి యశాంతినెల్లఁ గ
న్నారఁగఁజూచి సంతసిలి యాదవవీరుఁడు దూరదృష్టిచేఁ
గౌరవ పాండవేయులకుఁ గాదిఁకసంధి యటంచు నెంచి గం
భీరమనస్కుఁడై పలికె వేరమునంతయు దాఁచిపెట్టుచున్. 115

కం. పిన్నలు పెద్దలు నీసభ
నున్నారుకదా యిఁకేమి యుండఁగలదు ? నా
విన్నపమొక్కటి వినుఁడీ
యన్నెము పున్నెంబువలదయార్యుల కెందున్ 116

గీ. పాండు నరపాలు సంగోరు పాలుపంచి
యీయమీకు నిష్టంబు లేదేని తుదకు
నిప్పుడేవురకేనూళ్ల లిచ్చి సంధి
సేయఁబాడిగాదో యాంబికేయ ! చెపుమ. 117

వ. ఆయూళ్లెవ్వి యంటివేని వినుము. కుశస్థలి వారణావతంబు మాకంది వృకస్థలి మఱియేదేని యొక గ్రామంబు— 118

కం. కడసారిమాటఁ జెప్పితిఁ
గడగండ్లను దెచ్చికొనుట కర్జంబగునా ?
చెడుగులమాటలు విన్నన్
జెడు రెండుకులంబు లేమి చెప్పఁగవలయున్ ? 119

వ. రాధేయుండు శ్రీకృష్ణ వాక్యంబుల యందలి నిగూఢభావంబు గ్రహించి వెంటనే చిడిముడిపాటులేక— 120

సీ. జలజాక్ష ! నీయెత్తు సాఁగిరాదిఁకమీఁద
నింతమాత్రంబు మే మెఱుఁగలేమె ?
కలహంబు మాలోనఁ గల్పింపనెంచి యీ
యైదూళ్ళనే కోరి యడిగినావు
నాకుఁ గుశస్థలి, మాకందివారణా
వతములు గురునకు వచ్చు బెఱిఁగి
యాయూళ్ళ నడిగితి వందుచే రారాజు
పై మాకు గోపంబు వచ్చుననుచు

గీ. సంధిచేయ దుర్యోధన చక్రవర్తి
యిష్టపడెనేని నైదూళ్ళనిత్తుమిపుడె
సకల కురురాజ్య సౌభాగ్య మొకటె మాకు
వలసినట్టిది, వేయేల వాసుదేవ ? 121

గీ. రవితనూజు పల్కులువిని రాజరాజు
సింహసంహననుఁడు డిగ్గి సింహపీఠి
పలికె గంభీర భాషణంబులను సభికు
లెల్లఁ దలయూఁచి కొండాడ నొప్పిదముగ. 12

గీ. శైశవమునుండి రాజవంశంబు దొరఁగి
పెఱిగి పెద్దవాఁడవయి తాభీరపల్లి
వారి యాచారములెనీకుఁ బట్టువడియెఁ
బల్లెమాటలమానుమో పంకజాక్ష!

చం. చిఱుత తనంబునన్ జదువు చెప్పిన హేతువుచేత భక్తితో
గురునకు మేము వారలును గూడియెపార్షతుఁజావఁగొట్టి యా
నరపతి రెండుగ్రామముల నాఁచియొసంగితిమౌర! నేఁటికిన్
గురుధనమున్ హరింపగను గోరెనె? ధర్మజుఁడెట్టి శిష్యుఁడో! 124

గీ. విపులతేజః ప్రతాపంబు వెలయ మిమ్ము
నొడిచిపుచ్చి కర్ణుఁడు తొల్లి పుడికిపుచ్చు
కొనెఁ గుశస్థలి దానినేమనుచుఁ గర్ణు
నడిగి పుచ్చుకొనుచు మీకు నిడెడివాఁడ?

చం. అతి కరుణాసముద్రులయి యాగురు కర్ణులు నన్నుఁజూచి స
మ్మతిపడి యీయవచ్చు బతిమాలిన వారల మూఁడుగ్రామముల్
కితవుని మాటలాడెదవు కేవల మీవెపుడైన వింటివే?
వితరణమిచ్చి యాపయిని వెండియు దానినిగొన్న రాజులన్. 12

గీ. పేరుపెట్టి యీ యైదూళ్ళఁ గోరుటేల?
లేవె కురురాజ్యమందు నిఁకేవియేని
యూళ్ళయిదు? వానిఁగోరక యుండుటేల
యింతమాత్ర నీ మతకంబు నెఱుఁగలేమె? 127

గీ. అఖిల భూచక్రమంత నా కగ్గమయ్యెఁ
బరుషవాక్యంబులనియెంచ వలదు, వాఁడి
సూది మొనమోపఁ జాలిన చోటుకూడ
నీయ నెవ్వరిప్పింతురో యేనుజూతు. 128

కం. దుర్యోధనసూక్తుల భూ
వర్యులు కొనియాడినపుడు బళిరా ! యనుచున్
గార్యజ్ఞులగుచు యాదవ
వర్యుని బంధింప మేలు వచ్చునటంచున్. 129

చం. ఒలయక యాత్మలోఁదలఁచి యొక్కరికొక్కరు మూకభాషచేఁ
బొలకువఁజెప్పికొంచు విడిపోవుచుఁ గూడుచు వెంటవెంటనే
కొలువును జొచ్చుచున్ బయటకుంజని వచ్చుచు నొక్కరీతిగా
నలజడిఁ బొందుచున్ దిఙుగుటందఱు గాంచుచునుండనప్పుడున్. 130

ఉ. ప్రత్యయితుండు తత్సభిక వర్గము పన్నుచునున్న కుట్రనున్
సాత్యకి తా గ్రహించి యదునాథునకున్ వినిపింపనంతయున్
దౌత్యము మాటమానుచు యథార్థముఁ జెప్పినయంత నాపగా
పత్యముమాటమీఁదుగ సభన్ ధృతరాష్ట్రుఁడు మాన్ప నెంచఁగన్. 131

వ. ఐంద్రజాలికుండయిన నందనందనుండు కనుకట్టు ప్రభావంబుచేఁ బల్వురు జోదులుతన్నుబలసి కొలుచున్నట్టు కన్పట్టఁజేసి సాత్యకితోడఁగూడ బయటఁ బడినంత వైచిత్ర్యవీర్యుండు కొలువు చాలించెను. రాజులెల్లరు తమ తమ విడిదలకుంజనిరి. లేనిపోని పోరామిఁ గల్పించుకొని శ్రీకృష్ణుండు కర్ణుని కరంబు కరంబునఁ దెమల్చిపట్టుకొని తనతోఁ గొంతదూరంబు గొనిపోయి మెల్లఁగా నొరులెవ్వరు వినరానిరీతి నాతని జన్మరహస్యంబు నెఱింగింపఁ గర్ణుండు వాసుదేవుని నెగాఁడిగ చూచి "కృష్ణా ! యీ నీ మేనత్త రహస్యంబుఁ దాఁచక నాకేల చెప్పితివి ? నన్నేమని పాండవులం జేర మందువు ? కని పాఱవేసినది కుంతిదేవి. కని పెంచినది రాధాదేవి.

కన్నులు దెఱువని నెత్తుకందును బొదిగిళ్ళతోఁబాటు నట్టేటఁ ద్రోసినది కుంతీదేవి; నట్టేట దొఱికిన కసిగందును బొదిగిళ్ళలోఁబెట్టి పెంచినది రాధాదేవి. పుత్రమోహమును దిగద్రావి జాలిలేని రాతిగుండెతో నన్నెము పున్నెమెఱుంగని కన్నబిడ్డను లోకాపవాదముఁ బాపుకొన గంగపాలు చేసినది కుంతీదేవి; కావుకావంచు నేడ్చుచున్న దిక్కులేని పసికూనను దెచ్చి చన్గుడుపులిచ్చి పెంచి పెద్దను జేసి మంచినది రాధాదేవి. పెండ్లి పేరంటములు చేసి యపరిమితానందముఁ బొందినది రాధాదేవి. నేనెవ్వండనైన నేమి? నేను లోకంబునకు రాధేయుండ నగుదును గాని కౌంతేయుండఁ గానోప. చదువు సాములు చెప్పువారు లేక దేశదేశంబులు తిరిగి తిరిగి ద్రోణునిఁజేర మోమోటమిలేక కుటిలుండై నీకు బ్రహ్మాస్త్ర ప్రయోగంబు నేర్పనయితి కాదని చెప్పి యవమానపఱిచినప్పుడు పరశురాముండో కష్టకాలంబున భార్గవాస్త్రంబు ప్రతిభాషింపకుండునట్లు శపియించినప్పుడు నిష్కారణంబుగ నొక బ్రాహ్మణుండు నన్నుఁ దిట్టినప్పుడు, కుమారాస్త్ర ప్రదర్శన సమయంబున భీముండు నన్ను గేలిచేసినప్పుడు నేఁబడ్డ మనః పరితాపంబు నెవ్వండెఱుంగంజాలు? నాకీ ప్రపంచమునందుఁ జోటున్నదా యని సందియంబు పొడముకునది. ఇట్లు బ్రాహ్మణులచే శప్తుండనై దిక్కులేక నేనల్లాడిపోవునప్పుడు నన్నుంగని కనికరంబున సుయోధన సార్వభౌముండు నాకాశ్రయంబునిచ్చి, యాదరించి, గౌరవంబిచ్చి, పెద్దనుజేసి, పరివారంబునిచ్చి, పరివాహంబునిచ్చి సరివారలలో తలయెత్తికొని తిరుగ నవకాశమిచ్చి మన్నించె. స్వామిద్రోహంబుగాని, మిత్రద్రోహంబుగాని యీ కర్ణునకుఁ జేతరాదు. ఓ కృష్ణా! యీ జన్మంబునకుఁ గర్ణుండు రాధేయుండే. సుయోధన సార్వభౌముండు నమ్మినబంటే. ఈ మాటకుఁ దిరుగులేదు. గోపాలా! నాకు రాధాదేవి కన్నతల్లి, మహారథుండు కన్న తండ్రి, సుయోధనుం డేలిక. ఇవి త్రికరణశుద్ధిగా జెప్పుచున్న మాటలు. ఈ మహానుభావున కపచారంబుఁ దలంచుటకాని చేయుటకాని మహాపాప హేతువు. తలపెట్టఁజాలను, జేయఁజాలను. ఇంక మాటలు చెప్పి నన్నుఁ బీడింపక మగిడిపొమ్మ"ని చెప్పి, తటాలున సెలవంది గిరుక్కున మగిడి కర్ణుండు శ్రీకృష్ణుని సన్నిధానంబుననుండి తిరుగుడుపడుచున్న మనంబుతో వెడలిపోయెను.

132

అతంట శ్రీకృష్ణుండు నివ్వెఱపడి కొండొక సేపేమియుఁ దోఁచక నిలిచి యుండి మేనత్త యగు కుంతిని దర్శించి సభావృత్తాంతం బెఱింగించి యామె చెప్పినమాట లాలించి విదురునితో ముచ్చటించి యటనుండి తిన్నగా నుపప్లావ్యమునకు నేగి— 133

పాండవపక్షయోధులకుఁ బాండుకుమారుల కీయుదంతమున్
నిండు సభాముఖంబున గణించినపిమ్మట యోద్ధలెల్ల రు
ద్దండత సింహనాదములు దారుణపద్ధతిఁ జేసి ధీరులై
భండన మెప్పుడెప్పుడని పంతములాడగఁ జొచ్చిరెల్లెడన్. 134

ఉపప్లావ్యమంతయు, భేరీభాంకారములతోడను, మత్తకుంభీంద్ర ఘీంకారములతోడను, ధనుష్టంకారములతోడను బూరటిల్లెను— 135



# కురుక్షేత్ర యుద్ధము

విజయాభిలాషచే నిరువాగుల దొరలు నవష్టంభ విజృంభణంబునఁ దమతమ సైన్యంబులతోఁ బోరికిఁ గాల్ద్రివ్వుచుఁ బుణ్యక్షేత్రంబగు కురుక్షేత్రంబున పాళెంబు దిగిరి. యాదవవర్గంబునందుఁ గృష్ణ సాత్యకి చేకితానులు పాండవపక్షపాతులై వీరలం గలిసికొనిరి. నారాయణ గోపాలురు విందానువిందులు కృతవర్మయు దుర్యోధన పక్షంబునుం జేరిరి. బలరాముండు దుర్యోధన పక్షపాతియయ్యు, భీముండు శిష్యుం డగుటచేతను, దమ్ముండగు శ్రీకృష్ణుండు పాండవ పక్షపాతి యగుటచేతను బాహ్లిక సోమదత్తాదులు దుర్యోధనపక్షంబున నుండుటచేఁ దాను బాహ్లికుని మనుమం డగుటచేతను, నేమియుఁ జేయనేరక తీర్థయాత్రమిషంబున నెందేనరిగెను భీష్మకసుతుండగు రుక్మిపక్షద్వయంబుచేఁ దిరస్కృతుండై యింటి మరువునడాఁగె. దుర్యోధనుని సవతితమ్ముండగు యుయుత్సుండు ధర్మజుం గలిసె. ధర్మజుని మేనమామలగు కుంతిభోజు లిరుపక్షంబులం జేరిరి. కవల మేనమామయగు శల్యుండు దుర్యోధనపక్ష మవలంబించె ఈగతిఁ గురుపాండవులు పరస్పరాభిముఖులై నిలువంబడిరి. పాండవసైన్యంబునకు ధృష్టద్యుమ్నుండు సర్వసేనాధిపతియయ్యె. కురుబలంబునకుఁ బితామహుండైన భీష్ముండు సేనాపతి యయ్యె. ఆసన్న గురువృద్ధజ్ఞాతి బంధువధచే విషాదచిత్తుండైన శ్వేతవాహనుని బోధించి సమరసుముఖునిగా శ్రీకృష్ణుఁ డొనరింప, నుభయసైన్యంబులు పెచ్చు పెఱిగి తలపడి పోరు నారంభించెను—— !

సీ. గ్రీష్మభానునిభంగి భీష్ముండు చెలరేఁగి
చిచ్చరమ్ములచేత విచ్చపడఁగ
పాండవవాహినీ పతనంబుఁ గావింప
నొక్కనాఁ డర్జునుం డోర్వలేక
గాంగేయు నెదిరింపఁగనలి యాతండతి
క్రూరాశుగములచేఁ గొట్టినంత
ఆయుధంబుల ముట్టనని బాససేసిన
నగధారిపగ్గముల్ నొగలఁబెట్టి

గీ. చక్రమును ముట్టి చేఁబట్టి సాహసించి
శాంతనవుపైకి లంఘించెఁ జంపిపైతు
ననుచు నపుడు ధనంజయుఁ డడ్డువచ్చి
తివిచి మరలించి కొంపోయెఁ దేరుపైకి. 2

వ. తన్నుఁ గాపాడ వాసుదేవుండు ప్రతిజ్ఞాభంగంబగునన్న సంకోచంబులేక చక్రధారి యయ్యెనని సిగ్గిల్లి ఫల్గునుండు కినిసి సముత్సాహ సంరంభంబున గాండీవచండకోదండజ్యా నిర్ఘోషంబునఁ గురుసేన బెగ్గిల్లిపాఱ నిశాతబాణ పరంపర బడలువడఁజేసి యుద్ధంబు ప్రవర్తింపఁజేసెను— 3

ఉ. పాండవసేనలుం జెదరి పాఱఁగ భీష్ముఁడు విక్రమింపఁగాఁ
గొండొకనాఁడు శౌరి మునికోలధరించి నదీతనూజునిన్
మొండెముఁజేతుఁ జూడుమని మొగ్గరమందు రథంబు డిగ్గనా
ఖండలసూతి యడ్డుపడెఁ గర్జముకాదని నచ్చఁజెప్పుచున్. 4

గీ. తొమ్మిదవనాఁడు సంగ్రామ దోహలుండు
జాహ్నవీసూనుఁ డుగ్రుఁడై సదమదించెఁ
బాండవచమూసమూహంబు బఱలు పఱచి
ఘోర శరపాళి సేన గగ్గోలుపుట్ట. 5

గీ. పంచపాండవుల్ సైన్యాధిపతులు గూడి
యుక్కు చెడియొక్క యెడగూడి యుమ్మలించి
వడకునంగకమ్ములతోడ నడలుతోడ
నిలిచియుండంగ వెన్నుండు కలయఁజూచి. 6

ఉ. ధర్మజుతోడ నిట్లనియెఁ దాతకు నీవనినంత నెంతయో
యర్మిలి యెట్లు నీకు విజయంబొడఁగూర్పఁ దలంచుఁ గావునన్
మర్మమువిప్పి చెప్పు మనుమానము మానుము తప్పకుండ దు
ష్కర్మమటంచు నెంచకయె జాహ్నవిపుత్రునిఁ జూడఁబోవుమా. 7

పోరునకుముందు సెలవందఁ బోయినపుడు
మించి యాపదల్ నిన్నావరించినపుడు
వచ్చి తనుఁ జూడమనిచెప్పి పంపలేదె ?
తగినసమయంబు పొమ్మన్నఁ దాతకడకు. 8

తాతకడకేగ నిచ్ఛించి ధర్మసుతుఁడు
దొరలు శిబిరంబులను నిద్ర దొరలుచుండఁ
దారి మెల్లగా నడిరేయి తాతకడకుఁ
బోయి తనగోడు నిటు వెళ్ళఁ బోసికొనియె. 9

చం. అవవదలయ్యె నా బ్రదుకు నాహవభూముకి నీవురాఁగ నీ
యెదుటను నల్లెత్రాడు బిగియించి శరంబును వింటఁదొడ్గి నె
మ్మది గురితప్పకేయఁగల మానటియొక్కఁడు గల్గువాఁడె యీ
పదిపది నాల్గులోకముల ? వట్టిదిగాదె జయంబు నాకిఁకన్ ? 10

ఉ. ఇంతటిజాలిలేక రణ మిట్టులు సేతువఁటన్న మేము మా
వంతును బంచిపెట్టుమని పట్టును బట్టఁగఁబోము వారు మ
మ్మెంతలు చేసినారొ యవి యెల్ల నెఱుంగవె నీవు తాత ? మే
మింతకు బీదవారమనియేకద ! యిట్టులుపేక్ష సేయుటల్. 11

ఉ. చెప్పెదనేఁడు రాజులకుఁ జెచ్చెరఁబొందిఁక వీళ్ళకంచు నా
తప్పిదమున్ క్షమించి యొక దారిని జూపకయున్న వారలన్
ముప్పులపాలు సేయఁగల మూర్ఖుఁడఁగాను మహానుభావ ! నా
కిప్పుడు తోఁచదేమియును నీవొకదారిని జూపి పంపవే. 12

ఉ. తాతవు నీవు చిన్నపుడె తాతగతించిన బాళిచేత నీ
చేతులమీఁదఁ బెంచితివి ? చేతమువల్లఁగ నీవునేఁడొ యీ
చేతులమీఁదఁ జంపెదవె, చిత్తమువచ్చినయట్టు చేయు మీ
చేతులుమోడ్చి భక్తిమెయిఁ జేతును జోతలఁటన్న పిమ్మటన్. 13

చం. ముసిముసి నవ్వునవ్వుకొని మోము వికారముఁ దోపనీక సం
తసపడి జాహ్నవీసుతుఁడు ధర్మజుతో నిటుపల్కె నర్థరా
త్రసమయమందు నొంటరిగ రాఁదగునే పరసైన్యమధ్యమం
దెసగు గుడారముల్ చొరఁగ నేటికిఁజేసితివీ యకార్యమున్. 14

గీ. కూడుగుడ్డలనిచ్చి కాపాడుచుండె
నేఁటిదాఁక దుర్యోధనుఁ డేటిమాట ?
ధర్మమో యధర్మమ్మొ యుద్ధంబుఁజేయఁ
బూనితిని వానిపక్షంబు పొమ్మటంచు. 15

కం. దీనాననుఁడగు కుంతీ
సూనునిఁ గనుగొని సురనది సుతుఁడు కనికరం
బూనుచుఁ గటకటఁబడుచున్
మౌనముతోనుండి కొంత మాటాడె నిటుల్ 16

ఉ. ఇంతకుమున్నె నీవిచటికేలరుదెంచఁగ లేదటంచు నే
నెంతొ తలంచుచుంటిఁగద యిప్పుడు వచ్చితి వేమిసేతు నీ
వంతలు దీరుపెట్టు బలవంతుఁడు కౌరవరాజు భూరి వి
క్రాంతిగలట్టి సైన్యములు గల్గును వానికి వేల పెట్టుగన్. 17

కం. నా వంతలయిక చేసిన
నీ వంతలు నీకుఁ దీరునే ? కురుపతికిన్
మావంతులు రేవంతులు
లావంతుల బలముకలదు లక్షలకొలఁదిన్. 18

కం. చాపము నాచేనుండినఁ
జాపాచార్యుఁడుగూడ శరమొక్కటియేన్
మోపెట్టి వేయనేరఁడు
నీ పట్టుగలట్టివారు నేర్తురె ? యైనన్. 19

చం. ముదుసలినైతి నే బ్రదుకఁబోనిఁక నెన్నియొ యేండులక్కటా!
బ్రదికిన లాభమేమిపుడు? పౌత్రులు గొట్టుక చచ్చుచుండఁగా
నది కనులారఁగాంచు టొక టబ్బెను గావున యుద్ధమందునన్
గదిరినచావుకన్న మరి క్షత్రియుఁ డొక్కటి గోరనేర్చునే?

బ్రదికియుండిన నీకుఁ దోడ్పడఁగఁ గలఁ
జచ్చిపోయిన లాభంబు సంక్రమించు
నొక యుపాయంబుఁ జెప్పెద నొండునాక
నాకమరణంబుఁ గూర్చఁగా నీకతగును.

"నాకొక వ్రతంబుకలదు. అంగనాపూర్వుల మోముఁ దిలకింపను. నీమఱంది యగు శిఖండి యంగనాపూర్వుఁడు. వానిని ముందల నిడికొని సవ్యసాచిచే తేపు నన్నుఁ బడవేయింపుము. మీకు లగ్గగు. మిమ్ముఁ బెంచినవాఁడ నగుటచే మీయెడఁ గూర్మికలవాఁడ. మీకు భాగంబుఁ బంచిపెట్టింప విశ్వ ప్రయత్నంబులు చేసితి. దుర్యోధనుండు వినఁడయ్యె. కర్ణుని దివ్యాస్త్ర మహిమంబు నమ్మియున్నవాఁడు ఏతత్కారణంబున వానిని నిరుత్సాహునిఁ జేయుటకై యర్ధరథుండని నిర్ణయించితి. దాన మీకు లాభంబు గలిగె. ఇంతదనుక నతండు రణరంగంబునకు రాఁడయ్యె. అతం డసామాన్యుండైన యోధుండు. వానినిఁ గనిపెట్టియుండుట సముచితంబు. నీ విడిదలకుఁబోయి కార్యోన్ముఖుండవుకమ్ము." ధర్మజుం డంత తాతకు సాఁగి ప్రణమిల్లి సెలవుం గైకొని సంభ్రమంబునఁ దన పర్ణకుటీరముంజేరి కృష్ణునకు సర్వంబు విన్నవించి యా మఱునాఁడు గాంగేయోపదిష్టంబుగా రణంబు నడపి కరుణమాలి తాతయని తలంపక క్రీడిచే శరశయ్యాగతునిం జేయించెను.

ఆ. అంపసెజ్జమీఁద నాపగా తనయుండు
కూలియున్నయంత కురునృపుండు
కుంభభవునిదెచ్చి కురుసేనలకునెల్లఁ
బట్టభద్రుఁజేయ బైసితోడ.

వ. పాంచాలురతోడనున్న పూర్వవైరంబు మనంబునం దుంచుకొని ద్రోణా
చార్యుండు విక్రమావష్టంభంబున విజృంభించి యొకనాఁడు— 24

ఉ. తామర మొగ్గరంబు నొకదానిని బన్ని ప్రచండుఁడై సమి
ద్భూమి విహారమున్ సలుప దోర్బలుఁడై యభిమన్యుఁ డొక్కఁడున్
దీమసమూని చీల్చి చొరి తేకువఁజూపఁగ యోద్ధలెల్ల సం
గ్రామముచేయఁజుట్టికడఁకన్ గుమిఁగూడినయంత బైటనున్. 25

గీ. భీమముఖ్యులు తోడ్పడ వెడలుచుండ
మొగను సైంధవుండాకట్టెఁ బగఱనెల్ల
మొగ్గరంబునఁ బల్వురు ముట్టిగిట్టి
చంపివైచిరి యభిమన్యుఁ జలముపట్టి. 26

కం. కవ్వడి యీసంగతివిని
నివ్వెరఁగును బూనియపుడె నిశ్చేష్టుండై
దవ్వులనుండిన సైంధవు
బ్రువ్వందెగఁదిట్టిపల్కెఁ బొక్కుచు నిటులన్. 27

గీ. అస్తగిరిపైకి నాదిత్యుఁ డరుగకుండ
నవని సైంధవు తలఁ గూల్పనైతినేని
నాలుకలు గ్రోయు నగ్నిలోఁ గూలువాఁడ
గాండివముతోడ నెల్లరు గాంచుచుండ. 28

కం. సకలం బాలించి గురుఁడు
శకటవ్యూహంబుఁబన్ని సైంధవు సైన్య
ప్రకరముతో దానినడుమ
సుకరముగా నుండుమంచు సుస్థిరుఁజేయన్. 29

వ. మరునాఁడు బీభత్సుండు బీభత్సంబుగా భూనభోంతరాళంబు పిక్కటిల్ల
దేవదత్తంబుఁ బూరించి, ప్రచండగాండీవ కోదండజ్యావల్లీటంకారంబునఁ

గురుసైన్యంబు కలవరపడ, రథంబెక్కి శకటవ్యూహంబుఁజేరి తత్సేనాముఖంబుననున్న గురునితోఁ గయ్యంబాడఁ దొడంగె. శ్రీకృష్ణుఁ డిదిగాంచి కాలహరణంబగునని తలపోసి గురునకుఁ బ్రదక్షిణంబుగాఁ దేరుపోనిచ్చి తప్పింప క్రీడి సైంధవుంజేరు తమకంబున శకట వ్యూహంబును జించుకొనుచు మహాదారుణంబుగాఁ బోరాడుచుఁ బోవుచుండ, నిక్కడ— 30

చం. శినివరుఁజూచి ధర్మజుఁడు చెప్పెను నీగురుఁడొక్కరుండె బా
సను నెఱవేర్చికోఁదలఁచి సైన్యసమాకులమైన మోహరం
బునుజొరె నేప్రకారముగఁ బోరుచునుండెనొ నేనెఱుంగఁ గా
వున నరుఁజేరి తోడ్పడుము పొమ్మన సాత్యకి పొంగిపోవుచున్. 31

కం. మొగఁగాచి యున్నద్రోణుని
మొగమునఁబడకమొగఁ దప్పి పోవుచు ఘోరం
బుగ సైన్యముఁబడఁ గూల్చుచుఁ
బగతుఱకును బిట్టపిడుగుభాతిఁ జరించెన్. 3

వ. శకటవ్యూహ మధ్యభాగంబునకుఁ జనునంత భూరిశ్రవుం డెదురుపడఁ బ్రాతపగలు పొగలెగయ నొకరినొకరు పేర్కొని దార్కొని మార్కొని తులారణంబుఁ జేయుచు నిరువురు విరథులై ముష్టియుద్ధంబునకుఁ గడంగిరి. భూరిశ్రవసుండు సముత్సాహంబున శైనేయునిం బట్టికొని, పడవేసి ఱొమ్ముఁ ద్రొక్కి నిలిచి, కాలసర్పంబుఁబోని ఖడ్గయుక్తంబయిన భుజాదండంబు పెకెత్తఁ గృష్ణుండు దూరంబుననుండి పరికించి తొరపడి క్రీడిం గనుంగొని— 33

కం. అదె చూడుము నీశిష్యుని
మదమునఁ బడవైచి యొక్క మానిసి గొంతున్
విదళింపఁగ నున్నాఁడదె
బ్రదికింపుము పగతుచేయిఁ బడఁగూల్చిధరన్. 34

కం. రణనీతి దైవమెఱుఁగును
రణమున నీ శిష్యునిపుడు బ్రదికింపవయో
రణమున నీకై వచ్చెను
తొణకిన లాభంబులేదు తొందరపడుమా. 35

గీ. అనిన సవ్యసాచి యమోఘమైన తూపు
వింటసంధించి వెంటనే విడిచినంత
సౌమదత్తి హస్తంబును సగమువఱకుఁ
ద్రుంచిపడవైచె భూమిపై దొరలు బెగడ. 3

క్రోధోద్రేకంబున నొడలు తెలియక సాత్యకి భూరిశ్రవసునిఁ గ్రిందికి దొరలించి నికృత్తకంఠునిఁ జేయ నుభయసేనలు హాహా కారంబులు చేసెను. అంత సైంధవ వధోత్కంఠ నర్జునుండు కురుసేనాపతులఁ గాందిశీకులం జేయుచుండఁ బ్రొద్దుగ్రుంకుతరి యగుడు విషణ్ణవదనుండైయుండ— 37

గీ. ప్రొద్దుక్రుంకుచుండఁ బొడతెంచె బెడగొండ
నలమె నెఱ్ఱచాయ లభ్రవీధి
మెడను సాచిసాచి పడమటిదిక్కును
సింధు రాజుచూచి చెలఁగుచుండె. 38

కం. సమయం బిదెయని కృష్ణుఁడు
తమకక బోధింపఁ గ్రీడి తతదివ్యామో
ఘమగు శరమువింటఁ దొడిగి
తమకంబున సైంధవుతల ధరఁబడనేసెన్. 39

గీ. ప్రొద్దుగ్రుంకెననుచు మొఱపెట్టి కొందఱు
బాస తప్పెననుచుఁ బల్కినారు
ప్రొద్దు గ్రుంకలేదు పొరపడినారంచుఁ
గొందఱాడిరపుడు గొల్లుమనుచు. 40

వ. ఏది యెట్లయిననేమి ? సైంధవుండు హతుండయ్యె. వివ్వచ్చుండు చిచ్చుఁ
జొరఁడయ్యె— 41

కం. పదునేనవనాఁడు గురుఁడు
తుదియగు యుద్ధంబు నేఁటితోనని పెలుచన్
వదరుచు ద్రుపదవిరాటులఁ
దుదముట్టించెఁ గడువాఁడి తూపులచేతన్. 42

కం. ద్రోణాచార్యునిఁ బొడఁగని
ప్రాణంబులమీఁది తీపిఁ బాండవసేనల్
క్షోణీతల మెల్లనద్రువ
బాణంబులు విడిచిపెట్టి పరుగిడుచుండన్. 43

ఉ. అప్పుడు ధర్మరాజుఁగని యాదవుఁ డీగతిజెప్పె ధర్మజా !
తప్పని చెప్పఁబోక రణ ధర్మవిరుద్ధమటంచుఁ బల్కఁబో
కిప్పుడు ద్రోణుఁజేరి వచియించినచో నొకమాట వేగ నీ
ముప్పుతొలంగు లేసియెద మూడునుబో మన చావులిప్పుడే 44

వ. ద్రోణాచార్యుండు సన్యస్తశస్త్రుండైనంగాని మన మోర్వంజాలము. వినఁగూడనిమాట విన్నచో నతం డస్త్రసన్యాసంబుఁ గావించుననుట నీవెఱింగిన విషయంబె; కావున మన భీముచేఁ జచ్చిన యశ్వత్థామనామ కుంజర మిషంబున నశ్వత్థామ చచ్చెనని గురునకుం జెప్పు మనవుఁడు ధర్మజుండు కొంతవడి నిష్టంబుఁ జూపకుండి పిదప వల్లెయని ద్రోణాచార్యునింజేరి, పేరెలుంగున నశ్వత్థామ చచ్చెననియు నీరెలుంగునఁ గుంజరంబనియుఁ జెప్ప గురుండు నమ్మి యస్త్రసన్యాసంబుఁ గావించెను. ధృష్టద్యుమ్నుండపుడు విజృంభించి ద్రోణురథంబు మీఁదికి లంఘించి కేశాకర్షణంబుఁ గావించి, కుత్తుకనుత్తరించు కబంధంబు భూమికి డిగ్గఁద్రోసెను— 45

కం. గురుఁడగు ద్రోణుం డీల్గినఁ
బరివాహమునిచ్చి కర్ణుఁబట్టముగట్టెన్
గురు సైన్యంబుల కెల్లను
గురుపతి, తత్సైన్యమెల్లఁ గోల్తలు సేయన్. 46

కం. పదునేఁడవ దివసమ్మునఁ
గదనముఁ జేయంగబూని కర్ణార్జునులున్
మదమునఁ గోల్తలఁజేయుచు
నెదుర్కొనిరి నొకరినొకరహీనజవమునన్. 47

చం. అతులితశిక్ష కన్పడఁగ నందఱుయోధులు పిచ్చలింప న
ద్భుతముగ రెంటుసైన్యములు పోరునుమాని తమంత వారి పో
రితమును జుట్టుమూఁగి కనురెప్పలవేయక చూచుచుండఁగా
జతపడి పోరుసేయఁగను సాగఁగ నిర్వురు నొక్కరూపుగా. 48

ఆ. తేరికండ్లు రెండు దిగఁబడె భూమిలో
నొడ్డగెడవుగాఁగ నొండుచేయ
లేక కర్ణుఁడంత లేచి రథమునుండి
డిగ్గి నిలువఁబడుచు వెగ్గలించి. 49

గీ. నే నిరాయుధుండ నిర్వాహకుండను
గనుకఁ గండ్లనెత్తు కొనెదుదనుక
బాణమేయమాను పార్థ! నీ కెప్పుడు
క్షత్రధర్మ మెఱుఁగఁగాని దగునె? 50

గీ. అనినఁ జిన్నవాని నభిమన్యు మత్పుత్రు
నొంటివానిఁబట్టి యుసురుదీయ
క్షత్రధర్మ మెటకుఁ జని యుండెనో చెప్పు
కానిమాట లేల? కర్ణ! యనిన.

కం. పలువురితోఁ బోరాడఁగ
వలయుననుచు వచ్చినట్టి వానిని గలనన్
బలువురు చంప నధర్మమె ?
పలికెదవేమైన నీవు పాలసుఁడౌటన్. 5

వ. అయినను— 53

మ. ఇది ధర్మంబని చెప్పినాఁడసుమి యంతేగాని నీతోడి యీ
కదనంబన్న భయంబుఁజెంది యెటులో కాపాడుకోఁగాదు నే
నెదియర్థింపను బుట్టిబుద్ధెఱిఁగి, మున్నెవ్వానిఁ బ్రార్థించియు
న్నదిలే దర్జున ! యిచ్చవచ్చినటు లెట్లైనన్ బ్రతారింపుమా. 54

గీ. ఒకఁ డధర్మంబొనర్చెనం చోర్మివిడచి
నీ వధర్మంబుఁ జేయ ననింద్యమగునె ?
కృష్ణ శిష్యుండవైన నీకేమి తగవు
కలదని వచింపఁ బార్థుఁడాగ్రహముఁజెంది. 55

ధర్మమేల ? మాకుఁ దలపోయ రాధేయ !
శత్రుహనన మొకటి చాలుఁగానఁ
గాచియుండనోపఁ గలపనులను నీవు
తీర్చికొనెడిదాఁకఁ దేర్పకుండ. 56

కం అగునగుఁ గృష్ణుని శిష్యుఁడ
వగుదువుగా యిట్టి ధర్మమాడఁగ నీవున్
దగుదువు గాకేమియనుచు
నగుమొగమునఁ గర్ణుఁడని యనంతర మతఁడున్. 57

గీ. కడఁగి రథచక్రమునుబట్టి కాలుదన్ని
పైకి లేవనెత్తెడివేళఁ బార్థుఁడట్టె
దివ్యబాణ మొక్కండు సంధించి విడచి
పుచ్చెఁ గర్ణుండు తలఁద్రెళ్ళి చచ్చిపడఁగ. 8

కం. పిమ్మట శల్యునిఁ గురుసై
న్యమ్ముల కధినాథుఁజేయ నహికేతనుఁడున్
దొమ్మిరిపులను గలఁచి జీ
వమ్ముల విడె ధర్మసూతి బాణమ్ములచే. 59

ఉ. సెల్లుఁడు ద్రెళ్ళినంత తనసేనలు పర్విడఁ గౌరవక్షమా
వల్లభుఁడల్ల కాంచి యిఁక వల్లడి తప్పదటంచు డెందమున్
డిల్లపడంగఁ దోఁచమి కడిందివిచారముఁబూనియేడకో
తల్లడమంది దాఁటెనుగదా కలితుండయి చాటుమాటుగన్. 6



# ఊరు భంగము

వ. శంఖచక్ర పద్మరేఖాంకితములయిన పదముల జాడంబట్టి దుర్యోధన సార్వభౌముండు ద్వైపాయన హ్రదంబున జలస్తంభనవిద్యచే డాఁగెనని యెంచి ధర్మజుండు శ్రీకృష్ణసహితుండై యచ్చటికిఁ జనెను. పిమ్మట భీమాదులు పోటుమాటలచే నుడికింప మానసుయోధనుండు నీరంబువెల్వడి తీరంబునుం జేరి నిలువంబడెను అంతట శ్రీకృష్ణుండు పరిహాసపూర్వక దరహసిత వదనుండె — 1

ఉ. ఓ కురువంశవర్ధన ! సహోదరబాంధవ పుత్రమిత్రులన్
నాకముఁజేరఁబంపితి వనాదృతిదాయము పంచిపెట్టకే
నీకయివచ్చి యెందఱవనీపతులీల్గిరొ చూచియుండియున్
లోకులు నవ్వ నీమడుగులోపల డాఁగఁగనేల ? యన్నచో. 2

ఉ. డస్సితి సేదదీర్చుకొన డాఁగితి నంతియెకాని మీకునై
యిస్సిరొ ! నేను భీతివడి యిచ్చటడాఁగను గృష్ణ ! మీదు మే
దస్సున సందియంపడక ధారుణి సర్వము కప్పకున్న నా
దుస్సహమైన దుఃఖమును ద్రోయఁగ నేర్తునె యంచు రాజనన్. 3

ఉ. ఒక్కఁడవీవు మేమిచటనుంటిమి యేవురమంచు భీతి నీ
కక్కఱలేదు నాదు పలుకాలనఁజేయుము వీరియందు నీ
వొక్కనితోడఁబోరి జయమొందినఁ గౌరవరాజ్య సంపదల్
దక్కును రాజరాజ ! యది తప్పిన దక్కును స్వర్గభోగముల్. 4

కం. కావున నీయిష్టంబగు
నేవిధ యుద్ధమయిన సరియే వినుమా మా
యేవురియం దొక్కనితోఁ
గావింపు మటంచుఁ జెప్పఁ గౌంతేయుండున్. 5

గీ. ఉలికిపడి సారసదళాక్షుఁ డుద్దుకుడిచి
విస్మయంబునఁ బరికించి వెగటుపడుచు
నరుని దరిఁజేరి మెల్లగా బలుకు చుండఁ
గాంచి దుర్యోధనుఁడు కృష్ణుఁ గనలిపల్కె.

చం. వనరుహనాభ ! ధర్మజుఁడు వట్టియమాయకుఁడంచు నీవు లో
ననుకొనినావె ? తప్పగు సుమా ! యతఁడందఱి కన్న మేటియౌ
ననయము నాస్వభావమును నాతఁడెఱింగియె యిట్లులాడెఁ గా
వున ననుమాన మీయెడలఁ బొందఁగనేటికి ? భీతియేటికిన్.

కం. తెలిసియొ తెలియకొ ! నాకుం
గలిగించెను నతఁడు గొప్ప గౌరవ మదియున్
దొలఁగింపక దక్కించెదఁ
గలగుడు పడనేల ? నీవు కంజదళాక్షా !

సీ. పాలించినాఁడనేఁ బౌర వాన్వయసంప్ర
దాయమ్ము లిసుమంత తప్పకుండ
ఆలించినాఁడనే నార్తావిలాపంబు
లతిశయ శ్రద్ధచే నరుగుబోగడ
దూలించినాఁడనే దుర్మదారులనెల్ల
ధర్మంబు లవమైన దాటకుండ
తోలించినాఁడనే దొంగ దొద్దడికాండ్రఁ
బరసీమలకుఁ జేరి బ్రతుకుచుండ

గీ. నర్థులకు నీవి యిచ్చితి నడిగినంత
జన్నములు చేసితిని బ్రజల్ సంతసింప
అనుభవించితి భోగ భాగ్యంబులెల్లఁ
జావు చావన్న భయమున్నె ? శంకయున్నె ?

ఉ. వచ్చు జయంబు నేనెఱుఁగు వాఁడ గదా రణమందు నిన్నొ వి
వ్వచ్చునొ మాద్రిపుత్రులనొ వచ్చి రణంబొనరింపుఁడన్నచో
మెచ్చదు నామనంబు ననుమెచ్చదు లోకము దీనిఁజేసినన్
జచ్చెడుదాఁకనున్ మఱవఁజాలను బంతగు నాభిజాత్యమున్.

రాజరాజను పేరుతో రాజ్యమెల్ల
నేలినాఁడనేనిందాఁక నింకమీఁద
మానదుర్యోధనుండంచు మనుజగణము
నన్నుఁ గొండాడఁజేతు నీ నాఁడుమొదలు. 11

వ. అంచు బరవసంబుఁ జేయుచు మహాసంరంభంబున భీమునిదిక్కు మొగం
బయి చేయివీచుచు— 12

చం. ఇరువురమొక్క యొజ్జకడనే కద తొల్లి గదారణంబునున్
గఱచితి మంతెకాని మన కౌశలమున్ గనుపింపఁజేయ నే
వెఱవును గల్గదయ్యె నదివెన్నుని సన్నిధి నబ్బెనేఁడు నా
తెఱఁగును నీతెఱంగు బలదేవుఁడు సాక్షిగఁ దెల్లమయ్యెడున్. 13

చం. అతులమహానుభావుఁడగు నాబలరామునివద్ద విద్దె నే
ర్చితిమి రహస్యముల్ మనకుఁ జెప్పెగురుండును దద్విశేషముల్
వితథముఁ జేయకుండ నొకపీసము ధర్మము తప్పకుండనిన్
బితరులఁ జూడబుత్తు నొకపెట్టున మాధవుఁడావులింపఁగన్. 14

కం. అదె! తాలాంకుఁడు వచ్చెను
బదపద యభివాదనంబుఁ బచరింతముపైఁ
గదనముఁ జేతుము మనకుం
గొదలుండవు భీమసేన కొంకఁగనేలా? 15

ఉ. భూభుజులందఱుంబొగడ భూరిగదారణ పాండితీ మహా
వైభవముం గనంబఱచి ప్రస్తుతికెక్కఁగవచ్చు వాయుపు
త్రా భయదావహంబు మఱితప్పదు నాకును నీకు ధర్మపీ
డాభయముండ నేరదిఁక డాయుము పోరికి మాటలేటికిన్. 16

వ. అంచు సుయోధనుండు వినీతవేషుఁడై బలరాముంజేరి— 17

గీ ్యుఁ డభివాదనంబును జేయుచుండె
నతిభయంకర ఘోర జన్యంబుసల్పఁ
బ్రాణము పణంబుగా నొడ్డి యరుగుచుండె
దీవెనలనిచ్చి పంపవే దేశికేంద్ర ! 18

వ. సుయోధనుండంత రౌహిణేయునిచే దీవనలంది మోము విప్పార నొడలు పెంచి, భుజాస్ఫాలనంబుఁ గావించి, గర్జించి దీర్ఘ గదాదండంబు గమిచిపట్టి, యుద్ధరంగంబున నిలువంబడ, భీముండును గన్నెఱ్ఱంగని కోపంబుతో గదంబట్టి సారించుచు మల్లచఱచి, సుయోధనుని నెదుర్కొనఁ బరస్పర జయకాంక్షచే వారు పోరసాగిరి. ఒకరి నొకరు డాయుచు, వీడుచు వ్రేయుచు గదను బిరబిరఁ ద్రిప్పికొట్టుచు, మండల ప్రచారంబుల భ్రమించుచు, మలయుచు, నొడుపెఱింగి మట్టుచుఁ గొంతవడి పెనంగిరి. స్థూలకాయుం డగు భీముండు క్రమక్రమముగా డయ్య నారంభించి, రోజుచు నిట్టూర్పు విడుచుచుండెను. అతికష్టంబుపై మండలభ్రమణంబుఁ జేయుచుండెను. ఎదిరిఁ గొట్టుటమాని, తన్నుఁ గాపాడుకొను ప్రయత్నంబున నుండెను. దుర్యోధనుం డతిలాఘవంబునఁ జుఱుకుదనంబున నెచ్చటఁ జూచినను దానయై భీమసేను వెలార్ప మొదలిడె. 19

కం. చకచక మాటల నాడుచు
జకపిక గదత్రిప్పి త్రిప్పి సర్పధ్వజుఁడున్
గకవికలై బెకబెకలై
తికమకలై భీముఁ గళ్ళు తిరుగఁగఁ గొట్టెన్. 2

గీ. సొక్కి భీమసేనుండంత సొమ్మసిల్లి
తేరి, తేరి కొంతవడికిఁ దెప్పిరిల్లి
గదను జేఁబట్టి తన యొడుఁ గఱచికొనుచు
యుద్ధమును జేయుచుండెను నోసరిల్లి. 21

తడబడు నడుగులతోడన్
గడలుకొనెడి భీతితోడఁ గంపముతోడన్
బడలిన వడముడిచేగద
గిడుగయ్యెను జెప్పనేమి ? కృష్ణుండపుడున్. 22

వినవోయి ఫల్గునా ! మన భీమసేనుఁ డీ
యహికేతనుని గెల్చుననుట కల్ల
అలవాటులేమిచే నాయాసమున భరం
పడిపోదుచుండెను బాఱఁజూడు
సారెసారెకుఁ దూలి జవ్వాడుచుండెను
నడకలో బిగువు కన్పడుటలేదు
అతిలాఘవముతోడ హస్తిపురీశుండు
వెఱవుతో గదత్రిప్పి విసరుచుండె

గీ. భీమసేనుండు ప్రతివీరు పీఁచమడఁచు
యత్నమునుమాని తన్నుఁగాపాడుకొనెడి
యత్నముననుండెఁ జూడుమా యక్కటకట !
చూడఁజాలఁ గంటను వాయుసూను చావు. 23

కం. నిట్టూర్పులగమి మిక్కిలి
దట్టంబగు చుండె నింక దక్కఁడు మనకున్
గట్టా ! భీమునిఁ గొట్టన్
గట్టల్కన్ గాచియుండె గౌరవనృపుఁడున్. 24

గీ. ధర్మమనుమాట మనమేల తలఁపవలయు ?
తొడలు విఱుగఁగొట్టించి యా ధూర్తుఁడైన
కౌరవేశ్వరుఁ జంపించి తీరువాఁడ
శ్రీ విజయలక్ష్మి ధర్మజుఁ జెట్టఁబట్టు. 25

గీ. నాభిక్రింద ఘోర గదా రణంబునందుఁ
గొట్టరాదనిచెప్పి పల్కుదురు నీతి
విదులది యెఱింగి కౌరవ విభుఁడు జోకఁ
గాచుకొనుచునుండెను నూర్ధ్వ కాయమొకటె. 26

కం. బలరాముని భయమొక్కటి
కలఁగించుచునుండె నైనఁ గౌరవనృపు భూ
తలమునఁ గూల్చినపిదపన్
బలరాముని బట్టుపఱప వచ్చుననెట్లో. 27

కం. కావున భీము నెదుటఁ దొడ
నీవు చఱచికొనినయంతనె యతఁడెఱిఁగి యా
పై విఱుగఁగొట్టు దొడలను
బోవుమ యిది నీవుచేయఁ బొక్కకు మన్నన్. 8

భీము కట్టెదుటకు నేగి విజయుఁ డప్పు
డేమొ పనియున్న యటు నటియించి కొంత
తొడను జఱచుకొనియె దీని వడముడియును
జక్కగా గ్రహియించి యుత్సాహమూన. 29

సర్పకేతనుండు దర్పదుర్వారుఁడై
యుప్పరంబు నెగసె నురవడించి
గదను జిక్కఁబట్టి గర్జించి భీముని
మట్టుఁబెట్ట నొక్క పెట్టుచేత. 3

ఉ. మీఁదకుదూఁకి గర్జిలి సమిద్ధజవంబున వచ్చు కౌరవ
జ్మాదయితుంగనుంగొని ప్రచండగదాహతి నూరు యుగ్మమున్
బాదెను నుగ్గునూచముగ బాణహతింబడు పుల్గు కైవడిన్
వేదనఁబొంది రాజు పృథివీస్థలిఁగూలఁగఁ గుప్పకూరఁగా. 31

చం. పడినటువంటి కౌరవనృపాలునిఁ గన్గొని మచ్చరంబునన్
వడముడి డాసి డగ్గరకుఁ బల్వురువద్దని చెప్పుచున్ననున్
ద్రొడిబడి దూరి కట్టలుకతోడ సుయోధను నుత్తమాంగమున్
గడువడి ధూర్తుఁడై యెడమ కాలను దన్నె దురాగ్రహంబునన్. 32

శా. తాలాంకుండిదికాంచి దుర్భర పరీతాపంబునుంబొంది యా
ఖీలంబౌగదఁ జేతఁబట్టి యిదిగో ! భీమా ! నినుంగూల్తు నీ
లీలం ధర్మముతప్పి కూల్తువె నృపున్ ? లేలెమ్ము కౌరవ్య భూ
పాలక్షోభము మాన్పనేరనె గదా ప్రావీణ్య మేపారఁగన్ ? 33

గీ. అంచు లేచిన బలరాము నడ్డగించి
ధర్మజుఁడు ధర్మపీడచేఁ దత్తరింపఁ
జేతులను బట్టి గదలాఁగి చెప్పె నిట్లు
వాసుదేవుండు గద్గద స్వరముతోడ. 34

కం. చచ్చిన దుర్యోధనుఁ డిఁక
వచ్చునె మన భీమసేను వధియించినచో ?
నిచ్చలు మేన త్తనిసున్
బొచ్చెము లేదంచు నెపుడు పొగడుచునుండున్. 35

గీ. అయినపని యేమొ యైపోయె నాగ్రహింప
పలవదని చెప్పి బతిమాలి యవల కంప
నేవపడియప్డె బలరాముఁ డేగెనకట !
కర్మఫలము ననుభవింత్రు గాతమంచు. 3

ఈ సంభాషణంబు నంతయు భీమ గాదాక్షేపంబున భగ్నోరువుండై పడి యున్న దుర్యోధనుం డాలించి నడుము నలిగిన, మణిరోచిష్ణువగు పడగ విప్పి లేచి యాడు మహానాగంబు చందంబున, వివిధమణిప్రభాపుంజ ధగద్ధగిత నిస్తుల కోటీర ప్రశస్తంబయిన మస్తంబెత్తి భూతలంబుఁ జేతుల నానుకొని కృష్ణునిం జూచి— 37

సేతువుఁదొట్టి శీతనగ సీమలదాఁకను గల్గు భూతధా
త్రీతలభాగమంతయును రేఁగిన తీరని యాడుకూయిచే
మ్రోఁతలు మ్రోఁగుచున్నఁగనుమూసిన రాత్రులు నిద్రపట్టునే ?
సీతలవ్రాత యీవిధము నీకొడ గూర్చె దురంత దుఃఖముల్. 38

ఎల్లరు పేరుమోసిన మహీశులు యుద్ధమునందుఁ జావ నీ
వెల్ల వసుంధరావలయ మేలఁగవచ్చునటంచు నెంచుచున్
బల్లిదులైనయట్టి యదువర్యులఁ దోడ్కొనిరామిఁ బోరికిం
దెల్లము; కాని ధర్మజుఁడు దీని నెఱుంగఁగ నేరఁడేమియున్. 39

చెల్లదు, సత్యమున్ వినుము చెప్పెద మాధవ ! సర్వధారుణీ
వల్లభులున్ నశింప యదు వంశమె యేలెడు నన్నమాట; నీ
వల్ల నొనర్పఁబడ్డ బహు పాతక మూలక ధర్మపీడలున్
వల్లడిఁ గూర్చి కూర్చి యదువంశముఁ బీలిచి పిప్పిఁజేయవే. 40

కం. బలవంతుఁ డైనవానిని
బలహీనుం డెందు నమ్మవచ్చునె ? చెపుమా !
బలవంతుఁడు పమయంబున
బలహీనుని మ్రింగకున్నె పటుతరశక్తిన్ ? 41

సీ. పట్టించితివిగదా పగవాని కొల్లనిన్
నమ్మియున్నట్టి పాండవులచేత
కొట్టించితివిగదా కురువృద్ధ గురుభీష్మ
గురుయోధులనునెల్లఁ బరువుదప్పి
మట్టించితివిగదా మహితవీరులనెల్ల
సంగ్రామ నియమముల్ జారవిడచి
ముట్టించితివిగదా ముమ్మరంబగుచిచ్చు
భరతాన్వయారామ పటలికెల్ల

ఎవ్వఁ డనుభవించు నీ మహాదారుణ
పాపకార్యవితతి ప్రతిఫలంబు
రాత్రులెల్ల నిద్రరామిచే శ్రీకృష్ణ!
కలలుగాంచి చావఁగలవు నీవు. 42

ఉ. దారుణ సంగరంబు రణధర్మముఁ దప్పక చేసినాఁడనే
వీరవిహారమున్ సలిపి పెద్దలు మెచ్చఁగ నాకభోగముల్
జూరఁగఁ బోవుచుంటిఁ గద శోకమునాకిఁక లేదు మాధవా!
భూరి విషాదఖేదముల బ్రుంగుడు గాంతురు నీవు పాండవుల్. 43

వ. కృష్ణా! నీమందెమేలంబునఁ బాండవులు ధర్మదూరులై భారతకులంబునకుఁ గలంక మాపాదించిరి. చంద్రవంశంబునకు నీ పుట్టువునఁ బుట్టుమచ్చ దాకొనె— 44

గీ. కంటిఁ గన్నార నీవు వెన్నంటి భీము
నెదుటఁ గ్రీడిచే సైఁగఁ జేయించుటెల్ల
నింత పాపకార్యంబుఁ జేయింతువనుచు
నెఱుఁగనైతి నద్దానిచే నిట్టులైతి. 45

కం. బలదేవ దేశికేంద్రుఁడు
కలఁడుగదాయంచు నూర్ధ్వకాయము నేనున్
గలఁగక కాపాడుకొని వ
దలితి నధఃకాయ మిట్టిదశ ప్రాప్తింపన్. 46

కం. వీరస్వర్గముఁ బొందెదఁ
గౌరవ వీరాధివీర గణమిచ్చెడి కై
వారంబుల నాలించెద
గౌరవమున నాకుఁ గొదువకలదే కృష్ణా 47

వ. అని చెప్పుచు డగ్గుత్తికపడి క్రమక్రమంబుగ గ్రాఁగన్ను వెట్టి మాటాడ నేరకయున్నఁ బాండవులు కృష్ణునింగూడి యథేచ్ఛగాఁ జనిరి— 48

చం. మఱకువలేక మాధవుఁడు మానసమందుఁ దలంచె నీక్రియన్
గురుపతి చాపునుం దెలిసి కొన్నయెడన్ గురుపుత్రుఁ డుగ్రుఁడై
దురమునఁ బాండవేయులను ద్రుంచుటయొండెను దొంగపోటువన్
బొరిగొనుటొండె చేయఁగల పోటరికావున నేర్పుతోడుతన్. 49

గీ. పాండవేయుల నీరాత్రి వానిబారిఁ
బడక తొలఁగియుండెడునట్లు భద్రపఱుప
వలయుననిచెప్పి వెంటనే పాండవాగ్ర
జునిఁ గనుంగొని శ్రీకృష్ణుఁ డనియె నిట్లు. 50

ఉ. ధర్మజ ! డస్సియుంటిమి గదా ! పదునెన్మిదినాళ్ళు పోరుచే
దుర్మదుఁడౌ సుయోధనుఁడు ద్రుంగెను నోఘవతీస్సురన్నదీ
నిర్మల వాయువీచికల నిద్దురఁబోవుద మేనునీవు నీ
పేర్మి సహోదరుల్ మఱియు వృష్ణికులుండును నేఁటిమాపునన్. 51

వ. అనిచెప్పి ధర్మజు నొడంబఱచి నాఁటిరేయి పంచపాండవులు కృష్ణుండును సాత్యకియు నోఘవతీపులినంబుల విశ్రమించిరి. అశ్వత్థామ విజృంభించి న్యాయయుద్ధంబునఁ బాండవులఁ గెలుచుట దుర్లభంబని యెంచి యర్ధరాత్రంబునఁ బటకుటీరంబులం జొచ్చి కృప కృతవర్మ సాహాయ్యంబున నెల్లరం బొరిపుచ్చి, రారాజు ఋణంబుఁ దీర్చికొనియె. 52

# యాదవ ప్రళయము

ఉ. భారతయుద్ధమైన పిదపన్ యదువర్యుఁడు పాండవేయ స
త్కారముఁబొంది సంతసిలి ద్వారవతీపురి కేగుచుండఁగా
దారిని బ్రొద్దుగ్రుంకఁగ నుదంక మునీశ్వరు పర్ణశాలయున్
జేరువనున్నమాటెఱిఁగి చేరెను నచ్చట రేయి పుచ్చఁగన్.

కం. చేరిన కృష్ణునిఁ గనుఁగొని
గారవమున సంయమిప్రకాండుఁ డతిథి స
త్కారముఁ జేయుచు నీగతి
సారసదళనేత్రుతోడఁ జనవున ననియెన్.

ఉ. కౌరవ పాండవేయులకుఁ గల్గిన యాపగ యేవిధంబుగా
మాటెను? సంధియౌననెడి మాటలు నిక్కమె? సంధియయ్యెనే?
సారసనేత్ర! సత్యముగ సంధిని నీవొనరింపఁ బూన, నె
వ్వారును మాన్పలేరిది ధ్రువంబనిపల్కఁగఁ గృష్ణుఁడిట్లనెన్.

మొండి దుర్యోధన నృపాలకుండు వినక
సంధిచెడఁగొట్టె నందుచే సమరమయ్యెఁ
గౌరవులు చచ్చిపోయి రొక్కరును లేరు
ధర్మజుని బొందె జయలక్ష్మి తాపసేంద్ర!

కం. పదునెనిమిది యక్షౌహిణు
లెదురెదురై పోరి పోరి యేపటికడకున్
బదునెనిమిది దినములలోఁ
గదనంబున నీల్గిచచ్చెఁ గ్రమ్మఱకుండన్.

గీ. కౌరవులయందుఁ గృతవర్మ గౌతముండు
ద్రోణసుతుఁడును మిగిలిరి తుదకుఁ ధర్మ
తనయు దెసఁ బంచపాండవుల్ శినివరుండు
నే యుయుత్సుండు చావక నిల్చినారము.

గీ. అతిభయంకరమైన యా యాహవమ్ముఁ
గన్నవారికిఁ గంపంబు గల్గఁజేసె,
భరతవర్ష మీరీతిగా బాడువడియె
నన్నదమ్ములు పాళ్ళకై తన్నుకొనఁగ. 7

కం. అనునీనుడులను వినుచును
గనారిలుచు మండిపడుచుఁ గటము లదరఁగా
మునికుల శేఖరుఁ డిట్టుల
వనరుహపత్రాక్షుతోడ వక్కాణించెన్. 8

ఉ. పావలుపూననేల ? కురు పాండవ యుద్ధము మాన్పఁబూనుచో
మానుపఁగల్గియుండియును మాన్పక కౌరవపక్షయోధ సం
తానమునెల్లఁ గూల్చితివి న్యాయముమాని రణంబునందునన్
మానక శాపవహ్ని నిను మాడ్చెదఁ జూడుమటంచుఁ గ్రోధియై. 9

కం. శాపోదకమిదుగో ! నీ
చాపల్యము మాన్తునంచు సంరంభమునన్
జేపట్టి కమండలువున్
గోపంబున శాపమీయ గొందగొనుచుండన్. 10

గీ. అగుమాగుము కోపంబు నాఁచికొనుము
నీకమండలు వటుపెట్టి నేను జెప్పు
మాటలను నాలకించి పిమ్మటను నీవు
చేయవచ్చునుగాదె తోఁచినవిధంబు. 11

ఉ. వారిని వీరిఁబోలెననుఁ బల్కెదవేటికిఁ ? జాలు, నీశ్వర
ప్రేరితమై మహారణము వీరవినాశన హేతుభూతమై
ధారుణి భూరిభాగము వదల్పఁగవచ్చె నిజంబు గాన నీ
పోరునుమాన్ప నేనెవఁడఁబో ! తలపోయవె మౌనిచంద్రమా

గీ. పూర్వ కర్మఫలము సర్వంబు భుజియింప
కుండ నెవరిశక్యమో మునీశ!
మర్మమేల? నరుఁడు కర్మఁబు చేతిలోఁ 13
గీలుబొమ్మకాదె కేవలంబు?

గీ. ఎన్నిపాటులు పడినానొ యెవ్వఁడెఱుఁగు?
సంధిసేయంగ నెటులైన శక్తివంచ
నంబులేకుండఁ గౌరవనాథుఁ డొకఁడు
వినక చెడఁగొట్టె నందుచే బెడిసె సంధి. 14

కం. అందఱు దారుణయుద్ధము
నందున మరణించుచుండ నతిభయదముగాఁ
గ్రందై యేడ్పులు సెలఁగన్
విందగునే నాకుఁజెప్పు విపరీతముగాన్? 15

వ. శ్రీకృష్ణుండిట్లు కల్లబొల్లిమాటలు పెక్కులు చెప్పి యుదంకమహాముని నిరుత్తరుంజేసి, మిక్కిలి చనువుతో— 16

గీ. మౌనిపర్ణశాల మరుభూమి యందుండ
మంచినీళ్లలేక మాఁడుచుండఁ
గాష్ఠలోనదానిఁ గనిపెట్టి చక్కఁగా
మంచిమాటలాడి మౌనితోడ. 17

గీ. చుట్టుప్రక్కపొలము శోధించి త్రవ్వింప
నీళ్ల పడెడిచోటు నిశ్చయించి
నిలువులోతుపోవ జలజలమని జెల
పొంగి పైకివచ్చి పొలముఁదడిపె. 18

వ. మౌనియు నీయాకస్మిక జలపాతముచే మెత్తవడి, వాయెత్తి మాటాడ నేరఁడయ్యె. శ్రీకృష్ణుఁ డీగతి బొంకులుబొంకి యుదంకమహాముని హృదయ

కలంకముఁ బాపి, సుయోధనునివంక వంకనిల్పి, తదాశ్రమంబున సుఖముగా నారేయి పుచ్చి, సుప్రభాతంబుననే లేచి, మునీశ్వరుకడ సెలవంది, ద్వారవతిం బ్రవేశించి, నిశ్చింతతోఁ గాలముఁ గడుపుచుండ—

ఉ. భారతభూతధాత్రిఁ గురు పాండవయుద్ధము వీరరక్తకా
సారమయంబుఁ జేయఁగ విసారమునై బహుదీర్ఘ శోకవి
స్తారపరీతమై కుముల జారులుచోరులు భీతిలేక సం
చారముఁ జేయసాఁగిరి విశంకటపీడల నాచరించుచున్.

సీ. వినరావు మంగళ స్వనములు రవ్వంత
యోదార్పరాని యేడ్పొకటి తక్క
కనరారు నగుమోము కలవారు శిశువృద్ధ
వికలాంగ బధిరాంధ వితతి తక్క
పరికింపఁగాలేవు పంటపొలంబులు
పిస్గు పెంటలఁగ్రుళ్ల బీళ్ళుదక్క
పొడకట్టఁగారారు పుణ్యాంగనామణుల్
విలపించు ముండమోపులును దక్క

గీ. ఏడ్పుబొబ్బలు లేనట్టి యిల్లుగాని
యూరు పల్లెలుగాని కొండొక్కఁడైనఁ
గటకటా ! కన్నుదోయికిఁ గానరావు
వలుకులై పోయె భారత వర్షమెల్ల.

ఉ. ఒక్కని రాజ్యతృష్ణ మఱియొక్కని మొండితనంబు నింక వే
ఱొక్కని రాజనీతి భరతోర్విని౯ బీలిచి పిప్పిఁజేసెఁబో
పిక్కటిలంగఁ బేదఱిమి పెంపఱఁజేసె మహోగ్రభంగిగాఁ
ద్రెక్కొను బీదసాదలకు దిక్కెవ్వరుండిరి కావఁబ్రోవఁగన్.

సీ. ధర్మపీడలుమాన్పఁ దగువారు లేమిచేఁ
పాపముల్ మిన్నుముట్టి వరుసఁజెలఁగె
బలవంతులై నట్టి పరిపాలకులు లేమి
జారచోరులబాధ సాఁగిపోయె
మగవాండ్రు మరణింప మగనాండ్రు చెలరేఁగి
తిరుగాడఁ జొచ్చిరి తెంపుఁజేసి
తగవుఁదీర్పఁగఁ జాలు తగవరుల్ గనరామి
గోవాండ్ర గోవారు గుబ్బటిల్లె

గీ. భరతవర్షంబు దుస్సహ నరకమయ్యెఁ
గాలు కదలింపఁగా వీలు కలుగదయ్యెఁ
బ్రాణభయమొక్క క్షణమైనఁ బాయదయ్యె
దిగులు విడనాడిపోదయ్యె దినదినంబు.

వ ఇట్లు భరతవర్షంబు సంక్షుభితమై, వ్యాకులమై, యాభీలమై, పాపమూలమై
శోకరసాధిదేవత కునికిపట్టయుండ— 24

ద్వారకయందు యాదవులు దర్పసమగ్ర మహోగ్రులౌచు నె
వ్వారిని లెక్కపెట్టక యపారబలంబున వృద్ధిఁజెంది దు
ర్వార పరాక్రమాఢ్యులయి రాజులనెల్లఁ ధిక్కరించి దై
వారుచునుండి రాపురిని వైరులు లేరని గర్వలీఢులై.

సీ. కులవృద్ధులను జూచి గురుభక్తిఁ బూజించి
మర్యాదలనుజూప మానినారు
ఆచార్యులనుగాంచి యర్చించి శ్రద్ధతో
నుడుగరలిచ్చుట యుడిగినారు
ధర్మాత్ములగువారి దర్శించి నెమ్మితో
భాషించుపద్ధతి వదలినారు
దైవతారాధన తత్పరత్వముమాని
మూఁడు సంజల పూజ వీడినారు

గీ. యాదవకుమారు లుగ్రులై వ్యసనసప్త
కమునఁజిక్కి దురంతులై క్రమముఁదప్పి
వృద్ధజనముల గికురించి వెడగులగుచుఁ
దిరుగుచుండిరి ద్వారకాపురమునందు.

ఉ. ఆయము లెక్కపెట్టకయె యందఱిముందఱఁ గేరడించి, మై
రేయముఁద్రావి మైమఱచి రేఁబవలొక్కరుఁ డొక్కరై వడిన్
బ్రాయముఁ బానగోష్ఠికల వద్దను బుచ్చుచునుండఁ గాంచియున్
న్యాయము కాదటంచు నొకరైనను జెప్పెడివారు లేరటన్.

గీ. త్రాగుబోతుతనము తగవుగాదంచును
ముట్టఁబలుకువారు పుట్టరందు
నేమి పల్కనుండె; నిందీవరాక్షుని
యెదుట సాఁగుచుండె నిటిపనులు.

ఉ త్రావుము త్రావుమంచుఁ దెగఁద్రావుమటంచు నొకళ్లొకళ్ళనున్
ద్రావఁగఁ జేసిచేసి మదిరంబును లాహిరిఁబొంది వారుణీ
దేవత కేటికోళ్ల నిగడిఁ చెద రాపురిఁగల్లు శౌండికుల్
త్రావుచు నేలమీఁదఁబడు దాఁకమదంబుముదంబు మీఁఱఁగా.

కం. ఓరోరీ ! తేరమదిర
తేరా ! చషకంబునిండఁ దెగఁ ద్రావెద నా
పేరెఱుఁగవురా యనుచున్
బూరింతురుగిండ్లు త్రాగుఁబోతులు చొరవన్.

ఉ. మద్యము నాని యాని యవమానమెఱుంగక రాచబాటలన్
జోద్యము లాడుచుం దిరుగుచున్ గనుపింతురు చేతనున్న యా
ఖాద్యములన్ బసాపడుచుఁ గాఱులు ప్రేలుచు బాసలాడుచున్
బద్యము కూనరాగమునఁ బాడుచు యాదవ శౌండులప్పురిన్.

కం. ఎప్పుడు పురవీధులలోఁ
దప్పక కనవచ్చుఁ దప్పఁద్రాగినవారిన్
దుప్పతలల ముండలతోఁ
దప్పుటడుగు లిడుచు దారిఁ దారెడివారిన్. 32

మ. మదిరాపాన విఘూర్ణమానులగుచున్ మల్లాడిమల్లాడియున్
మదిరాక్షీపరిరంభ సౌఖ్యములతో మత్తిల్లిపువ్వాటలో
మదమత్తుల్ చరియింతురాపురమునన్ మర్యాదలేకుండ నా
యదువంశోద్భవులేమి చెప్పెదను దుర్వ్యాపార లీలారతిన్. 33

గీ. దెప్పరంబుగఁ బోరు కడింది మగలు
సందుగొందులఁ దిరిగి నిస్సారులైరి
పుడిమి నెదురించువారు కన్పడమిచేత
నౌర ! సామరి సోమరి యయ్యెనచట. 34

ఆనదొరంగి ద్వారవతి యందువసించెడి మత్తకాశినుల్
పానముఁజేయనేరిచి పిపాసను దీర్చికొనంగ వారుణిన్
బానలు నింపియుంపఁ దమవంతు మహానసమందునన్ మద
స్థానములయ్యె గేహములు ధర్మవినాశనమూలకంబులై. 35

కం. పౌరుగూరి పెద్దలయినన్
బొరపడి ద్వారవతికట్టి పోయిరయేనిన్
బరువు ప్రతిష్ఠలు దక్కవు
సురచే మత్తిల్లిన యదుసూనులయెదుటన్. 36

గీ. నారద ప్రభృతి మునిజనమునకైనఁ
దప్పవయ్యె నీపాటులు ద్వారవతిని
యదుకుమారుల స్వైరవిహారమిట్లు
తెన్నుగానక మితిమీటి మిన్నుముట్టె. 37

చం. వివిధములైన మద్యముల విల్చుచు నమ్మఁగ శౌండులెల్ల ద్వా
రవతిని బాన గోష్ఠికల రాయిడి యేమని చెప్పనేర్తు రేఁ
బవలును మూయఁగాఁబడవు వానిని బాయరు త్రాగుఁబోతులున్
బవరము పానగోష్ఠికల వద్దఁగనంబడు గంద్రగోళమై. 38

ఉ. పత్తనమిట్లు దుర్వ్యసన పంకిలమైకనుపట్టఁ గృష్ణుఁడున్
జిత్తులమారియయ్యు నెది సేయఁగలేక విషణ్ణచిత్తుఁడై
యొత్తిగిలంగ యాదవులహో ! చెలరేఁగుచు నంతకంత రే
కెత్తఁగ నుగ్రసేన పృథివీశుఁడు చాటఁగఁబంపె నీక్రియన్. 39

కం. హాలాపానముఁ జేసిన
వేళాకోళమ్ముగాదు వినుఁడీ వారిన్
శూలారోపణఁ జేసెద
జాలింబడఁ దత్కుటుంబ సహితముగాఁగన్. 4

గీ. ద్వారకాపట్టణపుఁ బొలిమేరలోనఁ
బానగోష్ఠులు పెట్టినవారినెల్లఁ
బట్టి మరుభూములకుఁబంపివైతు సర్వ
జనుల కవిలంఘనీయ మీ శాసనంబు. 41

వ. ఈ శాసనంబు నాకర్ణించి యతికుపితులై యదుకుమారులందఱు నొకచోటఁ
గుమిఁగూడి— 42

చం. ముదుకఁడుగాన నెట్లయిన భూపుఁడు ప్రొద్దులు పుచ్చవచ్చుఁగా
గొదగొనియున్న యూపదుచు కుఱ్ఱలమాటఁ దలంపకిట్టు బె
ట్టిదమగు శాసనంబు నొకటిన్ బ్రకటించుట రాజనీతియే ?
యిది కనుగొందమంచునపుడెల్లరు రోషకషాయితాక్షులై. 43

వ. అతినిగూఢంబుగా నొకరినొకరు బిలిచికొని బందు కట్టి శాసనంబు నిరర్థ
కంబుఁజేయ సమకట్టి జాతరయను నెపంబున- 44

సీ. బుసబుస పొంగారి పులికంపుఁగొట్టుచుం
దెడి కలుకుండ కావడులఁదాల్చి
మదపువాసనగొట్టు మధువునింపిన పంట్లు
మూపులపైఁ బెట్టి మోసికొనుచు
లాహిరి గలిగించి లంఖింపఁజేసెడి
వారుణీ భాండముల్ పట్టుకొనుచు
మదిరాక్షులకుఁగూర్చు మదిరతోఁ దెగనిండి
తొలుకు కుంతల బండ్లఁ దోలుకొనుచు

గీ. ద్వారవతివీడి యాదవుల్ బయలుదేరి
వార్ధి చెంతకుఁ జిత్తంబు వచ్చినట్టు
త్రాగవచ్చునటంచును దరలినారు
క్షోణిధవుఁ డేమిసేయునో చూతమనుచు. 45

గీ. రాజశాసన భయము సర్వంబు తొలఁగఁ
జేతఁ జషకముల్ పూని వాచేరఁబట్టి
రేకలనుదాల్చి మంచి మైరేయమెల్లఁ
గ్రోలిరప్పుడు యాదవుల్ గొంతువఱకు. 46

కం. కవకవలుగఁ దిరుగాడుదు
రవదంశము లమ్మునట్టి యంగడులందున్
దెవఁద్రావిన యదువంశ
ప్రవరులు మాటాడకుండ బందరునందున్. 47

కం. తసతసఁ గూలెడువారై
విసవిసఁ బరుగెత్తుచుండి విగతాంబరులై
గుసగుస లాడెడివారై
పసచెడి కందోయి తేలవైచెడివారై. 48

వ. యాదవ సందోహం బొడలెఱుంగక సంచరింపుచుండుటంజేసి ప్రచండ
శౌండపిచండిలంబై సముద్రతీరం బంతయు మహాకోలాహలంబులుగానుండె,
అట్టి సమయంబునఁ బ్రద్యుమ్నునిపై నానుకొని యతి వాచాలుండై — 49

కం. కనుగ్రుడ్లెఱ్ఱవడంగా
శినివర్యుఁడు తప్పఁద్రావి చిటచిటమనుచున్
ఘనయోధుని గృతవర్మను
గనుగొని యిట్లాడిపోసెఁ గనుబొమ లెగురన్. 50

చం. ప్రధనముఁ జేసిచేసి శిబిరమ్ముల నిద్దురవోవు బాలురన్
బ్రథితుల నర్ధరాత్రమునఁ బైఁబడి కంఠమునొక్కి కోయఁగా
రుధిరముఁ గ్రక్కుచుండఁగను రోయక పాయక తాన్నృశంసుఁడై
వధయొనరించినట్టి బలవంతుని నేఁ గొనియాడుచుండెదన్. 51

కం. అనవిని కృతవర్మయుఁ దన
మనమునఁ గట్టల్కరాజి మండుచునుండన్
వెనుదీయక చెప్పె నిటుల
శినివరు వీక్షింపకుండఁ జిఱునవ్వొలయన్. 52

చం. పగతుఁడు నేలమీఁదఁ బడవ్రైచి రణస్థలి యందు స్నేహితుల్
వగవఁగ ఱొమ్ముఁ ద్రొక్కి నిలువంబడి కంఠముఁ గోయఁ జేయిపై
కెగయఁగఁబట్ట దానిఁ బయినే తెగఁగొట్టఁగఁ గ్రీడి యొంటిచే
పగతునిఁద్రోసి కూలిచిన వానిని వీరవరున్ స్మరించెదన్. 53

కం. అని పలికి కొంటెమాపుల
వనరుహముఖి సత్యభామ వదనముఁ జూడం
గను సిగ్గు నేలుక ముప్పిరి
గొనఁగాఁ దలవాంచుట గనుగొని సాత్యకియున్. 54

చిత్తముఁగలంప భోజుని యెత్తిపొడుపు
సత్యభామావమానంబు సంగ్రసింపఁ
గుపితుఁడయ్యె సాత్యకి వేగిరపడకుఁడ
దృష్టిసారింపఁ గృష్ణుని దిక్కునకును. 55

కమలనాభుఁడంత కడగంటిసైగచే
హెచ్చరింపఁజూచి వృష్ణికులుఁడు
సంభ్రమించి సాహసంబున నుత్సాహ
భరితుఁడగుచుఁ బెదవి కొఱుకుకొనుచు. 56

కం. అగునగు స్మరియింతువులే
యిఁగ నెన్నాళ్లోయనిచెప్పి కృతవర్మతలన్
దెగిపడఁగొట్టెను వెంటనె
తగవుండునె త్రాగుఁబోతుతనమున్న యెడన్. 57

చం. ఇదికని భోజులెల్లరు సమిద్ధపరాక్రమ విక్రమాఢ్యులై
మదమునఁ గన్నుఁగానక ప్రమత్తతఁ దాలిచి క్రూర ఖడ్గముల్
బెదరక త్రోసికొంచు యదువృష్ణి కులంబులవారి మీఁదికిం
గదియుచుఁ బోరుసేయఁగడఁగన్ యదువృష్ణిజులంత నొక్కటన్. 58

కం. చేకొని కత్తుల భోజుల
డీకొని యెదిరించి నిల్చి దెప్పరముగ భూ
మీకంపము గల్గునటుల
నాకట్టుచుఁ బోరుచుండ యాదవవరుఁడున్. 59

ఆ. దారకుని డగ్గరకుఁ బిల్చి ద్వారవతిని
గల్గు స్త్రీబాల వృద్ధ సంఘంబునెల్ల
హస్తినాపురంబును జేర్చి యాదరింపఁ
బార్థుతోడఁ జెప్పుమటంచుఁ బంపివైచి 6

గీ. చెంతకప్పుడే బభ్రునిఁ జేరఁజీరి
పార్థుఁ డరుదెంచు నందాఁక ద్వారవతిని
గల్గు స్త్రీజన శిశువృద్ధ గణమునెల్ల
బ్రోచుచుండు మనుచుఁ జెప్పి పుచ్చి పిదప. 61

వ. ఒదిగి యొక్కఁడే యొండెడనిల్చి సముద్రతీరంబున మహాదారుణంబుగఁ బ్రవర్తిల్లుచున్న సంగ్రామంబును జూచుచున్నయెడ— 62

గీ. అధిక సంఖ్యాకులగుటచే యాదవులను
వృష్ణికులులను భోజులు పీఁచమడఁప
వాసుదేవుండు క్రుద్ధుఁడై వసుధఁగూల్చెఁ
బోరుసాఁగించి మిగిలిన భోజకులుల. 63

ఉ. యాదవవృష్ణి సాత్వత దశార్హులు భోజులు నీవిధంబు తా
మై దెగఁద్రావి మైమఱచి మైకము కప్పఁగఁ గ్రూరకర్ములై
వాదములాడి తన్నుకొని ప్రాణము వీడుటఁగాంచి బాపురే!
యాదవనాశ మీకరణి నయ్యెనె నేఁటికినంచు జాలితో. 64

ఉ. కట్టెదుటన్ గులక్షయము కల్గుటకాంచి దురంతవేదనా
ఘట్టిత మానసుండగుచుఁ గన్నులఁ గాంచఁగలేక దైవముం
దిట్టి సముద్రతీరమును దించి సమీపమునందు నొక్కచో
దట్టపుఁజెట్టునీడఁగని దగ్గరకేగి పరున్నయంతటన్. 65

ఉ. చిన్నతనంబునుండియును జేసినకార్యము లొక్కమాటుగాఁ
గన్నులఁగట్టినట్టు పొడగట్టఁగ మిక్కిలి విస్మయంబుతో
నన్ని తలంచికొంచు హృదయమ్మున నబ్బురపాటుఁ జెందుచున్
కొన్ని నిమేషముల్ గడవఁ గొంచెము కొంచెము నిద్రఁగూర్కఁగన్. 66

గీ. బోయఁడొక్కఁడు వీక్షించి పొత్తిఁబట్టి
చిక్కనేచిక్కెఁ గృష్ణుండు చేతికిప్పు
డెటులఁ దప్పించుకొని యీతఁ డేగఁగలఁడొ
కొంతుననిచెప్పి సంతోష కలితుఁడగుచు. 67

ఉ. వెల్లకిలం బరుండి పృథివీజముక్రిందను నుమ్మలమ్ముచే
నుల్లము తల్లడిల్లఁబడి యుండగ నొక్కఁడు చాపకట్టుగా
భిల్లుఁడుచూచి బాణమును వేయ రవంతయు వీలు చిక్కమిన్
బుల్లవడంగ మోము కొఱవోవుచునుండఁగ నింతలోపలన్. 68

కాలు కదలించి యిట్టటు కమలనాభుఁ
డెడమకాలిపైఁ గుడికాలు నిడిముసించి
నిదురపోవుచునుండెను గదలకుండ
నెఱుక కనిపెట్టి సంతోష మెనయుచుండ. 69

వెడదవాతియమ్ము వెసలాగి పొదినుండి
వింటఁ దొడిగి యొరుల కంటఁబడక
తివిచి యల్లెత్రాడు చెవిఁదాక గుఱిచూచి
విడిచిపుచ్చె దాని విధమెఱింగి. 70

ఎఱకలొగి తోడుపడుచుండ నెఱుకయమ్ము
ఱివ్వుఱివ్వున సూటిగా ఱెచ్చిపోయి
పోయి కృష్ణుని కుడికాలి బొట్టవ్రేలు
నెఱుక చెడిపోవ మొదలంట నఱికివె చె. 71

ఉ. కట్టిడియైన బోయ విశిఖమ్ముకరుక్కున దూసిపోవఁగా
బొట్టనవ్రేల్ చురుక్కనఁ జివుక్కనఁ గృష్ణుఁడు కన్నువిప్పియ
ట్టిట్టులుచూడఁ గట్టెదుట నే యగుపించెను బోయ; యొండొరుల్
గుటుగ భావముల్ తెలిసికొంచును మౌనముతోడనుండఁగన్. 72

కం. వెనుకకు గిరుక్కునఁ దిరిగి
చనియెఁ బ్రహృష్టుండగుచు నిషాదుండటుపై
వనజాక్షుఁడు వెనువెంటనె
తనువు వదలి తాఁ బరమపదంబును బొందెన్. 73

కం. కులనాశకుఁడగు కృష్ణుని
కొలపెద్దలు సంతసింపఁ గూల్చితిననుచున్
గులికెను బోయఁడు ప్రాత ప
గలుమాయునె ? యూరకెంత కాలము చనినన్. 74

చౌశీతి వర్షంబులు భారత వర్షంబును నఱచేత నిడికొని దేగాట యాడించిన లీలామానుష విగ్రహుండగు శ్రీకృష్ణుండు కాలంబునకుం జిక్కి, నిషాద బాణవ్యాఘాత వ్యాజంబునఁ దనుత్యాగంబుఁ జేయవలసినవాఁడయ్యె. ఇంతకు మున్న యాదవ ప్రళయంబు సముద్రతీరంబున మహాఘోరంబుగాఁ బ్రవర్తించుచుండ నొక్కయెడ— 75

బలుఁడు తెగఁద్రావికుత్తుక బంటిగాఁగ
నొడలు తెలియక తూలి తప్పడుగులిడుచు
దారిలోనున్న యొకకోడె త్రాఁచుఁద్రొక్కఁ
గస్సుమనిలేచి బలరాముఁ గాటువేయ. 7

గీ. త్రాగియుండినవాఁడౌట నాగుబాముఁ
బట్టి యిట్టట్టు వేలార్చి పాఱవైచి
కదలి మత్తుతో నొకచెట్టు మొదటఁబండి
గుఱ్ఱుపెట్టుచు నిద్దురఁ గూరెనపుడు. 77

కం. కసిఁబట్టిన యాపాము
పసిఁబట్టి యచటకువచ్చి పైఁబడివానిన్
బుసగొట్టుచుఁ గాటందెను
వెసమోమున దాన నతఁడు వెంటనె యీలెన్. 7

దారకునిచేఁ బంపఁబడినవార్త శూలాయమానమై చెవిని బడినంతనె, పార్థుండు బయలుదేరి నిరంతర ప్రయాణంబుచే ద్వారవతిం జేరి, శ్రీకృష్ణ సాత్యకి బలరామప్రముఖ మహావీరశూన్యంబును, నార్తాలాప దైన్యంబునునై, యా పురంబు కురుక్షేత్ర యుద్ధానంతరము పెంపుచెడియున్న హస్తినా

పురంబును జ్ఞప్తికి దేరఁజాలసేపు వగచి, తన్నుఁ దానూరడించికొని,
ధైర్యంబవలంబించి—— 79

కం. అంతఃపుర కాంతాజన
సంతాపముడించి సవ్యసాచి కడంకన్
గాంతల వృద్ధుల బాలుర
చింతలుదీరంగఁజెప్పి చిడిముడిపడుచున్. 80

కం. పసిపిల్లలఁ గసిగందుల
ముసలిముదుకవారినెల్ల ముసుగుడుపడుచున్
దెసలారసికొనితెచ్చుచు
వెస ద్వారక డించిపోవ వెడలినయంతన్. 81

ఉ. ద్వారక చుట్టునున్న కొఱవంజులమూఁకలు మూఁకఁగట్టుచున్
దారులుగట్టి యాదవనితంబిను లెల్లరఁబట్టి ద్రోచుకో
బారులుగట్టి నిల్చె నతి బంధుర కాననసీమలందునన్
మోరకులై ప్రచండులయి పూర్వవిరోధము తొందరింపఁగన్. 82

వ. పార్థుం డొక్కఁడు రక్షణకార్య నిమగ్నుండై యాదవ స్త్రీజనంబులఁ
గొని తెచ్చుచుండ నకస్మాత్తుగాఁ జెంచుదొరలు వారలపైఁబడి 'నిర్దయులై
దోపిడి మొదలుపెట్టి—— 83

సీ. ఉన్మత్తచిత్తుఁడై యొకచెంచు చెలరేఁగి
నిలువుదోపిడిచేసె నెలఁతనొర్తు
కన్నుఁగానక బోయ కడముట్టి యొకకాంత
ముప్పేటహారంబు మొలనుదోపె
కొఱవంజి యొకఁడొక్క కొమరాలి నదలించి
ముంగెరఁ దెగగుంజి మూటఁగట్టె
శబరుఁ డొక్కఁడు ధైర్య సాహసంబులచేత
నొకకాంత మెడపేరు లూడలాగె

గీ. వ్యాధుఁ డొక్కఁడొక్క పడంతి నడిమిపట్టి
యొడలి బంగారమెల్లను నొలిచి కొనియె
ఒక్క యెఱుక పేరాసతో నొక్కబోటి
పైడిమొలనూళ్లపైఁబడి యూడఁదీసె. 84

గీ. ఆలగోలు బాలగోలయ్యె యాదవ
మదవతీ సమూహ మధ్యమందు
నేమిచెప్పవాఁడ నిదియెల్ల వీక్షించి
పార్థుఁ డుగ్రకోప భరముచేత. 85

ఉ. బాపురెమంచు నేడ్చు యదు భామినులందఱిఁ బాఱఁజూచి రో
షావిల చిత్తుఁడై యతిభయంకర రూపముఁదాల్చి దివ్యగాం
డీవము నెక్కుపెట్టుటకు నేర్పున యత్నములెన్నొ చేసియున్
లేవడి యల్లెత్రాడు తగిలింపఁగలేక కిరీటియంతటన్. 86

గీ. వింటిపట్టుజార కంటిబొట్టులు గాఱ
నల్లెత్రాడు గూర్ప వల్లఁగాక
చిత్తమెల్లఁ జెదర జీకాకు పడిపోయె
ముసలి చెయివణకి పోవుచుండ. 87

కం. తెఱచిన కన్నులతోడన్
మఱచిన గాండీవ చాపమధ్యముతోడన్
బఱచిన తలఁపులతోడన్
నరుఁడట్టే నిల్చియుండె నబ్బురు నవ్వన్. 88

గీ. నిలువుగ్రుడ్డుతోడ నిలిచియుండఁ గిరీటి
నిలువుదోపిడంత నిలిచిపోక
యదుపులేక సాఁగె, యదువధూజనమంత
క్రొత్తపోటరులకు మెత్తవడుచు. 89

సీ. పూర్వార్జితములైన పొలముల నన్నిటిఁ
బొరలివచ్చిన వార్ధి పూడ్చివైవ
కాయకష్టముతోడ గడియించి పెట్టిన
ధనధాన్య సంపత్తి పొనుగుపడియె
పుట్టి పెఱిగినట్టి పుటభేదనంబెల్లఁ
గడలిలో క్షణములోఁ గలిసిపోయె
కనుకట్టు లేకుండ మనుగడ జరిపించు
పెనిమిటులని లోన దునిసిపోవ

గీ. ఎఱుకలేని దేశాలకు నేగవలసె
నెఱుకతో మనియుండుట పరువుగాదె?
ఏల పరదేశమునకేగి యిలియుటెల్ల
ననుచు యాదవ కామినీ జనము తలఁచి.

సీ. కడగంటి వాల్చూపు గమిచేత నొకచెల్వ
సొగనుకానికిఁ జాల సూరెలంపె
సొక్కి సోలి మనస్సు చుక్కాని వెసఁద్రిప్పి
సుందరాంగునివైపు సుదతియోర్తు
కంచెల తెగిపడ్డ చంచలాక్షి యొకర్తు
వంచించి కొంపోయెఁ జెంచుమగని
పెరిగిపోయిన పేరు వెదకుచు నొకకాంత
మరులుచూపునుబంపె మరల మరలఁ

గీ. దోచుకున్నవారు దోచఁబడినవారు
జంటజంటలైరి క్షణములోన
యాదవకులకాంత లటులౌటఁగన్నార
నర్జునుండు చూచి యోడుఁగఱచె.

కం. నవరాగోదయమెనన్
నవలావణ్యంబుతోడ నవలాగమి భి
ల్లవరులతోఁ గిలకిలమన
నవమానముఁ జూడలేక యలమటపడుచున్. 92

వ. చెంచుదొరలనోపమి దన యెట్టయెదుట నతి కుత్సితంబుగా నడుచుచున్న
యాకార్యంబు నాపఁజాలక భీభత్సం డొక్కయెడ నిలిచియుండ— 93

గీ. రుక్మిణీదేవి సొదఁజొచ్చి రూపుమాసెఁ
జలిమలకునేగెఁ దపియింప సత్యభామ
తక్కు కులకాంత లేమైరొ దైవమెఱుఁగు
యాదవకులంబు తుదకు నిట్లయ్యెనకట!

సీ. కామోపభోగముల్ కాంక్షించి వాంఛించి
చెలరేఁగి యాదవ స్త్రీజనంబు
మితిమీరి గతిఁదప్పి మ్లేచ్ఛకిరాతని
షాదపురుషపాళి పజ్జఁజేరి
కాంతారవీధులఁ గదలిపోయిరివారు
మరులెత్తి సరిక్రొత్త మగలతోడ
శ్రీకృష్ణునంతటి చిరయశోవంతుని
చెలిమి చుట్టరికంబుఁ జేసియుండి

గీ. యతఁడు చనినంత కులగౌరవాదులైన
సరకుసేయక దుశ్చింత జారపాళిఁ
గూడియేగిరి కామార్త కుటిలలగుచు
నేమికలదు రామస్వామి! యింకఁ జెప్ప?

గీ. లేచిపోవఁగా మిగిలిన లేమపిండుఁ
గొని ధనంజయుఁ డిభపురంబునకుఁదెచ్చి
ధర్మసూతికి వినిపింప దద్దరిల్ల
భయముఁ గొల్పెడి యాదవ ప్రళయమెల్ల.

వ. పెద్దప్రొద్దువగచి నిట్టూర్పు విడచి— 97

చం. సరసిజనేత్రుచావు విని సాత్యకి దుర్మృతి యాలకించి వా
రిరువురు చిన్ననాఁట గొలె నెప్పుడు చేసినమేళ్ళ నెంచుచున్
బురపుర పొక్కి ధర్మజుఁడు పోయినవారలఁగూర్చి యేడ్చినన్
బొరయదు లాభమంచు వగపున్ విడి యెల్లరసమ్ముఖమ్మునన్. 98

గీ. వాసుదేవ ప్రపౌత్రుఁడౌ వజ్రుఁగాంచి
కురునృపాలుఁ డింద్రప్రస్థ పురమునిచ్చి
చుట్టలలరంగఁ బట్టంబుఁ గట్టి పాడి
తప్ప కేలుకొనుమటంచుఁ జెప్పిపంపె. 99

గీ. సాత్యకి తనూజునకు సరస్వతిపురంబు
నిచ్చి మూర్తికావతపురంబిచ్చె భోజ
కులుఁడు కృతవర్మ పుత్రునకును నరాజ
కంబుగానది చెడియున్న కారణమున. 100

వ. పదంపడి ధర్మతనూభవుఁ డొక్కదినంబున నతి దుఃఖావేశపరవశుఁడై
కలవరపడి యొంటరిగఁ గూర్చుండి దీర్ఘముగ విచారించి— 101

ఉ. ప్రాణసమానుఁడై తనకుఁ బ్రాభవమిచ్చిన కృష్ణమూర్తి ని
ర్యాణముఁ జెందమన్గడ దురంతవిచారముఁ గూర్చుచుండె న
క్షీణధరాధిరాజ్యమును శీఘ్రమ మన్మనికిచ్చి యా జగ
త్రాణపరాయణుంగుఱిచి ధ్యానముఁ జేసికొనంగ మేలగున్. 1

వ. అంచు నిశ్చయించి వెంటనే ద్రౌపదీభీమార్జున నకుల సహదేవులం బిలిపించి
కంపితస్వరంబుతో వారల నుద్దేశించి సంబోధించి— 103

ఉ. కాలము మాఱిపోయె మన కాలము సర్వముఁ జెల్లిపోయె దు
ష్కాలము దాపరించె మన కన్నులముందటె యెంతమందియో
కాలముఁజేసినారు గతకాలమె మేలుగఁదోచు నక్కటా।
గాలమురీతి గ్రుచ్చుకొను కష్టపరంపరవచ్చెఁ గుంటిరే। 104

ఇష్టసఖుండు కృష్ణుడఖిలేశ్వరుఁడక్కట యస్తమింపఁగాఁ
గష్టసుఖాలు చెప్పికొనఁగా దగువారలుకూడ లేరు సం
తుష్టియు మాయమయ్యె నెదితోఁచక యుంటినిగాన నిట్టి ప్ర
భ్రష్టజగంబునన్ నిలువవచ్చునె ? చెప్పుఁడిమీరలిప్పుడున్. 105

పౌత్రుని నీధరాస్థలికిఁ బట్టముగట్టి ముదంబుతోడ నే
మాత్రము సంశయంపడక మౌనిజనంబుల సేవఁజేయుచున్
క్షత్రియ వృత్తినిన్ విడచి శాంతిని బూనుచు సన్యసించి లో
కత్రయ కారకుం బరముఁగన్గొనఁబోవఁగ నిశ్చయించితిన్. 106

కం. అన్నా ! పూర్వాచారము
లన్నియు మనకండ్లయెదుట నతివేగముగా
మన్నైపోవుచు నుండెను
ఛిన్నాభిన్నంబులగుచుఁ జెప్పఁగనేలా ? 107

కానీనుఁడన్నచోఁ గసరికొట్టుటెకాని
కొమరాండ్రు సరిపుచ్చుకొనరు నేఁడు
క్షేత్రజుండన్నచోఁ గేరడింపులె కాని
ప్రోయాండ్రు తలలూఁచఁ బోరు నేఁడు
మరి, సహోఢజుఁడన్న మండెమేలమెకాని
పడుచుకత్తియలిష్టపడరు నేఁడు
అవుర ! గూఢోత్పన్నుఁడన్న దూరులెకాని
మగవాండ్రు మొగమిచ్చి మనరు నేఁడు

గీ తాఊమాఅయ్యె జగమెల్లఁ దండ్రి ! వింటె !
యెట్టి విడ్డూరములు నేఁడు పుట్టుచుండె
కాలమెంతలోఁ దలక్రిందు గాఁగ నయ్యెఁ
గలిప్రవేశించినట్టి యీ క్షణమునందె. 108

ఉ. పుత్రులు లేకయున్నయెడఁ బున్నరకంబు తొలంగిపోవఁగా
గోత్రమునిల్ప బ్రాహ్మణుని గూడి సుపుత్రులఁ గాంచుమన్న నే
మాత్రము మాటలన్ వినరు మారుతి? భార్యలె యింక నేఁడు తా
పత్రయమెట్లు తీరునొకొ! బాపురె! యెంతటి చెడ్డకాలమో! 109

సీ. బహుపతిత్వము తప్పు పనికిరాదని చెప్పి
మగువ లీపెండ్లిండ్లు మానినారు
చాలాలు పెండ్లాడఁ జులుక నౌనని చెప్పి
పడఁతులీపెండ్లిండ్ల నుడిగినారు
సంతుగాంచినఁ బెండ్లి సల్పరాదనిచెప్పి
ముదిత లీపెండ్లిండ్లు వదలినారు
మారుమనువుగూర్ప మర్యాదకాదంచు
వెలఁదు లీ పెండ్లిండ్లు విడచినారు

గీ. తాఱుమాఱయ్యె జగమెల్లఁ దండ్రి! వింటె!
యెట్టి విడ్డూరములు నేఁడు పుట్టుచుండెఁ
గాలమెంతలోఁ దలక్రిందు గాఁగనయ్యెఁ
గలి ప్రవేశించినట్టి యీ క్షణమునంటె. 110

సత్యమె చెప్పవలయునటె
సత్యమె వలయునటె కార్యసాధనకై నన్
సత్యము దప్పిన నరకము
సత్యముగావచ్చునటె! విచారములేలా! 111

ఏ నియమంబులేనియెడ నిష్టముచొప్పున సంచరింపఁ, గా
నీసులు పుట్టవచ్చునని నేఁటికిఁ బెద్దలు బాల్యమందునే
మానక పెండ్లిచేసియును మాయురె యింటనునుంచుచుండ్రి, క
న్యానివహంబు పూర్వము వినంబడెనే యిటువంటి చిత్రముల్? 11

మ. మృగయాక్రీడల నైతముఙ్ మృగములన్ హింసింపఁ గారాదు, మే
ధగవాశ్వంబులఁ జంపఁగూడదను వాదంబున్ బయల్దేరె, నే
డిఁగనే చిట్టలుపుట్టనున్నవి కదే యేమైన కానిండహో!
తగదీరాజ్యమునందు నిల్వనిఁకమీఁదన్ జాముసేపేనియున్. 113

వేదం బార్షేయమటే
వేదంబెల్లరును జదువ వినఁ జదివింపం
గాఁదగుదురటే, చిత్రము
గాదటె! యిదియెన్నఁడేని కంటిమెచెప్పుఁడీ! 14

కం. మదిరాపానముతప్పటె!
మదిరాక్షులు దీనిమాట మన్నించుటె! త
ప్పిదమటె! పూర్వాచారము
లదవదలై పోయెనేమి యబ్బురమొ కదే 115

ఉ. పోయెదనింక నేను వనభూముల మౌనుల సేవఁజేయుచుం
బ్రాయముపుచ్చెదన్ వినుఁడు ప్రాయముఁబట్టుదుగట్టిగాఁ దృణ
ప్రాయముగా శరీరమును బాసెద మోక్షపదంబుఁబొంద నీ
తోయము మంచిమార్గమని తోఁచెను బెక్కులిఁకేల చెప్పితిన్. 116

కం. నాతోవత్తురయేనిన్
జేతో మోదంబుతోడఁ జేకొని పోదున్
మీతెఱఁగును వినిపింపుఁడు
వాతూలతనూజ! తక్కువారలు నీవున్. 117

వ. నావుడొకరి మొగంబు లొకరు చూచుకొని తుట్టతుదకుఁ "మీతోడ నెందేని వచ్చుటకు సంసిద్ధులమ"ని యెల్లరు చెప్ప, ధర్మజుఁడు పరీక్షిత్తును వెంటనే పిలిపించి సకల కురురాజ్యంబునకుఁ బట్టంబుఁగట్టి "ఇది సంధికాలమగుటం జేసి ధర్మాధర్మ నిరూపణంబుఁ జేయుట మిగుల దుష్కరంబు, కాన

నప్రమత్తుఁడవై, యతిశ్రద్ధాళుఁడవై రాజ్యపాలనంబు జేయుచు ననూక పరిపాటిని గాపాడు"మని మనుమనికి మనికి తెఱంగులు చెప్పి, బుద్ధులు కఱపి హస్తినాపురంబు డించి— 118

చం. ధృతిమెయి మాతృభూమి శతశృంగ మహీధర సానుదేశముల్
వతనుగ నేర్పరించుకొని వాసముఁజేయు తలంపుతోఁ బృథా
సుతుఁడు సహోదరుల్ ద్రుపదసూతియు గొల్వఁగ రూక్షకంటకా 119
వృతపథిఁబట్టిపోవఁ దొడవెన్ వెనుకాడక బంటుకైవడిన్.

కం. దగదప్పులచే నాకఁటి
సెగచేఁ గరువలివలిపిరిచే వగచే నా
మగువయు మగ లొకరొకరే 120
తెగటారఁగ ధర్మసుతుఁడు త్రెళ్ళక చనియెన్.

## ముగింపు

ఉ. ఆటలనాడినాఁడడవులందున నావుల మేపుచుండి స
య్యాటలనాడినాఁడు కొమరాండ్రనుగూడి మనోహరంబుగాఁ
బాటలుపాడినాఁడు వసివాడిన మ్రోళ్ళు చిగుర్పఁగా జగ
న్నాటకసూత్రధారుఁడయినాఁడెతఁడో యతనిం దలంచెదన్.

